# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

(ఫ్రెంచి నవల)

మొదటి భాగం



మూలం:

అలెగ్జాండర్ డ్యూమా



అనువాదం:

సూరంపూడి సీతారామ్

ఆంధ్ర గ్రంథ మాల,
మదరాసు-1.

# కౌంట్ ఆఫ్ మాంటిక్రిస్టో

---

## 1

**1815**వ సంవత్సరం, ఫిబ్రవరి 24. 'ఫరావో' నౌక మార్సేల్స్ రేవు ప్రవేశిస్తున్నది. నోటర్ డామ్ గోపుర శిఖరం అనుమతి సంకేతమిచ్చింది. నౌక స్మిర్నా, ట్రియస్ట్, నేపుల్స్ నగరాలు చూసుకుని వస్తున్నది.

రేవునుంచి ఒక పైలట్ వెంటనే బయలుదేరాడు. చిన్న బోటులో ఇఫ్ కోటను చుట్టి, 'మార్గియన్' అగ్రానికి 'రయన్' ద్వీపానికి మధ్య నౌక నందుకొన్నాడు.

చూడవచ్చిన జనం ఒడ్డుపై కిటకిట లాడుతున్నారు. ఒక నౌక వచ్చిందంటే ఆవాడు మార్సేల్స్ నగరవాసులకు పండుగన్నమాటే.

నౌక మెల్లిగా రేవు ప్రవేశిస్తున్నది. 'కలరీన్' ద్వీపానికి 'యారోస్' ద్వీపానికి మధ్యసింధుశాఖను జాగ్రత్తగా దాటింది. తెరచాపలెత్తి మెల్లిగా రేవు ప్రవేశిస్తున్నది. నౌక మందగమనాన్ని చూసి, ఓడకే ప్రమాదం వాటిల్లిందోనని తీరంపై జనం శంకించ నారంభించారు. కాని ఎట్టి ప్రమాదం సంభవించలేదని దూరాన చూసినంతలోనే నౌకాయాన ప్రవీణులు నిర్ధారణ చేశారు. నౌకగమనం నిర్దుష్టంగా ఉంది. లంగరు దిగడానికి సిద్ధంగా ఉంది. పైలట్ సమీపంలో ఒకయువకుడు నిలిచి నౌక గమనాన్ని అతిశ్రద్ధతో పరికిస్తున్నాడు. పైలట్ ఆజ్ఞలను పునరుచ్చరిస్తున్నాడు. చూడవచ్చినవారిలో జాప్యం సహించలేని ఒకడు

ఒకచిన్న బోటులోకి దుమికి నౌకదిక్కుగా వెళ్లాడు. 'రిజర్వ్' సింధు శాఖవద్దనౌకను సమీపించాడు.

నౌకపైయువకుడు ముందుకు వచ్చి, బోటులో వ్యక్తిని సమాశ్వాసించాడు. యువకుని వయస్సు పద్దెనిమిది ఇరవై ఏళ్లమధ్య ఉండవచ్చు. పొడగరి. బక్కపలుచని శరీరం. నల్లని నేత్రాలు. శైశవంనుంచీ భీతిఅంటే తెలియని ధైర్యభావం అతని ముఖంలో ఉట్టిపడుతోంది.

"ఎవరు? నువ్వా డాంటే?" అన్నాడు బోటులోవ్యక్తి. "ఏం జరిగిందోయ్? ఓడపైన ఈ విషాదసూచన లేమిటి?"

"పెద్దదుర్ఘటన సంభవించిందండి, మారెల్. ముఖ్యంగా నాకు తీరనిలోటు కలిగింది. మనకెప్టెన్‌లక్లేర్ మృతిచెందాడు."

"మరి ఓడలోసరుకు?"

"క్షేమంగానే చేరింది. ఆవిషయమైమీరు బెంగపడ నక్కర లేదు కాని పాపం మన కెప్టెన్..."

బెంగతీరిన ఓడయజమాని అర్ధోక్తిలోనే ప్రశ్న అందుకున్నాడు. "ఎల్లాపోగూడోయ్? జబ్బేమిటి?"

"మస్తిష్కజ్వరంతో యాతనపడి మరణించాడండి" అని జవాబుచెప్పి, యువకుడు వెనక్కితిరిగి నావికులను పిలిచాడు; "ఎవరక్కడ? రేవుచేర్చడానికి అంతాసిద్ధపడండి." నావికులు ఆజ్ఞపాలించారు. యువకుడు తిరిగి మారెల్‌తో ప్రసంగం అందుకున్నాడు.

యజమాని ప్రశ్నించాడు; "అసలిది ఎలాసంభవించింది?"

"ఏం చెప్పనండి? అంతా ఆశ్చర్యంగా జరిగిపోయింది. నేపుల్స్‌నగరం విడిచిపెట్టేముందు నౌకాశ్రయ సర్వాధికారితో కెప్టెన్‌లక్లేర్ చాలసేపుమాట్లాడాడు. తరవాత చాలకలవరపడినట్లు కనిపించాడు. అంతే. ఇరవైనాలుగ్గంటల్లో జ్వరం ముంచుకువచ్చింది. మూడురోజుల్లో చనిపోయాడు. ఆయన భౌతికదేహం తరంగాల అడుగున చిరవిశ్రాంతి పొందింది. శవాన్ని ఒక వలసంచిలో చుట్టి,

తలవంకనూ కాళ్లవంకనూ ఇనుపగుళ్లు కట్టి, ఎల్ గిగ్లియో వద్ద సము ద్రంలో విడిచిపెట్టాం. వితంతువుకు ఒప్పగించడానికి పవిత్రమైన సిలువ, కత్తి తేబడినాయి. ఆంగ్లేయులతో పదిసంవత్సరాలు హోరాహోరీపోరాడిన వీరుడు, ఈ రీతిగా సామాన్యులవలె మృతిచెందడం చూస్తే..." యువకుడు విషాదభరమైన చిరునవ్వు నవ్వాడు.

ఓడ యజమాని అన్నాడు: "అవునవును, ఎడ్మండ్. మనం అంతా మర్త్యులం. యువకులకు తావిచ్చి వృద్ధులు తప్పుకోడం మానవధర్మం. లేకపోతే వృద్ధికి అవకాశమే ఉండదు. ఓడలో సరుకంతా క్షేమంగా చేరిందని నువ్వు హామీ ఇస్తున్నావు కాబట్టి......"

"అవును. అంతా యథాస్థితిలో ఉంది మారెల్. బాధ్యత నాది. ప్రయాణంలో వచ్చిన వెయ్యిపౌనుల లాభాన్ని తీసుకోవద్దని మీకు నా సలహా. మీరు ఓడయెక్కి వచ్చినట్లయితే, సరుకు అజమాయిషీ చేసే డాంగ్లర్ మీకు అవసరమైన విషయాలన్నీ చెప్పగలడు. నేను ఈలోగా లంగరు వేయిస్తాను."

డాంటే విసిరిన పగ్గం పట్టుకుని సునాయాసంగా ఓడ యెక్కాడు యజమాని. యువకుడు యథాస్థానం చేరాడు. డాంగ్లర్ వచ్చి యజమానిని కలుసుకున్నాడు.

డాంగ్లర్ వయస్సు ఇరవై అయిదు. ఇరవై ఆరేళ్లుండవచ్చు. అంత ఆకర్షణీయమైన రూపం కాదు. పెద్ద ఉద్యోగులపట్ల అతివినయం, క్రిందివారిపట్ల ధూర్తతవల్ల నావికులలో పరపతి లేనివాడు. డాంటేపట్ల నావికుల కెంతప్రేమో, డాంగ్లర్ పట్ల వారి కంత అసహ్యం.

"మారెల్, మీ రీ విషాదవార్త విన్నారా?" అన్నాడు డాంగ్లర్.

"అవునవును. విన్నాను. పాపం లక్లేర్ వీరుడు. విశుద్ధవర్తనుడు."

"అనుభవజ్ఞుడైన నావికుడుకూడా. 'మారెల్ అండ్ సన్' వంటి కంపెనీలో బాధ్యత వహించడంఅంటే, అటువంటి అనుభవజ్ఞుడే కావాలి.."

డాంటేవంక చూపులునిగిడ్చి యజమాని అన్నాడు: "వృద్ధుడైతే గాని, నావికునికి పని తెలియదనడం సరికాదు డాంగ్లర్. మన ఎడ్మండ్ చూడు. ఎవరి సహాయం అక్కర్లేకుండా పనిచెయ్యగలడనిపిస్తుంది."

డాంగ్లర్ మాత్సర్యంతో డాంటేవంక పక్క చూపులు చూస్తూ అన్నాడు: "అవును. అతను యువకుడు. యువకులకు ఆత్మవిశ్వాసం అధికం. కెప్టెన్ చనిపోయాడో లేదో, బాధ్యతంతా పైన వేసుకున్నాడు. వెంటనే మార్సేల్స్‌కు తిరిగిరావటానికి బదులు 'ఎల్బా' ద్వీపంలో రోజున్నర గడిపాడు."

"బాధ్యతంతా పైన వేసుకున్నాడంటే 'మేట్'గా అది అతని విధి. కాని ఓడమరమ్మతు అవసరమైతే తప్ప, ఎల్బా ద్వీపంలో రోజున్నర జాప్యం చెయ్యటం తప్పే."

"ఓడకేం? నిక్షేపంలా ఉంది—నాలాగే. కేవలం లోభంవల్ల, అక్కడ కులాసాగా గడపడానికి, రోజున్నర పాడుచేశాడు."

"డాంటే!" అని పిలిచాడు ఓడయజమాని, "ఒక మాటిలారా."

"క్షమించాలండి. క్షణంలో వస్తున్నాను." అని జవాబిచ్చి, డాంటే, "లంగరుదించండి" అని నావికులకు కేకపెట్టాడు.

వెంటనే లంగరుదిగింది. ఇనుపగొలుసులు పెద్దరొద చేస్తూ దిగాయి. లంగరుపడిన తరవాత "జండాసగమెత్తు దించండి. రేవుకు నిచ్చెనలు వెయ్యండి" అని కేకపెట్టాడు డాంటే.

"అబ్బో! అప్పుడే కెప్టెన్ అయిపోయాననుకుంటున్నాడు చూడండి," అన్నాడు డాంగ్లర్.

డాంటేసమీపించాడు. "లంగరువేసేశారు. ఇంక సెలవివ్వండి."
డాంగ్లర్ ఒక అడుగువెనక్కి ఒదిగాడు.

"ఎల్బాదగ్గిర ఆలస్యమెందుకు చేశావో చెప్పవాకు?"

"నాకు తెలియదండి. అది కెప్టెన్ లక్లేర్ తుదిఆజ్ఞ. గ్రాండ్‌మార్షల్ బెర్‌ట్రండ్‌కి ఇవ్వాలంటూ ఒకబంగీనాచేతికిచ్చారు, చనిపోయేముందు."

"అయితే గ్రాండ్ మార్షల్‌ని చూశావన్నమాట?"

"చూశాను."

మారెల్ కంగారుగా ముందూ వెనకా చూశాడు. డాంటేని పక్కకు తీసుకెళ్లి మెల్లిగా ప్రశ్నించాడు, "చక్రవర్తి ఎలా ఉన్నారు?"

"ఈ కళ్లతో నే చూశానా అనిపిస్తుంది..."

"అయితే నువ్వు చక్రవర్తినే చూశావా!"

"నేను వెళ్లినప్పుడే మార్షల్ వద్ద ఆయన ఉన్నారు. ఓడనిగురించి నన్ను ప్రశ్నలడిగారు. మార్సెల్స్‌నించి ఎప్పుడు ప్రయాణమైనదీ, ఏమార్గాన ప్రయాణంచేసినదీ, ఏమేమి సరుకు తీసుకువెళ్లినదీ అడిగారు. ఓడలో సరుకు లేకపోయి, నేనే ఓడ యజమానినైతే, తప్పకుండా ఆయన ఓడని కొనేసేవారని నా నమ్మకం. కాని నేను మేట్‌ని మాత్రమేనని ఆయనకి నివేదించాను. ఓడ మారెల్ అండ్ సన్స్‌కు చెందినదని చెప్పాను. 'అల్లాగా' అన్నారాయన. 'నాకు తెలుసు. మారెల్ వంశస్థులు పారంపర్య ఓడయజమానులు. ఆ వంశంలో ఒకరు వాలెన్స్‌లో నాతోపాటు సైన్యంలో ఉండే వారు కూడా' అన్నారు."

యజమాని ఆనందభరితుడైనాడు. "నిజంగా? ఈశ్వరకృప సుమా! అతని పేరు 'పాలకర్ మారెల్;' మా పినతండ్రి. తరవాత కెప్టెన్ అయినాడు. డాంటే! ఈమాట నువ్వు మా పినతండ్రికి తప్పకుండా చెప్పాలి; చక్రవర్తికి ఇంకా అతను జ్ఞప్తిలో ఉన్నాడని. నువ్వే చూడు. ఇదివింటే ఏడ్చేస్తాడు." స్నేహభావంతో యువకుని జబ్బలు రెండుచేతులా పట్టుకుని మళ్లీ అన్నాడు: "నిజమే. నువ్వు చేసింది మంచిదే డాంటే. లక్లేర్ ఆజ్ఞ పాలించడం మంచిదే అయింది. కాని నువ్వు ఒక బంగీ గ్రాండ్‌మార్షల్‌కి ఇచ్చినట్లుగాని, చక్రవర్తితో మాట్లాడినట్లుగాని పైకి పొక్కిందంటే నీకు క్షేమంకాదు."

"అదెల్లాగండీ? నే నిచ్చిన బంగీలో ఏముందో నాకు తెలియదు. ఏ ఇతర అపరిచితవ్యక్తినైనా ప్రశ్నించేవిధంగానే, నన్నూ చక్రవర్తిప్రశ్నించారు. అంతే. ఇదిగో. తనిఖీ ఆఫీసర్లు వస్తు

న్నారు. ఒక్క క్షణం మన్నించండి" అంటూ డాంటే వెళ్లిపో యాడు. అతను వెళ్లిందే తడువు డాంగ్లర్ సమీపించాడు.

"ఇంకేం? ఫెరాజో రేవులో లంగరెందుకు వేశాడో మంచి కారణాలు చెప్పాడన్నమాట?"

"అవును, మంచి కారణాలే డాంగ్లర్. అది కెప్టెన్‌లక్లేర్ ఆజ్ఞ."

"అన్నట్టు, కెప్టెన్‌లక్లేర్ అంటే జ్ఞాపకం వచ్చింది. మీ కిమ్మని ఆయనిచ్చిన ఉత్తరం ఒప్పగించాడా?"

"నాకు ఉత్తరమా? లేదే? అతనిదగ్గరుందా?"

"బంగీకాక, ఒక ఉత్తరంకూడా కెప్టెన్ లక్లేర్ ఇచ్చాడను కున్నాను."

"బంగీ ఏమిటి డాంగ్లర్?"

"ఫెరాజో రేవులో ఒప్పగించి ఉండాలి, ఆ బంగీని."

"కాని ఫెరాజో రేవులో ఒప్పగించడానికి బంగీ ఒకటి డాంటేదగ్గరుందని నీ కెలా తెలుసు?"

డాంగ్లర్ ముఖం ఎర్రబడింది. "నేను అప్పుడే కెప్టెన్ గది దాటి వెడుతున్నాను. తలుపు ఓరగా ఉంది. బంగీ ఒకటి, ఉత్తరం ఒకటి డాంటేకి కెప్టెన్ ఇవ్వడం కనపడింది."

"నాకు ఉత్తరం సంగతేమీ డాంటే చెప్పలేదు. ఏదైనా ఉత్తరం ఉంటే నా కిచ్చేవాడే!"

డాంగ్లర్ ఒక్క క్షణం ఆలోచించాడు. "కాని క్షమించాలి మారెల్. దానిసంగతేమీ డాంటేని అడక్కండి. నేను పొర బడి ఉండవచ్చు."

అప్పటికి యువకుడు అక్కడికి చేరాడు. డాంగ్లర్ వెళ్లి పోయాడు.

"చూడు డాంటే! నీపనంతా పూర్తిఅయినట్టేనా? ఇంక చెయ్యవలసిందేదీ లేదు కదా?"

"లేదండి. అంతా పూర్తి అయింది."

"సరే. అయితే ఇవ్వీరాత్రి మాయింటికి విందుకి రాగలవా?"

"క్షమించాలండి మోరెల్. నేను ముందు వెళ్లి నాతండ్రిని చూడాలి. మీ ఆదరానికి చాలా కృతజ్ఞుణ్ణి."

"ఫరవాలేదులే. అదీ నిజమే. నీ పితృభక్తి నాకు తెలుసు."

కొంచెం సంకోచిస్తూ డాంటే ప్రశ్నించాడు. "నాతండ్రి ఎలా వున్నాడో మీకేమైనా తెలుసా?"

"ఆ- క్షేమంగానే ఉన్నాడనుకుంటాను. ఆయన్ని నేనంతగా చూడ్డం లేదనుకో."

"అవును. ఆయన గదివిడిచి కదలడు."

"దాన్నిబట్టే అనుకున్నాను, ఆట్టే ఎవరిసహాయం అవసరం లేకపోయిందని. సరే. మాసి త్వరలో తిరిగివస్తావుగా?"

"క్షమించాలి. నా తండ్రిని చూసినతరవాత మరొకచోటికి వెళ్లాలి. ఆలస్యం చెయ్యడానికి మనస్కరించడం లేదు."

"ఓహో! అదా? నేను మరిచిపోయాను డాంటే. కాటలన్స్ నివాసంలో నీకోసం ఒకరు నిరీక్షిస్తూ ఉంటారు కాబోలు. ఎవరు? మర్సిడాయేనా?"

డాంటే మందహాసం చేశాడు.

"ఓహ్హోహ్హో" అంటూ మోరెల్ బిగ్గరగా నవ్వాడు. "ఇప్పుడు తెలిసింది. ఆ మోనా వద్దకు మూడుసార్లు వచ్చి ఫరావోనౌకనిగురించి బెంగతో ఎందుకడిగిందో అనుకున్నాను. అవును ఎడ్మండ్. నిన్నింక నిలవరించకూడదు. నా వ్యవహారాల్ని చక్కగా కనిపెట్టి చూశావు. నీకింక విశ్రాంతి నివ్వడం నాధర్మం. నీకు డబ్బేమైనా కావాలా?"

"ఒద్దండి. ప్రయాణంలో తీసుకున్న మూడుమాసాల జీతం డబ్బుంది నాదగ్గర."

"జాగ్రత్త పరుడవే! ఇంక వెళ్లు ఎడ్మండ్. నీతండ్రిని చూడు. నాకూ కుమారుడొకడున్నాడు. మూడుమాసాలు సముద్ర సంచారంచేసి వచ్చినతరవాత, త్వరపడి నావద్దకు రాకపోతే నే విసిగిపోనూ? వెళ్లింక. ఇంక నాకు చెప్పవలసిందేమీ లేదుగా?"

"లేదండి."

"కెప్టెన్ లక్లేర్ చనిపోయేముందు నాకోసం ఉత్తరమేదీ ఇవ్వలేదా?"

"అసలాయన అప్పుడు వ్రాయలేని స్థితిలో ఉన్నాడండి. అన్నట్టు మరిచాను. పదిహేనురోజులు సెలవు అడగాలనుకున్నాను."

"ఓ! పెళ్లిచేసుకోడానికా?"

"అవునండి, ఆతరవాత పారిస్ వెళ్లాలి."

"నీకు కావలసినన్ని రోజులు సెలవుతీసుకో డాంటే. మూడు మాసాలవరకూ ఓడ బయలుదేరదు. ఆ లోగామాత్రం తిరిగిరా. ఎందుకంటే కెప్టెన్ లేకుండా ఫరావో కదలదుగా!"

"కెప్టెనా!" అన్నాడు డాంటే. ఆనందం, ఆశ్చర్యం అతన్ని ముప్పిరిగొన్నాయి. "నిజంగా నే నన్ను ఫరావో కెప్టెన్‌గా నియమిస్తారా?"

"అంతా నాచేతిలోనే ఉంటే, వెంటనే నిశ్చయించి చెప్పేసేవాడిని డాంటే. కాని నాతో వాటాదారుకూడా ఉన్నాడుగా! అయినా వ్యవహారం సగభాగం నిర్ణయమైనట్లే భావించుకోవచ్చు, నా సమ్మతినిబట్టి. నే చేయగలిగినంత నీకోసం చేస్తాను, రెండో పక్షం చేత సమ్మతింపచెయ్యడానికి."

"నిజమేనా మారెల్?" యువకుని నేత్రాలు బాష్ప పూరితాలైనాయి. యజమానిచేతిని తన రెండుచేతులా గ్రహించి అన్నాడు: "మీకు చాలా కృతజ్ఞుణ్ని. ఇదివింటేనా తండ్రీ, మర్సిడా కూడా చాలా ఆనందిస్తారు."

"మంచివాళ్లనెప్పుడూ పైన భగవంతుడు కనిపెడుతూ ఉంటాడు నాయనా. నువ్వింక నీ తండ్రిదగ్గరకూ, మర్సిడాసమ

షానికి వెళ్లి తిరిగిరా. నేనింక ఉంటాను. డాంగ్లర్‌తో వ్యవహారం ఇంక తేల్చుకోవాలి. ప్రయాణంలో అతను నీతో సఖ్యతగా ఉన్నాడా?"

"అయ్యా! జవాబు మీ ప్రశ్నలోని ఆంతర్యాన్ని బట్టి ఉంటుంది. చెలికాడుగా ఉన్నాడా అనడిగితే, అంతగా చెప్పలేను. ఎందువల్ల నంటే, నేనంటే అతని కెప్పుడూ ఇష్టంలేదు. 'మాంట్ క్రిస్టో' ద్వీపంవద్ద పదినిమిషాలు ఆగాలని నేనన్నప్పుడు అతను వద్దన్నాడు. అదినిజంగా చిలిపితగు వేనని ఒప్పుకుంటాను. నే ననడం తప్పే. అతనువద్దనడం సవ్యమే. ఇంక మీ సరుకు అజమాయిషీ ఎలా చేశా డని ప్రశ్నిస్తే, అతని కర్తవ్యాన్ని తృప్తికరంగానే నెరవేర్చాడని చెప్పాలి."

"నువ్వే ఫరావో నౌకకు కెప్టెన్ అయితే, డాంగ్లర్‌తో కలిసిఉండడం నీకు అంగీకారమేనా?"

"నేను కెప్టెన్‌గా ఉన్నా సరే, మేట్‌గానే ఉన్నా సరే, యజమానులు నమ్మిన ఉద్యోగులే ఉండాలని నా అభిప్రాయం. వారిని నేను మన్నిస్తాను."

"శబాష్, డాంటే! నువ్వు ముక్కుకి సూటిగా నడిచేవాడివి. ఇంక వెళ్లు. ఇంక ఆలస్యం చెయ్యడం నాకిష్టంలేదు. నువ్వు తొందరపడుతున్నావ్."

"సెలవివ్వండి మారెల్. చాలా కృతజ్ఞుణ్ని. మీకు వెయ్యి నమస్కారాలు."

యువకుడు ఉత్సాహంతో బోటులోకి దుమికాడు. 'కానిబయర్' దిక్కుగా నడపాలని నావికునికి ఆజ్ఞఇచ్చాడు. ఓడయజమాని చిరునవ్వుతో బోటులోని యువకుని పరికించాడు. బోటు తీరం చేరింది. యువకుడు ఒక్క ఉదుటున ఒడ్డుపైకిలంఘించాడు. అనతికాలంలో చూపు మేర దాటి జనసమూహంలో కలిసి అదృశ్యమైనాడు. 'కానిబయర్' వద్ద జనం గుంపులు గుంపులుగా చేరి ఉత్సాహంగా కాలం గడుపుతారు. పారిస్ నగరంలో ఇలాటిదే

మా కెప్టెన్ లక్లేర్ చనిపోయాడు బాబా. మారెల్ సహాయంతో నాకా ఉద్యోగం దొరకవచ్చును. చూడు బాబా! ఒక్కసారి ఆలోచించు! ఇరవయ్యేవిట కెప్టెన్! నూరు లూయీల వేతనం, లాభాలలో పాలు. నావంటి పేదనావికుడు కలనైనా కనలేని మహాద్భాగ్యం కాదూ?"

"అవును నాయనా, అవును. అది అదృష్టం!" అన్నాడు వృద్ధుడు.

"నాకువచ్చే మొట్టమొదటి జీతంతో తోటమున్న ఒక చిన్న ఇల్లు కొనాలని నిశ్చయించుకున్నాను. ఆ తోటలో నీయిష్టంవచ్చిన్ని పూలతీగలు వేసుకోవచ్చును. కాని నువ్వంత జబ్బుపడినట్టు కనిపిస్తున్నావేమిటి చెప్పు బాబా?"

"అబ్బే, ఏమీ లేదు నాయనా. ఆందోళనపడకు. ఓపికపట్టు" అంటూనే, సత్తువ ఉడిగిపోయిన వృద్ధుడు వెనక్కి ఒరిగిపోయాడు.

"చూడు బాబా, చూడు. ఉండు. ఒక గ్లాసు ద్రాక్షరసం పుచ్చుకుందువుగాని. కొంచెం తేరుకుంటావు. అది ఎక్కడ పెట్టావు?" అంటూ డాంటె గదిలో వెతక నారంభించాడు.

"లాభంలేదు నాయనా, ద్రాక్షరసం లేదు."

"ఏమిటి? ద్రాక్షరసం లేదా?" డాంటె తెల్లబోయి, పాలిపోయిన తండ్రిముఖంవంక చూశాడు. "అదేమిటి బాబా? డబ్బులేకపోయిందా?"

"నాకింక లేనిదేముంది నాయనా? నువ్వు వచ్చావు. అంతే చాలు."

"కాని నేను కిందటిసారి రెండువందల ఫ్రాంకు లిచ్చి వెళ్ళానుకదా?"

"అవును నాయనా, నువ్వు ఇచ్చావు. కాని మన పొరుగు 'కాడరూస్' కి ఇవ్వవలసిన ఋణంమాట మరిచిపోయావు. అతను వచ్చి జ్ఞాపకంచేశాడు. ఋణంతీర్చకపోతే మారెల్ వద్దకు వెడతానని బెదిరించాడు. నీ కేమి అపకారం కలుగుతుందోనని భయపడి, నేను ఋణం తీర్చేశాను."

"ఏమిటి? అది నూటనలభై ఫ్రాంకులుకదా అతని కివ్వవల సింది? నేనిచ్చిన రెండువందల ఫ్రాంకుల్లోనూ అంతమొత్తం ఇచ్చేశావా?"

వృద్ధుడు అవునన్నట్లు తలూపాడు.

"అంటే, మూడుమాసాలకాలంగా అరవై ఫ్రాంకులతో గడిపావా బాబా? అయ్యో! తల్చుకుంటే గుండె బద్దలౌతోంది."

"అబ్బే, అల్లా అనుకోకు. అదంతా ఇప్పుడెందుకు? నువ్వు క్షేమంగా తిరిగివచ్చావు. అంతే చాలు." అని వృద్ధుడు చిరునవ్వు నవ్వాడు.

"అవును. తిరిగివచ్చాను. ఉజ్వలభవిష్యత్తుపై ఆశతో, చేత కొంత ధనంతో, తిరిగివచ్చాను. ఉండు బాబా, ఇందులో నువ్వు కొంత డబ్బుతీసుకో. ముందుగా అవసరమైన కొన్ని వస్తువులు కొని తెప్పించుకో," అంటూ యువకుడు జేబులు దులిపి, తనవద్ద ఉన్న ధనమంతా తీసి మేజామీద ఉంచాడు. డజను బంగారునాణ్యాలు, అరడజను క్రౌన్లు, కొన్ని చిల్లరనాణ్యాలు ఉన్నాయి.

"వెంటనే బజారుకు పంపి అవసరమైనవన్నీ తెప్పించు కుందాం బాబా. ఇవాళ హాయిగా గడుపుదాం. మళ్లీ రేపు కొంత ధనంవస్తుంది."

"తొందరపడకు నాయనా, తొందర వద్దు. ఒక్కసారిగా ఇన్నీ ఇప్పుడే కొనెయ్యడం చూస్తే, వీటికోసమే నీకోసం ఇన్నాళ్లూ నేను వెంగలో నిరీక్షిస్తున్నానని లోకులు అనుకోగలరు సుమా!"

"అవును, అదీ నిజమే. నీయిష్టప్రకారమే కానియ్యి. కాని అన్నిటికంటె ముందు నీకు పరిచర్య చెయ్యడానికి నౌకరొకడు కావాలి బాబా. నువ్వు ఒంటరిగా గడపకూడదని నా కోరిక. నేను చాటుగా కొంత కాఫీ,పొగాకు తీసుకొచ్చాను. అది నాసామానులో ఉంది. రేపొస్తుంది. ఉండు. ఎవరో వస్తున్నట్టున్నారు."

"అవును, అతను మన పొరుగు 'కాడరూస్.' నువ్వు వచ్చి నట్టు విని ఉంటాడు. యోగక్షేమాలు కనుక్కోవాలని వస్తున్నాడను కుంటాను."

"అవునవును." మెల్లిగా గొణిగాడు ఎడ్మండ్, "పలికేమాటొకటి, మనసులో ఉండేది మరొకటి. కానీలే. పొరుగువాడుకదా! తోచినప్పుడు సహాయంచేశాడు. అతన్ని సత్కరించడం మన ధర్మం."

ఎడ్మండ్ మాటలు ముగిసీ ముగియకముందే, కాడరూస్ ద్వారంవద్ద ప్రత్యక్షమైనాడు.

ఇరవైఅయిదు, ఇరవైఆరేళ్లుంటాయి. చిన్న గడ్డం పెంచాడు. దర్జీవృత్తి. కత్తిరిస్తున్న గుడ్డముక్క చేతిలో ఉండగానే వచ్చాడు.

"ఓహో ఎడ్మండ్ ! తిరిగి వచ్చావన్నమాట." చిరునవ్వుతో తెల్లని పళ్లవరుస స్పష్టంగా కనపడింది.

"వచ్చాను, కాడరూస్. సెలవివ్వండి. మీ కే సహాయం కావలసినా చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాను." అన్నాడు డాంటే. కాని సత్కార వాక్యాలు అతని రూక్షభావాన్ని కప్పిపుచ్చలేక పోయినాయి.

"అహ. వొద్దులే. ఎవరి సహాయం అవసరంలేకుండానే నాకు గడుస్తోంది. ఇతరులికి నేనే సహాయంచేస్తుంటాను."

డాంటేకి కొంచెం వేడి తగిలింది. కాని ఇంతలోనే కాడరూస్ అందుకున్నాడు.

"అబ్బే. నేను నిన్నేమీ అనడంలేదోయ్ ! నేను నీకు ఋణమిచ్చాను; అది తీరిపోయింది. అది ఇరుగు పొరుగు ధర్మంకదా! అంతే. అది చెల్లు."

"చేసిన సహాయం ఎన్నడూ చెల్లిపోదు. ధనంబాకీ చెల్లిపోవచ్చు కాని కృతజ్ఞతా ఋణం తీరదు" అన్నాడు డాంటే.

"ఆ! అదంతా ఇప్పుడెందుకులే. జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పుడు నువ్వు క్షేమంగా తిరిగి వచ్చావు. కులాసాగా కాస్సేపు మాట్లాడుకుందాం. ఒక గుడ్డకోసం ఓడరేవుకి వెళ్ళాను. అక్కడ డాంగ్లర్ కనిపించాడు. 'ఇక్కడున్నావేమిటోయ్' అన్నాను. 'ఇప్పుడే తిరిగి వచ్చా' నన్నాడు. 'అయితే ఎడ్మండ్ ఏడ'ని అడిగాను. 'తండ్రిని చూడ్డానికి వెళ్ళాడనుకుంటా' నన్నాడు. సరే

కదా అని ఇల్లా వచ్చాను. పాతమిత్రుని చూద్దాంకదా అని ఇక్కడ తొంగిచూశాను."

"నిజంగానే నీకు మేమంటే చాలా శ్రద్ధ కాడరూస్" అన్నాడు వృద్ధుడు.

"కాదుమరీ! అసలే నిజాయితీ మనుషులు అట్టేకనిపించని ఈ రోజుల్లో, మీరంటే నాకు చాలా గౌరవం. ఏమిటోయ్! చాలా ధనవంతుడ నైనట్టున్నావే!" అన్నాడు దర్జీ, మేజాపైనున్న డబ్బు వంక చూస్తూ.

డాంటే నిర్లక్ష్యభావంతో, "ఏదోలే. దేవుడిదయ. కాని ఇది నా డబ్బు కాదు. నేను లేనప్పుడు మాబాబ ఇబ్బంది పడ్డా డేమోనని అడిగాను. లేదనినాకు నచ్చచెప్పడానికి, ఉన్నది పర్సు దులిపి చూపించాడు. అదేమిటి బాబా! అదక్కడే ఉంచావ్ ! తీసి దాచు. కాడరూస్ కి ఇప్పుడు డబ్బేమైనా అవసరముంటే కొంత అప్పియ్యి పోనీ"

"అబ్బెబ్బే నాకేమీ ఒద్దోయ్" అన్నాడు కాడరూస్. "దేవుడిదయవల్ల నావృత్తి నన్నిప్పుడు బాగానే గడుపుతోంది. సరే, బాగానే ఉంది. అయితే మోరెల్ తో బాగాసఖ్యత కుదిరిందన్న మాటేగా? నువ్వా గడుసుదనం నేర్చావులే!"

"మోరెల్ నన్నెప్పుడూ ఆదరిస్తాడు."

"మరైతే అతను విందుకి పిలిస్తే నువ్వు నిరాకరించావుట తప్పు కాదూ?"

"ఏమిటీ? విందు నిరాకరించావా?" ఆత్రుతగా అడిగా డావృద్ధుడు. "ఏమిటి డాంటీ? అతను నిన్ను విందుకి ఆహ్వానిం చాడా? మరెందుకు నిరాకరించావు నాయనా?"

"వెంటనే నిన్ను చూడాలని బాబా. చూడందే నిలవలేక పోయాను."

"మోరెల్ ఎంత నొచ్చుకుని ఉంటాడో! కెప్టెన్ అవాలని కోరుకుంటున్నవాడైతే, కొంచెం యజమానిని మెప్పించడానికి ప్రయత్నించాలి" అన్నాడు కాడరూస్.

"మెప్పించడానికి నేను ప్రయత్నించ నక్కరలేకుండా నే కెప్టెన్ అవాలని ఆశ."

"అవునవును. అదీ బాగానే ఉందిలే, మంచిదే. నీ పాతమిత్రు లంతా సంతోషిస్తారు. ఈ శుభవార్త వింటే సంతోషించే వాళ్లు సెంట్ నికోలాస్ కోట కవతిల మరొకరుంటారనికూడా నా ఊహ."

వృద్ధుడు ప్రశ్నించాడు: "ఎవరు? మర్సిదా మాటేనా?"

యువకుడన్నాడు "అవును బాబా. నిన్ను చూశాను. నా బెంగ తీరింది. ఇంక కాటలన్స్ నివాసానికి వెళ్ళాలనుంది బాబా. ఏమం టావు?"

"అవును నాయనా వెళ్లు. ఇటువంటి కొడుకునిచ్చి భగవం తుడు నన్ను కనిపెట్టాడు. అలాగే తగిన భార్యనుకూర్చి భగవం తుడు నిన్నాశీర్వదిస్తాడు."

"భార్యా!" అని ఆశ్చర్యపడ్డాడు కాడరూస్. "అప్పుడే భార్య అంటున్నారేమిటండీ! ఇంకా కాలేదుగా? అయినా, తొందరపడ్డం మంచిదిడాంటే. మర్సిదా అపురూపసుందరి. అంత చక్కని యువతి ఉంటే, ఆమెని కోరే వరులనేకులుంటారు. మర్సి దాపైన ఆసక్తి పెట్టుకుని డజనుమంది యువకు లున్నారు."

"నిజమే." అన్నాడు డాంటే, చిరునవ్వుతో. అయితే లోని తొందరపాటును అణుచుకోలేక పోయాడు.

"నిజమే." అన్నాడు కాడరూస్. "వాళ్లలో కొందరు ఎన్న దగినవరులుకూడా ఉన్నారు. అయితే, నువ్వు కెప్టెన్ కాబోతు న్నావు కాబట్టి నిన్ను నిరాకరించే ప్రమాదం లేదనుకో"

"అబ్బే. అలా అనకూడదు" అన్నాడు డాంటే. "స్త్రీలంటే నా కెంతకంటె మంచిభావం ఉంది. ముఖ్యంగా మర్సిదాపట్ల. నేను కెప్టెన్ అయినా సరే కాకపోయినాసరే, ఆమె నాపట్ల ఒకే ఆసక్తితో ఉంటుందని నా నమ్మకం."

"మరీ మంచిదీ! అయినా, నా సలహా పెడచెవిని పెట్టకు. నువ్వు తిరిగి వచ్చినట్టు, ఆమె పైన నువ్వు ఆశలు పెట్టుకున్నట్టు వీలైనంతత్వరలో ఆమెకి తెలియపరచడం మేలు"

"అలాగే చేస్తాను" అంటూ డాంటే, తండ్రిని ఒకసారి ఆలింగనం చేసుకుని బయలుదేరాడు. డాంటె వెళ్ళిన వెంటనే కాడరూస్ బయలుదేరాడు. మెట్లుదిగి వెళ్లి వీధిమలుపులో వేచి ఉన్న డాంగ్లర్ ను కలుసుకున్నాడు.

"ఏమయింది? అతన్ని చూశావా?" అని ప్రశ్నించాడు డాంగ్లర్.

"ఇప్పుడే అతనివద్దనుంచి వస్తున్నాను."

"తనకి కెప్టెన్ అవాలని కోరిక ఉన్నట్లు నీతో ఏమైనా అన్నాడా?"

"అనడమేమిటి? అప్పుడే కెప్టెన్ అయినట్లే మాట్లాడుతున్నాడు! మారెల్ అతనికి మాటఇచ్చాడట."

"అలాగేం? అంతా ఉట్టిది. అయినా, ఇంకా కెప్టెన్ కాలేదుగా! అది మాత్రంనిజం."

"ఆ. వాడిమొహం. అది అసలు వాడికి రావడమేమిటి? రాకూడదు. వస్తే ఇంక వాడితో మాట్లాడగలమా!"

"ఆమాటకొస్తే, అసలువాణ్ని ఇంకో మెట్టు దించెయ్యాలి. ఇంకావాడికి ఆ కాటలన్ యువతిని ప్రేమించే ఆశ ఉన్నట్టేనా?"

"ఉన్నట్టేనా ఏమిటి? వట్టిప్రేమ పట్టుకుంది. ఇప్పుడే ఆమెనిచూడ్డానికి వెళ్లాడు. కాని— నేనాట్టేపొరపడ్డం లేదనుకుంటాను— అక్కడే వాడికి ఆశాభంగం కలగవచ్చు."

"అంటే? అదేమిటో వివరంగా చెప్పనాకు! ఆ అమ్మాయిని గురించి కూడా పూర్తిగా చెప్పు?"

"ఏముంది? మర్సిడా పట్నానికొచ్చేటప్పుడల్లా కాటలన్ యువకుడొకడు కూడా కూడా ఉంటున్నాడు. అతనుపొడుగ్గా ఉంటాడు. నల్లని కళ్లు, గోధుమ ఛాయ. ఆమె అతన్ని బావ అంటుంది."

"అల్లాగా! అయితే ఆమెని చేసుకోవాలనేనా అతని ఉద్దేశం? అంతేనా?"

"అదేనని నా ఊహ. లేకపోతే ఇరవై ఒక్కేళ్ల యువకుడు పదిహేడేళ్ల యువతివెంట ఎప్పుడూ ఎందుకు తిరుగుతూ ఉంటాడు?"

"ఇప్పుడు డాంటే కాటలన్స్ నివాసానికి వెళ్లాడని కాదూ చెప్పావు?"

"నేను చూస్తుండగానే కదా, బయలుదేరాడు?"

"సరే. మనం దారికి ఈపక్కనించే నడిచినడితే. రిజర్వ్, హోటల్‌కివెళ్లి, అక్కడకూచోవచ్చు. ఒకగ్లాసు పుచ్చుకుంటూ కూచుంటే సరి. ఆ దారినే డాంటే తిరిగి వస్తాడుగా! అప్పుడు ఏం జరిగిందో వాడి ముఖం చూసి చెప్పవచ్చు."

"అవును. అయితేనేం."

ఇద్దరూ కలిసి గబగబా నడిచి హోటల్‌కి వెళ్లారు. పదినిమిషాల క్రితం డాంటే ఆదారినే వెళ్లినట్లు హోటల్ యజమాని పాంఫైల్ కూడా చెప్పాడు. కాటలన్స్ నివాసానికే వెళ్లాడని నిర్ధారణచేసుకుని, ఇద్దరూ చెరొక గ్లాసు ద్రాక్షసారాయం తెప్పించుకుని హోటల్ ఆవరణలో వృక్షచ్ఛాయక్రింద ఒక మేజావద్ద కుర్చీలలో నిరీక్షిస్తూ కూర్చున్నారు.

# కౌంట్ ఆఫ్ మాంట్‌క్రిస్టో

## 3

మిత్రులిద్దరూ మద్యం చప్పరిస్తూ కూర్చున్న ప్రదేశంనుంచి కాటలన్స్ నివాసగ్రామం నూరడుగుల దూరం ఉంది.

పూర్వం ఒకప్పుడు స్పెయిన్ నుంచి చిన్న పడవల్లో ఒక గుంపు వచ్చి ఇక్కడ చేరింది. వాళ్ళెలా వచ్చారో ఎవరికీ తెలియదు. వాళ్ళు వాడేది కొత్త భాష. వారిలో స్థానిక భాష తెలిసిన ఒక నాయకుడు ఈ ప్రాంతంలో వలస స్థిరపర్చుకోడానికి అనుమతి కోరుతూ, మార్సెల్స్ కౌన్సిల్‌కు మహజరు పెట్టాడు. మహజరు నమోదైన మూడుమాసాలలో అక్కడొక గ్రామం వెలిసింది. సముద్రాలపై స్వేచ్ఛాసంచారం కాంక్షించే కాటలన్ జాతి గుంపు ఇక్కడ నివాసం స్థిరపర్చుకుంది. వారు నిర్మించుకున్న గ్రామం కొంత స్పానిష్ రీతినీ, కొంత మూరిష్ రీతినీ మేళవించి ఒక వింత అందం తెచ్చుకుంది. సముద్రంలోకి చొచ్చుకున్న ఆ నేలని విడిచిపెట్టకుండా ఆ గుంపు ఈనాటికీ అక్కడే వుంది. ఈనాటికీ వాళ్లు పూర్వీకుల భాషనే వాడుతున్నారు. తాతముత్తాతల ఆచార సంప్రదాయాలను, దుస్తులనే అనుసరిస్తున్నారు. మూడు నాలుగు శతాబ్దాలైనా వారు ఇతరులతో కలవలేదు. వివాహ సంబంధాలు పెట్టుకోలేదు. భాష విశిష్టతనూ, జాతి విశిష్టతనూ నిలబెట్టుకున్నారు.

ఆ గ్రామానికి ఒకే ఒక వీధి ఉంది. సూర్యాతపానికి ఇళ్ల రంగులు వెలిసిపోయాయి. సున్నపు తెల్లదనం తప్ప, ఎక్కువ అలంకారమేమీ కనపడదు. ఆ వీధిలో ఒక చిన్న ఇంట్లో......

నల్లని శిరోజాలు, తళతళలాడే లేడికళ్లు గల ఒక చక్కని యువతి గడప నానుకుని నిలబడిఉంది. నాజూకైన వేళ్ళతో ఒక

పూలగుత్తిని నలుపుతోంది. రేకులు కింద రాలుతున్నాయి. దేవతా ప్రతిమను చూసి చెక్కినట్లున్న ఆమె పొడుగైన చేతులు కంపిస్తూ, లోని ఆవేగాన్ని ప్రకటిస్తున్నాయి. ఒకపాదంతో మెల్లిగా నేలను తట్టుతోంది. ఆమెకు మూడడుగుల దూరంలో సౌష్టవశరీరుడైన ఒక యువకుడు కుర్చీలో కూర్చుని, ముందుకూ వెనక్కూ ఊగుతున్నాడు. అతని వయస్సు ఇరవై, ఇరవైరెండే ళ్లుండవచ్చును. యువతివంక తదేకంగా చూస్తున్న అతని ముఖంలో ఓర్మిలేమి, చికాకు స్పష్టంగా గోచరిస్తున్నాయి.

యువతిముఖంలోని నిశ్చలభావం, యువకుని ముఖంలోని సంశయాందోళనలను ఇనుమడింప చేస్తున్నది.

"ఈస్టర్‌కి ఇంక ఆట్టేరోజుల్లేవు మర్సిడా! వివాహ ముహూర్తాలు సమీపిస్తున్నాయి. నాకు సమాధానం చెప్పవా?" అన్నాడు యువకుడు.

"ఇప్పటికి నూరుసార్లు సమాధానం చెప్పాను ఫెర్నాండో. నన్ను మళ్లీమళ్లీ అడుగుతున్నావంటే, నీపైన నీకే విశ్వాసం లేదన్న మాట."

"కావచ్చును! కాని మళ్లీ ఇంకోమారు చెప్పమని బతిమాలుతున్నాను. నే నామాటల్ని నమ్మగలిగేవరకూ చెప్పు. అయ్యో! నీ సాహచర్యంపొంది సుఖించాలని పదేళ్లకాలం కలలుకంటూ గడిపి, చివరికి నాజీవితంలో ఈ ఏకైకలక్ష్యం చేకూరే ఆశ నశించనా?"

"నేను మాత్రం అటువంటి ఆశకు తావివ్వలేదు ఫెర్నాండో. నే నెప్పుడూ నీకు చెప్తూనేవున్నాను—నిన్ను సోదరునిగా భావించి ప్రేమిస్తున్నానని; సోదరప్రేమకంటె అధికంగా ఏదీ నావద్ద కోరవద్దని; నాహృదయం మరొకనికి అర్పితమయిందని. నేను నీకెప్పుడూ చెప్తూ ఉండలేదా ఫెర్నాండో?"

"అవును మర్సిడా! చెప్తున్నావు. నిర్దయతో నిష్కర్షవాక్యాలనే నాకెప్పుడూ ప్రసాదించావు. కాని, కాటలన్స్‌జాతికి చెందినవాళ్లు అన్యజాతీయుల్ని వివాహంచేసుకోరాదనే పవిత్ర నియమాన్ని నువ్వు మరిచిపోతున్నావు."

"అది సరికాదు ఫెర్నాండో. అది నియమ విధి కాదు. అది ఆచారం మాత్రమే. నీ స్వార్థం కోసం ఈ ఆచారంతో నన్ను బంధించడానికి ప్రయత్నించకు. సైన్యంలో చేరాలని నీకు ఆజ్ఞ వచ్చింది ఏక్షణంలోనైనా నువ్వు వెళ్ళిపోక తప్పదు. నువ్వు సిపాయి వైనతరవాత నావల్ల నీకేం ప్రయోజనం ఉంటుంది? నాకే సంపదా లేదు, ఈ ఒక్క పూరిల్లు తప్ప. తల్లిదండ్రులు లేరు. ఏ ఆధారం లేని నావల్ల నీ కేం ప్రయోజనం?"

"నువ్వు పేదవే; ఒంటరివే. అయితేమాత్రం? మార్సైల్స్‌లో ఎంతటి భాగ్యవంతుల పుత్రికలైనాసరే, వారికంటె నువ్వే నాకు ఎన్న తగినదానవు. ఋజువర్తనలోగాని, సమర్థతలో గాని నీకు చాలిన మరొక యువతిని చూపించు?"

శిరస్సువంచి మర్సిదా అంది:—"కాని ఫెర్నాండో, ప్రేమించినవానిని కాక మరొకనిని వివాహమాడే యువతి ఋజువర్తన మారిపోవచ్చు. నామాట విను. నీ పల్లెవృత్తిపైనే నీ మనస్సు లగ్నం చెయ్యి. కలల్లో విహరించడం మాను. అటువంటి కలలనించి మేలుకోగానే, వాస్తవ స్థితి దుర్భరమైపోగలదు. నా స్నేహాన్ని మాత్రం స్వీకరించు. నేను నీ కింతకంటే ఇవ్వ గలిగేది లేదు."

"అవును మర్సిదా! నువ్వు చెప్పినది నిజం. నేను నావికుడ నౌతాను. నీ కంటికి అసహ్యంగా కనపడే మనపూర్వుల దుస్తులు త్యజించి, చారలషర్టు, నీలికోటు, టోపీ ధరిస్తాను. నిన్ను మెప్పించడానికి అలాగే ఉండాలి కదూ?"

ఈమాట మర్సిదా ముఖభంగిమ మారింది. అనుతాపం పోయి ఆగ్రహం ఆవహించింది. "అంటే?"

"అంటే ఆరీతిగా ఉండే ఒకనికోసం వేచిఉన్నావు. కాబట్టి, నాపట్ల ఇంత నిర్దయతో ప్రవర్తిస్తున్నావని. అయినా ఏమో! ఎవరు చెప్పగలరు? నువ్వు ఎవరికోసం నిరీక్షిస్తున్నావో అతడు చపలుడు కావచ్చును. కాకపోయినా అతనికి సముద్రమే చివరిగతి రాసిపెట్టి ఉండవచ్చును."

"ఫెర్నాండో" అంది మర్సిదా బిగ్గరగా. "నువ్వింకా సత్పురుషుడ వనుకున్నాను. కాని, మోసపోయాను. నీ ఈర్ష్యను తోడు శాపాలు పెట్టడానికి నీ హృదయ మెంత విషపూరితం! ఇదిగో విను. నేనేమీ దాచడంలేదు. నువ్వు ఎవర్ని గురించి మాట్లాడుతున్నావో అతన్నే నేను ప్రేమిస్తున్నాను. అతనికోసమే నిరీక్షిస్తున్నాను. తిరిగిరాని పక్షంలో అతన్నిచపలుడని నీమాదిరిగా నిందించను. నాపై ప్రేమతోనే మరణించాడని భావిస్తాను"

కాటలన్ యువకుడు ఉద్రేకపూరితు డైనాడు.

"నిన్నర్థంచేసుకున్నాను ఫెర్నాండో. నేనతన్ని ప్రేమిస్తున్నందువల్లనే అతన్ని నువ్వు దూషిస్తున్నావు. అతనితో కత్తి దూయ్యడానికి సిద్ధపడుతున్నావు. కాని, దానివల్ల నీకేం ప్రయోజనం? నన్నెలాగూ వివాహం చేసుకోలేవు. నే నిచ్చిన స్నేహంతో,సోదర ప్రేమతో తృప్తి పడు. అది కాక నువ్వన్నట్లు, నిజంగానే సముద్రం నమ్మడానికి వీలు కానిది. అతను వెళ్ళి అప్పుడే మూడుమాసాలయింది. ఈ మూడుమాసాలలోనూ ఏ తుపాను లొస్తాయో నని ఎంతగా క్షోభించాను?" అంటు న్నంతలో మర్సిదాకళ్ళు నీళ్ళతో నిండాయి.

ఫెర్నాండో అటూఇటూ పచారుచెయ్యనారంభించాడు. తరవాత ఆమె సమీపంలోకి వచ్చి నిలిచి, పిడికిళ్ళు బిగబట్టి కళ్ళలో నిరాశ ప్రతిఫలిస్తుండగా ప్రశ్నించాడు "చెప్పు మర్సిదా! ఆఖరుపర్యాయం చెప్పు. ఇదే నీ దృఢనిశ్చయమా?"

నిష్కర్షగా చెప్పింది మర్సిదా:—"నేను ఎడ్మండ్ డాంటీని ప్రేమిస్తున్నాను. అతన్నితప్ప ఇంకెవరినీ వివాహమాడను."

ఆశలు కూలిపోయినట్లు ఫెర్నాండో తల ఒరిగిపోయింది. మూలుగుతున్నట్లు దీర్ఘనిశ్వాసం విడిచాడు. కాని, వెంటనే శిర సెత్తి దృఢస్వరంతో ప్రశ్నించాడు.

"అతడు మరణించినట్లయితే?"

"అతడు మరణిస్తే, అతన్ని నేనూ అనుసరిస్తాను."

"అతడు నిన్ను విస్మరిస్తే?"

ఇంతలోనే గృహప్రాంగణంనుంచి ఉల్లాసపూరితమైన ఒక పిలుపు వినవచ్చింది. "మర్సిడా! మర్సిడా!"

"అదుగో" అంది యువతి. ఆమెముఖం కాంతివంతమయింది. ఉత్సాహంతో ముందుకు రెండడుగులు వేసింది. "చూడు, అతడు నన్ను మరిచిపోలేదు. ఇదుగో వచ్చాడు." ద్వారంవైపు పరుగెత్తి తలుపు తీసింది. "ఎడ్మండ్! ఎన్నాళ్ళకి వచ్చావ్!"

ఫెర్నాండో ముఖం పాలిపోయింది. వొణికిపోతూ కుర్చీలో కూలబడిపోయాడు. మర్సిడా ఎడ్మండ్ చేతుల్లోకి వాలిపోయింది. ఇద్దరూ ఆనందాతిరేకంలో లోకాన్ని మరిచిపోయారు. బాధా జనితమో ఆనందఫలితమో తెలియని అస్పష్టమైన వాక్కులతో పరస్పరభావాలను ప్రకటించుకున్నారు. ఫెర్నాండో ముఖంలోని కాళఛ్ఛాయలు అకస్మాత్తుగా ఎడ్మండ్ దృష్టిగోచరమైనాయి. ఫెర్నాండో చెయ్యి కత్తిపిడిమీదికి దూకింది.

"ఓహో, నన్ను క్షమించాలి" అన్నాడు డాంటీ, క్రోధ భావంతో "ఇక్కడ ముగ్గురం ఉన్నామన్న సంగతి నేను గమనించలేదు." మర్సిడావంక తిరిగి ప్రశ్నించాడు.

"ఈయ నెవరు?"

"నీకు ప్రాణస్నేహితుడు కావలసినవాడు. నాకు మిత్రుడు, బావ, సోదర సమానుడు. అతని పేరు ఫెర్నాండో. ఎడ్మండ్, నీతరవాత, అతన్ని ప్రేమించినంతగా ఈ ప్రపంచంలో నే నింకెవరినీ ప్రేమించను. అతన్ని గుర్తు పట్టలేదా?"

"ఆ! అవును." అన్నాడు డాంటీ. మర్సిడాను వదలకుండానే, ఒక చెయ్యి చాచి కాటలన్ యువకుని సాదరంగా పిలిచాడు. కాని, ఫెర్నాండో చెయ్యి అందుకోలేదు. శిలాప్రతిమ వలె స్తబ్దుడై కూర్చుండిపోయాడు. ఆందోళనతో కంపిస్తూమర్సిడా వంక డాంటే తేరిపార చూశాడు. తరవాత క్రోధోద్వేగంతో ఫెర్నాండో వంక చూశాడు. క్షణంలో అంతా గ్రహించాడు. కోపంతో అతని ముఖం ఎర్రబడింది.

"నీదగ్గరకు రెక్కలమీద వచ్చి వాలాను మర్సిడా. కాని, ఇక్కడశత్రు వొకడు తటస్థపడతా డనుకోలేదు."

"శత్రువా ?" మర్సిడా బిగ్గరగా అరిచింది. ఆ వేగంతో ఫెర్నాండో వంక చూసి, "నాయింటిలో నా శత్రువు ? అదే నిజమయితే, వెంటనే ఈయిల్లు విడిచిపెట్టి మార్సెల్స్ నగరానికి నిన్ననుసరించి వచ్చేస్తాను. నీకే హాని సంభవించినా మార్గియన్ అగ్రం పైనుంచి దూకి ప్రాణత్యాగం చేస్తాను." నిశ్చలంగా ఆమె పలికిన వాక్యాలనుబట్టి, తన మనోగతోద్దేశాన్ని ఆమె గ్రహించినట్లు ఫెర్నాండో తెలుసుకున్నాడు. అతనిముఖం పాలిపోయింది.

మర్సిడా మళ్లీ చెప్పింది. "కాని నువ్వు పొరపడ్డావు ఎడ్మండ్. ఇక్కడ నీకు శత్రు వెవరూ లేరు. నాకు సోదరసమానుడైన ఫెర్నాండో ఒక్కడే ఉన్నాడు. హృదయపూర్వకమైన స్నేహ మివ్వడానికి సిద్ధంగా ఉన్నాడు." ఆజ్ఞాపూర్వకమైన యువతి నేత్రభంగిమ చూసిమంత్రముగ్ధుడైనట్లు ఫెర్నాండో మెల్లిగా ఎడ్మండ్ ను సమీపించి చెయ్యి అందించాడు. కాని చేతికి చెయ్యి తాకినంతనే తనలోని సహనం అంచులు మీరినట్లు, దుర్భర వేదనతో ఇల్లు విడిచి అతివేగంతో నిర్గమించాడు. పిచ్చివానివలె జుట్టుపీక్కుంటూ "అయ్యయ్యో ! ఎలాగ ? నన్నెవరు కాపాడగలరు ? అయ్యో పాడుజన్మ ! పాపిష్ఠికర్మ !" అంటున్నాడు.

ఇంతలో అతని కొక పిలుపు వినవచ్చింది. "ఎవరు ? ఫెర్నాండో ! ఎక్కడికి వడుతున్నావ్ ?"

కాటలన్ యువకుడు చటుక్కున ఆగిపోయాడు. చుట్టూ చూశాడు. వృక్షచ్ఛాయలో కూర్చున్న కాడరూస్, డాంగ్లర్ కనిపించారు. విభ్రాంతుడై వారిని చూస్తూ ఉండిపోయాడు. నోట మాట రాలేదు.

కాడరూస్ ను మోకాటితో పొడిచి డాంగ్లర్ "అదేమిటి ? అలా పిచ్చెత్తినట్టున్నాడు?" అన్నాడు. "ఏమో ! ఏం చెప్పగలం? మనం మోసపడిఉండవచ్చు. డాంటెకి కోరినంతా లభించిఉండవచ్చు."

"అలాగే కనిపిస్తోంది. అదేమిటో కనుక్కుందాం" అన్నాడు కాడరూస్. ఫెర్నాండో వంక తిరిగి, "రావోయ్ రా, కూచో కొంచెం స్థిమితపడు."

నుదుటినుంచి ధారలుకట్టిన చెమట తుడుచుకుంటూ, ఫెర్నాండో మెల్లిగా చెట్టునీడకి చేరాడు. నీడలో చల్లదనం అతన్ని కొంత శాంతపరిచింది. "నన్ను పిలిచారా?" అంటూ ఒక కుర్చీలో కూలబడ్డాడు.

"పిచ్చివాడిలా పరుగెత్తుతున్నావని పిలిచాను. వెళ్లి సముద్రంలో దూకుతావేమో నని భయపడ్డాను." అన్నాడు కాడరూస్ నవ్వుతూ. "స్నేహితుడన్న తరవాతి ఒక గ్లాసు మద్యం ఇవ్వడమే కాదు; సముద్రంలో మునిగిపోతున్నప్పుడు కాపాడాలి కూడా."

ఫెర్నాండో పెద్ద మూలుగు మూలిగాడు. అది మూలుగులా లేదు. రోదనలా ఉంది. రెండుచేతులమధ్యా ముఖం దాచుకొని ముందుకువంగి కూర్చున్నాడు.

"ఇదిగో చూడు ఫెర్నాండో. నిన్ను చూస్తే ఎలా వున్నావో చెప్పనా?" అన్నాడు కాడరూస్. "భగ్నప్రేమికుడిలా వున్నావు. చాలు, చాలు! అదేమిటో మాకంతా చెప్పకూడదూ? నీ హితవు కోరి స్నేహితులడుగుతుంటే ఊరుకోడం భావ్యం కాదు."

ఫెర్నాండో తలెత్తకుండానే పిడికిళ్లు బిగించి అన్నాడు.

"నేను బాగానే ఉన్నాను."

"అదిగో! చూడు డాంగ్లర్" అన్నాడు కాడరూస్ మిత్రునివంక కన్నుగీటుతూ. "ఇలా గుంది. చూడు ఇతని సంగతి. ఏ పాపం ఎరగడు. ఉత్తముడు. పల్లెవాళ్లలో పెద్ద చెయ్యి. మర్సిదా అనే చక్కని అమ్మాయిని ప్రేమించాడు. కాని దురదృష్టవశాత్తు ఈ చక్కనిపిల్ల ఫరావో నౌక మేట్‌ని ప్రేమించింది. ఫరావో ఇవాళే వచ్చింది. వచ్చిందో లేదో, పాపం, ఫెర్నాండోని అతని దారి అతన్ని చూసుకోమంది."

"అయితే?" అన్నాడు ఫెర్నాండో, తలెత్తి కాడరూస్ వంక చూస్తూ, తన కోపాన్నంతనీ కక్కడానికెవరైనా దొరుకుతారా అని వెతుకుతున్నట్లు. "కోరినవాణ్ణి ఎంచుకోడానికి మర్సిదాకి స్వేచ్ఛ, స్వాతంత్ర్యం ఉన్నాయి. లేవంటారా?"

"సరిపోయింది. అల్లా అనుకుంటే ఇబ్బందే లేదు" అన్నాడు కాడెరూస్. "కాని నువ్వేమో కాటలన్‌జాతిపేరు వినిపే వీరుడి వనుకున్నాను. ప్రత్యర్థి ఆక్రమించుకుంటూ ఉంటే, కాటలన్ జాతికి చెందినవాళ్లెవరూ ఊరుకోరని నే విన్నాను. అందులోనూ ఫెర్నాండో అంటే ప్రత్యర్థులకు భయంకరుడని విన్నాను."

ఫెర్నాండో సానుభూతిపూర్వకంగా నవ్వాడు. "ప్రేమికుడు భయంకరంగా ఉండడు" అన్నాడు.

"ఓహో! కాబోలు," అన్నాడు కాడెరూస్. మద్య ప్రభావం అప్పుడే అతని తలకెక్కుతోంది "దాని మాటెల్లా వున్నప్పటికీ, డాంటే తిరిగిరావడంవల్ల ఫెర్నాండో ఒక్కడికే ఇబ్బంది కలగలేదు. ఏమంటావ్ డాంగ్లర్ ?"

"నువ్వు చెప్పిందీ నిజమే. అతనికి కొంత ఇబ్బంది కలిగే ఉండవచ్చు."

"అదేముందిలే" అన్నాడు కాడరూస్, ఫెర్నాండో గ్లాసులో మద్యంపోసూ. పదోసారి తన గ్లాసుకూడా నింపుకున్నాడు. డాంగ్లర్ మొదటిగ్లాసింకా ఖాళీ కాలేదు. "ఎవరెల్లా పోతేం! అతను మర్సిదాని పెళ్లి చేసుకోక మానడు."

డాంగ్లర్ కాటలన్ యువకుని అతి శ్రద్ధగా పరిశీలిస్తున్నాడు. కాడెరూస్ పలుకులు అతని హృదయంలో చిచ్చుపెడుతున్నాయి.

"మరి, పెళ్లి ఎప్పుడు ?"

"అదా! ఇంకా నిర్ణయం కాలేదు." అని గొణిగాడు ఫెర్నాండో.

"లేదు. కాని నిర్ణయంకావడానికెంతలే! త్వరలోనే అవుతుంది." అన్నాడు కాడరూస్. "పెళ్లవడం ఎంత నిశ్చయమో, ఫరావోనౌకకి డాంటే కెప్టెన్ అవడం కూడా అంతే నిశ్చయం. ఏమంటావ్ డాంగ్లర్ ?"

సంభాషణ హఠాత్తుగా తనమీదికి తిరిగేసరికి డాంగ్లర్ కంగారుపడ్డాడు. కాడరూస్ తనను ఎత్తిపొడవడానికి యత్నిస్తున్నాడేమోనని అతనివంక తీక్షణంగా చూశాడు. కాని, మత్తువల్ల అర్థచైతన్యం మాత్రం మిగిలిన ఆముఖంలో అసూయతప్ప, వేరేమీ కనిపించలేదు.

తనగ్లాసు నింపుకుంటూ అన్నాడు : "సరే కానీ. మర్సిదా భర్త అయిన కెప్టెన్ ఎడ్మండ్ డాంటేకి శుభాకాంక్షలు పలకండి."

కాడరూస్ గ్లాసెత్తి పెదవులకు పట్టించాడు. ఒక్క గుక్కలో గ్లాసు ఖాళీచేశాడు.

ఫెర్నాండో తన గ్లాసుఎత్తి నేలకు విసిరికొట్టాడు.

"ఆగండి. అటు చూడండి. అక్కడెవరు?" అన్నాడు కాడరూస్. "కాటలన్స్ గ్రామందగ్గర ఆ మిట్టపైన కనిపిస్తున్న వాళ్లెవరు? నువ్వు చూడు ఫెర్నాండో. నాకంటె నీచూపు బాగుంది; నాచూపు తగ్గిపోయింది. మద్యం చేసేద్రోహం నీకు తెలుసుగా! చూస్తే ఇద్దరు ప్రేమికుల్లా కనిపిస్తున్నారు. చెయ్యీ చెయ్యీ కలిపి నడుస్తున్నా రనుకుంటాను. దేవుడు క్షమిస్తే—పాపం ఇంకొకళ్లు చూస్తున్నారని వాళ్ళకి తెలియదు. చూడు. ఆలింగనం చేసుకుంటున్నారు."

ఆ దృశ్యాన్ని చూసి ఫెర్నాండో ముఖం వికృతంగా మారి పోయినట్లు డాంగ్లర్ కనిపెట్టాడు.

"వాళ్లెవరు ఫెర్నాండో?" అని అడిగాడు.

బొంగురుపోయిన గొంతుతో చెప్పాడు ఫెర్నాండో "వాళ్లు ఎడ్మండ్, మర్సిదా."

"ఓహో" అన్నాడు కాడరూస్. "నేను గుర్తుపట్టలేక పోయాను సుమా!" అని, వాళ్లని గట్టిగా పిలిచాడు. "డాంటే! మాట! ఓ అమ్మాయ్! మిమ్మల్నే! కొంచెం ఇటురండి. ఎప్పుడేమిటి పెళ్లి? ఇక్కడ ఫెర్నాండో మాకేం చెప్పకుండా భీష్మించుకుని కూచున్నాడు."

"ఊరుకుంటావా లేదా" అంటూ డాంగ్లర్ కాడెరూస్‌ని వెనక్కి లాగుతున్నట్టు నటించాడు. మత్తుతో నిలబడలేకపోయినా లేచి సాగుతున్నాడు కాడరూస్. "కూచోవోయ్ నువ్వు మాట్లాడకుండా. ప్రేమికుల్ని వాళ్ల మానాన వాళ్లని విడిచిపెట్ట రాదూ? చూడు, ఫెర్నాండోకేసి; అతనెంత శాంతంగా, సబబుగా ఊరుకొన్నాడో. చూసి నేర్చుకో" అన్నాడు డాంగ్లర్.

ఒళ్లు తెలియని ఆవేశంలో, డాంగ్లర్ ఎత్తిపొడుపులికి నిలవలేక, ఫెర్నాండో దూసుకు వెళ్ళేవాడే. కాని, ఇంతలో మర్సిదా తలెత్తి చిరునవ్వుతో చుట్టూ కలయచూసింది. ఇద్దరూ సమీపిస్తున్నారు. ఫెర్నాండోకి మర్సిదా బెదిరింపు జ్ఞప్తికి వచ్చింది—ఎడ్మండ్‌కి ఏటువంటి హానికలిగినా ఆత్మహత్య చేసుకుంటానని. దాంతో ఫెర్నాండో నిర్జీవంగా కుర్చీలోకి వాలిపోయాడు.

డాంగ్లర్ తనప్రక్కనున్న ఇద్దరిముఖాలూ చూశాడు. ఒకని ముఖంలో మత్తువల్ల చైతన్యం ఉడిగిపోయింది. మరొకని ముఖంలో భగ్నప్రేమవలని ఉన్మత్తత కనిపించింది.

"ఈ వెర్రిమొహాలవల్ల నాకు రవ్వంతకూడా ప్రయోజనం లేదు" అనుకున్నాడు డాంగ్లర్ తనలో. "ఇక్కడ ఒక తాగుబోతుకీ, ఒక పిరికిపందకీ మధ్య నేను కూచోవలసిన పనిలేదు. ఎడ్మండ్ దశ ఉచ్ఛగతిలో ఉంది. అతనా సుందరిని పెళ్లిచేసుకుంటాడు; కెప్టెన్ అవుతాడు; మమ్మల్ని అందర్నీ హేళన చెయ్యక మానడు; నేను జోక్యం చేసుకోకపోతే, అవహేళన చెయ్యక మానడు" ఒక వక్రమందహాసం పెదవుల చివర ద్యోతకమయింది.
మేజాబల్ల నానుకుని నిలిచీ నిలవనట్లు నిలిచి కాడెరూస్ బిగ్గరగా అంటున్నాడు..

"ఏమోయ్ ఎడ్మండ్! ఇక్కడ మిత్రులం కనిపించడం లేదా? లేక మాట్లాడానికి మేము తగమా?"

"లేదు కాడెరూస్" అన్నాడు డాంటే చేరువకివస్తూ. "మాట్లాడ్డానికి తగకపోడ మేమీ లేదు. నా కెంతో ఆనందంగా ఉంది. గర్వంకంటె ఆనందం మరింత గుడ్డిది!"

"బలేగా చెప్పావోయ్! ఏమమ్మా మదాం డాంటే! క్షేమమేనా?"

మర్సిదా శంకతో శిరస్సు కంచుకుంది. "నన్నప్పుడే అలా పిలవకూడదు. వివాహం కాని యువతుల్ని వరుల పేరు చేర్చి పిలిస్తే మాలో అశుభం. నన్ను మర్సిదా అనే పిలవండి."

"త్వరలోనే పెళ్లి జరుగుతుందనుకుంటాను డాంటే?" అన్నాడు డాంగ్లర్.

"వీలైనంత త్వరలోనే జరుగుతుంది డాంగ్లర్. ఇవాళ నా తండ్రితో మాట్లాడి అంతా ఏర్పాటు చేస్తాం. రేపో ఎల్లుండో ఇక్కడే, ఈ రిజర్వ్ హోటల్లోనే విందు ఏర్పాటవుతుంది. మిత్రులంతా మానకుండా రాగల రనుకుంటాను. మిమ్మల్ని నేను ఇప్పుడే ఆహ్వానించినట్లు ఎంచుకోండి డాంగ్లర్. మీరుకూడా కాడరూస్."

"మరి ఫెర్నాండో మాట? అతనుకూడా రావాలా?" అన్నాడు కాడరూస్, చిన్న వెకిలి నవ్వుతో.

"నా భార్య సోదరుడు నాకూ సోదరుడే" అన్నాడు ఎడ్మండ్. "ఇటువంటి శుభానికి అతను రాకపోతే ఇద్దరం కూడా చాలా చింతిసాం."

"ఇవాళ ఏర్పాట్లు, రేపో ఎల్లుండో ప్రధానం, విందు. చాలా తొందర మీదున్నారే కెప్టెన్!"

డాంటే చిరునవ్వుతో అన్నాడు "డాంగ్లర్! కాడరూస్‌కి మర్సిదా చెప్పినమాటే మీకూ చెప్పాలి. ఇప్పటికింకా లభించని బిరుదుతో నన్ను పిలవకండి. దానివల్ల దురదృష్టం ప్రాప్తించవచ్చు."

"క్షమించాలి. ఆలస్యం సహించలేకుండా ఉన్నారని ఊరికే అన్నాను. అంతే. మీ కింకా కావలసినంత వ్యవధిఉంది. ఫరావో మూడుమాసాలవరకూ బయలుదేరదు. అందు కన్నాను."

"సౌఖ్యాన్ని అందుకోడానికి ఎవరైనా తొందరపడతారు డాంగ్లర్. మరీ ఆలస్యమైతే, ఆ సౌఖ్యం దక్కకపోవచ్చును.

నా సౌఖ్యం మాటెలా ఉన్నప్పటికీ, నేను పారిస్ వెళ్ళవలసిన పని కూడా ఉంది."

"ఓ! పారిస్ వెళ్ళాలా? అక్కడ పనేదైనా ఉందా?"

"నాపని కాదు. పాపం మన కెప్టెన్ లక్లెర్ తుది ఆజ్ఞ పాలించాలి. అది పవిత్రమైన కర్తవ్యం కదా డాంగ్లర్!"

"అవు నవును." అన్నాడు డాంగ్లర్. అని తనలో ఇల్లా అనుకున్నాడు. "అవును పారిస్ వెళ్ళాలి. గ్రాండ్ మార్షల్ ఇచ్చిన ఉత్తరాన్ని అక్కడ ఒప్పగించాలి. ఆ! మంచి ఆలోచన తట్టింది. చాలా బాగుంది. డాంటే! దొరికావ్! నువ్విప్పుడే ఫరావో కెప్టెన్ కావడం లేదులే!" తరవాత డాంటేతో అన్నాడు. "క్షేమంగా వెళ్ళిరండి."

ఎడ్మండ్ ధన్యవాదాలు చెప్పి బయలుదేరాడు. అమర సౌఖ్యాన్ని అందుకుంటున్న తృప్తితో ఇద్దరూ వెళ్ళారు.

---

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

## 4

అంతకంతకి దూరమౌతున్న ఇద్దరిపైనా దృష్టి నిగిడ్చి చూస్తున్నాడు డాంగ్లర్. సెంట్ నికలాస్ కోటవద్ద మలుపుతిరిగి ఇద్దరూ అదృశ్యులవగానే, ఫెర్నాండో వంక చూశాడు. ఫెర్నాండో నిరాశతో కుర్చీలో కూలబడి ఉన్నాడు. కాడెరూస్ మత్తు తలకెక్కి పాట గొణుగుతున్నాడు.

డాంగ్లర్ ఫెర్నాండో వంక తిరిగి అన్నాడు. "అయితే అదన్నమాట సంగతి. ఇది అందరికీ ఆనందం చేకూర్చే వివాహం కాదన్నమాట!"

"నాకు పిచ్చెక్కుతోంది" అన్నాడు ఫెర్నాండో.

"అయితే మీరు మర్సిదాను ప్రేమిస్తున్నారన్నమాటేనా?"

"పరిచయం కలిగిన రోజునుంచీ ఆమె నారాధించాను."

"అయినా మార్గాంతరం చూడకుండా, ఇక్కడే జుట్టు పీక్కుంటూ కూచున్నారు. మనుష్యులిల్లా ప్రవర్తిస్తారని నేనెన్నడూ అనుకోలేదు."

"వాణ్ని నిలువునా చీరెయ్యాలనుంది. కాని వాడికే ముప్పు వచ్చినా తన ప్రాణాలు తీసుకుంటానని ఆమె అంటుంది."

"హుం. దద్దమ్మ" అనుకున్నాడు డాంగ్లర్ తనలో. "ఆమె ప్రాణాలు తీసుకుంటే ఎవరికి, తీసుకోకపోతే ఎవరికి? డాంటెకెప్టెన్ కాకపోవడమే కావలసింది!"

"మర్సిదా మరణించేకంటె నేనే చావడం మేలు" అన్నాడు ఫెర్నాండో, స్థిరమైన స్వరంతో.

డాంగ్లర్ అన్నాడు. "చూడండి. మీరు సత్పురుషునివలె కనిపిస్తున్నారు. మిమ్మల్ని ఈ చిక్కులోనించి తప్పించాలని నాకు కోరిక కలుగుతోంది. కాని..."

"అవును అదెల్లాగో ఆలోచిద్దాం" అన్నాడు కాడెరూస్.

"నువ్వుండవోయ్. ఇప్పటికే ముప్పాతిక పాలు తెలివిపోయేటట్లు తాగావు. ఆ పాతికా పూర్తిచేసేసి నీమానాన నువ్వుండు. నీ తాగుడేదో నువ్వు చూసుకో. మా వ్యవహారంలో వేలు పెట్టకు. దీనికి కొంచెం బుర్ర ఉపయోగించాలి."

"నేను తెగ తాగానా? ఎవరన్నారు? ఏదీ చూడు చెప్తా. ఇప్పుడే ఇంకో నాలుగు సీసాలు తాగెయ్యగలను. ఇవ్వేం సీసాలు, ఔన్సు మందుల్లాగ? పాంఫైల్! ఇంకా మద్యం తీసుకురా." మాటలకి జోరు చాల దన్నట్టు కాడెరూస్ గ్లాసు తీసి బల్లనేసి కొట్టాడు.

ఫెర్నాండో అందుకున్నాడు: "ఏమిటి ఇప్పుడంటున్నారు?"

"ఏమంటున్నానంటే— ఏమిటో మర్చిపోయాను. ఈ తాగుబోతువల్ల ఆలోచన తెగిపోయింది."

"నన్నీ చిక్కులోనించి తప్పించగలరని అంటున్నారు. కానీ, అని ఏమిటో అన్నారు."

"ఆ. ఆ. జ్ఞాపకం వచ్చింది. మిమ్మల్ని ఈ చిక్కులోనించి తప్పించాలంటే, ముందుగా మీరు ప్రేమించే ఆ యువతిని అతను పెళ్లిచేసుకోకుండా నిలిపివెయ్యాలి. డాంటే చచ్చిపోనక్కర్లేకుండానే పెళ్లి ఆపుచెయ్యవచ్చునని నాకు తట్టుతోంది."

"మృత్యువు తప్ప మరేదీ వాళ్ళమధ్య ఎడబాటు తేలేదు" అన్నాడు ఫెర్నాండో ఘంటాపథంగా.

"ఒట్టి తెలివిహీనుడిలా మాట్లాడుతున్నావోయ్" అన్నాడు కాడరూస్. "డాంగ్లర్‌ని చూడు, ఎంత మెలకువగా ఉంటాడో! అతని చాకచక్యం చూడు. నువ్వు పొరపడ్డావని ఇట్టే రుజువు చెయ్యగలడు. డాంటే చచ్చిపోనక్కర్లేకుండానే పని సానుకూల పడుతుందని చెప్పవోయ్ డాంగ్లర్. అయినా అతను చచ్చిపోవడమేమిటి? డాంటే చాలా మంచివాడు. అతనంటే నాకు చాలా ఇష్టం. డాంటే! నిన్ను ఆశీర్వదిస్తున్నాను."

ఫెర్నాండో ఆవేశంతో లేచి వెళ్లిపోడానికి ప్రయత్నించాడు.

డాంగ్లర్ అతన్ని ఆపుతూ, "అతని మాటలకేం లెండి. తెగ తాగి మాట్లాడుతున్నాడన్న మాటే కాని, అతను చెప్పిన దాంట్లో నిజం లేకపోలేదు. ఎడబాటు కలిగించాలంటే చావే అవసరమని లేదు. ఇద్దరినీ దూరంచేస్తే సరిపోతుంది. మాటవరసకి అంటున్నాను. కారాగారం ఇద్దరికీ ఎడబాటు కలిగించగల దనుకోండి?"

"అవును కలిగించగలదు. కాని ఖైదయితే, అందులోనుంచి బైటపడ్డంకూడా ఉంటుందిగా?" అన్నాడు కాడెరూస్. "ఖైదులోనించి బయటపడినప్పుడు, డాంటే స్థితిలో ఎవడున్నప్పటికీ పగ తీర్చుకోకమానడు. అయినా డాంటేని కారాగారాని కెందుకు పంపుతారు? అతనే దొంగతనం చెయ్యలేదు; హత్య చెయ్యడం లేదు."

"చాల్లే నువ్వూరుకోవోయ్" అన్నాడు డాంగ్లర్.

"నే నూరుకోను. ఎందు కూరుకోవాలి? అసలు డాంటేని ఖైదు కెందుకు పంపాలో చెప్పండి నాకు? డాంటే అంటే నాకుచాలా ఇష్టం." అంటూ కాడెరూస్ మరో గ్లాసు గడగడా తాగేశాడు. అతని ముఖంలో చైతన్యం మరింత అంతరిస్తున్నదని గమనించి డాంగ్లర్ ఫెర్నాండో వంక తిరిగి అన్నాడు:—

"వాణ్ని హతంచెయ్యవలసిన అవసరం లేదన్న సంగతి గ్రహించారా?"

"నిజమే. కాని మీ రన్నట్టు అతన్ని అరెస్టుచేయించడం ఎల్లాగ? సాధనమేదీ?"

"వెతికితే సాధనం అదే కనిపిస్తుంది. అయినా ఈ వ్యవహారంలో నే నెందుకు తలదూర్చడం; నా కేమీ సంబంధం లేనప్పుడు?"

"డాంటేపట్ల మీక్కూడా క్రోధానికి ఏదో కారణముండుంది. ఒకరిని అసహ్యించుకునే వ్యక్తి, ఇతరుల అసహ్యభావాన్ని సులువుగా కనిపెట్టగలడు." అన్నాడు ఫెర్నాండో.

"నాకా? డాంటెమీద నాకే కోపం, అసహ్యం లేవే? అందుకు కారణ మేమీ లేదే! మీ దుఃఖంచూస్తే నాకు జాలి కలిగింది, అంతే. మీతోడు! నా కోపంకొద్దీ నేను చేస్తున్నానని మీరు భావిస్తే, ఇంక చాలు; సెలవు. మీ చిక్కు లేవో మీరే పరిష్కరించుకోండి." అంటూ డాంగ్లర్ లేచి వెళ్లిపోడానికి ఉంకించాడు.

ఫెర్నాండో అతన్ని పట్టుకుని కూర్చోబెట్టి, "లేదు లేదు. ఒక్క క్షణం ఉండండి. మీకు డాంటె మీద కోపం ఉంటేయేం, లేకపోతేయేం, నాకెందుకు? అనవసరం. అతనంటే నాకు కక్ష అని గట్టిగా చెప్తున్నాను. మీరు సాధనం చెప్పండి. నేను నిర్వర్తిస్తాను. ఒక్కటే. డాంటెని చంపకుండా ఉంటే చాలు. అతనికే మృత్యు వచ్చినా మర్నాడా ఆత్మహత్య చేసుకుంటానేమాట నిజం."

మేజాకి బుర్ర బోర్లించి కూచున్న కాడరూస్ మందకొడిగా తలెత్తి, మిత్రు లిద్దరినీ సంశయంతో చూశాడు: "ఏమిటే? డాంటెని చంపడమా? అతనికి అపకారం తలపెడుతున్న వా రెవరు? అతన్ని చంపడం నా కిష్టం లేదు. అతను నా స్నేహితుడు. నా కివాళ ఉదయం అతను అప్పిస్తానన్నాడు—ఇదివరలో నే నతని కిచ్చానుగా! డాంటెని చంపనివ్వను."

"వాణ్ని చంపాలని ఎవ రన్నారోయ్ చవటా?" అన్నాడు డాంగ్లర్. "అది ఊరికే వేళాకోళాని కన్నమాట. ఇంకోసారి వాణ్ని ఆశీర్వదించుకో. ఇదుగో ఇంకో గ్లాసు తాగు. మా మాట ఇంక మానెయ్యి" అంటూ కాడరూస్ గ్లాసు నింపాడు.

"అవునవును" అంటూ కాడరూస్ ఆ గ్లాసుకూడా క్షణంలో ఖాళీచేశాడు.

"ఎల్లాగ? సాధనం ఏమిటి?" అన్నాడు ఫెర్నాండో. "ఇందుకు పూనుకుంటానని మీరు మాటిచ్చారు."

"అన్నాను నిజమే. స్పానిష్‌వాళ్లకంటె ఫ్రెంచివాళ్ల గొప్ప ఇక్కడే ఉంది. స్పానిష్ వాళ్లు విచారిస్తూ కూచుంటారు. ఫ్రెంచివాళ్లు మెదడు ఉపయోగించి మార్గాలు కనిపెడతారు."

"సరే. మార్గం కనిపెట్టండి" అన్నాడు ఫెర్నాండో ఆత్రంతో.

హోటల్ కుర్రవాణ్ణి పిలిచాడు డాంగ్లర్. "ఒక కలం, సిరా, కాగితం తెచ్చిపెట్టు."

మూడూ వచ్చాయి. కాడరూస్ కాగితాన్ని చేతపుచ్చుకుని అన్నాడు "మారువోయ్ చూడు. చాటునా మాటునా పొంచివుండి మనిషిని హత్య చేసేకన్న, అణిచెయ్యడానికి ఈ ఉపాయం ఎంత మంచిదో చూడు. నాకెప్పుడూ కత్తి, పిస్తోలుకంటె కలం కాగితం అంటే ఎక్కువ భయం."

"పైకి కనిపించినంతగా తాగలేదే! బలే టక్కరి. ఫెర్నాండో, వాడికింకో గ్లాసు పొయ్యండి." అన్నాడు డాంగ్లర్.

ఫెర్నాండో గ్లాసు, నింపాడు. వెంటనే కాడరూస్ కాగితాన్ని విడిచిపెట్టి, గ్లాసు అందుకుని ఖాళీచేశాడు. దాంతో పూర్తిగా మత్తెక్కి వేళ్లు పట్టువొదిలి, కాడరూస్ గ్లాసుని మేజామీదికి జారవిడిచాడు.

డాంగ్లర్ అందుకున్నాడు. "ఇదిగో. మాటవరసకి చెప్తున్నాను. ఈ ప్రయాణంమే ఉందనుకోండి. నేపుల్స్‌నగరంనించి వస్తూ, ఎల్బా ద్వీపంవద్ద ఆగి, తరవాత ఇక్కడికి వచ్చాడు. వీడు బోనపార్టిస్ట్ గూఢచారి అని రాజోద్యోగులికి తెలియపరుస్తామనుకోండి..."

"అవును. నేనే తెలియపరిచేస్తాను."

"అప్పుడు ఆ ప్రకటనకింద మీరే సంతకం పెట్టాలి. బాధ్యతంతా మీ దవుతుంది. అప్పుడు నేరస్థుణ్ని మీ సమక్షంలోకి తీసుకొస్తారు. వివరాలన్నిటినీ మిమ్మల్ని చెప్పమంటారు. నేరాన్ని స్థిరపరచడానికి కావలసిన సమాచారమంతా నే తెలుపుతాను. కాని, డాంటే ఎప్పుడూ ఖైదులోనే ఉండిపోతాడనుకో కూడదు. ఎప్పుడో ఒకప్పుడు బైటపడతాడు. అప్పుడు అతన్ని ఖైదుకి పంపినవాడి గతి బైటపడుతుంది."

"అదేం ఫరవాలేదు. నాకు కావలసినదల్లా ఒక్కటే; వాడు నాపైకి తగువుకి రావాలి. అది చాలు."

"ఇదిగో, మనం ఏదైనా చెయ్యదల్చుకుంటే ఈ కలం కాగితం తీసుకుని, నేనిప్పుడు రాస్తున్నట్టుగా ఎడమ చేత్తో ఆకాశరామన్న ఉత్తరం రాయాలి; దస్తూరీ ఎవరిదో తెలియకూడదు." అంటూ డాంగ్లర్ ఎడమ చేత్తో ఈ క్రింది వాక్యాలు వ్రాశాడు :—"మహారాజు యొక్క హితంకోరిన ఒక మిత్రుడు, రాజశాసనాధికారికీ క్రిందివిధంగా హెచ్చరిస్తున్నాడు: స్మిర్నా నుంచి బయలుదేరి నేపుల్స్, ఫెరాజో రేవులగుండా ప్రయాణం చేసి, ఇవాళ ఉదయమే మార్సెల్స్ చేరిన ఫరావో నౌకలో మేట్‌గా పనిచేస్తున్న ఎడ్మండ్ డాంటే అనే ఒక యువకుడు, నేపుల్స్‌రాజు (నెపోలియన్ బావమరిది) వద్దనుంచి నెపోలియన్‌కు ఒక ఉత్తరం ఇచ్చి, పారిస్‌లో బోనపారిస్ట్ కమిటీకి ఇవ్వడానికి నెపోలియన్ వద్దనుంచి ఒక ఉత్తరం తీసుకు వడుతున్నాడు. ఆ యువకుని అరెస్టుచేసినట్లయితే, రుజువు దొరుకుతుంది. నెపోలియన్ ఉత్తరం అతనివద్దకాని, అతని తండ్రి ఇంటిలో కాని, ఫరావో నౌకలో అతని గదిలో కాని దొరుకుతుంది."

వ్రాత ముగించి డాంగ్లర్ అన్నాడు :—"ఇంక మీరు వేరే పగతీర్చుకో నక్కర్లేదు. దానంతట అదే కార్యం సానుకూలపడి పోతుంది. చెయ్యవలసినదల్లా ఏమిటంటే, దీన్ని ఇల్లా మడత పెట్టి రాజశాసనాధికారికి పంపడమే. అంతే. దాంతో పనంతా అయిపోయినట్టే."

"అవును. అంతా అయిపోయినట్టే" అని అందుకున్నాడు కాడరూస్. పట్టుతెగకుండా సంభాషణ వినడానికి అతడు తన శక్తినంతా వినియోగించవలసి వచ్చింది. ఈ నేరారోపణవల్ల డాంటీకి కలిగేహాని ఎటువంటిదో ఇట్టే గ్రహించాడు. "అవును. అంతా జరిగిపోతుంది. ఒక్కటే చెప్పాలి. ఇది వొట్టి నీచమైన పని." అంటూ ఆ కాగితాన్ని లాక్కోడానికి చెయ్యి చాచాడు.

డాంగ్లర్ దాన్ని అందకుండాచేసి, అన్నాడు:—"అవును. ఇది నీచమైన పని. నేను ఊరికే వేళాకోళానికే అంటున్నాను;

కాలక్షేపానికే రాశాను. ఎందుకంటే, మన డాంటేకి ఎలాటి హాని కలిగినా చింతించేవాళ్ళలో నే మొదటివాణ్ని. ఇదిగో ఇల్లా చూడు" అంటూ కాగితాన్ని ఉండెగానలిపి మేజాకి కొద్దిదూరం లోకి విసిరాడు.

"బాగా చేశావు" అన్నాడు కాడెరూస్. "డాంటే నాకు స్నేహితుడు. అతని కపకారం జరగడం నా కిష్టం లేదు."

"అతని కపకారం చెయ్యాలని ఎవరికిమాత్రం కోరికుంటుంది? నాకూ లేదు; ఫెర్నాండోకీ ఉండదు." అన్నాడు డాంగ్లర్. అని మెల్లిగా లేచి కాటలన్ యువకుని ముఖంవంక చూశాడు. అతడు కాగితపు ఉండపైనే చూపు నిలిపి నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

"సరి అయితే ఇంకొంచెం ద్రాక్షసారాయం పుచ్చుకుందాం. మర్నిదాకీ, డాంటేకీ శుభాకాంక్ష పలుకుదాం" అన్నాడు కాడెరూస్.

"ఇప్పటికి తెగ తాగావోయ్ తాగుబోతూ. ఇంకచాలు. లే." అన్నాడు డాంగ్లర్. "మనకి వేళ మించిపోయింది. రా నడదాం" అంటూ అతనికి చెయ్యి అందించాడు.

"అవును నడదాం. కాని, నన్ను నువ్వు లేవదియ్యనక్కర్లేదు. రావోయ్ ఫెర్నాండో. మాతో మార్సేల్స్‌కి వస్తావా?"

"ఊహుఁ. రాను. నేను కాటలన్స్ గ్రామానికి తిరిగి వెళ్ళిపోవాలి. మార్సేల్స్ వెళ్లవలసిన పని లేదు."

"ఏమిటి? రావూ? పోనీ లేవోయ్. ఎవరి ఇష్టం వాళ్ళది. రావోయ్ డాంగ్లర్. అత నిష్టంవచ్చినట్లు అక్కడికే వెళ్లనీ."

కాడెరూస్ డాంగ్లర్ భుజంమీద ఆనుకునే నడవవలసి వచ్చింది. ఇద్దరూ మార్సేల్స్ దిక్కుగా నడిచారు. కాని ఫెర్నాండో, తమ కళ్లపడకుండా మార్సేల్స్ వెళ్లదల్చుకుంటే, అలా వెళ్ల నివ్వడానికి వీలుగా, డాంగ్లర్ తీరం వెంబడి కాక, చుట్టుదారి పట్టాడు. ఇద్దరూ కలిసి కొన్నిగజాలమేర నడిచిన

తరవాత, కాడరూస్‌ని చేత్తో పట్టుకుని, తాను వెనక్కి తిరిగి చూశాడు. ఫెర్నాండో ఒక అడుగువేసి, కాగితపు ఉండని చటాల్న అందుకుని జేబులో దాచుకోడం డాంగ్లర్ కనిపెట్టాడు. ఫెర్నాండో అది అందుకుని మార్సేల్స్ నగరానికి తీరం వెంబడి బయలుదేరి గబగబా నడిచాడు.

"అరె! చూడు? వాడేం చేస్తున్నాడో?" అన్నాడు కాడరూస్. "చూశావా ఫెర్నాండో. మనతో అబద్ధం చెప్పాడు కాటలన్స్ గ్రామానికి వెడుతున్నా నన్నాడు. చూడు.మార్సే ల్స్‌దారిని వెడుతున్నాడిప్పుడు. ఓయ్‌ఫెర్నాండో ఇటురా!"

"పోవోయ్. నీ కసలు కన్ను కనిపించడం లేదు. అతను కాటలన్స్ గ్రామానికే వెడుతున్నాడు. సరిగ్గా చూడు" అన్నాడు డాంగ్లర్.

"నిజంగానా? కుడివైపు తిరిగాడనుకున్నాను. మద్యం ఎంత మోసం చేస్తుంది!"

# 5

ఆనాడు ప్రభాతం కలకల లాడింది. సాగరతరంగాల అంచుల నురుగులు ప్రభాకరుని తొలికిరణాలలో కెంపుల తోరణాల వలె ప్రకాశించాయి. రిజర్వ్‌హోటల్లో విందు ఏర్పాటయింది. అయిదారు కిటికీలవల్ల వెలుగు నిండారిన ఒక పెద్ద గదిలో విందు జరుగుతుంది. కిటికీల ప్రక్క గదిపొడుగునా వరండా ఒకటి ఉంది. భోజనాలు జరగవలసినది మిట్ట మధ్యాహ్న వేళ. కాని పదకొండు గంటలకే వరండా అతిథులతో నిండిపోయింది. అతిథులలో చాలమంది ఫరావోనావికు లున్నారు. డాంటీమిత్రులైన కొందరు సిపాయి లున్నారు. నౌకయజమానికూడా విందుకు రాగలడని అతిథులలో వదంతి బయలుదేరింది. అయినా డాంటీకి ఇంత సత్కారం జరుగుతున్నదంటే చాలమంది నమ్మలేకపోయారు. చివరికి మారెల్ ప్రవేశించగానే,

నావికులంతా సంభ్రమంతో స్వాగతమిచ్చారు. మారెల్ రాకతో, డాంటే కెప్టెన్ కాగలడనే వదంతి ధృవపడింది. నావికులకు డాంటే అంటే ప్రీతి.

మారెల్ రాగానే, వరుని తీసుకురావడానికి డాంగ్లర్, కాడరూస్ పడవమీద బయలుదేరారు. నూరుగజాలలో వారికొక చిన్న ఊరేగింపు ఎదురయింది. మర్సిదా డాంటేలు చెయ్యీ చెయ్యీ కలిపి నడిచి వస్తున్నారు. డాంటేతండ్రి వధువు ప్రక్క నడుస్తున్నాడు. వారి వెనుక నలుగురు కాటలన్ యువతులనుసరిస్తున్నారు. అందరకూ వెనుకగా ఫెర్నాండో నడుస్తున్నాడు. అతని ముఖంలో వికృత మందహాసం ద్యోతకమౌతున్నది. ఎదురువెళ్ళిన ఇద్దరూ తమపని చెప్పి, వారితో తిరిగి వెనక్కి బయలుదేరారు. డాంగ్లర్ ఫెర్నాండో ప్రక్క నడిచాడు. కాడరూస్ వృద్ధుని ప్రక్క నడిచాడు. వృద్ధుడు చక్కని టఫేటాసిల్కు కోటు ధరించాడు. తెలుపునీలపు రంగుల రిబ్బన్లు ముడివేసిన గూడంచుల టోపీ పెట్టుకున్నాడు. చిత్రమైన వంకర చేతికర్ర మోపుకుంటూ నడుస్తున్న వృద్ధుని చూస్తే, శతాబ్దం నాటి విలాసపురుషులు జ్ఞప్తికి వస్తారు. మృష్టాన్నంకోసం తహ తహలాడుతున్న కాడరూస్ వృద్ధునితో స్నేహం కలిపాడు. అతని మనస్సులో ఒకమూల నిన్నటి సంఘటన మెదుల్తూనే ఉంది.

ఫెర్నాండో ప్రక్క చేరిన డాంగ్లర్ భగ్నప్రేమికుని ఓరకంట కనిపెట్టి చూశాడు. అతని ఉనికినే మరచి, దృష్టినంతా ప్రియునిపైనే లగ్నంచేసిన మర్సిదా వెనుక ఆభగ్నప్రేమికుడు నెమ్మదిగా నడుస్తున్నాడు. అతడు మాటిమాటికీ మార్సెల్స్ నగరంవంక చూస్తున్నాడు. తలవని తలంపుగా ఏదో వచ్చిపడ గలదని నిరీక్షిస్తున్నట్లు క్షణక్షణానికీ కంపించిపోతున్నాడు.

వాణిజ్యనౌకలో ఉద్యోగిగా, తనకనువైన నిరాడంబరమైన దుస్తులనే డాంటే ధరించాడు. వధువువంక తదేకంగా చూస్తున్న అతని సుందరవదనంలో అపార ఆనందానుభవం, గర్వం ప్రతిఫలిస్తున్నాయి. గ్రీక్ వనితల సౌందర్యానికి దీటురాని మర్సిదా, నీలినేత్రాలు, కెంపుపెదవులు ఆమె అందాన్ని ఇనుమడింప చేయగా,

సముద్రతీరవాసుల సహజస్వేచ్ఛాస్వాతంత్ర్యాలను ప్రకటిస్తూ, ఠీవిగా నడుస్తున్నది.

ఈ బృందం రిజర్వ్ హోటల్ కి అల్లంత దూరంలో కనిపించగానే, మారెల్ ఎదురువెళ్ళాడు. మారెల్ వెంట కొందరు సిపాయిలు, నావికులూకూడా బయలుదేరారు. ఫరావో కెప్టెన్ గా నియమించగలనని డాంటేకి చేసిన వాగ్దానాన్ని మారెల్ అప్పుడే అతిథులకు ప్రకటించిఉన్నాడు. మారెల్ సమీపించగానే ఎడ్మండ్ వధువుచేతిని మారెల్ చేతిలో ఉంచాడు. మారెల్ ఆమెను హోటల్లోకి నడిపించుకు వెళ్ళాడు.

విందుమేజావద్ద మధ్యలో నిలిచి, మర్సిడా వృద్ధుడైన డాంటేతండ్రిని తన కుడిప్రక్కకు పిలిచి కూర్చోబెట్టుకుంది. "నాకు సోదరసమానుడైనవాడు నా ఎడమప్రక్క కూర్చుంటాడు" అని ఫెర్నాండోను పిలిచింది. ఆమె పిలుపులోని మాధుర్యం ఫెర్నాండో హృదయంలో శూలమై గ్రుచ్చుకుంది. అతని ముఖం పాలిపోయింది. హృదయా వేగం అధికమయింది. డాంటే మారెల్ కీ డాంగ్లర్ కీ మధ్య చేరాడు. అందరూ కూర్చోవచ్చునని చేసంజ్ఞ చేశాడు. రకరకాల పాకవిశేషాలను అతిథులు రుచితో భుజిస్తున్నారు: "ఆహా! ఎంత నిశ్శబ్దంగాఉంది!" అన్నాడు వృద్ధుడు, సారాయం రుచిచూస్తూ; "ఉల్లాసంగా గడపడానికి సుమారు యాభయి మంది జనం ఇక్కడచేరారని ఎవరనుకుంటారు?"

"అవును. కాని భర్తకాబోతున్న యువకుడు నవ్వుతూ పేలుతూఉండడుగా!" అన్నాడు కాడెరూస్.

"అసలువిషయమేమిటంటే, నేను నవ్వుతూ పేలుతూ ఉండగల స్థితిలో లేను. ఆనందం అమితంగా ఉన్నందువల్ల నిర్వాక్కుగా ఉన్నాను" అన్నాడు డాంటే. "నువ్వు ఆ అర్థంతో అన్నట్లయితే, అది నిజమే. దుఃఖంమాదిరిగానే ఆనందంకూడా ముప్పిరిగొన్నప్పుడు అలాగే ఉంటుంది."

డాంగ్లర్ ఫెర్నాండోవంక చూశాడు. ప్రతి మాటకీ, ప్రతి అలికిడికీ కొటలన్ యువకుడు ఉలికులికిపడుతున్నాడు. డాంగ్లర్ డాంటేతో అన్నాడు: "అయితే దేనికో సంకోచిస్తున్నట్లున్నారెందుకు? మీరు ఉచ్చదశలో ఉన్నారుగదా?"

"అవును. సరిగ్గా అదే కారణం" అని జవాబిచ్చాడు డాంటే. "మనిషై పుట్టినవాడు ఇంత సులువుగా, ఇంత ఆనందాన్ని ఒక్కసారిగా పొందలేడని నా ఉద్దేశం. అదృష్టసంపదని పొంద కోరేవాడు, పోరాడిసాధించాలి. నిజం చెప్పాలంటే, మర్సిడాకి భర్త కౌగలిగినసౌభాగ్యం నాకు ఎట్లా ఎందుకు లభించిందో తెలియడం లేదు."

"భర్త అంటున్నావేమిటోయ్ అప్పుడే?" అన్నాడు కాడరూస్ పకపక నవ్వుతూ. "అప్పుడే అనకోయ్, కెప్టెన్. పక్కనున్న వాళ్లని చూసి మరీ మాట్లాడు."

మర్సిడా ముఖం రాగరంజిత మయింది.

ఫెర్నాండో కుర్చీలో స్థిమితంగా కూర్చోలేకపోతున్నాడు. చిన్న సవ్వడి వినపడినా ఉలికిపడుతున్నాడు. మాటిమాటికి నుదుట చెమట తుడుచుకుంటున్నాడు.

డాంటె అన్నాడు: "సరేలేవోయ్ కాడరూస్. ఇంత చిన్నవిషయంకోసం నాతో వాదించడం ఎందుకు చెప్పు? మర్సిడా ఇంకా నా భార్య కానిమాట నిజమే. అయితే ఇంకెంతసేపు?" జేబులోనుంచి గడియారం తీసి చూసి, "ఇంక గంటన్నరలో అవుతుంది."

ఈ మాటలు వినేసరికి, అందరూ ఆశ్చర్యచకితులైనారు, ఒక్క డాంటే తండ్రి మినహా. ఆ వృద్ధుడు సంతోషం పట్టలేక నవ్వేశాడు. మర్సిడా చిరునవ్వు నవ్వింది. ఫెర్నాండో చెయ్యి కత్తిపిడిమీద వాలింది.

"గంటలోనా?" అన్నాడు డాంగ్లర్ తెల్లబోతూ; "ఎలాగ చెప్పండి?"

డాంటే చెప్పాడు: "అవును. నా తండ్రితరవాత తండ్రిగా ఎంచదగిన మారెల్ దయవల్ల, వ్యవహారమంతా సులువైపోయింది. లైసెన్స్ తీసుకునే పనికూడా పూర్తి అయింది. విల్లాహోటల్ వద్ద మనకోసం మేయర్ నిరీక్షిస్తూ ఉంటారు. ఇప్పుడు సరిగ్గా ఒంటి ఒంటంపావు అయింది. కాబట్టి నే చెప్పినదాంట్లో అట్టే తప్పు

లేదు. సరిగ్గా గంటన్నరలో మర్సిదా, మదాం డాంటే పేరు స్వీకరిస్తుంది."

"శుభకార్యాలంటే ఇల్లా సానుకూలపడాలి" అన్నాడు డాంటే తండ్రి. "కాలం రవ్వంతైనా నష్టం కాలేదని ఒప్పుకుంటారా లేదా? నిన్ననే ఓడ దిగడం; ఇవాళ మధ్యాహ్నం మూడు గంటలకల్లా పెళ్లిఅయిపోవడం! ఇంత చక్కగా తరుణం కని పెట్టిన మరొక నావికుణ్ని చూపండి నాకు?"

"మరి మిగతా తతంగం మాట? కంట్రాక్టు? మిగతా ఏర్పాట్లు?" అని ప్రశ్నించాడు డాంగ్లర్, కొంచెం తొందరపాటు చంతో.

"కంట్రాక్టా?" అన్నాడు డాంటే నవ్వుతూ. "కంట్రాక్టు కేముంది? అన్నీ నిర్ణయమైపోయినాయి. ఆస్తిపాస్తులేవీ నాకూ లేవు, మర్సిదాకీ లేవు. కమ్యూన్ (లోకల్ బోర్డువంటిది) ఆధ్వర్యం కింద పెళ్లి జరుగుతుంది. అదంతా నిర్ణయమైపోయింది. వ్రాతకోతలకి ఆట్టేసేపు పట్టలేదు. ఓబ్బువసూళ్లు ఆట్టే ఉండవు."

"అంటే ప్రధానపు విందని మేం మనుకుంటున్నది, నిజంగా పెళ్లివిందన్న మాట? అంతేనా?" అన్నాడు డాంగ్లర్.

"అంతమాత్రానికి మీ కొచ్చిన నష్టమేమీ లేదు. ఇటు వినండి. నేను రేపు బయలుదేరి పారిస్ వెడుతున్నాను. వెళ్లడానికి నాలుగురోజులు, తిరిగి రావడానికి నాలుగురోజులు, నా కర్తవ్యాన్ని తృప్తిగా నిర్వహించడానికి ఒకరోజు పడుతుంది. అంటే పదిరోజుల్లో తిరిగి వస్తాను. ఆ మర్నాడు అసలు పెళ్లిసంతర్పణ జరుగుతుంది."

ఇంకో విందుమాట వినగానే అతిథుల సంతోషం రణగొణ ధ్వనులతో మిన్నుముట్టింది. ఆ రొదలో వధూవరులకు వృద్ధుడు పలికిన ఆశీర్వచనాలు మణిగిపోయాయి.

ఎడ్మండ్ ప్రేమపూర్వకంగా తండ్రివంక చూశాడు. మర్సిదా చిన్న గడియారంవంక చూసింది. విందు ముగిసే వేళకి రణగొణధ్వని మరింత ఎక్కువయింది. ఎవరికి వారు గుంపులుగుంపులుగా చేరి సంభాషణ కుపక్రమించారు.

ఫెర్నాండో మనస్సులోని ఆందోళన అధికం కాసాగింది. డాంగ్లర్ కూడా ఆందోళనకు గురైనాడు. కాటలన్ యువకుని హృదయజ్వాలలధికమైనకొద్దీ, అటూ ఇటూ పచారు చెయ్యనారంభించాడు. గాలిపాటలను, హర్షధ్వానాలను, గ్లాసుల మోతలను చెవుల పడనీయలేక, వీలైనంత దూరంలో ఉండడానికి ప్రయత్నిస్తున్నాడు. కొంతసేపటికి కాడెరూస్ అతన్ని సమీపించాడు. అదే సమయానికి డాంగ్లర్ కూడా అక్కడికి చేరాడు. ఇంతవరకూ డాంగ్లర్‌కు దూరంగా ఉండాలని ఫెర్నాండో ప్రయత్నిస్తున్నాడు.

డాంటీ ప్రియవర్తన, మధురసారాయాలవల్ల, అతనిపట్ల వైరభావాన్ని నిశ్శేషంగా చెరిపివేసుకున్న కాడెరూస్ ఇలా అన్నాడు: "నిజంగా ఉన్నమాట చెప్పుకోవాలోయ్! డాంటీ మహా మంచివాడు. ప్రియురాలిప్రక్క కూర్చున్న అతన్ని చూస్తుంటే, నిజంగా నిన్న నువ్వు పన్నిన దుస్తంత్రం సిగ్గుచేటైన దనిపిస్తోంది."

"కాని అదేం జరగలేదని నీకు తెలుసుగా! పాపం! ఈ ఫెర్నాండో దీనస్థితి చూస్తే మొదట జాలివేసింది. కాని ప్రత్యర్థి పెళ్ళిలో, మర్సిదా తరఫున ప్రధానవ్యక్తిగా ఉండడానికి అతను నిశ్చయించుకోగానే, ఇంక నేను చెప్పవలసిందేముందని మానుకున్నాను."

ఇంతలో మర్సిదామాటలు వినిపించాయి. "ఇంక మనం బయలుదేరి వెడదామా? అప్పుడే రెండు కొట్టింది. మనం రెండుంబావుకి వస్తామని అక్కడ నిరీక్షిస్తుంటారు."

"అవునవును. వెడదాం" అంటూ డాంటీ సంభ్రమంతో లేచాడు.

"నడవండి" అన్నారు అతిథులంతా ఏకకంఠంతో.

సరిగ్గా ఆ క్షణంలో, కిటికీఅంచు నానుకొని నిలబడిఉన్న ఫెర్నాండో కనుగ్రుడ్లు వెళ్ళబెట్టి, విపరీత భయాందోళనలతో కంపించి, వెనక్కు ఒరిగిపోవడం డాంగ్లర్ చూశాడు. వెంటనే పెద్ద సవ్వడి, బరువైన అడుగుల చప్పుళ్లు, కత్తుల ఖణ

ధ్వనులు, తొందరమాటలు వినవచ్చినాయి. ఈ సవ్వడిలో అతిథుల ఆందోళిత స్వరాలు మణిగిపోయాయి. మూడుసార్లు తలుపుపై తట్టినట్లు వినరాగానే, గదిలో నిశ్శబ్దం అలుముకుంది.

"రాజోద్యోగుల ఆజ్ఞ. తలుపు తెరవండి" అని ఒక కంఠం పలికింది.

ఎవ్వరూ సమాధాన మివ్వలేదు. తలుపులు తెరుచుకున్నాయి. ఒక పోలీసుఅధికారి ప్రవేశించాడు. అతనివెంట అయిదుగురు సాయుధులైన పోలీసు లున్నారు.

అధికారితో కొద్ది పరిచయం కల ఓడయజమాని ముందుకు వచ్చాడు. "మీరేంపనిమీద వచ్చారు ? తప్పకుండా ఎక్కడో పొరపాటు జరిగిఉంటుంది," అన్నాడు.

"పొరపాటు జరిగివున్నట్లయితే తప్పకుండా దిద్దుకోబడు తుందని నమ్మండి మారెల్. నావద్ద అరెస్టు వారంటుంది. ఇష్టంలేకపోయినా, నా కర్తవ్యం నెరవేర్చాలి. మీలో ఎడ్మండ్ డాంటే ఎవరో తెలుపుతారా ?" అన్నాడు అధికారి.

"నేనే. మీ కేం కావాలి ?"

"ఎడ్మండ్ డాంటే ! ప్రభుత్వాజ్ఞప్రకారం నేను మిమ్మల్ని అరెస్టుచేస్తున్నాను."

"నన్ను అరెస్టుచేస్తారా ? ఎందుకు ?" అన్నాడు ఎడ్మండ్ తెల్లబోతూ.

"అది నేను చెప్పలేను, విచారణలో మీకే తెలుస్తుంది."

ఇప్పుడింక చెయ్యగలిగేదేదీ లేదని మారెల్ గ్రహించాడు. అరెస్టుచెయ్యడానికి వచ్చిన వ్యక్తి సామాన్యుడు కాడు. అధికార దత్తమైన దుస్తులు ధరించిన న్యాయశాసనప్రతినిధి. కళ్ళు, చెవులు, నోరు మూసుకుని కర్తవ్యాన్ని నిర్వహించ వలసినవాడు. పుత్రప్రేమ మూర్తీభవించినట్లున్న వృద్ధునికి హఠాత్సంఘటనలో ఇది తెలియరాలేదు. అధికారిసమీపానికి దూసుకువెళ్లాడు. దీనంగా ప్రార్థించాడు. కాని అతని ప్రార్థనలు, కన్నీరు వ్యర్థమైనాయి.

అధికారి ఇలా చెప్పాడు: "మీరు శాంతించండి. ఓడ దిగినప్పుడు మీ కుమారుడు ఏ నియమాన్నో పాటించక చిన్న తప్పిదం చేసిఉంటాడు. అవసరమైన సమాచారం అడిగి తెలుసుకుని, బహుశా అతన్ని విడిచిపెట్టవచ్చును."

"ఏమిటిదంతా ?" అంటూ వచ్చాడు కాడరూస్. ఫెర్నాండో కోసం చుట్టూ చూశాడు. కాని అతడు కనిపించ లేదు. గడిచిన సాయంకాలపు దృశ్యమంతా అతని కళ్లకు కట్టినట్టు కనిపించింది. అప్పటి చైతన్యం తప్పినస్థితిలో అలముకున్న మాయతెర, ఈ దుర్ఘటనతో తొలగిపోయింది. "అయ్యయ్యో! నిన్నటి పరిహాసానికి ఇదా ఫలితం డాంగ్లర్ ? ఎంత దుర్మార్గానికి ఒడిగట్టాడు ? వాడి సిగ్గు కాల!"

"అదేం కాదోయ్!" అంటూ గట్టిగా అరిచాడు డాంగ్లర్. "ఆ కాగితాన్ని నేను చింపిపారెయ్యడం నువ్వు చూశావుగా?"

"నువ్వు చింపి పారెయ్యలేదు. మూల పడేశావు. అంతే. ఏడీ ఫెర్నాండో?"

"నా కేం తెలుసు? అతని పనుల్లో అత నున్నా డనుకుంటాను. మన మింక ఇల్లా నాదించుకోవడం మానేసి, పాపం వాళ్లని పరామర్శ చేద్దాం రా."

వీరిద్దరి సంభాషణ ఇక్కడ జరుగుతుండగా, డాంటే చిరునవ్వుతో మిత్రులందరివద్దా సెలవు తీసుకుని అధికారిముందు నిలబడ్డాడు. "అదంతా పోనివ్వండి. ఇప్పుడు ఈ వ్యవహార మేదో తేలిపోడానికి ఆట్టేసేపు పట్టదు. బహుశా నన్ను జైలుకి పంపడం కూడా జరగదనుకుంటాను."

"అబ్బెబ్బే. దానికి నేను జవాబుదారీ" అంటూ డాంగ్లర్ అక్కడ చేరాడు.

అధికారి ముందు నడిచాడు. సాయుధభటుల మధ్య నడుస్తూ డాంటే మెట్లు దిగాడు. ద్వారంవద్ద ఒక బండి నిలిచి ఉంది. డాంటే బండెక్కి కూర్చున్నాడు. అతని ప్రక్కనే అధికారి కూర్చున్నాడు. ఇద్దరు భటులుకూడా కూర్చోగానే బండి మార్సేల్స్ నగరముఖంగా బయలుదేరింది.

మర్సిడా వరండాచివర నిలబడి ప్రియునికి వీడ్కోలు ఇచ్చింది. "మళ్లీత్వరలో రా డాంటీ" అంటూ చెయ్యిఊపింది. ఆమె పలుకులు ఖైదీకి ఆక్రందనవలె వినవచ్చినాయి. అతడు బండిలో నుంచితల వొంచి చూసి, "మళ్ళీ వస్తాను మర్సిడా" అన్నాడు. సెంట్‌నికలాస్ కోటవద్ద బండి మలుపు తిరిగి అదృశ్యమయింది.

"మీ రిక్కడే ఉండండి" అన్నాడు ఓడయజమాని. "వెంటనే ఏ బండి దొరికితే దానిమీద మార్సేల్స్ వెళ్ళి మీకు కబురు తీసుకువస్తాను."

మిగిలిన అతిథులందరిలోనూ గాఢ నిస్తబ్దత వ్యాపించింది. దుఃఖం ఉబికివచ్చి మాట రాక వృద్ధుడు, మర్సిడా నిలబడిపోయారు. కొంతసేపటికి ఇద్దరి కన్నులు కలుసుకున్నాయి. కఠోరమైన ఒక్క అఘాతానికి ఇద్దరూ గురైనట్లు ఒకరిచేతులలో ఒకరు వాలిపోయారు.

ఆ సమయానికే ఫెర్నాండో ప్రవేశించాడు. ఒక గ్లాసు మంచినీరు గడగడ తాగి కుర్చీలో కూర్చున్నాడు.

కాడరూస్ అతనివంక చూసి డాంగ్లర్‌తో "వాడే చేశాడు" అన్నాడు.

"అది కాదని నా నమ్మకం" అన్నాడు డాంగ్లర్. "ఆ దద్దమ్మ కాపాటి తెలివి లేదు. ఎవరయినప్పటికీ, ఈ దుర్మార్గాని కొడిగట్టినవాడికి శాస్తి జరిగితీరుతుంది."

"ఆహా! అయితే సలహా ఇచ్చిన దుష్టుడిమాట చెప్పవేం?" అన్నాడు కాడరూస్.

ఈలోగా చేరిన అతిథులంతా డాంటీ అరెస్టునిగురించి పరిపరివిధాల చెప్పుకోడం మొదలుపెట్టారు.

ఒకడన్నాడు: "డాంగ్లర్! నీ ఉద్దేశ మేమిటి?"

"నా ఉద్దేశం, తీసుకురాకూడని సరుకేదో అతను ఓడలో తెచ్చిఉంటాడని."

"అదయితే, ఓడలో సరుకుమీద అజమాయిషీ చేసే నీకు తెలియాలి కదా!"

"అవును. కాని నాకు ఒప్పగించిన సరుకై తే నే నాకు తెలుస్తుంది. అలెగ్జాండ్రియానుంచి, స్మిర్నానుంచీ పత్తి వేసుకువస్తున్నాం. నాకు అంతవరకే తెలుసును. ఆపైన నన్నడక్కండి."

"అదా! నా కిప్పుడు జ్ఞాపకం వచ్చింది" అన్నాడు వృద్ధుడు, గొణుగుతూ. "నాకోసం కాఫీ, పొగాకు తెచ్చానని నిన్న నాతో అన్నాడు."

"ఆ! ఇంకేం! చూడండి" అన్నాడు డాంగ్లర్. "అదీ సంగతి. మేము లేనప్పుడు రేవుఅధికారులు ఫరావోనౌకను తనిఖీ చేసి, ఈ రహస్యం కనిపెట్టారన్నమాట."

కాని మర్సిదా ఇదంతా నమ్మలేకపోయింది. ఆమెకు దుఃఖం పొంగివస్తున్నది.

"ఊరుకో. ఊరుకో. అంతా మన మేలుకేనని ఆశతో ఉండాలి మనం" అన్నాడు వృద్ధుడు. కాని నిజంగా ఈమాటలు అతనికే బోధపడలేదు.

పరామర్శ చెయ్యాలని ఫెర్నాండో ప్రయత్నించాడు. కాని మాటలు నోటినుంచి పెగిలిరాలేదు. పెదవులుమాత్రం కదిలాయి.

"ఆగండాగండి. ఇదుగో ఏదో బండి వచ్చింది." అన్నాడొక అతిథి. "మారెల్ వచ్చారు. మంచి కబురు తెచ్చి ఉంటారు."

వృద్ధుడు, మర్సిదా గబగబా ద్వారం సమీపించారు. ఓడ యజమానిముఖం పాలిపోయి ఉంది. శిరఃకంపన చేస్తూ అన్నాడు: "విషయం మనం అనుకున్నంత సులువైంది కాదు. బోనపార్టిస్ట్ గూఢచారి అని అతని పైన నేరం ఆరోపిస్తున్నారు."

ఆ రోజుల్లో ఈ నేరం ఎంత ఘోరమైనదో అందరికీ తెలుసును.

మర్సిదా దీనంగా ఆర్తనాదం చేసింది. వృద్ధుడు కుర్చీలోకి ఒరిగిపోయాడు.

"ఓ! నన్ను మోసపుచ్చావా డాంగ్లర్?" అన్నాడు కాడరూస్. "మీఆట ఆడారన్నమాట. ఈ వృద్ధుడూ, యువతీ, ఇలా

దుఃఖంలో మునిగిఉన్నప్పుడు నేను చూస్తూ ఊరుకోలేను. జరిగిన దంతా వాళ్లకి చెప్పేస్తాను."

"నువ్వు నోరు నొక్కుకుని ఊరుకోవోయ్ నిర్భాగ్యుడా!" అన్నాడు. డాంగ్లర్ అతని చెయ్యి పట్టుకు లాగుతూ. "లేకపోతే, నీ ప్రారబ్ధానికి నిన్ను వొదిలేస్తాను సుమా! డాంటే నేరం చెయ్యలే దని నీ కెల్లా తెలుసు? ఓడ ఎల్బాద్వీపందగ్గర ఆగింది. ఫెరాజో రేవులో అతను ఒకరోజంతా ఉన్నాడు. అతనిదగ్గర ఏదైనా ఉత్తరం దొరికి, నేరం స్థిరపడితే ఏమాతుంది? అతన్ని వెనకవేసుకువచ్చిన వాళ్లు కూడా అతనితో చేరి కుట్రపన్నారనుకుంటారు."

సహజంగా తన మేలు ముందు గమనించుకునే కాడరూస్, ఈ వాదంలోని బలాన్ని వెంటనే గ్రహించాడు. "సరే అయితే, ఏమాతుందో చూద్దాం" అని గొణిగాడు.

"అవును చూద్దాం." అన్నాడు డాంగ్లర్. "ఏ దోషం ఎరగనివాడైతే అతన్ని విడిచిపెడతారు. నేరంచేసినవాడైతే, నేరస్థునికోసం పరితపించడం అనవసరం"

క్రమంగా జనం లేచి వెళ్లిపోతున్నారు. ఫెర్నాండో మర్సిడాప్రక్క చేరి ఓదార్చుతున్నాడు. ఆమెను చెయ్యిబట్టి కాటలన్స్ నివాసగ్రామానికి నడిపించుకు వెళ్లాడు. డాంటేమిత్రులు వృద్ధుని చుట్టూ చేరి సానుభూతి తెలిపి, మెల్లిగా మేలన్వీధికి తీసుకువెళ్లారు.

బోనపార్టిస్ట్ గూఢచారి అని డాంటేని అరెస్టుచేసిన వార్త పట్టణమంతా ఇట్టే వ్యాపించింది.

ఎడ్మండ్‌నుగురించిన సమాచారాన్ని న్యాయాధికారి విల్ ఫర్ట్‌వల్ల తెలుసుకునే ఉద్దేశంతో, పట్టణానికి బయలుదేరిన మారెల్, దారిలో డాంగ్లర్, కాడరూస్‌లను కలుసుకున్నాడు.

"డాంగ్లర్! నువ్విది నమ్మగలవా? ఇది నమ్మడానికి శక్య మేనా?" అని ప్రశ్నించాడు మారెల్.

"నేను మీతో చెప్పాను కదా, పనేదీ లేకుండా ఎల్బా ద్వీపంలో ఓడ ఆపాడని. దానివల్ల నాకు కొంచెం అనుమానం కలిగినమాట నిజమే."

"అయితే నీ అనుమానాన్ని మరెవరిదగ్గరేనా వెలి బుచ్చావా?"

డాంగ్లర్ అతిరహస్యంగా చెప్పాడు: "నేను అతిజాగ్రత్తగా ఉన్నానండీ. ఎందుకంటే బోనపార్టిస్టులకింద పనిచేసిన మీ పిన తండ్రి పాలికర్ మారెల్ ఉన్నారు కదా! ఆయన తన అభిప్రాయాల్ని ఎన్నడూ రహస్యంగా దాచుకోలేదు. అందువల్ల నెపోలియన్ స్థితి చూసి మీరు చింతపడుతున్నట్లు ఎవరైనా అనుమానిస్తారేమో ననీ, దీనివల్ల మీకూ ఎడ్మండ్ కీకూడా ఏమి ముప్పు వస్తుందో ననీ, నేను చాలా జాగ్రత్తగా ఉన్నాను."

"అవును డాంగ్లర్, మంచిపని చేశావు. నువ్వు మంచి వాడవని నాకు తెలుసు. డాంటేని ఫరావో కెప్టెన్‌గా నియమించ డానికి ఆలోచించినప్పుడు, నీ బాగోగుల్ని గురించి కూడా ఆలో చించాను. నీతో అతనెల్లా ఉంటున్నాడో, నీపట్ల అయిష్ట మేమైనా ఉందేమో నని అతన్ని అడిగాను. ఎందుకో తెలియదు; కాని మీ యిద్దరిమధ్యా సఖ్యత కుదరలేదని కనిపెట్టాను. ఒకసారి అతనే నీపట్ల సరిగ్గా ప్రవర్తించలేదని ఒప్పుకున్నాడు. అయితే యజమానుల విశ్వాసం పొందినవాళ్లపట్ల తనూ నమ్మకతో ఉంటానన్నాడు."

"ద్రోహి" అని గొణిగాడు డాంగ్లర్.

"డాంటే పాపం! నిజంగా చాలా మంచివాడు" అన్నాడు కాడరూస్.

మారెల్ అన్నాడు, "అవును. కాని ఈలోగా ఫరావోకి కెప్టెన్ లేకపోయాడే!"

"ఇంకా మూడుమాసాలవరకూ ఓడ బయలుదేరదు కాబట్టి, అప్పటికి విడుదలౌతాడని ఆశతో ఉందాం" అన్నాడు డాంగ్లర్.

"అవు ననుకో. కాని అప్పటివరకూ?"

"మీ రేది చెయ్యమన్నా నేను సిద్ధమే. అనుభవం ఉన్న ఏ కాప్టెన్ చేసేపాటి అయినా, నేనూ చెయ్యగలనని మీకు తెలుసును. ఓడబాధ్యతంతా నిర్వహించగలను. నన్నుపయోగించుకుంటే మీపని తీరిపోతుంది. ఎడ్మండ్ జైలునుంచి విడుదలై రాగానే మీ కెవరిసహాయం అవసరం ఉండదు. అతని పనిలో అతను చేర తాడు, నా పనిలో నేను చేరతాను."

"బాగుంది డాంగ్లర్, బాగుంది. అలా చేస్తే సరిపోతుంది. ఓడ బాధ్యతంతా నీ కప్పగిస్తున్నాను. సరుకు దించేటప్పుడు నువ్వే అంతా చూడాలి. ఎలాటి దుర్ఘటనలు సంభవించినా వ్యాపారం మాత్రం ఆగకూడదు."

"దాన్నిగురించి మీ రాట్టే బెంగపడకండి. కాని మన మిత్రుడు డాంటేని ఇప్పుడు చూడ్డానికి వీలుపడుతుందా?"

"అది త్వరలోనే తెలుసుకుని చెప్తాను డాంగ్లర్. విల్ ఫర్ట్‌ని దర్శించడానికి ప్రయత్నం చేసి, డాంటేకి సహాయం చెయ్యడానికి చూస్తాను. నువ్వు ఓడకి వెళ్లు. నిన్నక్కడ కలుసు కుంటాను."

మారెల్ ఆ యిద్దరినీ దారిలో విడిచి న్యాయస్థానం దిక్కుగా నడిచాడు.

"చూశావా?" అన్నాడు డాంగ్లర్ కాడరూస్‌తో. "వ్యవహారా లెలా మారాయో! ఇంకా డాంటేకి సహాయంచెయ్యా లనుందా నీకు?"

"అబ్బే లేదు. కాని ఒక పరిహాసంవల్ల ఎంత మూడిందో చూస్తే ఘోరంగా ఉంది."

"నేను ఆ కాగితాన్ని కింద పారేశాను. అసలు చింపేశా ననికూడా అనుకుంటాను."

"లేదు లేదు. నేను గట్టిగా చెప్పగలను. దాన్ని ఉండగా చుట్టి కింద పడేశావు. ఇప్పుడుకూడా అది అక్కడే ఉండి ఉంటే బాగుండును."

"అవును. పోనీ అల్లాగే అనుకుందాం. ఫెర్నాండో దాన్ని తీసిఉండవచ్చు. దానికి నకలు రాసిఉంటాడు. ఏమో నకలుకూడా తియ్యలేదేమో—అరి దేవుడా! ఇప్పుడు తల్చు కుంటే తట్టుతోంది. తీరా నేను రాసిన కాగితాన్నే పంపించా నేమో! నిజంగా నేను మారు దస్తూరీతో రాయడం అదృష్టమే సుమా!"

"అయితే నిజంగా డాంటే కుట్రలో చేరాడని నీకు తెలుసునా?"

"నాకా? అసలు నాకేం తెలియదు. నేను చెప్పానుగా! ఊరికే పరిహాసంకోసమే అన్నాను. అంతే. తెలియకుండా ఊరికే అన్నమాట నిజమై ఊరుకుంది కాబోలు!"

"ఏమయితే నేం? మనకి ఉసురు తగుల్తుంది."

"ఉసురు తగిల్తే దుర్మార్గం చేసిన ఫెర్నాండోకి తగుల్తుంది. మనకి కాదు. మన కెందుకు తగుల్తుంది? మనం మాట్లాడక ఊరు కుంటే చాలు. వచ్చే మునక వచ్చి, దానంతటదే పోతుంది."

"అలాగే పోనీ." అన్నాడు కాడరూస్. మిత్రునివద్ద సెలవు తీసుకుని మేలాక్ వీధివైపు తిరిగాడు. తనలో ఏదో గొణు క్కుంటూ తల పంకిస్తూ నడిచాడు.

డాంగ్లర్ తనలో ఇలా అనుకున్నాడు: "బాగుంది. చక్కగా జరిగింది. అంతా అనుకున్న ప్రకారం జరిగింది. ఈలోగా నేను కెప్టెన్. ఆ దద్దమ్మ కాడరూస్ నోరుగూసు కుని ఊరుకుంటే, ఈలోగానే కాదు, శాశ్వతంగా నేనే కెప్టెన్. ఒక్కటే చిక్కు వస్తుంది; డాంటేని అధికారులు విడిచి పెట్టినప్పుడు. అయినా అదేం ఫరవాలేదని నేను ధైర్యంగా ఉండవచ్చు. న్యాయశాసనం న్యాయశాసనమే." అనుకుంటూ, తీరంవద్ద ఒక బోటులోకి దుమికి ఫరావోనాకదిశగా వెళ్ళాడు.

# 6

సరిగ్గా పై సంఘటన సమయంలోనే, గ్రాండ్ కోర్ వీధిలో ఒక భవనంలో మరొక పెండ్లి ప్రధానపు విందు జరుగుతోంది. ఈ విందులో మార్సేల్స్ నగరంలో పేరుమోసిన పెద్దలంతా ఉన్నారు. నెపోలియన్ పరిపాలనలో ఉద్యోగాలకు రాజీనామా లిచ్చిన న్యాయాధికారులు, సైనికోద్యోగంనుంచి విర మించుకున్న వృద్ధులు ఉన్నారు. అయిదేళ్ళ దేశాంతర వాసంవల్ల త్యాగవీరుడని కీర్తిగడించి, పదిహేనేళ్ల ఫ్రెంచి సింహా సన పునఃప్రతిష్ఠాపనవల్ల (రెస్టొరేషన్) ఆరాధ్యదైవం కాగలిగిన వ్యక్తి (నెపోలియన్)పట్ల ద్వేషం మప్పిన కుటుంబాల యువకు లున్నారు.

విందులో వివిధ ప్రసంగాలు జోరుగా సాగిపోతున్నాయి. ఆనాటిరాగద్వేషాద్వేగాలు అక్కడ సంభాషణలలో చెలరే గాయి. యూరప్‌లో అత్యధిక భాగానికి సార్వభౌముడై పరిపాలించి, నేడు ఎల్బాద్వీపంలో పరిమిత రాజరికం చేస్తున్న చక్రవర్తి (నెపోలియన్), ఇంక సింహాసనానికిగాని ఫ్రెంచిదేశానికిగాని ఎన్నటికీ రాగల ఆశ లేదనే అభిప్రాయంతో అందరూ మాట్లాడుతున్నారు. నెపోలియన్ చేసిన రాజకీయ దోషాలను న్యాయాధికారులు చర్చిస్తున్నారు. మాస్కో, లీప్జిగ్ ముట్టడులనుగురించి సైనికోద్యోగులు మాట్లాడుతున్నారు. జోసె ఫిన్‌తో అతని వివాహవిచ్ఛేదాన్నిగురించి స్త్రీలు ప్రసంగిస్తు న్నారు. బోనపార్టిస్టుల ఆశలన్నీ భగ్నమైపోయినందుకు విజయ గర్వంతో ఈ రాజరికపక్షసమాజంయావత్తూ ఆనందిస్తున్న ట్లుంది. పీడకలను విదల్చి మేలుకున్నట్లు, వారికి తిరిగి జీవితం నూతనోల్లాసంతో వికసిస్తున్నట్లుంది.

సెంట్ లూయీ సిలువచిహ్నం ధరించిన ఒక వృద్ధుడు లేచి,పద్దెనిమిదవ లూయీ మహారాజుకు శుభాకాంక్షలు పలికాడు. అతనిపేరు మార్క్విస్ ఆఫ్ సెంట్ మిరాన్. వధువు తండ్రి. అతిథి సమూహమంతా హర్షధ్వానాలు చేసింది. ఇంగ్లీషు సమాజ

సాంప్రదాయానుసారం గ్లాసులు ఖణఖణ మన్నాయి. వనితలు పుష్పగుచ్ఛాలను విచ్చి పూలను మేజాలపై చల్లారు.

"ఓహోహో!" అంది మార్క్విస్ భార్య. వికాసంలేని నిశ్చలమైన ఆమె నేత్రాలు, బిగిసిన పలుచని పెదవులు, ఉత్తమ వంశసంజాత అని ప్రకటిస్తున్నాయి. ఏభైయేళ్లు నిండినా ఆమె ఠీవి సడలలేదు. "మనల్ని తరిమిన ఆ విప్లవకారులు ఇప్పుడు ఇక్కడుండి, ఇది చూసినట్లయితే, మనదే నిజమైన దేశభక్తి అని తెలుసుకుంటారు. కూలిపోతున్నదైనా, రాజరికాన్ని భక్తితో అంటిపెట్టుకున్నవాళ్ళం మనం. మనం మన భాగ్యాన్ని పోగొట్టుకోగా, కొత్తపొద్దును చూసి దోసిలొగ్గి అదృష్టం పోగుచేసుకున్నది వాళ్లు. మన ప్రభువు లూయీ అనీ, సింహాసనాన్ని అన్యాయంగా ఆక్రమించినవాడు దైవదూరుడైన నెపోలియన్ అనీ, అంగీకరించగలను. ఏమంటారు విల్‌ఫర్ట్?"

విల్‌ఫర్ట్ వరుడు. ప్రభుత్వన్యాయవాది. అతడిలా అన్నాడు: "నిజమే. కాని వారు ఉద్రేకపూరితులు. పాశ్చాత్యులకు నెపోలియన్ దైవనియుక్తుడైన ప్రవక్త. లోభపూరితులైన సామాన్యజనుల దృష్టిలో అతడు కేవలం శాసకుడు, పరిపాలకుడు మాత్రమే కాదు; సర్వజనసమత్వసూత్రానికి చిహ్నమైన ఒక తరహా వ్యక్తి."

"సమత్వం! నెపోలియన్‌కా సమత్వం?" అన్నది మార్క్విస్ భార్య. "అయితే, రోబ్‌స్పియర్‌నిగురించి ఏమంటారు? అతన్ని గెంటివేసి, ఆ స్థానాన్ని కార్సికన్‌కి (నెపోలియన్‌కి) ఇస్తున్నారన్నమాట. ఇదికూడా ఒక తరహా దురాక్రమణక్రిందికే వస్తుందే!"

"లేదండీ లేదు. ఎవరిస్థానంలో వారినే ఉంచుతున్నాను. ఉరికంబానికి రోబ్‌స్పియర్‌ని, వెండోమ్‌వద్ద నెపోలియన్‌ని ఉంచుతాను. ఒకరు సమత్వంకోసం అందరినీ అధోగతికి ఈడ్చివేశారు. మరొకరు సమత్వంకోసమే ఉన్నతస్థానం ఆక్రమించారు. ఒకరు మహారాజుల్ని ఉరికంబాలకు దించారు. మరొకరు ప్రజానీకాన్ని సింహాసనానికి ఉద్ధరించారు. అయితే, ఇద్దరూకూడా దుర్నీతిపరులైన విప్లవకారులు కారని నేననడం లేదు. ఉభయుల పీడా విరగడైన రోజులు ఫ్రాన్స్ దేశానికి పండుగ చేసుకో

వలసినవి కావనడంలేదు. రాజరిక పక్షమిత్రులందరూ పండుగ చేసుకోవలసినవే. తిరిగి తలెత్తకుండా శాశ్వతంగా కూలిపోయిన నెపోలియన్‌కి అనుచరవర్గం ఇంకా ఉన్నదంటే, నేను చెప్పినదే కారణమంటున్నాను. ఇంతకంటె మరే మాతుంది? నెపోలియన్‌తో పోల్చడానికైనా వీలుకాని క్రామ్‌వెల్‌కే అనుచరవర్గం ఉండేవారు కదా!"

"విల్‌ఫర్ట్! మీరు చెప్పినమాటల్లో విప్లవాంశకూడా ఉందని మీకు తెలుసునా? కాని అందుకు మిమ్మల్ని అనలేను. వంశ పరిమళం కొంచెమైనా మిగలకుండా, గిరాండిస్టుల (రిపబ్లికన్లు) కుమారులైనవా రెవరూ ఉండలేరు."

విల్‌ఫర్ట్ అన్నాడు. "నా తండ్రి గిరాండిస్ట్ అన్నమాట నిజమే. కాని మహారాజుకు విధించబడిన మరణశిక్షను నాతండ్రి ఆమోదించలేదు. మిమ్మల్ని తరిమివేసిన ఆ భయంకర పాలకులే, నా తండ్రినీ తరిమివేశారు. మీ తండ్రి శిరచ్ఛేదం జరిగిన చోటనే, నా తండ్రికికూడా శిరచ్ఛేదం జరగవలసింది; కొద్దిలో తప్పిపోయింది. అంతే భేదం."

"అవును, నిజమే. కాని ఇద్దరినీ నేరవిచారణ చేసినది పరస్పర విరుద్ధహేతువులపైన సుమా! దేశాంతరగతులైన రాజవంశం పట్ల మా వంశం ఎన్నడూ భక్తిప్రపత్తులు విడిచిపెట్టలేదు. మీ తండ్రి నూతన పరిపాలకులకు అండగా నిలిచారు. సామాన్యపౌరుడైన నయర్‌టైర్, గిరాండిస్ట్ అయినతర్వాతనే కదా, కౌంట్ నయర్‌టైర్‌గా సెనేట్‌సభ్యుడైనాడు!"

"దైవవిధి ప్రతికూలించిన విషయాలనుగురించి వాగ్వాదాల వల్ల మన కేం ప్రయోజనం? భవిష్యత్తునైతే దైవమైనా మార్చగలడు కాని, గడిచినదానిని మార్చలేడుకదా! నాకు సంబంధించినంతవరకూ, నేను నా తండ్రిఅభిప్రాయాలనే కాదు, నా తండ్రి ఇంటిపేరునుకూడా త్యజించాను. ఆయన ఒకప్పుడే కాదు, ఇప్పుడుకూడా బోనపార్టిస్టే కావచ్చును. ఆయనపేరు నయర్‌టైర్. నేను రాజరికపక్షానికి చెందినవాడిని. నాపేరు విల్‌ఫర్ట్. కుళ్ళి కృశిస్తున్న వృక్షంతోపాటు, విప్లవాల చిలవలను పలవలను నశించ

నివ్వండి. ఇంకా తగినబలం కూర్చుకోలేక, ఇప్పుడిప్పుడే తల్లి వేరునుంచి పుట్టి ఎదుగుతున్న కొత్తమొక్కను ఆదరించండి."

"బాగా చెప్పావోయ్ విల్‌ఫర్ట్!" అన్నాడు మార్క్విస్. "గతాన్ని విస్మరించాలని నా భార్యకి నేనెంత గానో బోధిస్తున్నాను. కాని ఇంతవరకూ ఆమె తల కెక్కలేదు. నువ్వైనా నచ్చచెప్పగలుగుతావని ఆశపడుతున్నాను."

"అలాగే మరిచిపోతాను" అన్నది మార్క్విస్ భార్య. "గతాన్ని మరిచిపోడానికి నాకేలాటి అభ్యంతరం లేదు. కాని విల్‌ఫర్ట్, ఇకనుంచి మీరు మీ వృత్తిలో దృఢచిత్తంతో పని చెయ్యాలి సుమా! మీ చేతుల్లో ఒక కుట్రదారుడు చిక్కాడంటే, మిమ్మల్ని ఐయ్యికళ్లు కనిపెట్టిచూస్తున్నాయన్న విషయం మరిచిపోకండి. బహుశా కుట్రదారులతో మీ కుటుంబం చేరి ఉంటుందని అందరూ అనుమానిస్తారు."

"నిజం చెప్పాలంటే, నా వృత్తిధర్మంవల్లనైతే నేం, కాలగతినిబట్టి అయితే నేం, నేను కఠినంగా ఉండక తప్పదు. నేను అలాగే నిర్వర్తిస్తాను. ఇప్పుడు నావద్దకు అనేక రాజకీయ నేరాలు విచారణకు వచ్చాయి. తగిన సాక్ష్యబలంకూడా చేరింది. దురదృష్టవశాత్తు ఈ వ్యవహారాలింకా అంతం కాలేదు. నెపోలియన్ ఫ్రాన్స్‌దేశానికి అతిసమీపంలో నే ఉన్నాడు. మనతీరానికి కనుచూపుమేరలో, ఎల్బాద్వీపంలో అతడున్నందువల్ల, అతని అనుచరుల బలోత్సాహాలు ఇంకా అంతరించలేదు. అర్ధవేతనాలు పొందుతున్న అధికారులు మార్సెల్స్‌లో అనేకులున్నారు. రాజరికపక్షంవారితో చీటికీ మాటికీ కయ్యాలకు కాలుదువ్వుతున్నారు. అందువల్ల ఉన్నత తరగతులలో ద్వంద్వ యుద్ధాలు, నీచతరగతులలో హత్యలు విరివిగా సాగుతున్నాయి."

"అవును" అన్నాడు కౌంట్ సాల్వో. ఇతడు మార్క్విస్ ఆఫ్ సెంట్‌మిరాన్ మిత్రుడు. "కాని అతన్ని సెంట్ హెలెనా ద్వీపానికి పంపాలని పవిత్రరాజ్యకూటం (హోలీ ఎలయన్స్) నిర్ణయించిందని మీకు తెలుసు కదా!"

"సెంట్ హెలెనా ? అంటే అదెక్కడుంది ?" అని ప్రశ్నించింది మార్క్విస్ భార్య.

"భూమధ్యరేఖకు అవలివైపున; మనకి ఆరువేలమైళ్ల దూరంలో ఉంది."

విల్ఫర్ట్ అన్నాడు: "కాని మన దురదృష్టంకొద్దీ 1814 ఒడంబడిక ఒకటుంది. దానిమూలంగా నెపోలియన్ జోలికి మనం పోలేం."

"అయితే ఒడంబడికల్ని పాటించనేవద్దు." అన్నాడు కౌంట్ సాల్వో. "ఫ్రెంచిరాజకుమారుణ్ని చంపడానికి నెపోలియన్‌కి ఏ ఒడంబడికా అడ్డురాలేదు."

"అవును. అయితే అది స్థిరపడినట్లే" అన్నది మార్క్విస్ భార్య. "పవిత్రరాజ్యకూటం నెపోలియన్‌ని యూరప్‌నించి విరగడచేసుకుంటుంది. దాంతో మార్సెల్స్‌లో అతని అనుచరుల బాధ విల్ఫర్ట్‌కి విరగడౌతుంది. మహారాజు పరిపాలించాలా, వద్దా? పరిపాలించాలంటే, ప్రభుత్వం బలీయంగా ఉండాలి. అధికారులు దృఢచిత్తులై పనిచెయ్యాలి. ముప్పురాకుండా కాపాడాలంటే అంతే."

విల్ఫర్ట్ చిరునవ్వుతో అన్నాడు: "అపకారం జరిగిపోయిన తరవాతనే ఎప్పుడూ న్యాయాధికారి కర్తవ్యాన్ని ఉపక్రమించడం మన దౌర్భాగ్యమే."

కౌంట్ సాల్వో కుమార్తె సంభాషణలోకి ప్రవేశించింది. ఈమె వధువు ప్రియమిత్రం. సుందరి. "మేము మార్సెల్స్‌నించి వెళ్లిపోయేలోగా గొప్ప నేరవిచారణ ఒకటి జరిపించండి విల్ఫర్ట్! నే నెప్పుడూ న్యాయస్థానం చూడలేదు. చాలా సరదాగా ఉంటుందంటారు" అంది.

"నిజంగా సరదాగా ఉంటుంది. నాటకాలలో అభినయించే విషాదం కాదిది. జీవితంలోని వాస్తవమైన విషాదం, దుఃఖం చూడవచ్చును. ఉద్వేగహృదయులైనవారు, ఉద్రేకపూరితదృశ్యాల్ని చూడగోరితే, ఇంతకంటె అద్భుతదృశ్యం

ఉండబోదు. తరుణం రాగానే, మీకు చూపిస్తాను."

వధువైన మార్క్వేస్ కుమార్తె, రినీ అంది: "అది తల్చుకుంటేనే దడ వస్తుంది సుమా! కాని ఆశ్చర్యం! ఎంత చులకనగా మాట్లాడుతున్నాడో!"

"అవును. ఎందుకు మాట్లాడకూడదు? అది నా దృష్టిలో ద్వంద్వయుద్ధంవంటిది. ఇప్పటికి అప్పుడే అయిదారుసార్లు రాజకీయ నేరస్థులకు మరణశిక్షలు విధింపచేశాను. నాకోసం కత్తులు నూరుతున్నవారెందరున్నారో ఎవరికి తెలుసు?"

వధువు కలవరపడింది: "నిజం చెప్తున్నావా?"

చిరునవ్వుతో వరుడన్నాడు. "ఇదీ ఒక నిజమేనా? ఈ అద్భుత నేరవిచారణలే లేకపోతే, పరిస్థితి మరింత దుర్భరమైపోయేది. ప్రత్యక్షశత్రువుని చంపడంకంటె, ఎన్నడూ కంటితో చూడని రష్యన్, ఆస్ట్రియన్, హంగేరియన్ సైనికుల్ని చంపడం ప్రధానమని నెపోలియన్ సైనికులు పరిగణిస్తారా? లేదు. అసలు ఈ కాంక్ష ఎంతో అవసరం. ఇదే లేకపోతే మా వృత్తి ఎక్కడుంటుంది? నామటుకు నాకు నేరస్థుని కళ్లలో రౌద్రాన్ని చూస్తున్నకొద్దీ ఉత్సాహం అధికమౌతుంది. పట్టుదల ఎక్కువౌతుంది. అది నేరవిచారణ కాదు; ఒకరకం ద్వంద్వయుద్ధం. ఒడుపు చూసి వాడొక వేటు వేస్తాడు. అది కాసుకుని నేను తిరిగి దెబ్బతీస్తాను. విజయమో, పరాజయమో, అక్కడే తేలిపోతుంది. వాద ప్రతివాదాలంటే అలా ఉంటాయి. ప్రమాదమనేది వాగ్ధార నుత్పన్నంచేస్తుంది. నా ప్రతివాదం విని నవ్వే నేరస్థునిచూస్తే, నేచెప్పిన దానిలో లోపముందని, నా వాదంలో బలం చాలదని భావిస్తాను. నేరంలో నిజం బయటపడి, దోషి ముఖం పాలిపోయి, సాక్ష్యబలానికి తలొగ్గినప్పుడు, వాడిని చూస్తుంటే న్యాయాధికారిపొందే గర్వం ఎలా ఉంటుందో ఆలోచించండి! అనతి కాలంలో ఛేదించబడనున్న శిరస్సు వాలిపోతుంది..."

రినీ చీత్కారం చేసింది.

అతిథులలో ఒక రన్నారు: "కిందటి కేసులో మీ చాక చక్యం అద్భుతంగా ఉంది విల్ ఫర్ట్. తండ్రిని చంపిన ఆ నేర స్థుడు మీకు జ్ఞాపకమేనా? ఉరితియ్యకముందే మీరు వాణ్ని అక్షు రాలా చంపేశారు."

"పితృహంతకులైతే అది వేరు" అంది రినీ. "వాళ్లని ఎంత బాధపెట్టినా చాలదు. కాని పాపం రాజకీయ నేరస్థుల సంగతి అలా కాదు."

"వీళ్లు మరింత ఘాతకులు రినీ," అన్నాడు విల్ ఫర్ట్. "మహారాజంటే జాతికంతకీ తండ్రి. అటువంటి మహారాజును పదభ్రష్టుని చెయ్యడం, హత్యచెయ్యడం అంటే ఏమిటి ? మూడు కోట్ల ఇరవైలక్షల ప్రజలకు పితృసమానుడు మహారాజు."

"అది సరే. నేను చెప్పినప్పుడుమాత్రం నేరస్థుల్ని కొంచెం కరుణతో చూస్తే చాలు" అంది రినీ.

"తప్పకుండా," అన్నాడు విల్ ఫర్ట్, చిరునవ్వు ముఖ మంతటా వికసింపచేస్తూ.

"అమ్మాయ్! నీ చిలకలు, గోరింకలూ, సీమకుక్క పిల్లలు, అలంకారాలసంగతి నువ్వు చూసుకో" అంది మార్క్వెస్ భార్య. "నీ కాబోయే భర్తని అతని వ్యవహారాలకి అతన్ని విడిచిపెట్టు. ఈరోజుల్లో ఆయుధాల్ని మూలపారేశారు. న్యాయస్థానాలలో పోరాటాలు జరుగుతున్నాయి."

"నువ్వు వైద్యుడివైతే బాగుండునని నా ఉద్దేశం" అంది రినీ, విల్ ఫర్ట్ తో. "ఎంతటి కరుణార్ద్రహృదయుడైనా, దండ నాధికారి కఠోరుడే నని నా అభిప్రాయం."

ప్రేమార్ద్రమైన దృష్టితో విల్ ఫర్ట్ యువతివంక చూశాడు. "పాపం, పిచ్చిపిల్ల!" అనుకున్నాడు.

మార్క్వెస్ అన్నాడు: "అమ్మాయ్! విల్ ఫర్ట్ మన రాష్ట్రా నికి నైతికంగా, రాజకీయంగా చేసేది వైద్యమే ననుకో. అదీ ఉత్కృష్ట కర్తవ్యమే."

"దీనివల్ల అతని తండ్రి చేసినవన్నీ మరిచిపోడానికి వీలౌతుందికూడా" అంది మార్క్విస్ భార్య.

కొంచెం అనుతాపసూచకంగా చిరునవ్వు నవ్వాడు విల్ఫర్ట్: "నాతండ్రి ఇదివరలో చేసిన దోషాలను దిద్దుకున్నాడని ఇప్పుడే మనవి చేశాను. ఇప్పుడు ఆయన ప్రస్తుత పాలక వర్గంపట్లనూ, మతంపట్లనూ విధేయుడు. నాకంటె మేలైన రాజరికపక్షవాదిగా మారినా సంభవమే. నా విషయంలో ఇది నా ఇష్టానికి సంబంధించినది మాత్రమే. నా తండ్రివిషయంలో అది పశ్చాత్తాపం"

"మీరు చెప్పినది నిజమే విల్ఫర్ట్" అన్నాడు కౌంట్ సాల్వో. "ఈమధ్య ఒక రోజు మహారాజునివాసంలో, అంతఃపురవ్యవహారాలమంత్రితో మాట్లాడినప్పుడు నేనది గమనించాను. ఇంవరలో కౌండ్ సైన్యంలో పనిచేసిన ఉద్యోగి కుమార్తెకూ, గిరాండిన్ కుమారునికీ వివాహప్రసంగం జరుగుతున్నదేమిటని నన్ను మంత్రి ప్రశ్నించారు. సరిగ్గా ఈ పద్ధతినే ఉభయపక్షాలమధ్యనూ సామరస్యం చేకూర్చడం మహారాజుగారి అభిలాష అని నాతో చెప్పారు. మా సంభాషణ మహారాజు వింటున్నట్లు మేం గమనించలేదు. మహారాజు మధ్యలో వచ్చి 'విల్ఫర్ట్ వృద్ధిలోకి వచ్చేవాడే' అన్నారు. మహారాజు విల్ఫర్ట్ అనే పేరు వాడారుకాని, నయర్టైర్ పేరు వాడలేదు సుమా! 'ఇప్పుడే అతనికి మంచి విచక్షణ, వివేచన ఉన్నాయి. సెంట్ మిరాణ్ దంపతులు అతన్ని అల్లుడుగా స్వీకరిస్తున్నారంటే నాకూ సంతోషమే. వారు ఇంకా నిర్ణయం చేసిఉండకపోతే, నేను సరిగ్గా ఇటువంటి బాంధవ్యమే తెచ్చుకోవాలని సలహా ఇచ్చేవాడిని' అని కూడా అన్నారు మహారాజు."

"నిజంగా? మహారాజు అలా అన్నారా?" అన్నాడు విల్ఫర్ట్, మహదానందంతో. "నిజంగా నేనీ మహారాజుకు ఎంత ఋణపడిఉన్నాను? ఆయన కొలువుచెయ్యడానికి దేనికైనా నేను సిద్ధమే."

"బాగుంది" అంది మార్క్విస్ భార్య. "మీ మాటలు వింటే నాకు సంతోషంగా ఉంది. ఇంక ఇప్పుడు రానివ్వండి, ఏ కుట్ర దారుడు వస్తాడో! తెలుస్తుంది మన ప్రభావం."

సరిగ్గా ఈ వాంఛ తీర్చడంకోసమే అదృష్టదేవత నిరీక్షించి ఉన్నట్లు, అదే సమయంలో ఒక దర్వాన్ వచ్చాడు. విల్‌ఫర్ట్ చెవిలో ఏదో చెప్పాడు.

వెంటనే విల్‌ఫర్ట్ అతిథులను క్షమార్పణ కోరి వెళ్లి పోయాడు. వెళ్లిన కొద్దిసేపటిలోనే నవ్వుముఖంతో తిరిగివచ్చాడు. రినీ అతనివంక ప్రేమతో చూసింది. అతని సౌష్టవశరీరం, వికసించిన వదనం, అమాయకురాలైన ఆ కన్య ప్రశంసాభావాన్ని ఇనుమడింపచేశాయి.

"ఇప్పుడే కదా అన్నావు, వైద్యుడైనవానిని పెళ్లిచేసుకుంటే బాగుండు నని? క్రిమినల్ లాయరు కూడా వైద్యుని పోల్చుకోదగినదొక లక్షణం నాకూ ఉంది. ఇద్దరి వృత్తులూ క్షణం తీరిక నివ్వవు. నేను నీ సమక్షంలో ఉన్నా సరే, నా వివాహానికి ప్రధానపు విందులో ఉన్నా సరే, నన్ను విడిచిపెట్టరు."

కొంచెం కలవరపాటుతో ఆమె ప్రశ్నించింది: "నిన్ను ఎందుకు పిలిచారు?"

"నాకు చెప్పినది నమ్మదగినదైతే, ఒక ప్రమాదమైన రోగాన్ని నివారించవలసినపని వచ్చిందన్నమాట. ఈమారు ఇది చాలా ప్రమాదమైనది. మందు మరణదండనే ననుకుంటాను."

"ఏమిటి?" అన్నారు అతిథులంతా ఒక్కసారిగా.

"ఇప్పుడే బోనపార్టిస్టుల కుట్ర ఒకటి బైటపడిందిట. ఇదిగో నేరమారోపించే ఉత్తరం చదువుతాను వినండి: 'మహారాజుయొక్క హితంకోరిన ఒక మిత్రుడు రాజశాసనాధికారి నీ క్రిందివిధంగా హెచ్చరిస్తున్నాడు: స్మిర్నానుంచి బయలుదేరి, నేపుల్స్, ఫెరాజోరేవులగుండా ప్రయాణం చేసి, ఇవాళ ఉదయమే మార్సేల్స్ చేరిన ఫరావోనౌకలో మేట్‌గా పనిచేస్తున్న ఎడ్మండ్ డాంటే అనే ఒక యువకుడు, నేపుల్స్ రాజు (నెపోలియన్ బావమరిది) వద్దనుంచి నెపోలియన్‌కు ఒక ఉత్తరం ఇచ్చి, పారిస్‌లో బోనపార్టిస్ట్ కమిటీకి ఇవ్వడానికి నెపోలియన్

వద్దనుంచి ఒక ఉత్తరం తీసుకువెడుతున్నాడు. ఆ యువకుని అరెస్టుచేసినట్లయితే రుజువు దొరుకుతుంది. నెపోలియన్ ఉత్తరం అతనివద్ద కాని, అతని తండ్రిఇంటిలో కాని, ఫరావో నౌకలో అతని గదిలో కాని దొరుకుతుంది."

"ఈ ఉత్తరం ప్రధానన్యాయాధికారికి వ్రాసినది. పైగా పేరూ, దస్కతూ లేనిది కదా?" అంది రినీ.

"అవును. కాని ప్రధానన్యాయాధికారి ఇక్కడిప్పుడు లేడు. అందువల్ల ఉత్తరాన్ని అతని కార్యదర్శి తీసుకున్నాడు. చూసి నాకు కబురు పంపాడు. నేను వెంటనే దొరక్కపోడం వల్ల అరెస్టుకు ఆజ్ఞ ఇచ్చాడు."

"అయితే దోషి అరెస్టయినాడా?" అని ఆత్రంతో ప్రశ్నించింది మార్క్విస్ భార్య.

"ఎక్కడున్నాడు?" అని ప్రశ్నించింది రినీ.

"నా ఇంటివద్ద."

"మీ రింక కర్తవ్యవిలంబన చెయ్యకండి" అన్నాడు మార్క్విస్, "రాజకార్యం ముందుగా నిర్వర్తించి తీరవలసినది".

ఆవేశంతో రెండు చేతులూ గుండెలపై చేర్చి రినీ అంది, "విల్ఫర్ట్! ఇవాళ మన ప్రధానంరోజన్నమాట మరిచిపోకు. మరీ కఠినంగా ఉండవద్దు"

విల్ఫర్ట్ ఆమెను సమీపించి అన్నాడు: "నేను చెయ్యగలిగినదంతా చేస్తాను. నువ్వు ఆందోళనపడవద్దు. వార్త నిజమై, నేరం ధృవపడితే, ఈ దుష్టాంగాన్ని ఖండించక తప్పదు."

"అబ్బె! చిన్నపిల్ల మాటలు వినకండి విల్ఫర్ట్" అంది మార్క్విస్ భార్య. "క్రమక్రమంగా ఆమే వీటికి అలవాటుపడుతుంది."

"నిర్బలురైన రాజరికవాదిని క్షమించండి. నా కర్తవ్యాన్ని చిత్తశుద్ధితో, విధేయతతో నిర్వర్తించగలను. కఠినంగా ఉండవలసినప్పుడు వెనుదీయను." అన్నాడు విల్ఫర్ట్. మురిపెంతో వధువు వంక అతడు చూసిన చూపులోమాత్రం, "నీ ప్రేమకోసం నీమనోవాంఛను మన్నిస్తాను" అన్నట్లు స్ఫురించింది.

# 7

ఓడ విడిచి వచ్చిన విల్ ఫర్డ్ ముఖంలో ఉల్లాసం చెరిగి పోయింది. సాటిమానవుని శిక్షకు పాల్పడచేయవలసిన కఠోరకర్తవ్యభారం అతని ముఖాన్ని ముకుళింపచేసింది. ముఖ కవళిక మార్చడం అతనికి అభ్యాసమే. కాని ఈమారు ఆనందానుభవం శిఖరాన్నందుకున్నందువల్ల, మార్పు కష్టమయింది. ఇరవై యేడోయేట సంపదగడించి, ఉద్యోగంలో ఉన్నతిపొందిన అతడు ఒక చక్కని యువతిని వివాహమాడుతున్నాడు. ఆమెపట్ల ప్రేమ అతన్ని పరవశే మొందించలేదు. న్యాయశాసనాధికారి కెంత తగునో అంత అదుపులోనే ఉంది. వధువు ఉన్నత వంశానికి చెందినది. రాజకీయ రంగంలో ఆవంశానికి గల పరపతి అతని అభివృద్ధికి తోడ్పడుతుంది. వధువుఆరు వేల పౌనుల కట్నంతో వస్తుంది. ఆమె తండ్రి అనంతరం 20 వేల పౌనులు లభిస్తుంది. ఇవన్నీ చూసుకుని విల్ ఫర్డ్ ముగ్ధుడైనాడు.

ద్వారంవద్ద పోలీసుఅధికారి వేచిఉన్నాడు. అధికారి కన పడగానే విల్ ఫర్డ్ స్వరధామంనుంచి ఒక్కసారిగా మేలు కున్నాడు. గంభీరముఖంతో అధికారిని సమీపించాడు. "ఉత్తరం చదివాను. మీరు అరెస్టుచెయ్యడం మంచిదే అయింది. మనం అక్క డికి చేరేలోగా, మీకు తెలిసినంతవరకూ అతన్నిగురించీ, కుట్రనుగురించీ చెప్పండి"

"కుట్రగురించి ఇప్పటికేం తెలియదండి. అతనివద్ద దొరికిన పత్రాలన్నిటినీ స్వాధీనపరుచుకుని సీలువేశాం. బంగీ మీ మేజా పైన ఉంది. ఇతనిపేరు, ఉత్తరంలో ఉన్నట్లు, ఎడ్మండ్ డాంటే. ఫరావో నౌకలో మేట్ గా పనిచేస్తున్నాడు. ఓడ మారెల్ అండ్ సన్స్ కంపెనీ వారిది. అలెగ్జాండ్రియా, స్మిర్నారేవుల్లో పత్తివర్తకానికి నియోగించబడింది."

"ఓడలో చేరేముందు అతను సైన్యంలో పనిచేశాడా ?"

"లేదు. అతను వయస్సులో చిన్నవాడు. పందొమ్మిది, ఇరవై ఏళ్లుంటాయి."

ఇద్దరూ కలిసి ఒకరోడ్డు మలుపు తిరగ్గానే, మొగలో వారిని మారెల్ కలుసుకున్నాడు. విల్ ఫర్ట్ ని సమీపించి, "మిమ్మల్ని ఇక్కడ కలుసుకోగలగడం, నా అదృష్టమే. నా ఓడలో మేట్ గా పనిచేస్తున్న ఎడ్మండ్ డాంటీని అరెస్టు చేశారు. అతన్ని అరెస్టు చెయ్యడం పొరపాటండి."

"అరెస్టు చేశారుట. ఇప్పుడే అతన్ని విచారిస్తాను."

"అతన్ని మీ రెరగరు విల్ ఫర్ట్. నేను బాగా ఎరుగుదును. అతనివంటి ఉత్తముడు, నీతైనవాడు లోకంలో మరొకడులేడంటే నమ్మండి. నేను పూచీ ఇవ్వగలను."

విల్ ఫర్ట్ సామంతుల ఉన్నతవంశానికి చెందినవాడు. మారెల్ సామాన్య వంశీకుడు. విల్ ఫర్ట్ ముఖం ముడుచుకుని, కొంత కరుకుగా సమాధాన మిచ్చాడు.

"మనిషి స్వతహాగా మంచివాడే కావచ్చును, మారెల్. వ్యాపార వ్యవహారాల్లో నీతివంతుడు కావచ్చును. వృత్తిలో తెలివైనవాడే కావచ్చును. అయినా రాజకీయాల్లో నేరస్థుడు కూడా కావచ్చును. అది మీకు తెలుసునా ?"

మారెల్ ముఖం ఎర్రబడింది. రాజకీయాలకు సంబంధించినంత వరకు అతని అభిప్రాయాలుకూడా పైకి చెప్పకుంటే క్షేమం కాదు. గ్రాండ్ మార్షల్ వద్దకు వెళ్లడం, అక్కడ నెపోలియన్ తో మాట్లాడ్డం డాంటీ తనకు రహస్యంగా చెప్పాడు. ఇది మారెల్ కు భయ కారణ మయింది. అయితే, గంభీరంగా ఇలా అన్నాడు. "డాంటీని కొంచెం దయతో చూసి, మాకు తిరిగి ఒప్పగించండని ప్రార్థిస్తున్నాను."

విల్ ఫర్ట్ చెవులకు ఈ మాటల్లో కొంత వినయలోపం కనిపించింది. 'మాకు తిరిగి ఒప్పగించండి' అన్న మాటల్ని మనస్సులో పునశ్చరణ చేసుకున్నాడు. ఇలా అన్నాడు : "ఈ డాంటీ ఏదో రహస్య విప్లవ సంఘానికి చెందినవా డనుకుంటాను. ఒక హోటల్లో

ఒక సమావేశంలో ఉండగా ఇతన్ని అరెస్టు చేసినట్లు పోలీసుఅధికారి చెప్పాడు. ఖైదీ నిర్దోషి అయితే మీ కోరిక మన్నిస్తాను. కాని దోషి అయితే, నా విధి నేను నెరవేర్చక తప్పదు."

ఈ మాటలంటూ విల్ ఫర్ట్ న్యాయస్థానం ననుకనున్న స్వగృహం సమీపించాడు. ఓసె యజమానికి వందనంచేసి లోనికి వెళ్లాడు. ముందు పంచలో కొందరు పోలీసుల మధ్య ఖైదీ ఉన్నాడు. డాంటేని ఓరకంట చూసి, విల్ ఫర్ట్, తన గదిలోకి వెళ్లాడు.

టేని గదిలోకి తీసుకువెళ్లారు. విల్ ఫర్ట్ అతన్ని ఎగాదిగా చూశాడు. తేజోమయముఖం, విశాలమైన అతని నుదురు చూడగానే ముందుగా విల్ ఫర్ట్ కి సద్భావం కలిగింది. కాని పైపై లక్షణాలు చూసి మోసపోకూడదని అతనిమతం. వినయపూర్వకంగా డాంటే విల్ ఫర్ట్ కి వందనం చేశాడు. మారెల్ గదిలో తనకున్న అలవాటు ప్రకారం, దగ్గరలో కుర్చీకోసం చూశాడు. కాని విల్ ఫర్ట్ వంక చూసి ఆగిపోయాడు. తమ ఆంతర్యం తెలియనియ్యకుండా, ఎదటి వారి అంతర్యాన్ని కనిపెట్టాలని అధికారులు చూసే, ఆ అగాధమైన చూపుతో విల్ ఫర్ట్ పరీక్షించాడు.

పోలీసు అధికారి తన చేతిలో ఉంచిన కాగితాలు తిరగవేస్తూ విల్ ఫర్ట్ ప్రశ్నించాడు: "ఎవరు నువ్వు ? నీ పేరు ?"

"నా పేరు ఎడ్మండ్ డాంటే. ఫరావో నౌక మేట్ గా పని చేస్తున్నాను."

"అరెస్టు చేసినప్పుడు ఏంచేస్తున్నావు ?"

"నా పెళ్లి ప్రధానపు విందులో ఉన్నానండి. మూడేళ్లుగా ప్రేమించిన యువతిని పెళ్లిచేసుకోడానికి ఏర్పాటయింది." డాంటే కంపిత కంఠస్వరం, అప్పటి ఆనందానుభవానికీ, ఇప్పటి దుర్దశకీ కల వ్యత్యాసాన్ని నిరూపిస్తోంది.

విల్ ఫర్ట్ చకితుడైనాడు. ఇద్దరిస్థితిలోనూ కల వింత సాదృశ్యం అతనికి గోచరమయింది. అపూర్వానందంనుంచి ఆకస్మికంగా తరుముబడిన డాంటేపట్ల అతని హృదయం కొంచెం మెత్తబడింది. తనకూ వివాహం జరగబోతున్నది. తానూ ప్రియురాలివద్ద

నుంచి ఆకస్మికంగా రావలసివచ్చింది. తనవలెనే స్వర్గసుఖాన్ని అందుకోబోతున్న మరొక వ్యక్తి స్వర్గసుఖాన్ని తాను నాశనం చెయ్యవలసి వస్తున్నది.

తిరిగి డాంటేని చూసి విల్‌ఫర్ట్ అన్నాడు: "ఊ! నీ సమాచారమంతా చెప్పు. నెపోలియన్ కింద ఎప్పుడైనా పనిచేశావా?"

"నెపోలియన్ అధికారచ్యుతుడైనప్పుడే నేను నౌకాదళంలో చేరవలసింది."

"నీ రాజకీయోద్దేశాలు స్పష్టంగా అందరికీ తెలుసుట నిజమేనా?"

నిజానికీ సంగతి విల్‌ఫర్ట్‌కి ఎవరూ చెప్పలేదు. అయినా ఈ రీతిగా నేరమారోపిస్తూ ప్రశ్నించడానికి శంకించలేదు.

"నాకు రాజకీయోద్దేశాలా? అసలు నాకటువంటి వేవీ లేవని సిగ్గుపడుతూ ఉంటాను. నా కింకా పందొమ్మిదేళ్లు నిండలేదు. నాకివేవీ తెలియవు. రాజకీయాభిమానాలనేవి ఏవీ లేవు. నాకు తెలిసినవల్లా ఏమిటంటే, నా తండ్రిపట్ల భక్తి, ప్రేమ; మొరెల్ పట్ల గౌరవం; మర్సిడా పట్ల ప్రేమారాధన. ఇదేమంత చెప్పుకోదగింది కాదు. కాని నాకు తెలిసినదంతా ఇంతే."

డాంటే మాట్లాడుతున్నప్పుడు, అతని ముఖం వంక విల్‌ఫర్ట్ పరీక్షగా చూశాడు. నేరస్థుల్ని గురించి తనకు తెలిసిన అనుభవాన్ని బట్టి, డాంటే చెప్పిన ప్రతిమాటా నిజమనీ, డాంటే అమాయకుడనీ విల్‌ఫర్ట్ గ్రహించాడు. తనలో అనుకున్నాడు: "పాపం! మంచివాడే. అమాయకుడు. రినీ నావల్ల కోరిన మొదటి కోరికను ఇప్పుడు చెల్లించవచ్చు." విల్‌ఫర్ట్ ముఖంలో కాఠిన్యం తొలగింది. డాంటే ముఖం తేటపడింది.

"నీ కెవరైనా శత్రువు లున్నారేమో తెలుసునా? పోనీ, నీపట్ల అసూయ కలవా రెవరైనా ఉన్నారా? పందొమ్మిదో యేటనే కెప్టెన్ కాబోతున్నావు. పెళ్ళి చేసుకోబోతున్నావు. వీటివల్ల నీ పైన ఈర్ష్య వహించిన వాళ్లెవరైనా ఉన్నారా?"

"అసూయాపరు లుండవచ్చును" అన్నాడు డాంటే. "ఎవ రైనా ఉన్నప్పటికీ, వాళ్లెవరో తెలుసుకోవాలనే కుతూహలం నాకు లేదు. వాళ్లని అసహ్యించుకోవలసిన పని నాకుండదు."

"పొరపడుతున్నావు. దారిలో ముళ్లుంటాయి. ఎప్పుడూ జాగ్రత్తగా చూసుకుని నడవాలి. నిన్ను చూస్తే మంచివాడ వనిపిస్తోంది. మామూలు విచారణ తతంగం అంతా విడిచిపెట్టి, విషయ మేదో తెలుసుకోడానికి నీకు సహాయం చేస్తాను. నీ అరెస్టుకి కారణం చెప్తాను. మాకు వచ్చిన ఉత్తరం ఇదిగో. ఈ దస్తూరీ ఎవరిదో నీకు తెలుసునా?" అంటూ విల్‌ఫర్ట్ ఉత్తరాన్ని డాంటే చేతి కిచ్చాడు.

డాంటే ఉత్తరం చదివాడు. అతని ముఖం మేఘాచ్ఛన్న మయింది. ఇలా అన్నాడు: "ఈ దస్తూరీ ఎవరిదో నాకు తెలియదండి. చెయ్యి తిరిగినవా డెవడో తన దస్తూరీమార్చి వ్రాశాడు. మీవంటివారు విచారించడం నిజంగా నా అదృష్టమే. నిజంగా వీ డెవడో నాకు పరమశత్రువు." అతని కంఠస్వరంలో కృతజ్ఞత స్పష్టమయింది. యువకుడు అణుచుకుంటున్న ఉద్వేగాన్ని, చిర చిరలాడుతున్న అతని నేత్రాల్ని విల్‌ఫర్ట్ చూశాడు.

"ఇదిగో విను" అన్నాడు విల్‌ఫర్ట్. "నా దగ్గర దాచకుండా చెప్పు. తెలియక చిక్కులో పడ్డావు. నీ మంచికోసం అడుగుతున్నాను. ఈ ఉత్తరంలో ఉన్నదానిలో నిజం ఎంత వరకూ ఉంది?" చిరాకుతో ఉత్తరాన్ని మేజామీద పడేశాడు.

"నేను నావికుణ్ని. నా ప్రియురాలు మర్సిదాతోడు; ప్రమాణంచేసి చెప్తున్నాను. ఇందులో కొంత నిజం ఉంది. కొంత అబద్ధంఉంది."

"సరే చెప్పు" అన్నాడు విల్‌ఫర్ట్. తనలో అనుకున్నాడు: "ఇప్పుడు రినీ చూసినట్లయితే సంతోషించేది. నేను ప్రాణాలు తీసే క్రూరుడిననే భావం ఆమెకి తొలగిపోయేది."

డాంటే చెప్పడం మొదలెట్టాడు: "జరిగినది ఇదండి. నేపుల్స్ దాటగానే కెప్టెన్ లక్లేర్ మస్తిష్క జ్వరంతో మంచం పట్టారు. మూడురోజులు బాధపడి, ఇంక బతకడని తెలియగానే

నన్ను పిలిచారు. 'నీ కొక ముఖ్యమైన పని ఒప్పగిస్తున్నాను. అది తప్పకుండా నెరవేరుస్తానని నాకు ప్రమాణంచేసి చెప్పు.' అన్నారు. నేను ప్రమాణం చేశాను. 'నేను చనిపోగానే నువ్వు కెప్టెన్ బాధ్యతంతా తీసుకో. ఎల్బాద్వీపానికి వెళ్లి ఫెరాజోరేవులో లంగరు వెయ్యి. గ్రాండ్ మార్షల్ తో మాట్లాడ్డానికి అనుమతి తీసుకుని, నే నిప్పుడిస్తున్న బంగీ ఆయనకివ్వాలి. బహుశా ఆయన నీకు మరొక ఉత్తరం ఇవ్వవచ్చు. ఆయన చెప్పినవారికి ఆ ఉత్తరాన్ని ఒప్పగించు.' నేను 'అలాగే తప్పకుండా చేస్తాను. కాని గ్రాండ్ మార్షల్ ని కలుసుకోడం మీరనుకున్నంత సులువు కాదేమో!' అన్నాను. అప్పుడు కెప్టెన్ లక్లేర్ నా చేతికొక ఉంగరమిచ్చి, 'దీంతో నీకు అన్ని ఆటంకాలూ తొలగిపోతాయి.' అన్నారు. ఆ తరవాత రెండుగంటల్లో కెప్టెన్ లక్లేర్ కి సంధి పుట్టింది. మరునాడు మృతి చెందారు."

"తరవాత నువ్వేం చేశావు?"

"నేను నా కర్తవ్యం అనుకున్నది చేశాను. నా స్థితిలో ఎవరు చేసేదైనా ఒకటే కదా! నావికులైన వారికి తమ పై ఉద్యోగుల తుది కోరికలు అనుల్లంఘనీయమైన ఆజ్ఞలు. నేను ఎల్బాద్వీపంవద్ద ఓడ లంగరు వేశాను. ఒక్కడినే రేవు చేరాను. ముందనుకున్నట్లుగానే గ్రాండ్ మార్షల్ ను చూడ్డానికి చాలా ఆటంకాలు వచ్చాయి. కాని ఉంగరాన్ని ఆయనకి పంపగానే నాకు కబురుపంపారు. ఆయన్ని చూశాను. కెప్టెన్ లక్లేర్ ను గురించి సమాచారం అడిగారు. నేను చెప్పాను. ఆయన నాకొక ఉత్తరం ఇచ్చి, పారిస్ లో ఒకరి కివ్వాలని చెప్పారు. నేను మార్సేల్స్ లో దిగగానే అన్ని ఏర్పాటూ చేసుకున్నాను. నా ప్రియురాలిని చూశాను. మార్సెల్ సహాయంవల్ల పెళ్ళిసన్నాహాలు నిరాటంకంగా జరిగిపోయాయి. పెళ్ళి ప్రధానపువిందు ఈ పూటే జరుగుతోంది. ఇంకొకగంటలో వివాహంకూడా పూర్తికావలసింది. రేపు బయలుదేరి పారిస్ వెళ్లడానికి ఏర్పాటుచేసుకున్నాను. కాని ఈలోగా నాపైన నేరం ఆరోపించబడింది. విందులో ఉండగా అరెస్టయినాను. ఈ ఆరోపణ ఎటువంటిదో మీకు తెలుసును."

"అవును" అన్నాడు విల్ ఫర్ట్. "ఇదంతా వాస్తవంగానే కనిపిస్తోంది. నీవల్ల ఏదైనా నేరం జరిగిఉంటే, అది నీ అవివేకం

వల్లనే. ఈ అజాగ్రత్తకీ, అవివేకానికీ మీ కెప్టెన్ లక్లేర్ కూడా బాధ్యుడు. ఎల్బాలో నీకిచ్చిన ఉత్తరాన్ని నాచేతి కియ్యి. తొలి విచారణకి వస్తానని నాకు మాటిచ్చి వెళ్లు. నువ్వు నీస్నేహితుల వద్దకు తిరిగి వెళ్లవచ్చు."

"ఆ ఉత్తరం మీదగ్గరే ఉండాలి. మిగతా పత్రాలన్నిటితో పాటు దాన్ని కూడా నాదగ్గిర తీసుకున్నారు. అదుగో, అది ఆ కట్ట లోనే ఉంది."

డాంటే వెళ్లిపోబోతుండగా విల్ఫర్ట్ అన్నాడు: "అయితే ఉండు ఒక్క క్షణం. ఎవరి చిరునామాకివ్వాలి ఈ ఉత్తరాన్ని?"

"నయర్ క్లైర్, 13. కాక్ హెరాన్ వీధి, పారిస్."

విల్ఫర్ట్‌కి నెత్తిపైన పిడుగు పడినట్లయింది. వెంటనే ముందుకు వంగి, గబగబా కాగితాలు వెతికాడు. దుష్టగ్రహంలా ఉత్తరం అతని కంట పడింది. విల్ఫర్ట్ విపరీత భయంతో దానివంక చూశాడు. పాలిపోతూ గొణుగు తున్నట్లుగా చదివాడు: "నయర్ క్లైర్, 13 కాక్ హెరాన్ వీధి."

"అవునండి. అదే. ఆయన్ని మీ కెరుగుదురా?" అన్నాడు డాంటే.

"అబ్బె లేదు." వెంటనే అన్నాడు విల్ఫర్ట్. "మహారాజుకు విధేయుడైనవానికి, కుట్రదారులతో పరిచయం ఎలా ఉంటుంది?"

"అయితే ఇందులో కుట్ర ఏదైనా ఉందా?" అని అడిగాడు డాంటే. స్వేచ్ఛగా తిరిగి వెళ్లిపోవచ్చునని ఆశపడుతున్న డాంటే మొదటికంటె బిత్తరపోయాడు. "ఒకటిమాత్రం చెప్తానండి. ఆ ఉత్తరంలో ఏముందో నాకు బొత్తిగా తెలియదు."

భారమైన స్వరంతో విల్ఫర్ట్ అన్నాడు: "అవును. కాని ఈ ఉత్తరం ఎవరికి వ్రాయబడిందో వారిని నీకు తెలుసునా?"

"ఇది ఇవ్వవలసిన అవసరాన్ని బట్టి తెలుసుకోవలసివచ్చిం దండి. అంతే."

ఉత్తరాన్ని చదువుతున్నకొద్దీ విల్‌ఫర్ట్ ముఖం పాలిపో నారంభించింది. "నువ్వీ ఉత్తరాన్ని ఇంకెవరికేనా చూపిం చావా? ఎల్బానుంచి నయర్ సైర్‌కి ఒక ఉత్తరాన్ని నువ్వు తీసుకు వెడుతున్నట్లు మరెవరికైనా తెలుసునా?"

"నాకిచ్చినవారికి తప్ప మరెవరికీ తెలియదండి."

తత్తరపాటుతో న్యాయశాసనాధికారి ఉత్తరాన్ని మరోక మాటు చదివాడు.

"ఇందులో ఉన్న సంగతు లేవీ నీకు తెలియవంటావు?"

"ప్రమాణంచేసి మళ్లీ చెప్తానండి. కాని సంగతేమిటండి? మీకు ఆరోగ్యం బాగుండలేదా? ఎవరినైనా పిలవనా?"

"అక్కర్లేదు, నాకేమీ వొద్దు" అంటూ కంగారుగా విల్ ఫర్ట్ లేచాడు. "ఈ నీరసం రావడం మామూలే. వచ్చిపోతుంది." డాంటే ఇంకా పరీక్ష చేస్తాడని నిలబడివుండి పోయాడు. విల్‌ఫర్ట్ మళ్ళీ కుర్చీలో కూర్చున్నాడు. చెమర్చిన నుదుటిని తుడుచుకుంటూ ఉత్తరాన్ని మళ్ళీ చదువుతూ, తనలో అనుకున్నాడు: "ఈ ఉత్త రంలో సంగతులు ఇతనికి తెలిసివుంటే? నయర్ సైర్ నాతండ్రి అని ఇతని కెప్పుడైనా తెలుస్తే? నాపని ఆఖరే!" డాంటేవంక మాటి మాటికీ చూడ్డం మొదలెట్టాడు. అతని హృదయగత రహస్యా లన్నిటినీ తెలుసుకోడానికి, మనిషికీ మనిషికీ మధ్య ఉండే తెర తొలగిపోతే ఎంత బాగుండు ననుకున్నాడు.

"అయ్యో! ఇంక అనుమానం లేదు." అనేశాడు పైకి.

విల్‌ఫర్ట్ ఆవేగాన్ని అణుచుకోడానికి తీవ్రప్రయత్నం చేశాడు. వీలైనంత దృఢస్వరంతో అన్నాడు: "డాంటే! ఈ ఉత్త రంలో తెలిసిన సంగతుల్ని బట్టి, నువ్వు చాలా ప్రమాదంలో పడ్డావు. మొదట అనుకున్నట్టు నిన్ను విడుదల చెయ్యలే నిప్పుడు. విడుదలచేసేముందు మేజస్ట్రేటుతో సంప్రదించాలి. కొన్నాళ్లునిన్ను నిర్బంధంలో ఉంచాలి. వీలైనంత త్వరలో నే విడుదల చేయిస్తాను. ఈఉత్తరమే నీపైన పెద్ద నేరం ఆరోపిస్తోంది. ఇదిగో ఇటు చూడు." అంటూ విల్‌ఫర్ట్ పక్కనున్న చలి కాగే గాడిపొయ్యిలో ఉత్త రాన్ని పడేశాడు. ఉత్తరంపూర్తిగా కాలిపోయేవరకూ చూశాడు.

"చూడు. ఈఉత్తరాన్ని కాల్చిపారేశాను. కాబట్టి ఇంక నువ్వు నన్ను నమ్మవచ్చుకదా ? ఏమంటావు ?"

"తప్పకుండా. మీ రాజ్ఞ ఇవ్వండి. నేను విధేయుణ్ని."

విల్ ఫర్ట్ యువకుని సమీపించాడు: "ఆజ్ఞకాదు. సలహా ఇస్తాను. సాయంత్రం వరకు నిన్నీకోర్టులో ఉంచుతాను. ఇంకొకరు వచ్చి నిన్ను పరీక్షచేస్తారు. నాకు చెప్పినదంతా వాళ్ళకి చెప్పు. కాని ఈ ఉత్తరం గురించిమాత్రం ఒక్క మాట కూడా చెప్పకు."

"తప్పకుండా మీ సలహా శిరసావహిస్తాను."

"మంచిది. ఈ ఉత్తరం నాశనమైపోయింది కాబట్టి, దీని సంగతి నీకూ నాకూ మాత్రమే తెలుసును. ఇంక నీపైన పెద్దనేర మేదీ ఆరోపించలేరు. అందువల్ల నిన్నెవరు ప్రశ్నించినా, అటువంటిది నీ దగ్గర లేనేలేదని చెప్పు. ఇదొక్కటేనా, ఇంకేదైనా ఉత్తరం నీ దగ్గరుందా?"

డాంటే చెయ్యిచాపి "నేను ప్రమాణం చేస్తున్నాను. ఇంకేదీ లేదు" అన్నాడు.

విల్ ఫర్ట్ గంటమోగించాడు. పోలీసు అధికారి లోపలికి వచ్చాడు. అతని చెవిలో విల్ ఫర్ట్ ఏదో చెప్పాడు. "ఇతని వెంట వెళ్లు" అని డాంటేతో అన్నాడు.

డాంటే కృతజ్ఞతాపూర్వకంగా విల్ ఫర్ట్ వంక చూశాడు. వందనంచేసి వెళ్లిపోయాడు. తలుపు మూసుకోగానే విల్ ఫర్ట్ కి సత్తువంతా ఒక్కసారి ఉడిగిపోయినట్లయింది. కుర్చీలోకి వాలిపోయాడు.

"హారిదేవుడా !" అని నిట్టూర్చాడు. "ఎంత ప్రమాదం తప్పింది! ప్రధానన్యాయ శాసనాధికారి ఊళ్లో ఉన్నా, లేక నన్ను పిలిచేబదులు మేజస్ట్రేటునే పిలిచినా, ఎంతపని జరిగిపోయేది! ఆ ఉత్తరం నన్ను సర్వ నాశనం చేసేదికదా! అయ్యో! నాతండ్రి! ఈ ప్రపంచంలో నా సుఖానికి నిత్యం కంటకప్రాయంగానే ఉంటారా? మీ గతజీవితం నన్ను వృద్ధిలోకి రానీకుండా అణిచివెయ్యవలసిందేనా? ఇంకెంత కాలం నేనిల్లా బాధపడాలి?"

ఇంతలో విల్ ఫర్ట్ కి ఒక యోచన తట్టింది. వెంటనే అతని ముఖం కాంతివంతమయింది. "ఆ! అదీ. సరిగ్గా కుదిరింది. ఏమో! ఎవరు చెప్పగలరు? నన్ను సర్వనాశనం చెయ్యవలసిన ఈ ఉత్తరమే నాకు అదృష్టాన్ని తెచ్చి పెట్ట కూడదా? ఆ. ఇప్పు డుంది నేను చెయ్యవలసినపని." అంటూ కుర్చీలోనుంచి లేచాడు. ఖైదీ ఇంక గదలో లేడుకదా అని అటూ ఇటూ చూశాడు. లేడని నమ్మకం కుదిరిన తరవాత, విందు జరుగు తున్న భవనానికి బయలుదేరాడు.

# 8

డాంటీ వరండాలోకి రాగానే పోలీసు అధికారి ఇద్దరు సాయుధులైన సైనికులకు సంజ్ఞ చేశాడు. సైనికు లిద్దరూ డాంటీని న్యాయస్థాన ప్రాంగణంలో ఉన్న బందిఖానాకు నడిపించుకు వెళ్లారు.

డాంటీని నిర్బంధించిన గది ఒక మోస్తరు బాగానే ఉంది. గదిని చూడగానే డాంటీ ఆందోళన కొంత తగ్గింది. అతనికి విల్ ఫర్ట్ ఆదరణపూర్వకమైన మాటలు జ్ఞప్తికి రాసాగినాయి. ఆమాటలు తనకి మధురమైన ఆశాసందేశాన్నిస్తున్నాయి. నాలుగుగంటల సమ యానికి డాంటీ ఆ గదిలో నిర్బంధితుడైనాడు.

మార్చి నెల ప్రారంభమౌతున్నది. త్వరగానే చీకటి పడింది. చీకటిలో చూపు అవసరం తగ్గడంతోనే, ఆలకించేశక్తి అధిక మయింది. ఏ చిన్న అలికిడైనా తనని విడుదలచెయ్యడానికే ఎవరో వస్తున్నారని భావించి, లేచి ద్వారంవద్దకు వెళ్లేవాడు. కాని సవ్వడి క్రమంగా మరొక దిశకు అంతరించగానే, తిరిగి తన స్థానంలో కూలబడేవాడు. చిట్టచివరికి రాత్రి పదిగంటల వేళకు, అతని ఆశలన్నీ అంతరిస్తున్న సమయానికి, తలుపుతాళం చప్పుడయింది. ఎవరో తలుపు తీస్తున్నారు. కవాటం కరకర శబ్దంతో తెరుచుకుంది. రెండు కాగడాలు ఆకస్మి కంగా గదిని వెలుగుతో నింపేశాయి. కత్తులు, తుపాకులు

ధరించిన నలుగురు సైనికులు వెలుగులో కనిపించారు. డాంటే రెండడుగులు ముందుకు వేశాడు. కాని సిపాయిలు నలుగుర్ని చూడగానే నిశ్చేష్టుడై నిలబడిపోయాడు. తడబడుతున్న మాటలతో "న్యాయాధికారి విల్ ఫర్ట్ ఆజ్ఞప్రకారం నన్ను తీసుకు వెళ్లడానికి వచ్చారా ?" అని ప్రశ్నించాడు.

"అవును"

"నేను సిద్ధమే. నడవండి."

విల్ ఫర్ట్ ఆజ్ఞవల్ల వాళ్లు వచ్చారని తెలియగానే, ఆ నిర్భాగ్యుని మనస్సులో శంకాభయాలు తొలగిపోయినాయి. సైనికులమధ్యగా నడిచాడు. రోడ్డుపైన ఒక బండినిలిచివుంది. పక్కన ఒక పోలీసు ఆఫీసరున్నాడు.

డాంటే ఇంకా ప్రశ్నలడిగేవాడే. కాని మరుక్షణంలోనే బండితలుపు తెరుచుకుంది. డాంటే బండెక్కి ఇద్దరు సైనికులమధ్య కూర్చున్నాడు. మిగతా ఇద్దరు సైనికులు అతని కెదురుగా కూర్చున్నారు. వెంటనే బండి బయలుదేరింది. ఖైదీ కిటికీల వంక చూశాడు. కిటికీ లలుపులు మూసివున్నాయి. అయినా బండి కేసరి వీధిదాటి, సెంట్ లారెంట్, తరామిస్ వీధులగుండా సముద్రతీరానికి వడుతున్నదని డాంటే గ్రహించాడు.

బండి ఆగడంతోనే డజనుమంది సైనికులు చుట్టూచేరారు. తీరంపై దీపాల వెలుగులో సైనికుల తుపాకులు డాంటేకి స్పష్టంగా కనిపించాయి.

"నా ఒక్కడికోసం ఇంత సైనికబలగం పహరా ?" అని తనలో తాను ప్రశ్నించుకున్నాడు.

ఈ ప్రశ్నకు వెంటనే సమాధానం లభించింది. పోలీసు ఆఫీసరు తలుపు తెరవగానే సైనికులు వరుసలు తీర్చి నిలబడ్డారు. బండివద్దనుంచి తీరానికి దారిమాత్రం ఉంచారు. ఎదురుగా కూర్చున్న సైనికు లిద్దరూ ముందు దిగారు. తరవాత ఖైదీ దిగాడు. తరవాత ప్రక్కన కూర్చున్న సైనికులిద్దరూ దిగారు. నలుగురూ కలిసి ఖైదీని తీరానికి కట్టి ఉన్న ఒక చిన్న బోటువద్దకు నడిపించుకు

వెళ్లారు. డాంటే బోటెక్కి కూర్చున్నాడు. అతనిచుట్టూ సైనికులు నలుగురూ కూర్చున్నారు. పోలీసు ఆఫీసరు ముందుకూర్చున్నాడు. బోటువిడిచి పెట్టారు. ఒక్కసారి గట్టిగా కుదించి, బోటు పిలక్ దిశగా బయలుదేరింది. తెడ్లువేస్తున్నవారిలో ఒకడు కేకవెయ్యడంతో, రేవు అంచునున్న ఇనపగొలుసు అడ్డంతియ్యబడింది. బోటు రేవు దాటింది. సముద్రవాయువుల మధ్యకు రాగానే ఖైదీ మొదట సుఖానుభవం పొందాడు. స్వేచ్ఛావాయువును గట్టిగా పీల్చి విడిచాడు. మరుక్షణంలోనే దీర్ఘనిశ్వాసం వెలువడింది. ఆనాడుదయమే తాను ఆనందపరవశంలో గడిపిన రిజర్వ్ ప్రాంతం అంత దూరాన కనిపించింది.

బోటు ఇంకా నడుస్తూనే ఉంది. తనకు తెలిసిన తీరప్రాంతమంతా గడిచిపోగానే, తననెక్కడకు తీసుకుపోతున్నారో డాంటేకి అర్థంకాలేదు. "నన్నింకెక్కడికి తీసుకువెడుతున్నారు?" అని ఒక సైనికుని ప్రశ్నించాడు.

"నీకు చెప్ప కూడదని ఆజ్ఞ"

డాంటేకూడా కొంతసైనిక వృత్తి నెరిగినవాడే. అందువల్ల ఇంక వాళ్ళ నడగడం వ్యర్థమని తెలిసిపోయింది. అతనికి చిత్రవిచిత్రమైన ఆలోచనలు పొడగట్టినాయి. తీరంపైన దూరంగా ఒకచోట దించి విడిచిపెట్టేసినట్లు చేస్తారని ఒకసారి భావించాడు. తన చేతులకు జోడీలు తగిలించకపోడం మంచికేనని తోచింది. నయర్ టైర్ పేరు ఉచ్చరించనంత వరకూ తనకే భయం లేదని విల్ ఫర్ట్ తనకి చెప్పలేదా? తన నేరాన్ని నిరూపించే ఏకైక ఆధారమైన ఆ ఉత్తరాన్ని తాను చూస్తుండగానే నిప్పులో కాల్చివేశాడు కదా?

అందువల్ల మౌనంగా ఓపికగా నిరీక్షిస్తూ, అగాధ నిశీధిని కన్నులు పొడుచుకుచూస్తూ కూర్చున్నాడు. దీపస్తంభందాటింది. కాటలన్ ప్రాంత తీరందాటిపోయింది. మరింతకళ్లు పొడుచుకుని చూడ్డంప్రారంభించాడు. అదే మర్సిడా నివసించేప్రదేశం. అనుక్షణమూ ఆ చీకటి ఒడ్డుపై నిలబడిన ఒక యువతి అస్పష్టరూపం నీడగా కనిపిస్తున్నట్లు అతనికి మనోగోచరమయింది.

కాటలన్స్ నివాసప్రాంతంలో ఒక చోట ఒక దీపం వెలుగు తున్నట్లు కనిపించింది. సరిగ్గా ఆ ఉనికి పరిశీలించి, అది తన ప్రియురాలి నివాస గృహ మేనని డాంటీ నిర్ధారణచేసుకున్నాడు. ఆ సమయంలో మర్సిడా ఒక్కతే మేలుకొని చూస్తున్నది కాబోలు. బిగ్గరగా అరిచినట్లయితే ఆమెకు వినిపించవచ్చును. కాని అంతలోనే అతన్ని బిడియం ఆవహించింది. ప్రక్కనున్న ఈ సైనికు లేమనుకుంటారు, తన పిచ్చి కేకలువిని? మర్సి డాను తలుచుకుంటూనే, దూరాన ఆదీపంపైనే దృష్టి నిలిపి, మౌనంగా కూర్చుండి పోయాడు.

హఠాత్తుగా దీపం మాయ మయింది. ఎత్తైన ఒక మిట్ట అడ్డు వచ్చింది. డాంటీ ప్రక్కకు తిరిగి చూశాడు. బోటు సముద్ర మధ్యంలో ఉంది. ప్రశ్నించడాని కెంత జంకుతున్నా, చివరికి గుండె దిటవు చేసుకుని ఒక సైనికుని చేతులు పట్టుకుని ప్రశ్నిం చాడు. "నన్ను కరుణించండి బాబూ! నాకు చెప్పండి. నేను కెప్టెన్ని. ఏ ద్రోహానికి నన్ను నిందిస్తున్నారో నాకు తెలియదు. కాని నేను విధే యుడనైన ఫ్రెంచివారుణ్ని. నన్నెక్కడికి తీసుకుపోతు న్నారో చెప్పండి. నా కర్మనికి తలొగ్గి అనుభవిస్తానని నావికు డుగా ప్రమాణం చేస్తున్నాను. నోరువిప్పి చెప్పండి"

సైనికుడు బుర్ర గోక్కున్నాడు. ప్రక్కవాని వంక చూశాడు. వాడు భుజంఎగర వేసి ఊరుకున్నాడు. తరవాత డాంటీ వంక చూసి అన్నాడు: "నువ్వు నావికుడవ్. మార్సెల్స్ నివాసివి. ఎక్కడికి వెడుతున్నావో నన్నడుగుతున్నావా?"

"నాకు నిజంగా తెలియదు. ప్రమాణం చేస్తున్నాను. దయుంచి చెప్పండి."

"మరి మా కిచ్చిన ఆజ్ఞ?"

"పదినిమిషాల్లో కాకపోతే అరగంటలోనో, గంటలోనో తెలియక తప్పదుకదా. అదేదో ఇప్పుడు చెప్పడానికి మీ ఆజ్ఞలెలా అడ్డువస్తాయి? నాకీ దుర్భర వేదన తొలగించినట్లవుతుంది. మిమ్మల్ని తప్పించుకుని పారిపోవాలనే ఉద్దేశం నాకు లేదు. అది అసాధ్యమని నాకు తెలుసును. ఎక్కడికి వెడుతున్నాం?"

" నీ చుట్టూ చూడు తెలుస్తుంది. "

డాంటీ లేచి బోటు పోతున్న దిక్కుగా చూశాడు. కను చూపు మేరలో నల్లని గుట్ట, దానిపైన భయంకరంగా నిలిచి చూస్తున్న ఇఫ్ కోట ఛాయ కనిపించాయి. అనేక శతాబ్దాలుగా మార్సెల్స్ వాసులకు భీతికారణమైన ఈ శిలానిర్మిత కారాగారం కనిపించగానే, డాంటీకి హఠాత్తుగా ఉరిస్తంభం సాక్షాత్కరించినట్లయింది.

"అమ్మయ్యో! అది ఇఫ్ కోట. నన్నక్కడ బందీగా చేయడానికి తీసుకువెడుతున్నారా నిజంగా ? ఇఫ్ కోట పెద్దపెద్ద రాజకీయ నేరస్థుల్ని బంధించడానికి ప్రభుత్వం ఏర్పాటుచేసిన కారాగారం. నేనే నేరం చెయ్యలేదే! అక్కడకూడా మేజస్ట్రేట్లూ, జడ్జీలూ ఉన్నారా?"

" అక్కడొక్క గవర్నరుమాత్రం ఉన్నాడనుకుంటాను " అన్నాడొక సైనికుడు. " కాపలాకి ఒక సైనికదళం, జైలర్లు ఉంటారు. రాతిగోడలుంటాయి. ఇంక మరి ఊరుకో. ఆశ్చర్యపడుతున్నట్లు నటించకు. నేను మెత్తగా ఉన్నందుకు నన్ను హేళన చేస్తున్నావనుకోవలసి వస్తుంది. "

" నాకేమీ చెప్పకుండా, ఏ నియమాల్నీ పాటించకుండానే నన్ను ఇఫ్ కోటలో బంధించటానికి తీసుకుపోతున్నారంటారా ?"

" నియమాలన్నిటినీ పాటించారు. "

" అయితే విల్ ఫర్ట్ వాగ్దానం చేసికూడా...''

" విల్ ఫర్ట్ ఏం వాగ్దానం చేశాడో మాకు తెలియదు. మనం ఇఫ్ కోటకి వెడుతున్నామని మాత్రమే తెలుసును. ఏయ్! ఏమిటది ? ఏం చేస్తున్నావు? పట్టుకోండి, పట్టుకోండి. "

డాంటీ మెరుపులా సముద్రంలోకి దూకబోయినాడు. కాని అనుభవమున్న ఆఫీసరు ముందే కనిపెట్టేశాడు. బలిష్ఠమైన నాలుగు చేతులు అతన్ని పట్టుకుని నిలిపాయి. క్రోధఘూర్ణిత స్వరంతో డాంటీ బోటులోపడ్డాడు.

డాంటేని ఛాతీపైన మోకాటితో నొక్కిపెట్టి సైనికు డన్నాడు. "నావికుడుగా ప్రమాణంచేసి నువ్వుచేసేపని ఇదేకదూ? సరే. ఇంక కదులుమాస్తాను; తుపాకిగుళ్లతో నీతల చిల్లులుపడి పోతుంది. నేను నా మొదటి ఆజ్ఞనుల్లంఘించాను. కాని రెండో ఆజ్ఞనుల్లంఘించనుసుమా!" సైనికుడు తుపాకిమొన డాంటే కణతకు ఆన్చి ఉంచాడు. మళ్లీ తెగించిలేచి, తుపాకి దెబ్బకు ప్రాణాలువొదిలి, ఈ దుర్దశనుంచి విముక్తిపొందాలని బందీ ఒక సారి తలపోశాడు. కాని అనుకోకుండా అకస్మాత్తుగా సంభవిం చిన ఈ దుర్దశ, అంత అకస్మాత్తుగానే తొలగిపోతుందని మరు క్షణంలోఅనుకున్నాడు. విల్ ఫర్ వాగ్దానం తిరిగి తిరిగిజ్ఞప్తికిరానా రంభించింది. క్రోధంతో చేతులుగట్టిగా నులుముకుంటూ, ఘూర్ణిస్తూ బోటు అడుగునే ఉండిపోయాడు. కొద్దిసేపట్లో నే బోటు దేనికో తగిలి గట్టిగా కుదిపి వేసింది.

ఒకసైనికుడు గట్టుపైకి ఉరికాడు. కప్పీనుంచి తాడు సాగింది. బోటుని ఒడ్డుకి కట్టుతున్నారని డాంటే గ్రహించాడు. రక్షకులు అతన్ని రెక్కలుపట్టి లేవదీసి ఒడ్డుకెక్కించారు. కొన్ని మెట్లుపైకి అతన్ని ఈడ్చారు. పోలీసు ఆఫీసరు తుపాకి గురిపెట్టి వెనుకనే వచ్చాడు. డాంటే మళ్లీ ఎట్టివృథా ప్రయత్నం చెయ్యలేదు. గట్టుపైన మరికొంతమంది సైనికులు చీకట్లో అస్పష్టంగా కనిపించారు; మెట్లెక్కి ఒక ద్వారందాటాడు. ద్వారంతలుపులు వెనుకనే మూసుకున్నాయి. అంతా అస్పష్టంగా ఉంది. ఒక్క క్షణం నిలవవలసి వచ్చింది. ఆ క్షణంలో, పాదరసంవలె పరుగులు తీస్తున్న పలువిధయోచనల్ని కూర్చుకోడానికి ప్రయత్నించాడు. చుట్టూచూశాడు. నాలుగువైపులా ఎత్తైనగోడలమధ్య ఒక ఆవర ణలో ఉన్నాడు. రక్షకుల లయాన్విత పదధ్వనులువినవస్తున్నాయి. గోడలప్రక్కనున్న దీపాల గుడ్డివెలుగులో వారిచేతులలోని తుపా కులకత్తులు మెరుస్తున్నాయి. ఇంకపారిపోలేడని నమ్మకంకలిగి, సైని కులు డాంటేని విడిచిపెట్టి, ఆజ్ఞలకోసం నిరీక్షించారు.

కొంతసేపటికి ఒక కంఠం వినవచ్చింది:

"ఖైదీ ఎక్కడ?"

"ఇక్కడ" అని ఒక సైనికుడు సమాధాన మిచ్చాడు.

"నా వెంట గదిలోకి పంపండి."

ఖైదీ అతనివెంట నడిచాడు. భూగర్భంలో ఒక గదిలోకి నడిచాడు. కళ్లకు తెరగట్టి నలుపైపులా నిలిచిన గోడలు కన్నీరోడ్చుతున్నట్లున్నాయి. కరిగిన కొవ్వులో ఈదులాడుతున్న ఒక వొత్తి, తను చూరిన ఈ భయంకర రావాసానికి కొద్ది వెలుగునిస్తోంది. ఆవెలుగులో డాంటే తనను నడిపించుకువచ్చిన జైలర్‌ను చూశాడు. జీర్ణవస్త్రాలు ధరించిన నీచజాతివాడు; డాంటే వంకచిటపట చూశాడు.

"ఈ రాత్రికి ఇదే నీగది. ఇప్పుడు చాలా రాత్రయింది. గవర్నర్ నిద్రపోతున్నారు. రేపు నిన్ను బహుశా వేరే గదికి పంపుతారు. ఇదిగో. ఈ ఫ్లాటుకే రొట్టెతిను. ఆ కూజాలో నీళ్లున్నాయి. ఆమూల గడ్డిపరిచివుంది. ఇక్కడ ఖైదీలకిదే పడక. పోయి పడుకో" అన్నాడు.

డాంటే జవాబుకి నోరు తెరిచే లోపలే, జైలర్ దీపాన్ని తీసుకుని గదితలుపులు బిగించాడు. నిలువుగోడల్ని కనపరుస్తున్న ఆ దీపపు వెలుగుకూడా పోయింది.

ఆ ఘోర నిశ్శబ్దంలో, గాఢాంధకారంలో ఒంటరిగా ఉండిపోయాడు డాంటే. కుతకుతలాడుతున్న నుదుటిని తీక్ష్ణమైన చలిచీల్చుతున్నది. తెల్లవారుతున్న సమయానికిగుడ్డివెలుగు ఆఒంటరి నివాసం ప్రవేశించింది. ఆ గదిలోనే బందీగా ఉండాలని చెప్పడానికి జైలర్ మళ్లీవచ్చాడు. డాంటే మొదట ఎక్కడ నిలబడ్డాడో అక్కడే, అలాగే శిలా ప్రతిమవలె నేలనంటి నిలబడిపోయిఉన్నాడు. రాత్రంతా ఏడ్చినందువల్ల కన్నులు వాచిఉన్నాయి. ఒక్కక్షణమైనా నిద్రపోలేదు. జైలర్ సమీపించినా డాంటే కనిపెట్టలేదు.

"నిద్రపోలేదా?"

"నాకు తెలియదు." అన్నాడు డాంటే.

"నీకు ఆకలి వెయ్యడంలేదా?"

"నాకు తెలియదు."

"నీకేమైనా కావాలా ?"

"గవర్నర్ని చూడాలి."

జైలర్ భుజాలెగరవేసి వెళ్ళిపోయాడు.

వెడుతున్న జైలర్ని డాంటే చూపు లనుసరించాయి. సగం తెరిచివున్న తలుపులవంక చేతులు చాచాడు. కాని మెల్లిగా తలుపులు మూసుకున్నాయి. అతని హృదయాన్ని చీల్చుకుని రోదన వెలువడింది. నేలపై బోర్లపడి దీనంగా ఆక్రందన చేశాడు. ఈ చిన్న వయస్సులో, తానే నేరం చేశాడని ఇంత కఠోర శిక్షకు గురైనాడు? ఆ రోజంతా గడిచింది. కొద్దిగా నీరు తాగాడు. రొట్టి ముక్క కొద్దిగా కొరికాడు. ఒక్కొక్కసారి దీర్ఘాలోచనా నిమగ్నుడై కూర్చుని ఉండేవాడు. మరొకసారి లేచి, బోనులో పులి మాదిరిగా అటూ ఇటూ తిరిగేవాడు. దారిలోనే, బోటులోనుంచి దుమికి పారిపోలేదే అని పరితపించాడు. పారిపోయి తీరం చేరి, ఏ ఓడలోనో ఏ చిన్న బోటులోనో ఇటలీ దేశమో, స్పెయిన్ దేశమో పారిపోవలసింది. అక్కడనుంచి మర్సీకాకు ఉత్తరం వ్రాస్తే, ఆమె తనవద్దకు చేరేది. ఇద్దరూ తన తండ్రితో సహా సుఖంగా జీవించవలసింది. కాని ఇప్పుడీ ఇఫ్ కోటలో బందీయైనాడు. మర్సీదా ఎలావుందో, తన తండ్రి ఏమైనాడో ఇప్పుడు తనకు తెలియదు. ఇదంతా విల్‌ఫర్ట్ మాటల్ని నమ్మినందువల్లకదా సంభవించింది? ఈ యోచన అతన్ని ఉన్మత్తుని చేసింది. వేదనతో గడ్డిపడకపై అటూ ఇటూ దొర్లాడు.

మరునాడు సరిగ్గా అదే సమయానికి జైలర్ వచ్చాడు.

"ఇప్పటికైనా స్థిమితపడ్డావా? నామాట విను. నేను చెయ్యగలిగింది ఏదైనా నీకు కావలిస్తే చెప్పు."

"నేను గవర్నరుతో మాట్లాడాలి."

"ఏమిటి ?" అన్నాడు జైలర్ విసుగుతో. "అది అసాధ్యమని నిన్న చెప్పలేదూ ? అటువంటిది ఖైదీ అడక్కూడదని ఇక్కడ నియమం."

"మరిక్కడేం అడగనిస్తారు ?"

"ఇంకా మంచి ఆహారం అడుగు—డబ్బు చెల్లించి. షికారు వెళ్లడానికి అడగవచ్చు. పుస్తకాలు అడగవచ్చు."

"నాకు పుస్తకాలక్కర్లేదు. షికారు వెళ్లనక్కర్లేదు. ఇస్తున్న ఆహారం ఫరవాలేదు. నా కొక్కటే కావాలి. గవర్నర్ని చూడాలి."

"మళ్ళీ మళ్ళీ అదే అడిగావంటే, ఇంక నీకు ఆహారంకూడా తీసుకురాను. తెలుసా?"

"అంతే కదా! అన్నం తీసుకురాకపోతే ఆకలితో చస్తాను. అంతేనా!"

చచ్చిపోడానికి సంతోషంతో సిద్ధపడతాడని ఈమాటల్లో స్పష్టపడుతూనే ఉంది. ప్రతిఖైదీవల్లా జైలర్కి రోజూ పది నికెల్ డబ్బులు గిట్టుతున్నాయి. ఈ ఖైదీ చచ్చిపోతే తనకెంత నష్టమో జైలర్ గ్రహించాడు. అందువల్ల మెత్తనిమాటల్తో ఇలా చెప్పాడు. "చూడు, నామాట విను. నువ్వడుగుతున్నది లభించేది కాదు. ఖైదుకొచ్చి ఖైదీల్ని గవర్నర్ చూడ్డమనేది కనీవినీ ఎరగనిమాట. నువ్వు సవ్యంగా ప్రవర్తించావంటే, నిన్ను ఆవరణలో నడవనిస్తారు. ఎప్పుడో ఒకరోజుని నువ్వల్లా తిరుగుతున్నప్పుడు, గవర్నరు ఆ దారిని రావచ్చును. అప్పుడు నువ్వాయన్ని అడగవచ్చును. మంచిదని తోస్తే ఆయన జవాబిస్తారు"

"ఈ అవకాశంకోసం నే నెంతకాలం వేచిఉండాలి?"

"ఓ! ఒకమాసం, మూడుమాసాలు, ఆరుమాసాలు, లేదా సంవత్సరం కూడాపట్టవచ్చు"

"అంతకాలమే! అల్లాకాదు. నేనువెంటనే చూడాలి."

"ఇదిగో. ఇటువంటి కోరిక నిత్యం మనస్సులో పెట్టుకుని కూచున్నావంటే, పదిహేను రోజుల్లోనీకు పిచ్చెత్తిపోతుంది. పిచ్చిసరిగ్గా ఇల్లానే వస్తుంది. ఇక్కడొకడికి ఇల్లావచ్చింది కూడా. ఈ గదిలోనే ఉండేవాడు ఒకఫాదరీ. తన్ని విడుదలచేస్తే పది లక్షల ఫ్రాంకులిస్తానని గవర్నరుకి ఎప్పుడూ ఇవ్వచూపుతాడు. అతనికి పిచ్చెత్తింది. ఇప్పుడొక కూపంలోపడేశారతన్ని."

"ఇదిగో చెప్తున్నాను విను!" అన్నాడు డాంటే. "నేను ఫాదరీని కాను. నాకు పిచ్చేమీ లేదు. ఎప్పుడైనా పిచ్చెక్కుతుందేమో చెప్పలేను. కాని నా దౌర్భాగ్యవశాత్తూ నా మనస్సు నా అధీనంలోనే ఉంది! నీకో మాట చెప్తాను. నీకు పది లక్షల ఫ్రాంకులు నేనేమీ ఇవ్వలేను; నా దగ్గరేం లేదు కాబట్టి. నూరు ఫ్రాంకులు మాత్రం ఇవ్వగలను; నాకొక ఉపకారం చేసిపెడితే. నువ్వీ మాటు మార్సెల్స్ వెళ్ళినప్పుడు కాటలన్స్ నివాసానికి వెళ్ళు. మర్సిడా అనే అమ్మాయికి ఒక ఉత్తరం ఇయ్యి. అదేమంత పెద్ద ఉత్తరం కాదు. లెక్కకి రెండు వాక్యాలు. అంతే."

"ఇది కాస్తా బైట పడితే, ఏడాదికి వెయ్యి ఫ్రాంకుల ఉద్యోగం ఊడిపోతుంది. వెయ్యి ఫ్రాంకులూ కాక, పైన నాకు ఆహారం పెడతారు. ఇంకా లాభా లున్నాయి. అంటే మూడు వందల ఫ్రాంకుల కోసం వెయ్యి ఫ్రాంకుల ఉద్యోగం వొదులు కోడం ఏమంత తెలివంటావు? నువ్వే చూడు."

"సరే అయితే. కాని ఇదిమాత్రం మరిచిపోకు. రెండు వాక్యాల చీటిని నువ్వు మర్సిడాకివ్వకపోయినా, కనీసం నేనిక్కడున్నట్టు ఆమెకి సమాచారమైనా తెలపకపోయినా, ఏదో ఒక రోజు నీపని పట్టేమాట నిజం. తలుపుచాటున దాక్కుని ఈ కర్రపీటతో నీతల పగల కొడతాను."

జైలర్ చేతు లడ్డు పెట్టుకుని, రెండడుగులు వెనక్కి వేసి, "ఓహో! నన్ను బెదిరిస్తున్నావా?" అన్నాడు. "అయితే నిజంగా నీకు మతిస్థిరం తప్పిందన్నమాటే. మూడు రోజుల్లో మరీ పిచ్చెత్తిపోయి, గొలుసుల్తో కట్టివెయ్యవలసి వస్తుందన్నమాటే! ఫరవాలేదులే. ఇఫ్ కోటలో ఇంకా కూపాలున్నాయి."

డాంటే కర్రపీట పైకెత్తి పట్టుకున్నాడు.

"అలాగే అలాగే. నువ్వంత కోరుకుంటున్నావు కాబట్టి గవర్నర్‌తో చెప్తాలే నీ సంగతి" అన్నాడు జైలర్.

"చెప్పుకో. మరీ మంచిదీ" అన్నాడు డాంటే. ముక్కాలిపీట కిందపెట్టి దానిపైన కూచున్నాడు. తల వాలిపోయింది. మతి తప్పినవాని మాదిరిగా కళ్లు భీకరంగా ఉన్నాయి.

జైలర్ వెళ్ళిందే తడువు నలుగురు సిపాయిలతో తిరిగి వచ్చాడు.

"వీణ్ని కూపంలో పడేయ్యాలని గవర్నర్ ఆజ్ఞ. పిచ్చి వాళ్లని పిచ్చివాళ్లతోనే చేర్చాలి" అన్నాడు.

సిపాయిలు డాంటేని గట్టిగా పట్టుకున్నారు. డాంటే పెనుగులాడలేదు. అతన్ని ఒక అంధకార కూపంవద్దకు తీసుకు వెళ్లారు. డాంటేకూపంలో ప్రవేశించాడు. "వాడు చెప్పింది నిజమే. పిచ్చి వాళ్లని పిచ్చివాళ్లతోనే చేర్చాలి." అని గొణుక్కున్నాడు తనలో.. తెలుపుగూసుకుంది. డాంటే తనముందు పతుకులాడ్డం మొదలుపెట్టాడు. చేతికిగోడ తగలింది. అక్కడాగి, మూల నిశ్చలంగా కూర్చున్నాడు.

జైలర్ చెప్పింది నిజం. డాంటే ఉన్మత్తుడవడానికింక ఆట్టే సేపు పట్టదు.

# 9

డాంటేని పరీక్షించిన తరవాత విల్ఫర్ట్ విందు జరుగుతున్న భవనానికి తిరిగి వెళ్లాడు. ఆత్రంతో నిరీక్షిస్తున్న అతిథులు అతడు రాగానే ప్రశ్నల వర్షం కురిపించారు.

"ఏమయిందోయ్, విల్ఫర్ట్? ప్రభుత్వ సంరక్షకుడవ్. తలలు తయించగల వాడివ్. ఏంచేశావ్? ఇంకొకసారి భయంకర పరిపాలన మనకోసం కనిపెట్టుకుని ఉందా? లేక కార్సికన్ రాక్షసి (నెపోలియన్) బోనులోనుంచి బైట పడిందా? ఏమిటి విశేషం?"

విల్ఫర్ట్ ఎవరికీ సమాధాన మివ్వకుండా, తన కాబోయే అత్తగారిని సమీపించి "అమ్మా! నన్ను క్షమించాలి. నేను వెంటనే వెళ్ళిపోవలసిన అవసరం వచ్చింది." అంటూ,మార్క్విస్ వంక తిరిగి "మీతో ఒకమాట చెప్పాలి. ఇటు వస్తారా?" అన్నాడు.

"ఏం? అంత ప్రమాదమైన విషయమా?" అన్నాడు మార్క్విస్.

"అవును. చాలా ప్రమాదమైనది. నేను కొన్ని రోజుల పాటు ఒకచోటికి వెళ్లాలి."

రినీ ఆవేగంతో "ఏమిటి? వెళ్ళిపోతున్నావా?" అంది.

"ఏం చెయ్యను రినీ? చాలా అవసరం" అన్నాడు విల్ ఫర్ట్.

"ఎక్కడికి?" అని అడిగింది మార్క్వెస్ భార్య.

"అది రాజరికానికి సంబంధించిన రహస్యం. ఎవరికైనా పారిస్‌లో కబురందించవలసిన పని ఉంటే చెప్పండి. ఇవాళ సాయంకాలం నా మిత్రుడొకడు పారిస్ వెడుతున్నాడు."

"నాతో మాట్లాడాలన్నావు?" అన్నాడు మార్క్వెస్.

ఇద్దరూ కలిసి మరొక గదిలోకి వెళ్లారు. అక్కడ కుర్చీలో కూర్చున్నాక మార్క్వెస్ అన్నాడు: "ఏమిటి సంగతి?"

"కొన్ని విశేష సంఘటనలు జరిగినందువల్ల నేను వెంటనే బయలుదేరి పారిస్ వెళ్ళవలసిన అవసరం వచ్చింది. అడగరానిది అడుగుతున్నా ననుకోకుండా ఉంటే, చెప్పండి; మీకు సర్కారు వాటాల్లో ధన మేమైనా ఉందా?"

"నా కున్న ఆరేడు లక్షల ఫ్రాంకులూ సర్కారునిధిలోనే ఉంది."

"అయితే వెంటనే మీ వాటాలు అమ్మెయ్యండి. లేదా సర్వనాశనం తప్పదు. అమ్మెయ్యాలని చెప్తూ వెంటనే మీ బ్రోకర్ కి ఉత్తరం వ్రాసి నాచేతి కివ్వండి. అసలు నేను అక్కడికి చేరేసరికే ఆలస్యమై అంతా అఖరౌతుందేమో చెప్పలేను."

"ఆరి దేవుడా!" అన్నాడు మార్క్వెస్ "మరైతే ఒక్క క్షణం జాప్యంవద్దు."

మార్క్వెస్ గబగబా బ్రోకర్ కి ఉత్తరం వ్రాసి ఇచ్చాడు.

"ఈ ఉత్తరం సరే, మహారాజుకి ఒక ఉత్తరం కావాలి."

"అదెల్లాగ? నేను మహారాజుకి స్వయంగా ఉత్తరం వ్రాయలేనే!"

"అది కాదు, మహారాజుని నేను వెంటనే దర్శించాలి. ఆటంకాలేవీ రాకూడదు. అటువంటి ఏర్పాటుకోసం కౌంట్ సాల్వోని ఉత్తరం వ్రాసిఇమ్మని మీరు చెప్పండి. నేను ఎంత త్వరలో ట్యిలరీ (మహారాజు నివాసం) చేరితే నా కంత మంచి

భవిష్యత్తుంటుంది. మహారాజు ఎన్నడూ మరువలేని సహాయం చేసిన వాడి నౌతాను."

"అలాగయితే నువ్వు త్వరగా సామాను సర్దుకో. సాల్వోని పిలిచి ఈ లోగా ఉత్తరం వ్రాయిస్తాను."

"నేను వెళ్ళిపోతున్నట్లు అత్తగారికీ, రినీకీ చెప్పలేక పోయాను. క్షమించమని చెప్పండి."

"నువ్వు చెప్పే వెళ్ళు"

"అయితే సరే. సాల్వో ఉత్తరం పంపుతారుగా?"

మార్క్వెస్ పరిచారకుని పిలిచి,సాల్వోకు కబురు పంపాడు. "ఇంక నువ్వు వెళ్ళు" అన్నాడు.

విల్‌ఫర్ట్ బయలుదేరాడు. వీధి ప్రవేశించగానే వేగం తగ్గించేశాడు. న్యాయశాసనాధికారి పరుగుతియ్యడం చూస్తే వీధిలో జనం అన్యథా భావించగలరు. అందువల్ల తన అధికారానికి తగిన ఠీవితో మెల్లిగా నడిచాడు.

స్వగృహం సమీపించగానే ద్వారంవద్ద తెల్లని నీడ ఒకటి కనిపించింది. అక్కడ నిరీక్షిస్తున్నది మర్సిడా. ప్రియుని అరెస్టుకి హేతువు తెలుసుకోవాలనే ఆశతో, విల్‌ఫర్ట్‌కోసం రాత్రి చీకటిలో వచ్చి అక్కడ వేచిఉంది. పేరు చెప్పకముందే ఆమె ఎవరో విల్‌ఫర్ట్ గ్రహించాడు. ఆమె సౌందర్యం, నిశ్చలభావం చూసి చకితుడైనాడు. ఆమె ప్రశ్నించినప్పుడు తాను నేరస్థుడైనట్లు, ఆమె న్యాయాధికారి అయినట్లు అనిపించిం దతనికి.

కరుకుగా జవా బిచ్చాడు: "నువ్వు ఎవర్ని గురించి అడుగుతున్నావో, అతను నేరస్థుడు. నేనే సహాయం చెయ్యలేను."

మర్సిదా కంఠంనుంచి సన్నని ఏడ్పు వెలువడింది. విల్‌ఫర్ట్ వెళ్ళిపోబోతుండగా చెయ్యి అడ్డుపెట్టి ఆపింది: "పోనివ్వండి, ఎక్కడున్నాడో చెప్పండి. అసలు బ్రతికిఉన్నాడో లేదో చెప్పండి."

"నాకు తెలియదు. అతనప్పుడే నా చేతులు దాటిపోయాడు."

ఆమె దీన వదనం, ఆర్తనాదం తన్ని లాంగదీస్తున్నాయని భయపడ్డాడు. ఆమెను తప్పించుకుని విల్‌ఫర్ట్‌లోనికి ప్రవేశించాడు. ద్వారం బంధించాడు. కాని చిత్తక్షోభను నివారించుకో

లేకపోయాడు. విషలిప్త శరాఘాతంవలె చిత్తక్షోభ మానని గాయం చేస్తున్నది. గది చేరగానే అతనికి సత్తువ పూర్తిగా ఉడిగిపోయినట్లయింది. పడకకుర్చీలో చేరి దీర్ఘనిశ్వాసం విడిచాడు. తన తండ్రి చేసిన తప్పిదానికిగాను తానే అమాయక యువకుని బలిచేస్తున్నాడో, అతని రూపం విల్‌ఫర్ట్‌కి మనోగోచర మయింది. వధువు ప్రక్క నిలబడినట్లున్న డాంటెరూపాన్ని విల్‌ఫర్ట్ తన మనోకాశం నుండి చెరిపివెయ్యలేకపోయినాడు. అది అతని హృదయాన్ని వేయి శూలాలతో పొడిచినట్లుంది. ఆమరణాంతం యాతన పెట్టగల గాయం అతని హృదయాన్ని పీడిస్తున్నది. క్షణకాలంపాటు అతని అంతరాత్మ అతన్ని వారించింది. అనేకమంది రాజకీయఖైదీల కతడు మరణశిక్ష విధింపచేశాడు. తన వక్తృత్వప్రభావంవల్ల వారు ఉరిపాల్పడినప్పుడు ఆవంతైనా చలించలేదు. వారు దోషులని తనకి తెలుసును. తెలియకపోయినా దోషులని తాను తృప్తిపడ్డాడు. కాని ప్రస్తుత పరిస్థితి వేరు. జీవితాశలన్నిటిలోకీ ఉత్కృష్టమైన దానిని పరితృప్తిపొందించుకోనబోతున్న యువకుని, ఏ దోషం ఎరగనివానిని, ఆజన్మాంతం అనుభవించడానికి కఠోర కారాగారవాసశిక్ష విధిస్తున్నాడు. అతని స్వేచ్ఛను, యావత్సౌఖ్యాన్నీ తన చేతులారా అంతమొందిస్తున్నాడు. ఈమారు తాను న్యాయనిర్ణయాధికారి కాడు. కేవలం శిక్షాశాసకుడు. ఈ యోచనతో ఏదో తెలియరాని భీతి కలిగి విల్‌ఫర్ట్ తల్లడిల్లిపోయాడు.

ఆ క్షణంలో రినీ వచ్చి కరుణ చూపాలని అతన్ని వేడుకున్నా, లేక అపురూపసుందరి అయిన మర్సిడా అతని సముఖానికి వచ్చినా, మెత్తబడి లొంగిపోయేవాడే. తనకే ముప్పు రానున్నప్పటికీ డాంటె విడుదలకు ఆజ్ఞ ఇచ్చేసేవాడే. కాని ఆ నిశ్శబ్ద నిశీధిలో అతనికే మధుర విజ్ఞప్తి వినరాలేదు. ఏ సుందరీ సాక్షాత్కరించలేదు. గుర్రాలబండి సిద్ధంగా ఉందని చెప్పడానికి పరిచారకుడుమాత్రం వచ్చాడు.

ఆత్మసంక్షోభాన్ని జయించినవానివలె విల్‌ఫర్ట్ లేచి నిలబడ్డాడు. మేజాపద్దకు వెళ్ళి సొరుగు తీసి బంగారునాణ్యాలు తీసి జేబులు నింపుకున్నాడు. గబగబా వెళ్ళి బండిలో కూర్చున్నాడు. సెంట్‌మిరాన్ గృహానికి బండి దారితీసింది. భాగ్యహీనుడైన డాంటే ప్రారబ్ధం మూడింది.

విల్‌ఫర్ట్ గృహం ప్రవేశించి స్త్రీలున్నచోటికి వెళ్లాడు. రినీ కనిపించగానే కంపించిపోయాడు. డాంటేని విడుదల చెయ్యాలని ఆమె అడుగుతుందని భయపడ్డాడు. కాని ఆమె కా ధ్యాసే లేదు. విల్‌ఫర్ట్ నిష్క్రమణగురించే ఆ అమాయిక చింతిస్తున్నది. అతన్ని ఆమె నిర్మలాంతఃకరణతో ప్రేమించింది. అతడు భర్త కానున్న ఘడియల్లో బయలుదేరి వెళ్ళిపోతున్నాడు. తన ప్రియుని ఈ సమయంలో తనవద్ద ఉంచకుండా పంపివెయ్యడానికి కారకుడైన వ్యక్తిపైన ఆమెకు కోపం వచ్చింది.

*　　　*　　　*　　　*

మర్సిడా విల్‌ఫర్ట్ గృహంనుంచి తన నివాసానికి కాళ్లీడ్చుకుంటూ నడిచి వెళ్ళింది. ఆమెకోసం అక్కడ ఫెర్నాండో వేచి ఉన్నాడు. నిరాశ, నిస్పృహ ఆమెను పెనగొన్నాయి. తన ఇల్లు ప్రవేశించి పట్టరాని దుఃఖంతో పడకపై వాలిపోయింది. హృదయభారం తీగెవరకు ఏడ్చింది. ఆమె ప్రక్కనే మోకాళ్లపై ఆని ఫెర్నాండో కూర్చున్నాడు. మాటిమాటికీ ఆమె చేయి ముద్దుపెట్టుకుని ఓదార్చుతున్నాడు. ఒంటిపై స్పృహలేక ఆమె అతని అనునయాన్ని సహించింది. అపార దుఃఖం ఆమె దృష్టినుంచి సర్వరూపాల్నీ చెరిపివేసింది. డాంటే స్వరూప మొక్కటే ఇప్పుడామెకు గోచరిస్తున్నది.

ఈ లోగా మారెల్ తన యత్నాలు మానలేదు. ఓటమి నంగీకరించలేదు. డాంటే నిర్బంధితుడైనాడని తెలుసుకున్నాడు. తనకు తెలిసిన మిత్రులందరి సహాయం తీసుకున్నాడు. నగరంలో పరపతి కలవారి నందరినీ కలుసుకున్నాడు.

ఇంతలో డాంటే బోనపార్టిస్ట్ ఏజంటైనందువల్ల అరెస్టు చేయబడినట్లు నగరమంతా తెలిసిపోయింది. నెపోలియన్ తిరిగి అధికారంలోకి రావడం కలలోని మాట అని అప్పుడు సర్వవ్యాప్తంగా ఉన్న అభిప్రాయం. అందువల్ల మారెల్ ఎక్కడికి వెళ్ళినా నిరసన ఎదురయింది. అందరూ సహాయం నిరాకరించారు. నిరాశతో ఓడయజమాని ఇల్లు చేరాడు.

కాడెరూస్‌కి కూడా మనశ్శాంతి లేదు. రెండు సీసాలు ద్రాక్షసారాయం ముందు పెట్టుకుని గదిలో తలుపులు బిగించి కూర్చున్నాడు. విచారాన్ని మద్యానికి మాటుబెట్టి దిగమింగాలని

ప్రయత్నించాడు. కాని ప్రస్తుత మనస్థితిలో రెండు సీసాలు చాలలేదు. అయితే, లేచివెళ్లి మరో రెండు సీసాలు తెచ్చుకునే స్థితిలో కూడా లేడు. అందువల్ల కాళ్లు విరిగిన కర్రకుర్చీలో కూర్చుని, క్రొవ్వొత్తి దీపం వ్యాపింపచేస్తున్న చంచలచ్ఛాయల్ని గమనిస్తూ ఉండిపోయాడు.

డాంగ్లర్ ఒక్కడే నిశ్చింతగా ఉండగలిగాడు. శత్రువుపై పగ సాధించి, అతని ఉన్నతోద్యోగాన్ని ఆక్రమించిన ఆనందం అతన్ని పరవశుని చేసింది. తన పడక చేరి ప్రశాంతంగా నిద్ర పోయాడు.

కౌంట్ సాల్వో ఉత్తరాన్ని తీసుకుని, రినీవద్ద సెలవు పుచ్చుకుని, విల్ ఫర్ట్ పారిస్ కు ప్రయాణమైనాడు.

# 10

పారిస్ లో, మహారాజు నివాసమైన ట్వీలరీలో ఒక చక్కని గది ఉంది. కిటికీలు పైభాగం అర్ధచంద్రాకారంలో నిర్మించబడి నాయి. నెపోలియన్, పద్దెనిమిదో లూయీ, ఆతరవాత లూయీ ఫిలిప్ ఈ గదిలోనే ఏకాంతంగా గడిపేవారు. గదిలో అందమైన ఒక మేజావద్ద మహారాజు పద్దెనిమిదో లూయీ కూర్చుని ఉన్నాడు. ఒకవంక తల పండిన ఒక వృద్ధుని మాటలకు ఊం కొడుతూ, మరొకవంక ఒక ఉద్గ్రంథం చదువుతూ, అప్పుడప్పుడు గ్రంథంలో ప్రక్క జాగాలో గిలుకుతున్నాడు మహారాజు. వృద్ధునికి ఏభై ఏళ్లుంటాయి. ఉన్నత వంశానికి చెందినవాడు.

"ఏమిటంటున్నారిప్పుడు?" అని ప్రశ్నించాడు మహారాజు.

"నేను పడుతున్న బాధ, ఆందోళన, ఇంతా అంతా కాదు ప్రభూ!"

"ఏమొచ్చింది బ్లాకా?"

"దక్షిణాదిని పెద్ద తుపాను చెలరేగుతున్నదని నాకు గట్టి అనుమానం, భయం కలుగుతున్నదండి"

"నా ఉద్దేశం ఏమిటంటే, మీకు తెలిసిన సమాచారం సరి కాదని. అసలు దక్షిణాదిని ఇప్పుడు వాతావరణం ఆహ్లాదకరంగా ఉంటుంది."

ఎంత విద్వాంసుడైనా, మహారాజుకి పరిహాసమంటే ఇష్టం.

"అయ్యా! పోనీ, నాకోసమైనా విశ్వాసపాత్రులైనవారిని పంపి అక్కడి ప్రజల అభిప్రాయం ఎలా ఉందో తెలుసుకోండి."

"కానిమా సుర్డీ! ఇదేం మాట!" అంటూ మహారాజు గ్రంథంలో ఒక మాట చదివి, పెన్సిల్ కొరికాడు.

"మీపట్ల ఫ్రెంచిప్రజలకు భక్తివిశ్వాసాలు అధికమన్న విషయం తెలుసును. అయినా బోనపార్టీ (నెపోలియన్) కాని, అతని అనుచరులుకాని దుస్సాహసం చేస్తారని నా భయం. నా భయం బొత్తిగా నిరాధారమైనది కాదండి."

"మీరు మీ అనవసరభయాలతో నా పనికి అంతరాయం కలిగిస్తున్నారు బ్లాకా."

"తమ అజాగ్రత్తవల్ల నాకు నిద్రపట్టటంలేదు మహారాజా."

"అయితే ఒక్క క్షణం ఉండండి. ఇక్కడ ఒక చక్కని ప్రయోగం వేశాడు కవి. ఈప్రక్క నొక మాట వ్రాస్తాను. అదయిన తరవాత మీరు చెప్పవచ్చును."

మహారాజు వ్రాస్తున్నంతసేపు గది నిశ్శబ్దంగా ఉంది. మహారాజు దస్తూరీ అతి సున్నితంగా ఉంటుంది. బహు చిన్నని అక్షరాలు వ్రాస్తారు.

"ఊఁ! ఇప్పుడు చెప్పండి. వింటాను."

విల్‌ఫర్ట్‌ని తన అవసరానికి వినియోగించుకోడానికి ఇప్పుడు వీలుపడుతుందని బ్లాకా ఆశపడ్డాడు. ఇలా అన్నాడు: "అయ్యా! అవి కేవలం నిరాధారమైన వదంతులు కాని, కాలం గడవక చెప్పుకునే కబుర్లుకాని కావని నేను మనవి చెయ్యాలి. వాస్తవంగా..." అంటూ ఆగి, ఒక్క క్షణం యోచించి, అన్నాడు: "ఒక వ్యక్తి అత్యంత ఆందోళనతో దక్షిణాదినుంచి ఇక్కడికి పని కట్టుకుని వచ్చాడు. అతన్ని నమ్మడానికి నాకు తగినంత ఆధారం ఉంది. దక్షిణాది పరిస్థితుల్ని ఒకకంట కనిపెట్టాలని అతన్ని నేనే నియోగించాను. 'మహారాజుకు పెద్ద ఆపత్తు ఆసన్నమయింది' అంటూ వచ్చి చెప్పాడు. అందువల్ల నేను వెంటనే తమ దర్శనానికి రావలసి వచ్చింది."

లూయీ ఇంకా గ్రంథం చదువుతూ, కొన్ని మాటలు పైకి గొణిగాడు.

"నేను చెప్తున్నది ఆపివెయ్యమంటారా?"

"అబ్బెబ్బె! ఆపకండి. కాని ఒక్కసారి ఆ కాగితాలు చూడండి?"

"ఏ కాగితాలు?"

"అదిగో! ఎడమప్రక్కనున్న దస్త్రం. అందులో నిన్న పోలీసుశాఖామంత్రి పంపిన నివేదిక ఉంటుంది చూడండి. ఆగండి. ఇదుగో మంత్రిగారే స్వయంగా వస్తున్నారు. ఆయనే మీకు బోనపార్టీని గురించిన సమాచారమంతా చెప్తాడు. మంత్రిగారూ! ఈయనకి చెప్పండి, ఎంత ప్రమాదంగా ఉన్నా సరే, దాచనక్కర్లేదు. ఎల్బాద్వీపం అగ్నిపర్వతప్రాంతం కాదూ? అది బద్దలై, త్వరలోనే యుద్ధం, రక్తపాతం సంభవించవచ్చు లెండి."

పోలీసుశాఖా మంత్రి డాండెర్ కుర్చీలో కూర్చున్నాడు. "నిన్నటి నివేదికను చూసేమన్నారా మహారాజా?"

"అవును. మాని ఆ సమాచారం ఆయనకి వినిపించండి. ఆయనికి మీ నివేదిక కనిపించలేదు."

డాండెర్, బ్లాకా వంక తిరిగి అన్నాడు: "మహారాజు పాలనలో ప్రజలంతా క్షేమంగా ఉన్నారు. ఎల్బాద్వీపంనుంచి వస్తున్న సమాచారాన్ని బట్టి, అందరూ నిశ్చింతగా ఉన్నారు. బోనపార్టీకి చికాకుతో ప్రాణం కష్టంటుతోంది. గనుల్లో కార్మికుల్ని చూస్తూ ఆయన రోజులికి రోజులు గడుపుతున్నారు."

"అప్పుడప్పుడు బుర్ర గోక్కుంటున్నారు కూడా" అన్నాడు లూయీ. "నేను నిజమే చెప్తున్నాను బ్లాకా! ఈ మహాపురుషుడు, మహావీరుడు, దేవేంద్రుడు, కొంచెం చర్మవ్యాధితో బాధపడుతున్నారన్న సంగతి వీరు మరిచిపోయారా"

"అంతే కాదండి" అన్నాడు డాండెర్. "ఆయనకి పిచ్చెత్తుతుందని కూడా మాకు గట్టి నమ్మకం ఉందండి. క్రమక్రమంగా ఆయన హేతుజ్ఞానం క్షీణిస్తోంది. ఒక్కొక్కప్పుడు వేడికన్నీరు కారుస్తుంటాడు. ఒక్కొక్కప్పుడు అతిగా నవ్వుతుంటాడు. ఒకోసారి తీరందగ్గర గంటలకొద్దీ కూర్చుని నీళ్ళలో బొమ్మరాళ్ళు విసురుతూ ఉంటాడు. రాళ్ళు గురికి సమానంగా వెళ్లాయంటే,

మళ్లీ ఆస్టర్లిజ్ యుద్ధం గెలిచినంత ఆనందిస్తున్నాడు. ఇది తప్ప కుండా పిచ్చియైతే లక్షణాలంటారా కావంటారా?"

"ఇవి జ్ఞానసంపదకికూడా లక్షణాలే" అన్నాడు లూయీ నవ్వుతూ. "పూర్వకాలంలో మహానాయకులు సముద్రంలో బెడ్డలు విసుర్తూ కాలక్షేపం చేసేవారు. సిపియో ఆఫ్రికానస్ గురించి ప్లూటార్క్ ఏం రాశాడో చూడండి!"

నిర్లక్ష్యపరులైన ఇద్దరి మధ్యనూ నిలబడిన బ్లాకా దీర్ఘాలోచనలో పడ్డాడు. విల్‌ఫర్ట్ తనకి సమాచారమంతా పూర్తిగా తెలపక పోయినా, తెలిపినదాన్ని బట్టి తాను చాలా కంగారుపడ్డాడు.

"బ్లాకా ఇంకా నమ్మటంలేదు డాంపర్! నెపోలియన్ మంచి అలవాట్లు ఎలా నేర్చుకుంటున్నాడో ఆయనకి చెప్పండి."

"ఉన్న సంగతిదండి" అన్నాడు డాంపర్. "కిందటిమారు ముసలి సిపాయిలు నెపోలియన్‌ని చూసినప్పుడు, తిరిగి ఆయన ఫ్రాన్స్ వస్తే బాగుంటుందని వాళ్లన్నారట. అల్లా కాదు మీ మహారాజుకి విధేయులై సేవచెయ్యండని బోధించి వాళ్ళని నెపోలియన్ పంపివేశాడు. అది నిజమని నాకు గట్టిగా తెలుసును."

"ఇప్పు డేమంటారు?" అన్నాడు మహారాజు విజయ గర్వంతో.

బ్లాకా అన్నాడు: "అయ్యా! ఒక్కటి మనవి చేస్తాను. నేనైనా పొరబడిఉండాలి. పోలీసు మంత్రిగారైనా పొరపడి ఉండాలి. అయితే, మీ రాజరికసంరక్షణ భారాన్ని మోస్తున్న పోలీసుమంత్రిగారు పొరపడ్డం అసంభవం. కాబట్టి, ఇంక నేనే పొరపడిఉండాలి. అయినా సరే, వచ్చిన వ్యక్తిని మీరే అడిగి చూడాలని నా ప్రార్థన. ఆయనకి మీరు దర్శనం ఇవ్వటం మంచి దని నా అభిప్రాయం."

"ఓ. తప్పకుండా. మీ సమక్షంలోనే. మీ రెవరిని తీసుకొచ్చినాసరే దర్శన మివ్వడానికి నేను సిద్ధమే. అయితే, నేను చేతుల్లో ఆయుధాలతో మాత్రం ఉంటాను. డాంపర్! దీని తర వాత మళ్లీ కొత్త నివేదికేదీ రాలేదా? ఇది ఫిబ్రవరి 20 వ తేదీ నివేదిక. ఇవాళ మార్చి 3."

"లేదండి. కాని గంటలోనో, రెండుగంటల్లోనో వస్తుందని చూస్తున్నానండి. నే నివాళ ఇంటివద్దనుంచి పెందరాళే బయలుదేరాను. బహుశా నేను వచ్చేసినతరవాత ఏదైనా వచ్చిందేమో."

"అయితే వెంటనే వెళ్ళి చూసిరండి. లేకపోతే పోయిందేమిటి? ఒకటి సృష్టించండి! మామూలుగా చేసేది అదేగా! నేను మీకోసం చూస్తూఉంటాను" అన్నాడు లూయీ, పకపకనవ్వుతూ.

"అయితే ఈలోగా నేను అతన్ని తీసుకువస్తానండి" అన్నాడు బ్లాకా.

"అలాగే. కాని ఉండండి. ఒక్క క్షణం ఉండండి. ఇక్కడి వాక్యాలేమో నాకు పూర్తిగా బోధపడ్డంలేదు. కొంచెం చెప్పండి. తోడేలు బారినుంచి లేడి పారిపోతోంది. మీకు తోడేళ్ల వేటలో మంచి నేర్పుంది కూడా. 'మోలీ అంహా లితా' అన్నారు. ఇదేమిటో చెప్పండి."

"ఓ! అద్భుతంగా అన్నారు మహారాజా! కాని మీరు చెప్తున్న లేడిలాగున్నాడు, నాకిప్పుడు సందేశం తెచ్చిన వ్యక్తి. అరువందల అరవై మైళ్ళు మూడు రోజుల్లో ప్రయాణం చేసివచ్చాడండి."

"అబ్బా! చాలా ఆయాసపడ్డాడన్నమాట! తంతిసౌకర్యం ఉంది కదా? రవంతకూడా ఒగర్చనక్కర్లేకుండా మూడు నాలుగ్గంటల్లో వార్త చేరిపోనే? ఆ వ్యక్తి స్వయంగా ఎందుకు పరుగెత్తుకొచ్చినట్లు?"

"నిజమే మహారాజా! కాని పాపం ప్రయాసపడి ఇంత దూరం వచ్చినవాడిని చులకనగా చూస్తున్నారు. మహారాజుకోసం అమూల్యమైన సమాచారం తెచ్చాడు. కనీసం కౌంట్ సాల్వోకోసమైనా కనికరించండి."

"ఓ! కౌంట్ సాల్వో పంపారా? అయితే ఆయ నిప్పుడు మార్సెల్స్‌లో ఉన్నారన్నమాట. ఆయనకూడా కుట్ర ఉందనే అన్నారా?"

"లేదండి. కాని విల్‌ఫర్ట్‌ని నాదగ్గరకు పంపి, ఎలాగైనా మీ దర్శనం ఇప్పించాలని సాల్వో నాకు ఉత్తరం వ్రాశారండి"

"ఎవరు? విల్‌ఫర్ట్?" అన్నాడు మహారాజు. "ఆ మాట నాకు ముందే ఎందుకు చెప్పలేదు?" ఈమారు మహారాజు ముఖంలో కొంత ఆందోళన కనిపించింది.

"అతని పేరు మీకు తెలియ దనుకున్నానండి."

"అచ్చే! తెలుసును. అతనికి మంచి సూక్ష్మబుద్ధి ఉంది. మంచి ప్రవర్తన కలవాడే. ఆపైన, భవిష్యత్తుగురించి చాలా ఆశలు పెట్టుకున్నవాడు. అవునుకాని, అతని తండ్రిపేరు మీకు తెలుసునా? నయర్ టైర్?"

"ఎవరు? గిరాండిస్ట్ సెనేటర్ కాదూ?"

"అవును. అతనే."

"అటువంటివాని కుమారుని మహారాజు నియమించారా?"

"బ్లాకా! అది మీకు తెలియదు లెండి. విల్‌ఫర్ట్ దురాశాపరుడు. స్వార్థంకోసం ఏదైనాసరే, చివరికి తండ్రినికూడా, బలివ్వగలడు."

"అయితే అతన్ని తీసుకురానా?"

"వెంటనే."

బ్లాకా గబగబా వెళ్లాడు. విల్‌ఫర్ట్‌నుపిలిచాడు. కానిగది వరం డావద్దకు వచ్చేసరికి ఆటంకం కలిగింది. దుమ్ముకొట్టిన దుస్తులతో, చీదరగా ఉన్న విల్‌ఫర్ట్‌ని ద్వారపాలకుడు రానివ్వలేదు. "రాజాజ్ఞ" అని బ్లాకా చెప్పవలసివచ్చింది. అప్పు డిద్దరూ గది ప్రవేశించారు.

"రావోయ్ విల్‌ఫర్ట్! ఇలా రా!" అన్నాడు మహారాజు.

విల్‌ఫర్ట్ వొంగి వొంగి వందనం చేశాడు. మెల్లిగా అడుగులు వేసుకుంటూ ముందుకు వచ్చాడు. మహారాజు ప్రశ్నకోసం వేచి ఉన్నాడు.

"నాకు చాలా ముఖ్యమైన సమాచారం చెప్పాలని నువ్వు కోరుతున్నట్లు బ్లాకా చెప్తున్నారు. ముందుగా ఒకటి చెప్పు. ప్రమాదం మరీ ముంచుకువచ్చిందని నన్ను నమ్మమంటావా?"

"విషయం అత్యవసరమైనది మహారాజా! కాని వెయ్యి దాటిపోలేదు."

బ్లాకా కలవరపాటు, విల్‌ఫర్ట్ కంపితస్వరం గమనించిన మహారాజు చలించాడు. "సరే, కథంతా చెప్పు విల్‌ఫర్ట్. కాని

కథ సరిగ్గా ఎక్కడ మొదలవుతుందో అక్కడే మొదలుపెట్టు. ప్రతీదీ రీతి తప్పకూడదని నా ఉద్దేశం."

"నేను జరిగింది జరిగినట్లు చెప్తానండి. కాని నా తత్తర పాటువల్ల తడబడినా, అర్థంలేని మాటలు నా నోటంట దొర్లినా, నన్ను క్షమించండి" అని విల్‌ఫర్ట్ మహారాజు ముఖకవళిక పరికించాడు. సుముఖభావం కనిపెట్టి, ఇలా చెప్పాడు.

"నేను నా కర్తవ్యం నిర్వర్తిస్తున్న సమయంలో, ఒక పెద్ద కుట్ర తెలియవచ్చినందువల్ల, తమకు తెలపడంకోసం నేను వెంటనే బయలుదేరి పారిస్ రావలసివచ్చిందండి. ఈ కుట్రవల్ల తమ సింహాసనానికే ముప్పు రానుంది. నెపోలియన్ మూడు ఓడల్ని నిర్మించాడు. ఎల్బాద్వీపంనుంచి ఈ పాటికి బయలుదేరి ఉంటాడు. ఇప్పుడెక్కడుంటాడో చెప్పలేను. నేపుల్స్‌వద్ద కాని, టస్కనీ తీరాన కాని, లేదా ఫ్రాన్స్‌లో కాని తప్పకుండా దిగుతాడు. ఎల్బాద్వీపాధిపతి ఇటలీతోనూ, ఫ్రాన్స్‌తోనూ సంబంధాలు విడనాడుకోలేదన్న సంగతి మీకు తెలిసేవుంటుంది."

"తెలుసును. సెంట్ జాక్ వీధిలో (పారిస్) బోనపార్టిస్ట్ సమావేశాలు జరుగుతున్నాయనికూడా తెలుసును. సరే చెప్పు. ఈ సమాచారం నీకెలా తెలిసింది?"

"ఒక మార్సేల్స్ నగరవాసిని పరీక్ష చెయ్యగా తెలిసిందండి. అతన్ని నేను కొన్ని రోజులుగా కనిపెట్టి చూస్తున్నాను. అతను నావికుడు. నేను బయలుదేరిన రోజునే అరెస్టు చేయించాను. అతను బోనపార్టిస్ట్ అని నేను మొదటినుంచీ అనుమానించాను. రహస్యంగా ఎల్బాద్వీపం వెళ్లి, అక్కడ గ్రాండ్‌మార్షల్‌ని చూశాడు. ఆయన, అతనిద్వారా పారిస్‌లో ఒక బోనపార్టిస్ట్‌కి నోటికబురు పంపాడు. కాని పారిస్‌లో ఆ బోనపార్టిస్ట్ ఎవరో అతనిచేత చెప్పించలేకపోయాను. నోటికబురు ఏమిటంటే, నెపోలియన్ తిరిగి రావడానికి వీలుగా, ప్రజల్లో ప్రచారంచేసి, అంతా సిద్ధం చెయ్యాలని. నెపోలియన్ త్వరలోనే బయలుదేరుతున్నట్లుకూడా కబురు చెప్పారు."

"ఇతనెక్కడున్నాడు?"

"కారాగారంలో"

"విషయం చాలా ప్రమాదమైనదనే నీ అభిప్రాయమా?"

"చాలా ప్రమాదకరమైనదండి. నా పెళ్లి ప్రధానపు విందులో నేనున్నప్పుడు అతన్ని అరెస్టుచేయించాను. ఇది అకస్మాత్తుగా తెలిసినందువల్ల వెంటనే నేను నా మిత్రుల్ని, ప్రియురాలిని విడిచిపెట్టి, మీ పాదాలవద్దకు వచ్చి పడి, నా భయాన్నీ, విధేయతనీ తమకు విన్నవించుకోవాలని వచ్చాను."

"అందతా బాగానే ఉందిలే. ముందు కుట్ర సంగతి పూర్తిగా చెప్పు."

"అది కుట్రకంటె ప్రమాదమైన దండి."

లూయీ చిరునవ్వుతో అన్నాడు! "కుట్రల కేమిలే! ఈ రోజుల్లో ఎవ్వరైనా సులువుగా పన్నవచ్చును. కాని నిర్వహించటమే కష్టం. పది మాసాలుగా మధ్యధరా సముద్రతీర ప్రాంతాన్ని కట్టుదిట్టం చెయ్యడానికి నా మంత్రులు రెండింతలు కష్టపడుతున్నారు. బోనపార్టీ నేపుల్స్‌లో దిగితే, ఆతను పియాంబినో చేరేముందే మన రాజ్యకూటం అంతా ఏకమై అడ్డగిస్తుంది. టస్కనీలో దిగాడంటే, శత్రురాజ్యంలో అడుగు పెట్టాడన్నమాట. ఫ్రాన్స్‌లో దిగితే, గుప్పెడుమంది అతని కూడా ఉండరు. ప్రజలకి అతనంటే రోత పుట్టింది. ఈ వ్యవహారాన్ని మనం ఇట్టే తేల్చెయ్యవచ్చు. కాబట్టి అధైర్యం చెందకు విల్‌ఫర్ట్. నువ్వుపడిన ప్రయాసని మనస్సులో పెట్టుకుంటానులే."

"ఇదుగో డాంపర్ వస్తున్నారు" అన్నాడు బ్లాకా.

పోలీసుమంత్రి ముఖం పాలిపోయి ఉంది. పిడుగు దెబ్బ తిన్నట్లు కళ్లు వెళ్లబెట్టి చూస్తూవచ్చాడు. విల్‌ఫర్ట్ ఒకడుగు వెనక్కు వేశాడు— వెళ్లిపోతున్నట్లు. కాని అతన్ని బ్లాకా గట్టిగా పట్టుకుని నిలిపాడు.

## 11

మంత్రి పాలిపోయిన ముఖం చూసేసరికి లూయీ గభాలున లేచాడు. మేజాను గట్టిగా ముందుకు నెట్టాడు.

"ఏమయింది డాంపర్? కలవరపడుతున్నావేం? విల్‌ఫర్ట్ చెప్తున్నది నిజమేనా?" అన్నాడు లూయీ.

బ్లాకా మంత్రిని సమీపించాడు. ఏదో అనబోయి ఊరుకున్నాడు. మంత్రిని ఇంకా చిన్నపుచ్చుకోవడం కంటె ఊరుకోడం మేలనుకున్నాడు.

డాండెర్ అతి కష్టంమీద అన్నాడు: "అయ్యా! ఏం చెప్పను?"

"ఏమిటి? ఏమయింది? చెప్పు. ఊరుకుంటావేం?" అన్నాడు రాజు.

"ఏం చెప్పనండి? ఘోరం జరిగిపోయింది. నెపోలియన్ ఎల్బా ద్వీపంనుంచి ఫిబ్రవరి 28 వ తేదీని బయలుదేరివచ్చి మార్చి 1 వ తేదీని దిగాడు."

"ఎక్కడ?"

"ఫ్రాన్స్‌లో. జువాన్ సింధు శాఖా తీరాన్ని ఏంటిబీ అనే చిన్న రేవులో దిగాడు."

"పారిస్‌కి ఏడువందల యేభైమైళ్ల దూరంలో, ఏంటిబీ దగ్గర మార్చి 1 వ తేదీని నెపోలియన్ దిగాడు! ఆ కబురు మొట్టమొదటిసారిగా ఇవాళ, అంటే మార్చి 3 వ తేదీని మీకు అందింది! ఏం? కాని మీరు చెప్తున్నది నిజమేనా? అసాధ్యం. మీకు చేరిన సమాచారం తప్పైవుండాలి. లేదా మీకు పిచ్చెత్తి వుండాలి!"

"కాని కర్మవశాత్తు ఇది నిజమేనండి."

లూయీకి కలవరం, క్రోధం, అధికమయినాయి. చెంపపెట్టు తిన్నట్లయింది. ఛాతీ విరుచుకుని నిటారుగా నిలిచాడు: "ఫ్రాన్స్‌లో! నెపోలియన్ ఫ్రాన్స్‌లో ఉన్నాడు! ఆ మనిషిని సరిగ్గా కనిపెట్టి చూడలేదన్నమాట! ఏమో, ఎవరికి తెలుసు? అందరూ అతనికి మిత్రులేనేమో?"

బ్లాకా అన్నాడు "అల్లా అనకండి. డాండర్‌వంటి పురుషుడు ద్రోహం చెయ్యలేడు. నిజానికి అందరం అంధులమై పోయినాం. అందరితో పాటే పోలీసు మంత్రీ కనిపెట్టలేక పోయారు. అంతే."

"కాని..." అని ఏదో అనబోయి ఆగిపోయాడు విల్‌ఫర్ట్. వెనక్కి ఒక అడుగువేసి "నన్ను క్షమించాలి. ఆవేశంవల్ల నిగ్రహించుకోలేకపోయాను."

"ఫరవాలేదు చెప్పు విల్ ఫర్, ధైర్యంగా చెప్పు. ముప్పు వచ్చిందని నువ్వొక్కడివే హెచ్చరించావ్. ఇప్పుడు మార్గాంతరం కూడా నువ్వే చెప్పు." అన్నాడు మహారాజు.

"అయ్యా! నెపోలియన్ అంటే దక్షిణాదిని ప్రజల్లో రోత పుట్టింది. అతనక్కడ ప్రమాదంలో పడుతున్నాడు. ఆ ప్రాంతం అంతటినీ అతనిపైన కత్తికట్టడానికి సిద్ధపరచ వచ్చును."

"అదినిజమే, కాని అతను గాప్ మీదుగా అప్పుడే తరలి వస్తున్నాడు" అన్నాడు పోలీసుమంత్రి.

"ఏమిటీ? తరలి వస్తున్నాడా? పారిస్ మీదికే వస్తున్నాడన్నమాట! అంతేనా?"

పోలీసుమంత్రి మౌనంగా ఉండిపోయాడు. అవునని నోటితో చెప్పలేకపోయాడు.

"అయితే డాఫిన్ ప్రాంతంమాట?" అని మహారాజు విల్ ఫర్ట్ వంకతిరిగి ప్రశ్నించాడు. "ఆ ప్రాంతం కూడా అతన్ని ఎదిరిస్తుందంటావా విల్ ఫర్?"

"లేదని చెప్పడానికి చాలా విచారపడుతున్నానండి. అక్కడి కొండప్రాంతపు ప్రజలందరూ బోనపార్టిస్టులు."

"అలాగా! అయితే ఇప్పుడు నెపోలియన్ వెంట ఎంత బలగం ఉంటుంది?"

"తెలియదండి" అన్నాడు మంత్రి. "ఆ సమాచారం తెప్పించలేక పోయినానండి. వచ్చిన కబురువల్ల నెపోలియన్ ఎక్కడ దిగినదీ, ఏ దిక్కుగా వస్తున్నదీ మాత్రం తెలిసిందండి."

"ఈ కబురు మీకెట్లా చేరింది?"

మంత్రి తలవాలిపోయింది. ముఖం కందగడ్డయింది. తడబడుతూ, "తంతివార్త వచ్చిందండి." అన్నాడు.

లూయీ ఒకడుగు ముందుకు వచ్చాడు. నెపోలియన్ మాదిరిగా చేతులు కట్టుకు నిలబడి, కోపంతో అన్నాడు. "ఓహో! అదా! మిత్రరాజ్యాల సైన్యాలు ఏడుకలిసి ఈ వ్యక్తిని జయించాయి. ఇరవై అయిదు సంవత్సరాల దేశాంతరవాసం అనంతరం నాకు నా తండ్రి తాతల సింహాసనాన్ని ఏదో అద్భుతమైన దివ్యశక్తితిరిగి ఇచ్చింది. నాకు నా జీవితంలో పరమలక్ష్యం సిద్ధించి,

అధికారాన్ని అందుకుంటున్న సమయానికి, అది భగ్నమై నన్ను సర్వనాశనం చేసున్నది!"

"ఇదంతా దైవ దుర్విపాకం" అన్నాడు మంత్రి. ఇంతటి దుర్ఘటన ఎటువంటి ప్రాణినైనా క్రుంగదియ్యక మానదన్నట్లు మంత్రి భావించాడు.

"అహా! మన శత్రువులు మనల్నిగురించి చెప్పేది నిజమే సుమా!" అన్నాడు మహారాజు. "గతానుభవంవల్ల మనం నేర్చుకున్నది శూన్యం. మన మేమీ మరిచిపోలేదు. అతనిపట్ల ద్రోహం జరిగినట్లే, నా పట్లకూడా ద్రోహం జరిగిఉంటే, అదొక తృప్తిగా ఉండేది. నే నెవరిని నమ్మి ఉన్నతపదవుల్లో ఉంచానో, వారంతా నా అండనుండి కూడా, కేవలం వారి అసమర్థతవల్ల, అజాగ్రతవల్ల నేను బలౌతున్నాను! నిజమే! మీరు చెప్పింది నిజం. ఇది దైవ దుర్విపాకం."

బ్లాకా నుదుటి చెమట తుడుచుకున్నాడు. విల్‌ఫర్ట్ తన ప్రాముఖ్యత హెచ్చుతున్నందువల్ల తనలో తాను చిరునవ్వు నవ్వుకున్నాడు.

మహారాజు మళ్లీ అన్నాడు: "కూలిపోవడం, కూలిపోయి ప్రారబ్ధాన్ని తంతివల్ల తెలుసుకోవడం! అయ్యొయ్యో! అవహేళన పొంది ట్వేలరీ మెట్లు దిగిపోవడంకంటె, నా అన్నమాదిరిగా ఉరిస్తంభ మెక్కడం మేలు! అవహేళన అంటే ఫ్రాన్స్‌లో ఎటువంటిదో మీకు తెలుసునా? తెలియదు. కాని తెలుసుకుని ఉండడం మీ ధర్మం! విల్‌ఫర్ట్! ఇటు రా. ఇంతవరకూ తెలుసుకోలేక పోయిన సమాచారాన్ని తంతివల్ల కాకముందుగానే తెలుసుకో వచ్చునని ఈ పెద్దమనిషికి తెలియచెప్పు."

"ప్రపంచంలో ఎవ్వరికీ తెలియకుండా అతి రహస్యంగా నెపోలియన్ కాపాడుతున్న ఈ సమాచారాన్ని, ఏ దివ్యశక్తివల్ల కూడా ఊహించుకోడం అసాధ్యమండి."

"అసాధ్యం! అవును. మంచిమాట చెప్పావు. మంచిమాటలు మంచిమనుష్యుల పోలికనే వుంటాయి. మాటల్నీ మనుష్యుల్నీ కూడా నేను లెరిచి చూశాను. ఆఫీసర్లు, ఏజంట్లు, గూఢచారులు, పదిహేను లక్షల ఫ్రాంకులు తన వశంలో ఉన్నప్పటికీ, ఫ్రాన్స్‌కి నూటఎనభై మైళ్లలో ఏం జరుగుతున్నదో తెలుసుకోవడం మంత్రి

గారికి అసాధ్యమా? నిజం! అయితే మరి ఈ పెద్దమనిషి మాటేమిటి? ఇతని వంశంలో ఎవ్వరూ లేరు. ధనం లేదు. ప్రభుత్వం తరఫు న్యాయవాదిమాత్రమే. అయినా మీకంటె ఇతని కెక్కువ సమాచారం తెలుసును! మీ కున్నట్లు తంతిసౌకర్యం ఈయన కుంటే, నా కిరీటాన్ని రక్షించగలిగేవాడు."

విజయగర్వానికి వినయంతో మెరుగుపెడుతూ, శిరస్సు వంచుకొన్న విల్‌ఫర్ట్‌వంక పోలీసుమంత్రి అమిత ద్వేషంతో పరికించాడు.

ఈ ప్రశంసకి మరొకరైతే పరవశమై పోవలసిందే. కాని అధోగతిపాలైన పోలీసుమంత్రితో వైరం అంటే విల్‌ఫర్ట్ జంకాడు. నెపోలియన్ రహస్యాన్నేదో పోలీసుమంత్రి ఊహించుకోలేక పోయాడు. కాని విల్‌ఫర్ట్ రహస్యాన్ని కనిపెట్టడం అతనికి కష్టంకాదు. దాంటేని అడిగితే చాలు. తెలిసిపోతుంది. అందువల్ల పోలీసుమంత్రి పరాభవాన్ని ఉపశమింపజెయ్యడానికి విల్‌ఫర్ట్ ఇలా అన్నాడు: "నేను తెలుసుకోగలిగినదంతా కేవలం ఒక చిన్న సంఘటనకు ఫలితమే కాని నా ప్రజ్ఞ కాదండి. దాన్ని మీ సేవకోసం వినియోగించాను. అంతే. అంతకంటె అధిక ప్రశంసకు అర్హుణ్ని కాను."

పోలీసుమంత్రి ఈమారు కృతజ్ఞతాసూచకంగా విల్‌ఫర్ట్ వంక చూశాడు. మహారాజు ప్రశంసను కోలుపోకుండా, విల్‌ఫర్ట్ మంత్రి మైత్రినికూడా సాధించాడు.

"సరే" అన్నాడు మహారాజు. మంత్రినీ, బ్లాకానూ ఉద్దేశించి "ఇంక మీవల్ల నాకే అవసరం లేదు. మీరు దయచెయ్యవచ్చును. ఇంక చెయ్యవలసినదంతా యుద్ధశాఖామంత్రిచేతుల్లో ఉంది." అన్నాడు.

బ్లాకా అన్నాడు: "మన అదృష్టంవల్ల ఇంకా మన సైన్యాన్ని మనం నమ్మవచ్చునండి. దేశంనుంచి వస్తున్న వార్తల్ని బట్టి, సైనికులు యావన్మందీ మహారాజుకు విధేయులేనని తెలుస్తోంది."

"ఇంక ఆ వార్తల్ని గురించి నాకు చెప్పకండి. వాటి విలువెంతో ఇప్పుడు నాకు తెలుసు. అన్నట్లు, నాకు ఒక మాట

మాత్రం చెప్పండి. సెంట్ జాక్ వీధిలో వ్యవహారం గురించి ఏమైనా సమాచారం విన్నారా మంత్రిగారూ ?"

"సెంట్ జాక్ వీధిలో వ్యవహారమా ?" అన్నాడు విల్ ఫర్ట్ హఠాత్తుగా. అతను ఆవేశం అణుచుకోలేక పోయాడు. మళ్ళీ అన్నాడు : "నన్ను క్షమించండి. కేవలం మీపట్ల కల భక్తివల్లనే, ఇక్కడి నియమాల్ని సరిగ్గా పాటించలేక పోతున్నాను."

"ఫరవాలేదు. మాట్లాడు. సంకోచించ నవసరం లేదు. ఇవాళ నీకా స్వేచ్ఛ నిస్తున్నాను." అన్నాడు మహారాజు.

మంత్రి చెప్పాడు : "మొదట మీకు ఆ సమాచారం చెప్ప డానికే నే నిక్కడికి వచ్చానండి. కాని ఇంతలోనే పిడుగులాగ ఈ వార్త వచ్చిపడింది. ఇప్పు డింక ఆ సమాచారంవల్ల ఉప యోగం లేదు."

"అలా కాదు." అన్నాడు మహారాజు. "దీనికీ, దానికీ దగ్గరసంబంధం ఉందని నా అభిప్రాయం. జనరల్ క్వెస్నెల్ మరణాన్ని బట్టి, కుట్ర ఆచోకీ మనకి దొరకవచ్చును."

జనరల్ క్వెస్నెల్ పేరు వినగానే విల్ ఫర్ట్ కంపించి పోయాడు.

మంత్రి చెప్పాడు: "ఎటుచూసినా, అది ఆత్మహత్య కాదనీ, హత్య అనీ అనుమానం కలగక మానదండి. జనరల్ క్వెస్నెల్ బోనపార్టిస్ట్ సమావేశం విడిచివెళ్ళిన తరవాతనే అంతర్ధానమైనాడు. ఆ రోజు ఉదయం అతన్ని గురించి ఎవరో అపరిచితవ్యక్తి ఒకడు వాకబుచేసి, సెంట్ జాక్ వీధిలో కలుసుకోడానికి ఏర్పాటు చేశాడు. ఆ వ్యక్తి క్వెస్నెల్ ను కలుసుకున్నప్పుడు, క్వెస్నెల్ కూడా ఉన్న పరిచారకుడు, ఇంటి నంబరు మరిచిపోయాడు. కాని వాకబుచేసిన వ్యక్తిని గురించి ఆచోకీ తీస్తున్నాం. అత నెలా ఉంటాడో పరిచారకుడు చెప్పాడు. ఏభై, ఏభైరెండేళ్లుంటాయి. నల్లని కళ్లు, ఒత్తైన కనుబొమ్మలు, గుబురు మీసాలు ఉన్నాయి. నీలి పొడుగుకోటు ధరించాడు. కోటుపైన లీజన్ ఆఫ్ ఆనర్ పతకం ఉంది. సరిగ్గా ఈ మాదిరిగా ఉన్న ఒక వ్యక్తిని నిన్న ప్రచ్ఛన్న వేషంలో ఉన్న పోలీసులు చూశారు. ఆ వ్యక్తి కాక్ హెరాన్ వీధికీ, జూశీన్ వీధికీ మధ్య మలుపులో మాయమైనాడు."

విల్ ఫర్ట్ కి కాళ్లు చేతులు పట్లు తప్పుతున్నట్లయింది. కాని ఆ వ్యక్తి మాయమైనా డన్న మాట వినగానే మళ్లీ ఊపిరి విడిచాడు.

"ఇతన్ని వేటాడాలి" అన్నాడు మహారాజు మంత్రితో. "జనరల్ క్విస్నెల్ హత్య చెయ్యబడినట్లయితే, హత్యకు కారకు లైనవారిని బోనపార్టిస్టులైనా సరే, మరొకరైనా సరే, కఠినంగా శిక్షించి తీరాలి."

మహారాజు ఆజ్ఞ విధించేసరికి విల్ ఫర్ట్ కి విపరీతమైన భయం ఆవ హించింది. పైకి కనపడకుండా అణుచుకోడానికి అతడు తన సత్తువ నంతా వినియోగించవలసి వచ్చింది.

మహారాజు విసుగుదలతో అన్నాడు: "ఎంత చిత్రంగా ఉంది! హత్య జరిగిందని పోలీసులు చెప్పకేంమాత్రం చెప్పారు. చెయ్యగలిగి నంతా చేశారు. చివరికి అన్న దేమిటి? నేరస్థుల జాడ తీస్తున్నారని!"

బ్లాకా అన్నాడు: "ఈ విషయమై ఫరవాలేదండి. నేర స్థుల్ని కనిపెట్టగలరు."

"సరే, సరే. చూద్దాం. ఇంక మీరు దయచెయ్యవచ్చు డాండెర్. విల్ ఫర్ట్! చాలదూరం ప్రయాణం చేసి వచ్చావ్. అలసిపోయుంటావ్. వెళ్లి విశ్రాంతి తీసుకో. నువ్వు నీ తండ్రి ఇంట్లో దిగా వనుకుంటాను?"

విల్ ఫర్ట్ కి కన్నులు చీకట్లు కమ్మిన ట్లయింది. "లేదండి. మాడ్రిడ్ హొటల్లో దిగానండి" అన్నాడు.

"నువ్వు ఆయన్ని చూడలేదూ?"

"లేదండి. తిన్నగా నేను బ్లాకా వద్దకే వచ్చానండి."

"ఇప్పు డేనా చూస్తావనుకుంటాను?"

"చూడలేనండి."

"సరే," అన్నాడు మహారాజు చిరునవ్వుతో. తన ప్రశ్నలు వృథాపోలేదనుకున్నాడు. ఇలా అన్నాడు: "నయర్ టైర్ తో నీకు సఖ్యత లేదన్న మాట మరిచిపోయాను. ఇదికూడా మా పట్ల విధే యతతో నువ్వుచేసిన త్యాగమే. దీనికి నీకు ప్రతిఫలం ఇవ్వాలి:"

"మీరు నా పట్ల ఉంచిన విశ్వాసమే తగిన ప్రతిఫలం. నా కదే చాలు."

"అయినా నిన్ను నేను మరిచిపోను లే విల్‌ఫర్ట్." అన్నాడు మహారాజు. ఇతర చిహ్నాలతో పాటు నిత్యం ధరించే లీజన్ ఆఫ్ ఆనర్ పతకాన్ని తీసి "ఈలోగా ఇదిగో, ఇది తీసుకో." అని విల్‌ఫర్ట్‌కి ఇచ్చాడు.

విల్‌ఫర్ట్ ఆనందపరవశుడైనాడు. కన్నులు చెమ్మగిలినాయి. పతకాన్ని ముద్దుపెట్టుకుని "మహారాజు ఏ ఆజ్ఞ ఇచ్చినా సరే శిరసావహించడానికి సంసిద్ధుణ్ని" అన్నాడు.

"నువ్వు విశ్రాంతి తీసుకో. ఇక్కడ పారిస్‌లో నువ్వు నాకు చెయ్యగల సేవ ఏమీ లేదు. కాని మార్సెల్స్‌లో నువ్వు చేయగలిగేది ఎంతైనా ఉంది."

"నేనొక గంటలో పారిస్ విడిచి వెళ్లిపోతున్నానండి."

"సరే వెళ్లు విల్‌ఫర్ట్. నేను పొరపాటున మరిచిపోయినట్లయితే, —మహారాజుల కిది మామూలే—నువ్వు జ్ఞాపకం చెయ్యడానికి సంకోచించకు." తరవాత మంత్రిని చూసి "యుద్ధశాఖామంత్రికి వెంటనే కబురు పంపండి. బ్లాకాస్! మీరిక్కడ ఉండండి" అన్నాడు.

ట్వైలరీ మెట్లు దిగుతుండగా విల్‌ఫర్ట్‌ను చూసి పోలీసు మంత్రి అన్నాడు "నువ్వు చాలా అదృష్టవంతుడివి."

మంత్రికి వందనం చేస్తూ విల్‌ఫర్ట్ తనలో అనుకున్నాడు. "కాని ఇదెంత కాలం?" చుట్టూ చూశాడు. వీధిలో వస్తున్న గుర్రాల బండిని పిలిచాడు. అందులో ఎక్కి పది నిముషాల్లో హోటల్ చేరాడు. రెండు గంటలకి తన బండి సిద్ధం చెయ్యడానికి ఆజ్ఞ ఇచ్చి, తన గదిలో కుర్చీలో కూర్చుంటున్న సమయంలో, అతని నెవరో పేరు పెట్టి పిలుస్తున్నట్లు వినవచ్చింది.

"నేనిప్పుడే ఇక్కడికి వచ్చినట్లు ఎవరికి తెలిసింది?" అనుకున్నాడు.

పరిచారకుడు ఒకడు లోపలికి వచ్చాడు

"మీ కోసం ఎవరో వచ్చారు. పేరు చెప్పడం లేదు. మీతో

"ఎలా ఉంటాడు?"

"దాదాపు ఏభైయేళ్లుంటాయండి. మీ అంత ఎత్తే ఉంటారు. నల్లని కళ్లు, నల్లని జుట్టు, ఒత్తైన కనుబొమ్మలు. నీలిపొడుగు కోటు ధరించారు. కోటుమీద లీజన్ ఆఫ్ ఆనర్ పతకం ఉంది."

విల్‌ఫర్ట్ ముఖం పాలిపోయింది. "ఆయనే!" అనుకున్నాడు.

పైన వర్ణించబడిన వ్యక్తి ఇంతలో లోపలికి వచ్చాడు. "ఓహో! తండ్రి వస్తే వీధిలో నిలబెట్టడం మార్సేల్స్‌లో కొడుకులకు అలవాటా?" అన్నాడు.

"ఓ! నేననుకున్నది నిజమే నన్నమాట! మీరే ననుకున్నాను."

తండ్రి చేతి కర్రను గోడమూల పెట్టి, టోపీ మేజామీద పడేసి అన్నాడు: "వచ్చింది నేనే నని ఊహించుకునికూడా, నన్ను అవతల నిలబెట్టావంటే, అది మంచి లక్షణం కాదు గెరార్డ్!"

విల్‌ఫర్ట్ పరిచారకుని పంపివేశాడు.

# 12

పరిచారకుడు వెళ్ళిపోగానే నయర్టైర్ జాగ్రత్తగా తలుపులు మూసి వచ్చాడు.

"ఏం, గెరార్డ్? నేను రావడం నీకంత హితవైనట్లు లేదే?" అన్నాడు.

"అదేమిటి, నాన్నా!" అన్నాడు విల్‌ఫర్ట్. "అదేం కాదు. మీరు అకస్మాత్తుగా వచ్చేసరికి ఆశ్చర్యపడ్డాను. వస్తారనుకోలేదు నేను."

నయర్టైర్ కూర్చున్నాడు. "నేనూ ఆశ్చర్యపడ్డాను గెరార్డ్. ఫిబ్రవరి 28 ని నీ పెళ్లి ప్రధానమని వ్రాశావు. కాని మార్చి 3 కి పారిస్‌లో ఉన్నావు."

"మీకోసమే ప్రయాసపడి ఇంతదూరం వచ్చాను. నేను రాకపోతే మీరు కాపుదల కావచ్చునేమో! సెంట్ జాక్ వీధిలో బోనపార్టిస్ట్ క్లబ్ ఉన్నట్లు మీరు వినేఉంటారు?"

"53 నంబరేనా? తెలుసును. నేనే ఆ క్లబ్‌కి ఉపాధ్యక్షుణ్ణి."

"నాన్నా! మీ సాహసం చూస్తే నాకు భయం వేస్తోంది."

"సాహసం కాక ఏముందోయ్! గడ్డిబండిలో దాక్కుని పారిస్‌నుంచి పారిపోలేదూ? బోర్డోచుట్టూ రోబ్స్పియర్ భటులు తరుముతోంటే పరుగెత్తలేదూ? ఇంక ఇటువంటివి నేర్చుకోక మానుతుందా? అదిసరేలే; చెప్పు. సెంట్ జాక్ వీధిలో క్లబ్‌కి ఏమొచ్చింది?"

"జనరల్ క్వెస్నెల్‌ని అక్కడికి తీసుకు వెళ్లారట. ఆయన రాత్రి తొమ్మిదింటికి తన ఇల్లువిడిచి వెళ్లారట. మూడురోజుల తరవాత సీన్ నదిలో శవం కనిపించిందిట."

"అయితే ఈ కట్టుకథ నీకెవరు చెప్పారోయ్?"

"మహారాజే స్వయంగా చెప్పారు."

"నీకథ బాగుందిలే. దానికిబదులు నేనింకో వార్త చెప్తున్నా విను. చక్రవర్తి (నెపోలియన్) దిగినట్లు విన్నావా?"

"విన్నాను. అసలు నాకిది ముందే తెలుసును. ఈ వర్తమానాన్ని మహారాజుకు వెంటనే తెలపలేక పోయినందుకు పిచ్చెత్తినట్లయింది. మార్సేల్స్‌నించి మూడురోజులు ప్రయాణం చేసి వచ్చింది ఇందుకోసమే."

"మూడురోజులా? అచ్చే. మూడురోజులకిందట చక్రవర్తి దిగనే లేదు."

"దిగకపోవచ్చు. కాని, దిగుతున్నారన్న వార్త, ఎల్బా ద్వీపంనించి మీపేర పంపబడిన ఒక ఉత్తరంవల్ల తెలుసుకున్నాను. ఆ ఉత్తరం ఒక వార్తాహరునివద్ద దొరికింది. అది మరెవరిచేతిలో నైనా పడివుంటే ఈపాటికి మీప్రాణాలు తీసేసి ఉండేవారు నాన్నా!"

నయర్ టైర్ పకపక నవ్వాడు. "ప్రాణాలు తీస్తారా? అబ్బాయ్! నీకిలాటి ఉద్దేశం ఎలాకలిగింది? ఏమిటా ఉత్తరం? ఏదీ? నీభయం నాకు తెలుసులే. ఉత్తరాన్ని అలా ఉండనివ్వవ్."

"కాస్త ముక్కైనా మిగలకుండా కాల్చేశాను. అది ఉంటే మీ అంతం మూసును"

"పాపం! నీ భవిష్యత్తు, నీ ఆశలుకూడా అంతమైపోను! అంతే. నాకు తెలుసులే. నువ్వు రక్షించేవాడవ్ ఉన్నావు కాబట్టే, ఇంక నేను భయపడ నక్కర్లేదు!"

"అంతేకాదు. మీ ప్రాణాలు కాపాడాను. సెంట్ జాక్ వీధి క్లబ్‌మాటే చెప్పండి. జనరల్ క్విస్నెల్‌ని చంపేశారు. ప్రపంచంలోని ప్రతిదేశంలోనూ ఇటువంటిదాన్ని హత్య అంటారు."

"అతన్ని హత్యచేశా రనడానికి ఆధారమేమిటోయ్? జీవితం మీద నిరాశపుట్టి ఆత్మహత్య చేసుకునే వాళ్లు, ఈత చేతకాక మునిగిపోయే వాళ్ళూ రోజూ అనేకమంది సీన్‌నదిలో తేల్తూ ఉంటారు."

"నాన్నా! జనరల్ క్విస్నెల్ జీవితం మీద నిరాశతో నదిలో దూకలేదని మీకు తెలుసును. ఈరోజుల్లో సీన్ నదిలో ఎవ్వరూ స్నానాలు చెయ్యరు. మిమ్మల్ని మీరెందుకు మోసపుచ్చుకుంటారు? ఈచావుకి సరైన పేరు హత్య. మహారాజే ఆ మాట అంటున్నారు."

"మహారాజు! రాజకీయాల్లో హత్యలనేవి ఉండవని తెలుసుకో గల జ్ఞాని అనుకున్నాను మహారాజు. రాజకీయాల్లో మనుషుల్ని చంపరు. దారిలో కంటకాల్ని ఏరి పారేస్తారు. అంతే. ఇదంతా ఎల్లా జరిగిందో తెలుసుకోవాలని ఉంటే విను. జనరల్ క్విస్నెల్‌ని నమ్మవచ్చని మొదట అందరం అనుకున్నాం. నమ్మవచ్చని ఎల్బా ద్వీపంనించి కబురుకూడా వచ్చింది. సెంట్ జాక్ వీధిలో క్లబ్‌కి రావలసిందని మాలో ఒకరతనికి చెప్పారు. అక్కడ మిత్రులుంటారని అన్నారు. అతను వచ్చాడు. కార్యక్రమం అంతా అతనికి చెప్పేశాం. ఎల్బాద్వీపంనించి చక్రవర్తి బయలుదేరడం, ఫ్రాన్స్‌లో దిగడం అన్ని ఏర్పాట్లూ చెప్పాం. చెప్పినదంతా విన్నతరవాత, తను రాజరికపక్షం వాడి నన్నాడు. ఇంక ఏం చెయ్యాలని ఆలోచించాం. అతను కార్యక్రమాన్ని రహస్యంగా ఉంచడానికి ప్రమాణం చెయ్యాలని తేలింది. అలాగే ప్రమాణం చేశాడు. కాని మనఃపూర్వకంగా చెయ్యలేదు. అయినా అతన్ని స్వేచ్ఛగా వెళ్లిపోనిచ్చాం. కాని, పాపం అతనింటికి వెళ్లలేదు. మధ్యలో దారితప్పాడు. అంతే. మళ్ళీ కనిపించలేదు. దీన్ని హత్య అంటారా? నిన్ను చూస్తే ఆశ్చర్యం వేస్తోంది విల్‌ఫర్ట్! నువ్వు రాజరిక పక్షాన నీ ఆట నువ్వు ఆడుతోంటే నిన్ను నేనేమీ అనలేదే? నా స్నేహితుల్ని అనేకమందిని నువ్వు శిరచ్ఛేదాలు చేయిస్తోంటే, హంతకుడివని నిందించానా నేను? లేదే!

కానీ, ఇప్పుడు నీ రోజులు బాగున్నాయి, అనుకున్నాను. కాని, దీనికి ప్రతిఫలాన్ని రేపనుభవించక తప్పదుసుమా!"

"కాని నాన్నా! జాగ్రత్తగా ఉండాలి. మేం పగసాధించడం మొదలు పెడితే భయంకరంగా ఉంటుంది."

"అంటే? నీ ఉద్దేశం అర్థం కావడంలేదు."

"మీరు చక్రవర్తి మళ్ళీ వస్తాడనేకదా ఆశపడుతున్నారు? కాని, మూడుమైళ్ళుకూడా రాకముందే అతన్ని వేటాడతారు; ఉచ్చు వేసి పట్టుకుంటారు, అడవి మృగాన్ని పట్టుకున్నట్టు."

"ఓరి పిచ్చినాయనా! చక్రవర్తి అప్పుడే గ్రెనోబుల్ రహదారిలో ఉన్నారు. పదో తేదీనో, పన్నెండో తేదీనో లయన్స్ చేరుకుంటారు. ఇరవై, ఇరవైఅయిదో తేదీల కల్లా పారిస్‌లో ఉంటారు."

"అయితే? ఆయన వెంట పన్నెండుమందికూడా లేరు; పెద్ద సైన్యం ఆయనకెదురు వస్తుంది."

"వెళ్ళనీ. ఆయన్ని దగ్గరుండి రాజనగరానికి తీసుకొస్తారు. నువ్వు బలేవాడివ్ గెరార్డ్! నీకంతా తెలుసుననుకుంటావ్. తీరంలో దిగిన మూడురోజులికి కాన్స్ దగ్గర దిగారని మాకు తంతివార్త వస్తుంది. తరవాత ఆయన్ని వెంటాడుతున్నారని సమాచారం వస్తుంది. కాని, ఆయనెక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో రవ్వంతైనా మీకు తెలియదు. పారిస్ వరకూ ఆయన్ని అనుసరిస్తారు నిజమే. కాని, ఒక్క తుపాకికూడా పేలదు. గ్రెనోబుల్ ఆయన్ని ఆహ్వానిస్తుంది లయన్స్ సత్కరిస్తుంది. నా మాటనమ్ము. నీకు తెలిసినపాటి నాకూ తెలుసును. మా పోలీసులు మీ పోలీసులకేమీ తీసిపోరు. నీకు రుజువు కావాలా? విను చెప్తాను. నువ్వు మార్సెల్స్‌లో బయలుదేరి నప్పుడు పారిస్‌కువస్తున్నట్టు నాకు తెలియనివ్వకూడదనుకున్నావు. కాని, నువ్వు పారిస్ హద్దులు దాటి ప్రవేశించిన అరగంటలో నాకు తెలిసిపోయింది. ఎక్కడ బస చేస్తున్నావో నువ్వు ఒక్కడికి చెప్పలేదు. కాని, నాకు తెలుసును. నువ్వు ఇక్కడకువచ్చి కూర్చుంటున్నంతలోనే నేను వచ్చానా? సరేలే. అదంతా ఇప్పుడెందుకు? ముందు భోజనం తెప్పించు. ఇద్దరం కూర్చునితిందాం."

అంటూ నయర్ టైర్ పరిచారకుని పిలవడానికి లేచేటంత లోనే విల్ ఫర్ట్ ఆపాడు. "ఆగండినాన్నా! ఒక్క మాట. రాజరిక పక్షపు పోలీసులు ఎంత అసమర్థులైనా కావచ్చును. కాని, క్విస్నెల్ మాయమైనగోజుని, అతన్ని పిలుచుకువెళ్లిన వ్యక్తి ఎలా ఉంటారో వాళ్లకి తెలుసును. నల్లని జుట్టు, బొగ్గుమీసాలు, నల్లని కళ్లు, ఒత్తైన కనుబొమ్మలు, నీలిపొడుగుకోటు, కోటుపైన లీజన్ ఆఫ్ ఆనర్ పతకం. ఈ వివరాలన్నీ పోలీసులకు తెలుసును."

"ఓ! అయితే అదంతా వాళ్లకి తెలుసు నన్నమాట. అయితే అతన్నెందుకు పట్టుకోలేదు?"

"నిన్ననో, మొన్ననో కాక్ హెరాన్‌వీధి మొగలో మాయమైనారుట. కాని, ఏక్షణంలోనైనా పట్టుకోవచ్చును."

నయర్ టైర్ నిర్లక్ష్యంగా అన్నాడు. "అవును. ముందు జాగ్రత్తపడాలని అతనికెవ్వరూ చెప్పకపోతే పట్టుకునే వారే. కాని, నువ్వు చెప్పావుగా! ఇంక పట్టుకోలేరు. అతను వేషం మార్చేస్తాడు."

చిరునవ్వుతో నయర్ టైర్ అద్దందగ్గరకు వెళ్లాడు. కోటు తీసేశాడు. మేజావద్దకు వెళ్లి కొడుకు సామాను వెతికాడు. వెతికి రేజర్, కత్తెర తీసి మీసాలు తీసేశాడు; క్రాపు సర్దుకున్నాడు. మెడకుచుట్టిన మఫ్లర్ తీసేసి, విల్ ఫర్ట్ మఫ్లర్ తీసుకుని చుట్టుకున్నాడు. కొడుకులోపి సరిపోతుందో, లేదో ప్రయత్నించి అద్దంలో చూసుకున్నాడు. అంతా బాగానే ఉందనుకున్నాడు. తన చేతికర్ర గోడమూల నుంచి, విల్ ఫర్ట్ చేతికర్ర తీసుకున్నాడు.

వెలవెలబోతున్న కొడుకువంక తిరిగి నయర్ టైర్ ఇలా అన్నాడు: "ఇప్పుడు చెప్పు. పోలీసులునన్ను గుర్తుపట్టగలరా?"

"గుర్తుపట్టలేరు." విల్ ఫర్ట్ తడబడుతూ చెప్పాడు.

"ఇప్పుడు తల్చుకుంటే తీరా నిజమే ననిపిస్తోందినువా! నా ప్రాణాలు నువ్వే కాపాడావుకాబోలు! అయితే అయిందిలే. నీ ఋణాన్ని త్వరలోనే తీర్చేస్తాను. నువ్వుమళ్లీ మహారాజును చూస్తావా?"

"చూడవచ్చు."

"చూసినట్లయితే ఆయనకీమాటలు చెప్పు. 'ఫ్రాన్స్‌లో ప్రజల అభిప్రాయాన్ని గురించి మీరు మోసపోయారు. మీ రెవరినైతే దూషణపూర్వకంగా కార్సికన్ రాక్షసి అంటున్నారో, ఆయన్ని అప్పుడే లయన్స్‌లో ప్రజలు బోనపార్టీ అని పిలుస్తున్నారు. గ్రెనోబుల్లో చక్రవర్తి అంటున్నారు. ఆయన్ని వెంటాడుతున్నారనీ, చుట్టుముట్టుతున్నారనీ మీరనుకుంటున్నారు. కాని, ఆయన డేగలా వచ్చిపడుతున్నాడు. తేనెచుట్టూ ఈగలమాదిరిగా సైనికులు ఆయన వద్దచేరుతున్నారు. మీరు వెంటనే పారిపొండి. విజేత అయిన వానికి ఫ్రాన్స్ దేశాన్ని ఒప్పగించి వెళ్లిపొండి. మీ ప్రాణానికిముప్పువచ్చిందనిపారిపోనక్కర లేదు. మిమ్మల్ని క్షమించడానికి తగినబలం ఆయనకుంది. కాని, సెంట్‌లూయీ మనుమడు అవమానం పాలుకావడం ఇష్టంలేకనే పారిపోవాలని చెప్తున్నాను. ఆస్టర్లిజ్ మహావీరుని చేతుల్లో మహారాజు ప్రాణభిక్ష పొందా ననిపించుకోవడం ఉచితం కాదు.' ఈ మాటలాయనకి చెప్పు గెరార్డ్. లేదా, ఒక్కమాటైనా చెప్పకుండా నీ దారిని నువ్వు వెళ్లు; మార్సెల్స్ వెళ్లు. చడీచప్పుడూ కాకుండా నీ ఇంట్లో కూచో. ఈ సారి మేం ఊరుకునేది లేదు. మాశత్రువు లెవరో ఇప్పుడుమాకు చక్కగా తెలుసును. వాళ్లని విడిచి పెట్టం. నీ తండ్రి ఆజ్ఞల్ని నువ్వు విధేయతతో పాలించినట్లయితే నీ ఉద్యోగంనీకు దక్కుతుంది." తరవాత కొంటెగా చిరునవ్వునవ్వి అన్నాడు:—"ఇందుకు ప్రతిఫలంగా ఇంకొక మారు నువ్వు నాప్రాణాన్ని రక్షించవచ్చులే. రాజకీయాలవక్రగతి తెలిసినదేకదా! నేను మళ్లీ కూలిపోయి, నువ్వే పైకిరావచ్చును." ఈ మాటలంటూ నయర్‌టైర్ వెళ్లిపోయాడు.

విల్‌ఫర్ట్ ఆందోళనతో కిటికీలోనుంచి చూశాడు. తండ్రి నిశ్చింతగా నడిచి వెడుతున్నాడు. వీధి మొగలో కనిపెట్టుకుని చూస్తున్న ఇద్దరు వ్యక్తులు కనిపించారు. దుబ్బుమీసాలు, ఒత్తు కనుబొమ్మలుండి, నీలిపొడుగు కోటు ధరించిన వ్యక్తిని పట్టుకోడానికి కాబోలు చూస్తున్నారు. తండ్రి వారిని సమీపిస్తున్న కొద్దీ విల్‌ఫర్ట్ ఊపిరి బిగపట్టి చూశాడు. కాని, వేషంమార్చిన తండ్రిని గూఢచారులు అనుమానించలేదు. తండ్రి మలుపుతిరిగి దాటిపోయాడు.

వెంటనే విల్‌ఫర్ట్ గదిలో చిందరవందరగా ఉన్న సామానులన్నీ సర్ది, తండ్రి తెచ్చినకోటు, మఫ్లర్, టోపీ చుట్టబెట్టి తన

పెట్టి అమగున దాచేశాడు. మూలనున్న చేతికర్రను ముక్కలుగా విరిచేసి గాడిపొయ్యిలో పడేశాడు. అంతా అయిన తరవాత పరిచారకుని పిలిచి హోటల్ బిల్లు తెమ్మని ఆజ్ఞాపించాడు. బిల్లు చెల్లించి, క్షణమైనా జాప్యం చెయ్యకుండా తన గుర్రాలబండిలో బయలుదేరి వెళ్లిపోయాడు.

లయన్స్ చేరేసరికి అప్పుడే నెపోలియన్ గ్రెనోబుల్ చేరినట్లు విన్నాడు. తరవాత దారిలో అనేక ఆటంకాలు వచ్చాయి. అన్నిటినీ గడిచి విల్‌ఫర్ట్ మార్సెల్స్ చేరాడు. చిరకాల వాంఛితమైన ఉన్నతి లభించనున్న సమయంలో, మనుష్యులకు సామాన్యంగా కలిగే శంకా భయాలు అతన్ని ముప్పిరిగొన్నాయి.

# 13

నయర్‌టైర్ చెప్పిన జోస్యమంతా నిజమయింది. రాజరికం గజగజ లాడి పోయింది. పూర్వ సాంప్రదాయాలనూ, ద్వేషాలనూ నూతనాభిప్రాయాలతో వింతగా సంతరించి నిలబెట్టిన రూపరహితమైన రాజరికం, నెపోలియన్ ఒక్క చేసన్నతో గుభాలున కూలిపోయింది. విల్‌ఫర్ట్‌కు లభించినది నిరర్థకమైన మహారాజు కృతజ్ఞతా ప్రకటనమాత్రమే. ఇది నిరర్థకమేకాదు, ప్రమాదకరమైనదికూడా. మహారాజిచ్చిన పత్రాన్ని విల్‌ఫర్ట్ గుప్తంగా ఉంచేశాడు.

నయర్‌టైర్ జోక్యం చేసుకోకపోతే విల్‌ఫర్ట్‌ను నెపోలియన్ బర్తరఫ్ చేసేవాడే. నూరుదినాల సార్వభౌముని పరిపాలనలో నయర్‌టైర్ బలవంతుడైనాడు. 1739 లో గిరాండిస్టు, 1806 లో సెనేటర్ అయిన నయర్‌టైర్ తనకుమారుడు తనని రక్షించినందుకు ప్రతిఫలం దక్కించాడు.

సామ్రాజ్య పునస్థాపన కాలంలో డాంటే రహస్యం బైట పడకుండా కాపాడుకోవం విల్‌ఫర్ట్‌కి గగనమయింది. మహారాజు నియమించిన ప్రధాన న్యాయాధికారినే ప్రభుభక్తి లోపానికి బర్తరఫ్ చేశారు. అయినా సామ్రాజ్యపాలన స్థాపించబడిందో లేదో, దక్షిణాదిని అంతఃకలహాలు చెలరేగాయి. మేజస్ట్రేట్లు

ఎంత కృషి చేసినా కల్లోలం అణగలేదు. ఇళ్లలో తలుపులు వేసుకుని ముఖం దాచుకున్న రాజరిక పక్షవాదుల్ని రాజకీయ తీవ్రవాదులు విడిచిపెట్టలేదు. వారినిగురించి వ్యంగ్యచిత్రాలు ప్రచురించడంతో తృప్తిపడలేదు. దౌర్జన్యం భీషణంగా చెలరేగింది.

సహజ పరిణామాల కనుగుణంగానే మారెల్ ప్రాబల్యంవృద్ధియింది. డాంటెనిగురించి అతడు తీవ్ర యత్నం చేశాడు. ఉన్నతోద్యోగి బర్తరఫ్ అయినా, విల్ఫర్ట్ తన ఉద్యోగంలోనే ఉండిపోగలిగాడు. అతని వివాహం వాయిదా పడింది. చక్రవర్తి అధికారం స్థిరపడినట్లయితే, మరొక సంబంధం చూసుకోడం క్షేమమని భావించాడు. లేక, పద్దెనిమిదో లూయీ మళ్లీ సింహాసనానికి వచ్చినట్లయితే, ఆ సంబంధమే స్థిరపర్చుకోవచ్చును. అప్పుడు తను ఆర్జించుకున్న పరపతి, సెంట్ మిరాన్ పలుకుబడికితోడై, తాను మరింత వృద్ధిలోకి రావచ్చును.

ఈ రోజుల్లోనే ఒకరోజున మారెల్ విల్ఫర్ట్‌ని దర్శించడానికి వచ్చాడు. మరెవరైనా అయితే, అపేరువతో వెళ్లి మారెల్‌ను సత్కరించేవారే. కాని, విల్ఫర్ట్ ధృఢచిత్తుడు; సూక్ష్మగ్రాహి. మారెల్‌ని తన సహజధోరణిలోనే, అంతంతమాత్రంగా ఆదరించాడు. విల్ఫర్ట్ గర్వం అణిగిపోయి వుంటుందనుకున్న మారెల్ ఆశ్చర్యపడ్డాడు. ఉన్నతవిద్య పొందినవానికీ, విద్య లేనివానికీ మధ్యకల తెర అలాగే ఉండిపోయింది. తనని చూసి విల్ఫర్ట్ వొణికిపోతాడనుకున్నాడు. కాని, అతన్ని చూసి తానే అతి జాగ్రత్తగా ఉండవలసి వచ్చింది.

విల్ఫర్ట్ క్షణంపాటు అతన్ని నిశితంగా పరికించి అన్నాడు! "ఎవరు? మారెల్ కాదూ? ఏం పనిమీద వచ్చారు?"

"గ్రహించలేరా?" అన్నాడు మారెల్.

"లేదే గ్రహించలేను. చెప్పండి. నాచేతనైనదైతే తప్పకుండా చేస్తాను."

"అది కేవలం మీ చేతుల్లోనే ఉంది." అన్నాడు మారెల్. క్రమంగా అతనికి భయం తొలగిపోయింది. అనుచితమైనదేదీ తాను కోరడంలేదు. సక్రమమైనదే అడుగుతున్నానని ధైర్యం తెచ్చుకున్నాడు. ఇలా అన్నాడు: "చక్రవర్తి ఫ్రాన్సు రాక ముందు, ఒక నిర్భాగ్యుడైన యువకుని దయతో చూడాలని

మిమ్మల్ని ప్రార్థించాను. అతను నా ఓడలో మేట్. ఎల్బా ద్వీపంతో సంబంధం పెట్టుకున్నట్లు అతనిపైన అప్పుడు ఆరోపించారు. అది మీకు జ్ఞప్తిలో ఉండవచ్చును. అప్పుడది నేరంగా పరిగణించబడింది. ఇప్పుడు అది రాజభక్తి లక్షణం. అప్పుడు మీరు లూయీ మహారాజుకింద ఉద్యోగి. నేరస్థుని క్షమించలేదు. అప్పుడది మీ కర్తవ్యం. ఇప్పుడు మీరు నెపోలియన్ కింద ఉద్యోగం చేస్తున్నారు. ఇప్పుడతన్ని రక్షించడం మీ కర్తవ్యం. అతనేమైనాడో అడిగి తెలుసుకోడానికి వచ్చాను."

విల్‌ఫర్ట్ ఉద్రేకాన్ని అణుచుకోడానికి విశ్వప్రయత్నం చేశాడు. "అతని పేరు?"

"ఎడ్మండ్ డాంటే."

శత్రువు ఎదురుగా నిలిచి పిస్తోలు గురిపెట్టినా నిలవగలిగే వాడేగాని, డాంటే పేరు వినడం సహించలేకపోయాడు. తనలో ఇలా అనుకున్నాడు: "నేను వ్యక్తిగత ద్వేషంతో ఇతన్ని అరెస్టు చేయించానని నన్నెవ్వరూ నిందించలేరు." మారెల్‌తో పైకి ఇలా అన్నాడు: "పేరేమిటని చెప్పారు? డాంటే?"

"అవునండి."

ప్రక్క బీరువాలోనుంచి ఒక పెద్ద రిజిస్టరు తీసుకొచ్చాడు విల్‌ఫర్ట్. మేజామీద పెట్టి కాగితాలు తిరగేశాడు. అతి సహజ భావంతో అన్నాడు: "మీరు పొరపడ్డం లేదుకదా మారెల్?"

"లేదండి. పాపం అతన్ని నేను పదేళ్లుగా ఎరుగుదును. నాలుగేళ్లనుంచి నాదగ్గర పనిచేస్తున్నాడు. అతన్ని దయతో చూడాలని కోరుతూ మీవద్దకి ఆరువారాల కిందట వచ్చాను. ఇప్పుడతనికి న్యాయం చేకూర్చాలని కోరుతున్నాను. అప్పుడు నామాటను మీరంతగా మన్నించలేకపోయారు. అప్పుడు బోనపార్టిస్టుల పట్ల రాజరికవాదులు మరీ కఠినంగా ఉండేవారు."

"ఆగండి" అన్నాడు విల్‌ఫర్ట్. ఇంకొక రిజిస్టరు తీసి చూస్తూ "ఇదుగో ఇక్కడుంది. ఇతను నావికుడు కాదూ? కాటలన్ యువతిని పెళ్లిచేసుకున్నాడు. అవు నవును. జ్ఞాపకంవచ్చింది. వ్యవహారం అప్పుడు చాలా ప్రమాదమైనదికూడా."

"ప్రమాదమా? ఎలాగ చెప్పండి?"

"నాదగ్గర పరీక్ష పూర్తికాగానే అతన్ని ఇక్కడే బందీగా ఉంచారు మీకు జ్ఞాపకం ఉందా?"

"అవును. జ్ఞాపకం ఉంది."

"అప్పుడు నేను పారిస్‌కి నివేదికపంపాను; అతని దగ్గర దొరికిన పత్రాలుకూడా పంపాను. అది నాకర్తవ్యం. తప్పదుకదా! అరెస్టయిన ఎనిమిదిరోజులికి అతన్ని తీసుకుపోయారు. అతన్ని సెంట్ మార్గరెట్ ద్వీపాల్లోనో, పినెరోల్‌లోనో నిర్బంధించి ఉంటారు. దేశాంతరం పంపారు. ఎప్పుడో త్వరలోనే విడుదలై వచ్చేస్తాడు. మీ ఓడలో మళ్లీ చేరతాడు."

"అత నెప్పుడు వచ్చినాసరే నా ఓడలో అతని ఉద్యోగం ఖాళీగానే ఉంటుంది" అన్నాడు మొరెల్. "కాని ఇంకా ఎందుకు తిరిగి రాలేదతను? రాజరికవాదులచేత నిర్బంధంలో ఉంచబడిన వాళ్లందర్నీ విడుదలచెయ్యడం బోనపార్టిస్టుల ప్రథమ కర్తవ్యం."

"తొందరపడకూడదు మొరెల్. అంతా న్యాయశాసనం ప్రకారం జరగాలి."

"ఇప్పుడు మాకు విజయంలభించిందికదా? ఈ న్యాయశాసనపు తతంగం అంతావిడిచిపెట్టి వెంటనే విడుదల చేయించలేమా? నాకిప్పుడు మిత్రులున్నారు; పలుకుబడిఉంది. శిక్షను రద్దు చేయించలేనా?"

"శిక్ష ఏదీ పడలేదు."

"అయినా జైలునుంచి విడిపించవచ్చును."

"రాజకీయ నేరాలైనట్లయితే, ఖైదుల్లో రిజిస్టర్లు ఉంచరు. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్కడిని, ఎన్నటికీ కనిపించకుండా మాయం చేసెయ్యడం, ప్రభుత్వాలకు అవసరమౌతుంది. రిజిస్టరు ఉంటే ఆచోకీ దొరుకుతుంది. అందువల్ల రిజిస్టరు ఉంచరు. కారాగారాలవిషయంలో మహారాజుకంటె చక్రవర్తి మరింత జాగ్రత్తగా ఉంటారు. రిజిస్టర్లలో పేరైనా లేకుండా కారాగారాల్లో మగ్గుతున్న వాళ్లు అనేకమంది ఉన్నారు."

సహృదయులైనవారు ఇలాగే సులువుగా మోసపోతారు. మొరెల్‌కి అనుమానమైనా లేకపోయింది. విల్‌ఫర్ట్ చెప్పినదంతా నమ్మాడు.

"అయినాసరే చెప్పండి విల్ ఫర్ట్. పాపం డాంటేని వెంటనే విడుదల చెయ్యాలంటే ఏం చెయ్యమని మీ సలహా?"

"ఏముంది? మేజస్ట్రేటుకి దరఖాస్తు పెట్టుకోండి."

"దరఖాస్తుల సంగతి మీకు తెలుసుకదా! అటువంటివి మేజస్ట్రేటుకి రోజుకి రెండొందలొస్తాయి. అందులో నాలుగు చదువుతారేమో!"

"నిజమే" అన్నాడు విల్ ఫర్ట్. "కాని, నేను సంతకంచేసి పంపినదరఖాస్తుని చదువుతారు. మీరు దరఖాస్తు నా చేతికిస్తే నేను పంపగలను. అప్పుడు డాంటే నేరస్థుడే కావచ్చును. ఇప్పుడు నిర్దోషి. అప్పుడు శైదుకి పంపక తప్పలేదు. ఇప్పుడు అతని విడుదలకోసం సహాయపడతాను."

ఈవిషయం విచారణకు వస్తుందని భయపడి విల్ ఫర్ట్ ఈవిధంగా జాగ్రత్తపడ్డాడు.

"మరి మేజస్ట్రేటుకి ఎలా రాయడం?" అన్నాడు మారెల్.

"కూర్చోండి. నే చెప్తాను, మీరు వ్రాయండి."

డాంటేకి చక్రవర్తిపట్లగల భక్తిని ఉత్ప్రేక్షించి దరఖాస్తు వ్రాయించాడు. అసలు నెపోలియన్ తిరిగి రావటానికి తోడ్పడిన వారిలో డాంటే ముఖ్యుడన్నట్లు వ్రాయించాడు. ఇంక ఈ దరఖాస్తు చూడగానే డాంటేని విడిచిపెట్టక మేజస్ట్రేటుకి గత్యంతరం లేదన్నట్లుంది. వ్రాయడం ముగిశాక కాగితం తీసుకుని విల్ ఫర్ట్ పైకి చదివాడు.

"బాగుంది. ఇది నాచేతికివ్వండి. నేను దస్కతు పెట్టి ఇవాళే పంపుతాను. మిగతా పనంతా నాకు విడిచిపెట్టండి." అన్నాడు విల్ ఫర్ట్.

ఈ వాగ్దానంతో మారెల్ ఆశ కొండంతయింది. శుభవార్త చెప్పడానికి డాంటే తండ్రివద్దకు బయలుదేరాడు మారెల్. విల్ ఫర్ట్ ఆదరఖాస్తుని పారిస్ కి పంపడానికి బదులు మడిచి తన జేబులో దాచుకున్నాడు. పంపినట్లయితే ఇప్పుడు డాంటే వెంటనే విడుదల కావచ్చును. కాని, మహారాజు మరొకసారి సింహాసనానికి వస్తే, దీనివల్లనే డాంటే భవిష్యత్తు పూర్తిగా నాశనమౌతుంది. అప్పటికే యూరప్ లో రాజకీయాలు చూస్తే, మహారాజు తిరిగివచ్చే

సూచనలు కనిపిస్తున్నాయి. డాంటే వ్యవహారం ఇప్పటికే శృతి మించింది. విల్‌ఫర్ట్ ఇంక వెనుకంజ వయ్యాలేదు. అందువల్ల డాంటే బందీగానే ఉండిపోయాడు.

కూపాంధకారంలో మ్రగ్గిపోతున్న డాంటేకి దేశంలో జరుగుతున్న చరిత్రాత్మక సంఘటనలు తెలియడంలేదు. పద్దెనిమిదో లూయీ పరారైనాడు. తరవాత సామ్రాజ్యమే కూలిపోయింది. నూరుదినాల ద్వితీయసామ్రాజ్య పరిపాలనలో రెండుమార్లు డాంటేని విడుదల చేయించడానికి మారెల్ ప్రయత్నించాడు. రెండుమార్లూ విల్‌ఫర్ట్ మెత్తని మాటలతో వాగ్దానాలతో అతన్ని శాంతపరిచి పంపివేశాడు. చివరికి వాటర్లూ యుద్ధం జరిగింది. నెపోలియన్ ఓడిపోయాడు. మళ్లీ మారెల్ విల్‌ఫర్ట్ వద్దకు రాలేదు. మనిషికి సాధ్యమైన దెంతవరకూ ఉంటుందో, అంతవరకూ మారెల్ డాంటేకోసం చేశాడు. తిరిగి మహారాజు సింహాసనానికి వచ్చాడు. ఇంకయత్నించడం అతనికే క్షేమంకాదని ఊరుకున్నాడు.

పద్దెనిమిదో లూయీ మళ్లీ సింహాసన మెక్కాడు. మార్సెల్స్‌లో దుర్ఘటనల్ని సహించలేక, విల్‌ఫర్ట్ టూలస్‌లో ప్రధాన న్యాయాధికారిగా బదలీచేయించుకున్నాడు. అక్కడచేరిన పదిహేనురోజుల్లో అతనికి రినీతో వివాహమయింది. సెంట్‌మీరాన్ పలుకుబడి ఇప్పుడుమరింత పెరిగింది. డాంటే నూరుదినాల సామ్రాజ్య పాలనకాలంలోనూ, వాటర్లూయుద్ధం తరవాతనూ కూడా ఆ అంధకారకూపంలో భగవంతునిచేతా, మానవులచేతా విస్మరింపబడి ఏకాకిగా ఉండిపోయాడు.

నెపోలియన్ తిరిగివచ్చినప్పుడు డాంగ్లర్ తనగతి ఏమౌతుందో ముందే గ్రహించుకున్నాడు. ముఖ్యంగా డాంటేవ్యవహారం వల్ల తనకెటువంటి ముప్పు వస్తుందోనని భయపడ్డాడు. ఎప్పటికప్పుడు డాంటే తిరిగివచ్చి పగతీర్చుకుంటాడనుకుంటూఉండేవాడు. అందువల్ల నౌకల్లోఉద్యోగం విరమించుకోవాలని తనకు కోరికున్నట్లు మారెల్‌తో చెప్పాడు. మారెల్ సిఫార్సుపొంది ఒక స్పానిష్ వర్తకునివద్ద గుమాస్తాగా చేరాడు.

డాంటేతనకింక అడ్డులేదన్న దొక్కటే ఫెర్నాండో గ్రహించగలిగినది. డాంటేమాయంకావడానికి ఉన్నవీ లేనివీ అనేక

హేతువులు కల్పించిచెప్పి, మర్సిదాను మోసపుచ్చడానికే తన కాలమంతా వినియోగించాడు. ఒక్కొక్కప్పుడు ఆమెను బలవంతంగా ఎక్కడికైనా తీసుకుపోవాలని యోచించేవాడు. ఒక్కొక్కప్పుడు నిరాశతో, వేదనతో ఒంటరిగా విహారిస్తూ ఉండిపోయేవాడు. పగతీర్చుకోడానికి డాంటే వస్తాడేమోనని దారులన్నీ చూసేవాడు. వచ్చినట్లయితే, అతన్ని చంపి తాను ఆత్మహత్య చేసుకోవాలనుకునేవాడు. కాని, డాంటే తిరిగిరాలేదు. ఇంతలోనే నెపోలియన్ ప్రభుత్వం నిర్బంధసైనిక సమీకరణ ప్రకటించింది. ఫెర్నాండో వెళ్లక తప్పలేదు. తను లేనిసమయంలో డాంటే వచ్చి మర్సిదాను వివాహం చేసుకుంటాడని బెంగపెట్టుకున్నాడు. మర్సిదా అతని పట్ల ఎప్పుడూ అత్యంతస్నేహభావంతోనే ఉండేది. తన దుఃఖసమయంలో తనను విడిచి పెట్టక ఊరటనిస్తున్న ఫెర్నాండోపట్ల ఆమెకు జాలికలిగింది. ఫెర్నాండో సిపాయిగా వెళ్లిపోతున్న సమయంలో మర్సిదా అతన్ని సమీపించి ఇలా అంది: "బావా. నువ్వొక్కడివే నా కిప్పుడు స్నేహితుడివు. నువ్వు యుద్ధంనుంచి తప్పకుండా తిరిగి రావాలి. నన్నీ ప్రపంచంలో ఒంటరిగా విడిచి పెట్టకు. లేకపోతే నే నేమైపోతాను!"

వీడ్కోలు సమయంలో మర్సిదా చెప్పిన ఈమాటలు ఫెర్నాండోకు ఆశాహేతువైనాయి. డాంటే తిరిగి రాకపోయినట్లయితే మర్సిదా తన అధీనమౌతుంది. ఫెర్నాండో వెళ్లిపోగానే మర్సిదా ఒంటరిదైపోయింది. తనను ఒంటరిగా కన్నీళ్లు కుక్కుకుంటూ నిర్జనప్రాంతాలలో తిరిగేది. ఒక్కొక్కప్పుడు మార్సెల్స్ దిశగా చూస్తూ రాతిబొమ్మ వలె నిశ్చలంగా నిలబడి ఉండిపోయేది. ఒక్కొక్కప్పుడు సముద్రతీరాన కూర్చుని తన దుఃఖంవలెనే అవిరళమైన సాగరఘోషను ఆలకిస్తూ ఉండేది. దుఃఖాన్ని ఒక్కసారిగా అంతం చేసుకోడానికి ఆమె ఆత్మహత్య చేసుకునేదే. కాని, ఆత్మహత్య కెన్నడూ యత్నించ లేదు. అది ధైర్యం చాలక కాదు; మత సాంప్రదాయాలు నిషేధించినందువల్ల.

ఫెర్నాండో మాదిరిగానే కాడెరూస్ కూడా సైన్యంలో చేరవలసి వచ్చింది. కాని వివాహితుడైనందువల్ల అతన్ని సరిహద్దులు దాటి పంపలేదు. డాంటే తండ్రికి నెపోలియన్ పతనంతో ఆశలు కూలిపోయాయి. డాంటే అరెస్టయిన అయిదుమాసాలకు వృద్ధుడు మర్సిడా చేతుల్లో మరణించాడు.

# 14

పద్దెనిమిదో లూయీ తిరిగి రాజ్యానికి వచ్చిన ఏడాదికి కారాగారాల తనిఖీ జరిగింది. అంధకారకూపంలో ఉన్న డాంటేకి దూరంలో సందడి వినవచ్చింది. అంతదూరంలో ఆ సందడి సామాన్యులు మనుష్యులకైతే వినిపించదు. కాని, అంధకారంలో నివాసం అభ్యాసమైన డాంటేకి, ఇప్పుడు గోడపైన సాలెపురుగు కదిలినా, పైకప్పునుంచి నీటిచుక్కలు రాలినా, వినపడుతుంది. అవతల, స్వేచ్ఛగా జీవితాన్ని గడుపుతున్న వారి మధ్య ఏదో కొత్త సంచలనం బయలుదేరిందని అతను ఊహించుకున్నాడు. ఇన్నాళ్లు ఈ గోరీలో గడిపిన తను ఇంక చచ్చిన వారితోనే జతఅనుకున్నాడు.

తనిఖీ ఆఫీసరు వచ్చి ఖైదీల్ని చూశాడు. ఖైదీలలో మంద బుద్ధులూ, సోమరులూ అయినవారిని ఏరి, వారిని అంత కఠినంగా చూడనక్కర లేదని సిఫార్సు చేశాడు. వారి ఆహారం ఎలావుందని ప్రశ్నించాడు. ఏమైనా కోరికలుంటే తెలపమన్నాడు. అందరూ దాదాపు ఒకేరీతిగా సమాధాన మిచ్చారు. ఆహారం దుర్భరంగా ఉంది; విడుదల చెయ్యాలి. ఇంకేమైనా చెప్పవలసింది ఉందా అని అడిగాడు. ఖైదీలు లేదని తల లూపారు. అజన్మ కారాగారవాస శిక్షితులకు ఇంతకంటె కోరదగిన దేముంది? తనిఖీ ఆఫీసరు గవర్నరు వంక తిరిగి చిరునవ్వుతో అన్నాడు: "ఈ తనిఖీవల్ల ఏం ప్రయోజనం ఉంటుందో నాకు బోధపడటం లేదు. ఒక్క ఖైదీని చూస్తే చాలు, అందర్నీ చూసినట్లే. అందరు చెప్పేదీ ఒకటే. ఆహారం బాగుండలేదు; తామేపాపం ఎరగరు. ఇంతే. ఇంకెవరైనా ఖైదీలున్నారా?"

"ఉన్నారు. పిచ్చెత్తిన వాళ్ళు కూపాల్లో ఉన్నారు."

"అక్కడికి వెళదాం నడవండి" అన్నాడు తనిఖీ ఆఫీసరు, విసుగుదలతో. "చేసే పనేదో పూర్తిగా చెయ్యాలి."

"ఆగండి" అన్నాడు గవర్నరు. "కూడా ఇద్దర్ని పెట్టుకో వాలి మనం. ఆ ఖైదీలకి ప్రాణాలమీద విసుగుపుట్టి, ఒక్కొక్కప్పుడు మరణశిక్షైనా దొరుకుతుందికదా అనే ఉద్దేశంతో, దౌర్జన్యానికి దిగుతారు. వాళ్ళు మీమీదే పడవచ్చు."

ఇద్దరు సైనికులొచ్చారు. చీకట్లో అందరూ మెట్లు దిగారు. అక్కడ వాసన దుర్భరంగా ఉంది.

"ఇక్కడొక పెద్ద కుట్రదారు డున్నాడండి. వాడు దేనికీ పనికిరాడు."

"ఎన్నాళ్లనుంచి ఉన్నాడు?"

"ఏడాదినుంచి."

"మొట్టమొదటినుంచి వాణ్ని ఈ కూపంలోనే ఉంచారా?"

"లేదండి. ఆహారం తీసుకెళ్లే వార్డర్ని చంపడానికి ప్రయత్నం చేసిన తరవాతనే వాణ్ని ఇక్కడ పడేశాం. వార్డర్ ఇక్కడే ఉన్నాడు; వాడు చెప్తాడు."

"అవునండి. నన్ను చంపాలని చూశాడండి" అన్నాడు వార్డర్, ఏంటోయిన్. "వాడు రాక్షసుడండి."

"అయితే నువ్వు ఫిర్యాదు చేస్తావా?"

"అక్కర్లేదండి. వాడికి తగినశాస్తి అయింది. ఇంకో ఏడాది తిరక్కముందే వాడికి పూర్తిగా పిచ్చెత్తి పోతుందిలెండి."

"అది వాడికే మంచిదిలే" అన్నాడు తనిఖీ ఆఫీసరు. "పూర్తిగా పిచ్చెత్తిందంటే, వాడికింక బాధ లేది ఉండదు."

"బాగా చెప్పారు" అన్నాడు గవర్నర్. "మీకీ విషయం బాగా తెలుసునండి. ఇక్కడికి ఇరవై అడుగుల్లో ఇంకో కూపం ఉంది. అందులో ఒక ముసలి ఫాదరీ ఉన్నాడు. ఒకప్పుడు ఇటలీలో ఏదో పార్టీకి నాయకుడని చెప్తారు. ఇక్కడ 1811 నించి ఉంటున్నాడు. 1813 ఆఖరుకి అతనికి పూర్తిగా మతిస్థిరం తప్పింది. ఆతరవాత మనిషి గుర్తుపట్టడానికైనా వీల్లేకుండా మారిపోయాడు. మొదట తెగ ఏడ్చేవాడు; ఇప్పుడు తెగనవ్వుతున్నాడు. అప్పుడు బాగా చిక్కిపోయి ఉండేవాడు; ఇప్పుడు బలిశాడు. వీడికంటె

ఆఫాదరీని చూడ్డం మంచిది. అతని పిచ్చి చూస్తే నవ్వు వస్తుంది. విచారం కలగదు."

"ఇద్దర్నీ చూస్తాను. ముందు వీణ్ని చూద్దాం."

పెద్దతాళాలు చప్పుడైనాయి. తుప్పుపట్టిన తలుపులు గరగరమన్నాయి. ఒకమూల కూచున్న డాంటే ఈ శబ్దం వినగానే తలెత్తాడు.

గవర్నర్ చేతులు కట్టుకుని ఒక కొత్త వ్యక్తికి ఖైదీల్ని చూపటం డాంటే చూశాడు. ఇద్దరు కాగడాలు పట్టుకుని వచ్చారు. ఇద్దరు సైనికులుకూడా ఉన్నారు. దీని అర్థం డాంటే ఊహించాడు. గవర్నర్ కంటె పై ఉద్యోగి వస్తున్నందువల్ల, ఇది మంచి అవకాశ మనుకున్నాడు. లేచినిలబడి చేతులు కట్టుకున్నాడు. ముందుకు వచ్చాడు. వెంటనే సైనికులిద్దరూ తుపాకు లెత్తి దగ్గరకు వచ్చారు. తనిఖీ ఆఫీసరు ఒకడుగు వెనక్కు వేశాడు.

తాను దౌర్జన్యపరుడని చెప్పి ఉంటారని గ్రహించాడు డాంటే. నిశ్చలంగా నిలబడ్డాడు. ముఖంలోని కాఠిన్యాన్ని మాఫు చేసుకోడానికి ప్రయత్నించాడు. చూడవచ్చిన ఆఫీసరు దయ సంపాదించడానికి, వినయం ఉట్టిపడేలాగు తన కథనంతా చెప్పాడు. విన్నవారంతా చకితులైనారు. తనిఖీ ఆఫీసరు గవర్నరు వంక తిరిగి "ఇతను నిక్షేపంలా ఉన్నాడు. క్రమంగా రాజభక్తి నేర్చుకుంటాడులే. కాని, చాలా భయపడుతున్నట్టున్నాడు. చూడండి. తుపాకులు కనిపించగానే వెనుకంజ వేశాడు. పిచ్చివాడైతే దేన్ని చూసినాసరే జంకడు. ఈవిషయమై నేను చాలా చదివాను." అంటూ ఖైదీవంక తిరిగి అన్నాడు: "నువ్వు కోరదగేదైనా ఉందా?"

"నేనే నేరం చేశానో తెలుసుకోనివ్వాలనే నా కోరిక. న్యాయమూర్తుల్ని నియమించి నాపైన నేరాన్ని విచారించండి. నేను నేరస్థుడినైతే నన్ను కాల్చి చంపండి. నిర్దోషినని రుజువైతే విడుదల చెయ్యండి."

"నీకు ఆహారం నచ్చుతోందా?" అని అడిగాడు తనిఖీ ఆఫీసరు.

"బాగానే ఉందనుకుంటాను. కాని, నాకు సరిగ్గా తెలియ

దండి. నాకు అదంత ముఖ్యమైన విషయం కాదు. నాకు ముఖ్యమైన దేమిటంటే న్యాయం విచారించడం. అది నాకే కాదు; న్యాయాన్ని నిర్ణయించే శాసనవిధికి, మనల్ని పరిపాలించే మహారాజుకీకూడా ముఖ్యం. నావంటి నిరపరాధులు అన్యాయంగా నిర్బంధించబడకుండా కాపాడ్డం అందరికీ ముఖ్యమైన విషయమే."

"వార్డర్‌ని కొట్టాలని చూసినప్పుడు మరొక మాదిరిగా మాట్లాడావ్?" అన్నాడు గవర్నరు.

"నిజమేనండి. అతను నాపట్ల ఎప్పుడూ మంచిగానే ఉన్నాడు. క్షమించమని అతన్ని కోరుతున్నాను. కాని, అప్పుడేం చెయ్యను? కోపంతో పిచ్చెత్తిపోయింది. నా మనస్సు నా వశంలో లేకపోయింది."

"ఇప్పుడు నీ మనస్సు నీ వశంలో ఉందంటావా?"

"అవునండి. నిర్బంధం నన్ను లొంగదీసింది. చాలకాలం నుంచి ఇక్కడ ఉంటున్నాను."

"ఎంతకాలం? నువ్వు అరెస్టయిన దెప్పుడు?"

"1815 ఫిబ్రవరి 28 మధ్యాహ్నం రెండు గంటలకి అరెస్టయినాను."

తనిఖీ ఆఫీసరు లెక్కగట్టాడు. "ఇప్పుడు 1816 జూలై 30. అంటే? నువ్వు నిర్బంధంలో ఉన్నది పదిహేడు మాసాలేనా? ఇంతేనా?"

"ఇంతేనా అంటున్నారా? ఖైదులో పదిహేడుమాసాలు గడపడం అంటే ఎలా ఉంటుందో మీకు తెలియదు. అది పదిహేడు సంవత్సరాలలో, పదిహేడు యుగాలలో ననిపిస్తుంది; ముఖ్యంగా నావంటివాడికి. పెళ్లి చేసుకోబోతున్నాను. మంచి ఉద్యోగం దొరికింది. ఒక్క క్షణంలో అంతా తుడిచిపెట్టుకుపోయి, వెలుగులోనుంచి ఈఅంధకారంలోకి పడిపోడం, భవిష్యత్తు నాశనమైపోవడం, ప్రియురాలు ఇంకా ప్రేమతో ఉన్నదో లేదో తెలియక, తండ్రి జీవించిఉన్నాడో లేదో తెలియక, ఇక్కడ ఇలా మగ్గిపోడం ఎటువంటిది? పదిహేడు మాసాల కారాగారవాసం ఎంత నీచ నేరానికైనా పొందవలసిన శిక్ష కాదు. నన్ను

కరుణించండి. మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. నేను కోరేదల్లా ఒక్కటే. నా నేరాన్ని విచారించండి. ఇది నిరాకరించరానిది కదా!"

"అవును. దాని సంగతేదో చూస్తాను" అన్నాడు తనిఖీ ఆఫీసరు. గవర్నరు వంక తిరిగి, "తిరిగి వెళ్ళేటప్పుడు ఇతన్ని గురించిన కాగితాలు రిజిస్టర్‌లో నాకు చూపించండి."

డాంటే మళ్ళీ అన్నాడు :—"నన్ను విడుదలచేసే అధికారం మీకు లేకపోవచ్చును. కాని నా ప్రార్థనను మీరు అధికారులకు అందచెయ్యగలరు. నేరవిచారణ ఒక్కటే నేను కోరేది. నేనే నేరం చేశానో, నాకే శిక్ష విధించారో తెలుసుకో గలుగుతాను. ఇది తెలియకపోవడం కంటె క్రూరహింస మరొకటి ఉండదు."

"సరే, పైకి దీపం చూపించండి" అన్నాడు తనిఖీ ఆఫీసరు.

డాంటే అన్నాడు: "అయ్యా! మీకంఠ స్వరాన్ని బట్టి మీకు నాపైన దయకలిగిందని ఆశపడుతున్నాను. నేను ఆశపడవచ్చునా? ఒక్కమాట చెప్పండి."

"అలా చెప్పడానికి వీల్లేదు. నీ రికార్డు పరిశీలిస్తానని మాత్రం చెప్పగలను. నిన్ను అరెస్టు చేయించిన వాడెవరు?"

"విల్‌ఫర్ట్. ఆయన్ని చూసి, ఆయనతో సంప్రదించండి."

"విల్‌ఫర్ట్ మార్సేల్స్ విడిచి వెళ్ళి ఏడాదయింది. ఇప్పుడు టూలస్‌లో ఉన్నారు."

"ఓహో! అదా?" అని గొణుక్కున్నాడు డాంటే. "నన్ను రక్షించగలవాడొక్కడూ ఇక్కడ లేడన్నమాట!"

"విల్‌ఫర్ట్ నీపైన ద్వేషం పెట్టుకోడానికి కారణమేమైనా ఉందా?"

"ఏమీ లేదండి. ఆయన నాపైన దయతోకూడా ఉన్నారు."

"అయితే, ఆయన ఇచ్చిన సమాచారాన్ని నేను నమ్మవచ్చునన్నమాటేనా?"

"తప్పకుండా."

"అయితేసరే. ఏమౌతుందో కనిపెట్టుకుని ఉండు."

డాంటే మోకాళ్ళపైన వొంగి, చేతులెత్తి నమస్కరించాడు. తన నీ నరకంలోనుంచి ఉద్ధరించడానికి దేవతవలెవచ్చి ఆశ పురి

గొల్పిన వ్యక్తిని ఆశీర్వదించాలని భగవంతుని ప్రార్థించాడు. తలుపులు మూసుకున్నాయి. గది మళ్లీ అంధకారబంధుర మయింది. కాని ఆవ్యక్తిచూపిన ఆశ, డాంటే ఒంటరితనంలో వెలుగు నిచ్చింది.

ఇవతలకి వచ్చిన తరవాత తనిఖీఆఫీసరుతో గవర్నర్ అన్నాడు: "ముందు ఇతని రికార్డుచూస్తారా? లేక ఇంకో ఖైదీని చూస్తారా?"

"ముందుఖైదీ లందర్నీ చూడ్డం పూర్తికావాలి."

"ఇప్పుడు మనం చూడబోతున్న ఖైదీ ఇతనిమాదిరిగా ఉండడు. అతని భ్రమలూ, యోచనలూ ఇతనిగోడులా ఉండవు. తనకి పెద్ద ధన నిక్షేపం ఉందనుకుంటూ డతను. ఖైదులో ఉంచిన మొదటి సంవత్సరం, తన్ని విడుదల చేస్తే ప్రభుత్వానికి పదిలక్షల ఫ్రాంకు లిస్తాననేవాడు. రెండో సంవత్సరం ఇరవై లక్షు లిస్తాననే వాడు. మూడో సంవత్సరం ముప్పై లక్షలు; ఇలాగే లంచం పెంచు కుంటూ వచ్చాడు. ఇప్పటికి అయిదేళ్లయింది. ఇప్పుడు మిమ్మల్ని చూడగానే మీతో రహస్యంగా మాట్లాడి, ఏభైలక్షు లిస్తానంటా డనుకుంటాను!"

"ఈ కోటీశ్వరుడి పేరేమిటి?"

"ఫెరయా."

"27 నంబరు?"

"అవునండి. ఏంటోయిన్! తలుపు తియ్యి."

తనిఖీ ఆఫీసరు నలువంకలా కుతూహలంతో చూస్తూ ప్రవేశించాడు. గోడసున్నం గిలికి, గదిమధ్యలో పెద్ద సున్న గీసి, సున్నమధ్య కూచున్నాడు ఫెరయా. దుస్తులు బొత్తిగా చిరిగి పోయున్నాయి. రేఖాగణితానికి చెందిన రేఖా చిత్రాలేవో గీస్తూ కూచున్నాడు. మహా విజ్ఞానశాస్త్రవేత్త వలె ధ్యానమంతా తన పనిపైన లగ్నం చేశాడు. తేమనేలపైన కాగడాల వెలుగు పడే వరకూ రేఖాగణితంనుంచి ఫెరయా మేలుకోలేదు. వెలుగు చూసి చటుక్కున లేచి నిలబడ్డాడు. ఇంకొంచెం గౌరవంగా కనిపించ డానికి, పడకపై నున్న గుడ్డ లాగి ఒంటికి చుట్టుకున్నాడు.

తనిఖీ ఆఫీసరు మామూలు పాట మొదలు పెట్టాడు:

"నువ్వడగవలసిందేమైనా ఉందా?"

ఫెరయా ఆశ్చర్యపడినట్లు చూశాడు. "నేనా? నాకు కావల సింది ఏదీ లేదు."

"నీకు బోధపడ్డం లేదు. నేను ప్రభుత్వం తరఫున వచ్చాను. ఖైదీల్ని చూసి వాళ్లు చెప్పేవీ, కోరేవీ తెలుసుకోడం నా కర్తవ్యం."

"ఓ! అదైతే వేరు. ఇద్దరం ఒకరి నొకరు అర్థం చేసుకోగల మనే అనుకుందాం. నేను ఫెరయా. ఫాదరీని. రోమ్ నగరంలో పుట్టాను. కార్డినల్ రొస్పిగ్లియాజీ వద్ద ఇరవైయేళ్లు కార్య దర్శిగా ఉన్నాను. నన్నెందుకు అరెస్టుచేశారో నాకు తెలియదు. 1811 లో అరెస్టు చేశారు. అప్పటినుంచీ నన్ను విడుదల చెయ్యా లని ఇటాలియన్ ప్రభుత్వాన్నీ, ఫ్రెంచి ప్రభుత్వాన్నీ కూడా అడుగుతున్నాను"

"ఫ్రెంచి ప్రభుత్వాన్నెందుకు అడుగుతున్నావు?" అన్నాడు గవర్నరు.

"ఎందుకంటే? నన్ను పియాంబినోలో అరెస్టు చేశారు. మిలాన్, ఫ్లారెన్స్‌ల మాదిరిగానే పియాంబినో కూడా ఫ్రెంచి ప్రభుత్వం కిందికి వచ్చిందికదా!" (నెపోలియన్ జయించిన ప్రాంతాలివి).

"అబ్బో! ఏనాటిమాట నువ్వు చెప్తున్నది?"

"నేను అరెస్టయిన రోజు నున్న పరిస్థితి అది. భగవంతు డిచ్చిన కొడుకు కోసమని నెపోలియన్ చక్రవర్తి రోమ్‌లో ఒక రాజరికాన్ని సృష్టించారు. నెపోలియన్ విజయాలు ఈపాటికి మెకియావలీ, సీజర్ బార్గియాలు కన్న కలల్ని కూడా మించిపో యుండాలి. వాళ్లు ఇటలీ నంతనీ ఒక్క ప్రభుత్వం కిందికి తేవా లని కలలు కనేవారు."

తనిఖీ ఆఫీసరు అన్నాడు: "నే చెప్పేది విను. భగవంతుడు కనికరించబట్టి చక్రవర్తి బ్రహ్మాండమైన కార్యక్రమాలకి అడ్డుపుల్ల తగిలింది. పాపం నీకలలు కూలిపోయా యనుకుంటాను."

"ఇటలీని బలీయమైన రాజ్యంగా చెయ్యాలంటే, దేశాన్ని ఐక్యపరచడం ఒక్కటే మార్గం. అప్పుడే ఇటలీకి స్వాతంత్ర్యం, అభ్యున్నతి లభిస్తాయి."

"కావచ్చును. కాని, పెద్దపెద్ద రాజకీయాల్ని గురించి నీ ఉపన్యాసాలు వినడానికి రాలేదు. నీ ఆహారంగురించి కాని, మరొక దాన్ని గురించి కాని నువ్వు అడగవలసిన దేదైనా ఉంటే అడుగు. అది వినడానికి వచ్చాను."

"ఆహారం ఎలావుంటుంది? ఖైదుల్లో ఉన్నట్లే ఉంటుంది. అంటే, బొత్తిగా పాడుగా ఉంటుందన్నమాట. వసతిమాట అడిగితే, మామూలుగా, ఎంత క్షేమగా ఉంటో. బొత్తిగా అసహ్యంగా ఉంది. కూపంఅంటే ఇలాకాక ఇంకెలాఉంటుంది? కాని, ప్రభుత్వానికి తెలపవలసిన కొన్ని ముఖ్య రహస్యా లున్నాయి. అందువల్లనే మీరొచ్చినందుకు చాలాసంతోషిస్తున్నాను— న్యూటన్ సిద్ధాంతాల్ని బోల్తాకొట్టించే ఒక లెక్క వేస్తున్నాను; నాధ్యానం పాడు చేసినందుకూడా మిమ్మల్ని ఏమీ అనడం లేదు. మీతో ఒకరహస్యం చెప్పాలి. వింటారా?"

"అబ్బె! అది కుదరదు."

"పోనీ, బోలెడుధనం గురించిన రహస్యం అనుకోండి, మాట వరసకి ఏ ఖైలక్షలఫ్రాంకులు ప్రభుత్వానికి లభిస్తుందనుకోండి. ఇప్పుడా రహస్యం వింటారా?"

"ఓయిబాబ్బో!" అంటూ తనిఖీఆఫీసరు గవర్నరు వంక తిరిగాడు. "మీరు చెప్పిందినిజమే. లెక్కకూడా సరిగ్గాచెప్పారు."

తనిఖీఆఫీసరు వెళ్లిపోతున్నాడనిచూసి ఫేరయా అన్నాడు. "కాని, నామాటవినండి. పోనీ మీ ఒక్కరికీ రహస్యంగా చెప్పాలనను. గవర్నరుకూడా వినవచ్చును."

గవర్నర్ అన్నాడు: "నువ్వు ఏంచెప్తావో నాకు ముందే తెలుసునోయ్, నీ ధన నిక్షేపాన్ని గురించి ఏకరువు పెడతావు. అంతేనా?"

పరిహాసంచేస్తున్న గవర్నర్ని ఫేరయా నిశ్చలదృష్టితో చూశాడు. మరెవరైనా అతన్ని చూసినట్లయితే, అతను సత్యమే పలుకుతున్నాడని, మతితప్పిన వాడు కాదని భావించేవారే.

"అవును. అదికాకపోతే మరి దేన్ని గురించి మాట్లాడతాను?" అన్నాడు.

తనిఖీ ఆఫీస రన్నాడు: "దేవుడిదయవల్ల ప్రభుత్వానికి కావలసినంత ధనం ఉంది. నీధనం అక్కర్లేదు. ఆ నిక్షేపాన్నం తనీ నువ్వు విడుదలయ్యే రోజుకి దాచుకో."

"కాని, న్యాయానికి విరుద్ధంగా నన్ని నిర్బంధంలో ఉంచితే, రహస్యాన్ని ఎవ్వరికీ చెప్పకుండా నేను చచ్చిపోతే, ఏమౌతుంది? ఈ నిక్షేపమంతా నష్టమై పోతుంది. అంతకంటె దాన్ని ప్రభుత్వం తీసుకోడం మేలు కాదూ? ఇంకా కావాలిస్తే అరవై లక్షలిస్తాను. అవును, అరవై లక్షలూ ఇచ్చేసి, నేను మిగిలిందే తీసుకుంటాను. నన్ను విడుదల చేస్తేచాలు."

"నిజంగా, ఇతను పిచ్చివాడని ముందు చెప్పకపోతే, నిజమే చెప్తున్నా డనిపిస్తుంది సుమా! అంత నమ్మకంగా చెప్తున్నాడు" అన్నాడు తనిఖీఆఫీసరు.

"నేను పిచ్చివాణ్ని కాను. నిజమే చెప్తున్నాను. ఈ ధన నిక్షేపం నిజంగా ఉంది. నేను మీకు వ్రాసిఇస్తాను. నన్నా చోటికి తీసుకువెళ్లండి. మీరు చూస్తుండగానే నేల తవ్విద్దాం. అక్కడేమీ కనిపించక, నేను మిమల్ని మోసంచేసిన వాడినైతే, నేను పిచ్చివాడినే అయితే, నన్ను తిరిగి ఇక్కడికి తీసుకొచ్చి మళ్ళీ నిర్బంధంలో ఉంచండి. ఇక్కడే చివరిదాకా ఉంటాను. మిమ్మల్ని ఇంకేమీ అడక్కుండా, ఇక్కడే చచ్చిపోయే వరకూ ఉండిపోతాను."

గవర్నర నవ్వాడు: "ఎక్కడుందీ నిక్షేపం?"

"ఇక్కడికి మూడువందల మైళ్లదూరంలో."

"మంచి ఉద్దేశమే! ఈ ప్రయాణానికి ఒప్పుకుంటే, నీకు పారిపోడానికి చక్కని వీలు దొరుకుతుంది."

"సరే. నువ్వు చెప్పింది విన్నాం. ఇంక చెప్పు. నీ ఆహారం ఎల్లావుంది?"

ఫెరయా అన్నాడు: "నేను చెప్పింది సత్యమైతే, మీరు నన్ను విడుదల చేస్తారని ప్రమాణం చెయ్యండి. అదెక్కడ పాతి పెట్టిఉందో మీకు చూపిస్తాను.

"నీకు ఆహారం సరిగ్గా ఉందా?" అన్నాడు మళ్లీ తనిఖీ ఆఫీసరు విసుగుతో.

ఫెరయా అన్నాడు: "మీకు రాగల ప్రమాద మేమీ లేదు. పని పూర్తయేవరకూ నే నిక్కడే ఉంటాను."

"నా ప్రశ్నకి జవాబుచెప్ప వన్నమాట?"

"మీరూ నా ప్రశ్నకి జవాబు చెప్పడంలేదు. నా మాట నమ్మనివాళ్లందరితోపాటు నువ్వూ విరగడైపో. నా బంగారం తీసుకోవు. పోనీ! నాకే ఉంటుంది. నాకు స్వేచ్ఛ నివ్వవు. నాకు దేవుడే ఇస్తాడులే. వెళ్లు. నీకింక చెప్పవలసింది లేదు" అన్నాడు ఫెరయా బిగ్గరగా.

తనిఖీ ఆఫీసరు మెట్లెక్కి వెడుతూ గవర్నర్‌తో అన్నాడు: "ఇతనికి ఒకప్పుడు భాగ్యం ఉండిఉంటుంది."

"ఉందని కలగన్నాడేమో! తీరా మేలుకు నేసరికి మతిపోయి ఉంటుంది."

"అవును. నిజంగా భాగ్యమే ఉంటే, ఖైదులో ఎందుకుంటాడు?"

ఫెరయా బందీగానే ఉండిపోయాడు. ఎప్పటికంటె మరింత సుఖంగా ఉంటున్నాడని పేరు పడ్డాడు.

డాంటే విషయంలో తనిఖీ ఆఫీసరు తనమాట నిలబెట్టుకున్నాడు. రిజిస్టరు తెప్పించి చూశాడు. అందులో ఇలా వుంది:-

ఎడ్మండ్ డాంటే: బోనపార్టిస్ట్. దౌర్జన్యపరుడు. ఎల్బానించి నెపోలియన్ తిరిగిరావడానికి తోడ్పడ్డాడు. దిట్టమైన గస్తీలో, రహస్య ప్రదేశంలో నిర్బంధించాలి.

రిజిస్టర్‌లో మిగతా వాక్యాల దస్తూరికీ, ఈ వాక్యాల దస్తూరికీ వ్యత్యాసం కనిపించింది. అంటే డాంటేని నిర్బంధంలోకి తీసుకొచ్చిన తరవాత ఇది వ్రాశా రన్నమాట. నేరం తోసివెయ్యగలిగింది కాదు. అందువల్ల దానికింద తనిఖీ ఆఫీసరు "ఇంకేం చేసేది లేదు." అని వ్రాశాడు.

ఈ దేవత దర్శనంతో డాంటేకి ఆశ పుట్టింది. నిర్బంధంలో ఉన్నందువల్ల ఇదివరలో రోజులలెక్క మరిచిపోయాడు. తనిఖీ ఆఫీసరు వచ్చి తేదీ చెప్పివెళ్లాడు. డాంటే అది మర్చిపోలేదు. గోడపైన సున్నంతో వ్రాశాడు: "1816 జూలై 30" ఆతరవాత ప్రతిరోజూ ఒక్కొక్క గీత గీసేవాడు. రోజులుగడిచాయి. వారాలు గడిచాయి. మాసాలు గడిచాయి. ఇంకా డాంటే నిరీక్షిస్తూనే ఉన్నాడు. పది

హేనురోజుల్లో తనకి ముక్తి వస్తుందని మొదట లెక్క వేసుకు న్నాడు. తనిఖీ ఆఫీసరు ఎంత అశ్రద్ధతో ఉన్నా, కనీసం పది హేను రోజుల్లోనైనా పని నెరవేరక పోదనుకున్నాడు. పది హేను రోజులు గడిచిపోయినప్పుడు, ఆఫీసరు పారిస్ వెళ్ళేవరకూ ఏమీ చెయ్యలేడుకదా అనుకున్నాడు. కారాగారాల తనిఖీ అంతా పూర్తయితే కాని పారిస్ వెళ్లడు. అది ఒకటి, రెండు మాసాలు పట్టవచ్చును. అందువల్ల ఈమారు మూడు మాసాలు గడువు కట్టాడు. మూడు మాసాలూ గడిచాయి. అప్పుడింకొక యోచన తట్టింది. ఈమారు ఆరు మాసాలుగడువు పెట్టుకున్నాడు. అది కూడా గడిచిపోయిన తరవాత లెక్క చూసుకున్నాడు. అతనిప్ప టికి పదిన్నర మాసాలనించి వేచి ఉన్నాడు. ఈ పదిన్నర మాసా ల్లోనూ అతని జీవితంలో ఎటువంటి మార్పూ లేదు. ఉపశమనం ఇవ్వగల వార్తేదీ అతనికందలేదు. జైలర్‌ని ఎన్ని సార్లడిగినా మౌనంగానే ఉన్నాడు.

డాంటే తనకి మతి పోలేదుకదా అని అనుమానించాడు. తన ఆశకి ఆధారమైన ఆ విషయం కేవలం తన భ్రమాకల్పన కాదుగదా? దేవతవలె బందిఖానాలోకి వచ్చిన ఆవ్యక్తి, స్వప్నంలో చూసిన రూపం కాదుగదా?

ఏడాది అనంతరం కొత్త గవర్నరొచ్చాడు. అతనికి ఖైదీ లందరి పేర్లూ తెలుసుకోడం కష్టం. అందువల్ల ఖైదీల నంబర్లు మాత్రమే తెలుసుకున్నాడు. నిర్భాగ్యుడైన ఆ యువకుని పేరు ఎడ్మండ్ డాంటే అన్న విషయం విస్మరించబడింది. అతని నంబరు 34.

# 15

లోకంచేత విస్మరించబడి, సాటిమానవుల అనునయ వాక్కు లకు ముఖంవాచిన ఖైదీ ఏయే బాధలకు గురౌతాడో, అన్నిటినీ డాంటే అనుభవిస్తున్నాడు. నేరం చెయ్యలేదన్న భావన వల్ల కలిగే ఆత్మాహంకారం మొదట అతనికి స్థైర్యమిచ్చింది. కాని క్రమంగా అది సడలిపోవారంభించింది. తాను నిజంగా

అపరాధి కాబోలునని శంకించడం మొదలు పెట్టాడు. అప్పుడతన్ని దైన్యం ఆవహించింది. అయినా అతను సర్వాంతర్యామిని ప్రార్థించలేదు. మానవునే ప్రార్థించాడు. ఈ కూపంనుంచి మరొక చోటికి మార్చవలసిందని, అదేటువంటి చోటైనాసరే మార్పు చేస్తేచాలని, ఆవరణలో నడవ నివ్వాలని, చదువుకోడానికి గ్రంథాల నివ్వాలని, ప్రార్థించేవాడు. అతని కోరికల్ని అధికారులు మన్నించకపోయినా ప్రాధేయ పడ్డం మానేవాడు కాదు. కొత్తగా వచ్చిన జైలర్‌తో చనువుగా మాట్లాడేవాడు. కాని కొత్తజైలర్ నోరుమెదిపేవాడు కాదు. అయితే ఏం? మూగవానితోనైనాసరే మాట్లాడ్డం, అదొక తృప్తిగా ఉండేది. తన కంఠస్వరం తానే వినడానికి మాట్లాడేవాడు. ఒంటరిగా ఉన్నప్పుడు తనలోతాను మాట్లాడుకోడానికి ప్రయత్నించాడు. కాని భయపడిపోయాడు. డాంటే స్వేచ్ఛగా తిరిగినరోజుల్లో ఖైదీల్ని చూశాడు. దొంగలు, గజదొంగలు, హంతకులు, లేని ఉల్లాసం తెచ్చి పెట్టుకుని మొరటు కేకలతో గడపడం చూశాడు. ఆవిధంగా తనని పదిమంది ఖైదీలతో చేర్చినా కొంత నయంగా ఉండేది. రోజురోజూ జైలర్ కరుకుచూపులు తప్ప ఇంకొక ముఖమే కనిపించదు. అతని కంటె బానిసలు, హంతకులు, దోపిడిదొంగలే సుఖంగా ఉన్నారు. వాళ్లు కలిసి ఉంటారు. ఆకాశం చూడగలరు. వీచే గాలిలో తిరగగలరు. తనకి మరొక ఖైదీ తోడుగా ఉండాలని, ఒకనాడు జైలర్ని కోరాడు. ఎవరినిచ్చినా సరే అంగీకారమే నన్నాడు. పిచ్చెత్తిన ఫాదరీ అయినాసరే చాలన్నాడు. జైలర్ కర్కశస్వరం మాటున, మానవసహజమైన కారుణ్యం ఇంకా పూర్తిగా మణిగి పోలేదు. పైకివ్యక్తపరచకపోయినా, జైలర్ ఈయువకుని మనోవ్యథను గ్రహించి లోలోన జాలిపడేవాడు. 34 నంబరు బందీ కోరికను గవర్నర్‌కి తెలియపరిచాడు. ఇది బందీల్ని కుట్రకి పురికొల్పడానికో, తోడుతీసుకుని పారిపోడానికో పన్నాగమని అనుమానించి, గవర్నర్ నిరాకరించాడు.

మానవుల్ని ప్రార్థించి డాంటే కడవరకూ చూసి, విఫలుడై, తరవాతనే తన ధ్యానాన్ని భగవంతుని పైకి మరల్చాడు. నిత్యం కష్టాలలో కాపురంచేసే నిర్భాగ్యుల ప్రార్థ

ష్యలు, పవిత్రయోచనలు అతని తలపుకు వచ్చి కొంత మనశ్శాంతి నిచ్చాయి. చిన్నతనంలో తల్లి నేర్పిన భగవత్ప్రార్థనలు జ్ఞప్తికి వచ్చాయి. వానిలో అతనికి నూతనార్థాలు స్ఫురించాయి. ఈమారు పవిత్రకాంక్షతో, చిత్తశుద్ధితో భగవంతుని ప్రార్థించాడు. ఒంటరితనంలో తన స్వరాన్ని తాను వినే భీతి తొలగిపోయింది. గొంతెత్తి భగవంతుని కీర్తించాడు. కీర్తించి డాంటే ఆనంద వివశుడైనాడు.

అయితే ఎంత ప్రార్థించినా డాంటే బందీగానే ఉండిపోయాడు. దైవంకూడా కనికరించలేదు! తిరిగి క్రమంగా అతన్ని నిస్పృహ ఆవహించింది. డాంటే విద్యాహీనుడు. గాంభీర్యం ఎరుగడు. గతజీవితంలో కొద్ది సంవత్సరాలే అతనికి వెలుగునీ ఆనందాన్నీ ఇచ్చాయి. భవిష్యత్తు అనేది ఉన్నదో లేదో తెలియదు. ఆ స్వల్పకాలపు వెలుగే జీవితమంతకీ గుడ్డివెలుగు నిస్తున్నది. పంజరంలో డేగ బంధించబడినట్లు, అతని స్మృతి ఆ అల్ప వ్యవధికే పరిమితమై పోయింది. అకారణంగా, దుర్విధికుట్రవల్ల భగ్నమై పోయిన ఆ అల్పసౌఖ్యానుభవాన్ని జారిపోకుండా పట్టుకున్నాడు. డాంటే ఎప్పుడూ శారీరకబలంపైన విశ్వాసంతో ఉండేవాడు. ఇప్పుడా విశ్వాసం నశించింది—అనేకమందికి నశించినట్లే. కాని ఈ అనుభవంకూడా అతనికి ఫలించలేదు. మతానురక్తి పోయి, నిష్ఠురకోపం అతన్ని ఆవహించింది. జైలర్‌ని అనరాని మాటలన్నాడు. వినలేక జైలర్ చెవులు మూసుకుని పారిపోయేవాడు. గోడపై తల కొట్టుకునేవాడు. క్రోధాన్ని పరిసరాలపై తీర్చుకునేవాడు.

తనపై నేరంమోపిన ఉత్తరం విల్‌ఫర్ట్ చూపించినది జ్ఞప్తికి వచ్చేది. తన అధోగతికి హేతువు ఈశ్వరాగ్రహం కాదనీ, మానవుల ద్వేషమేననీ చెప్పుకున్నాడు. బుద్ధి కల్పన కెంతవరకూ వీలుంటుందో, అంతవరకూ అన్నివిధాల శిక్షల్నీ తలపోసి, తన శత్రువుల్ని మానసికంగా ఆ శిక్షలకి గురిచేసేవాడు. తన శత్రువులకి ఈశిక్షలు చాల వనుకునేవాడు. వాళ్లు చావకూడదు. బ్రతికి ఉండే యాతనలన్నీ అనుభవించాలని కోరుకునేవాడు. చావనేది భయపడవలసింది కాదని పదేపదే భావించిన అతనికి, క్రమంగా ఆత్మహత్య చేసుకోవాలనే తలపుకూడా వచ్చింది.

ఆత్మహత్యాభావం అతనికి సంతృప్తి నిచ్చింది. అది భూతకాలానికీ భవిష్యత్కాలానికీ మధ్య అఖాతంవంటిది. ఈ అఖాతానికి దిగువ మట్టమ నేది ఉండదు. సర్వ దుఃఖాలూ కష్టాలూ నిద్రలోవలె కళ్లు మూసుకుంటాయి. ఆపైన చైతన్యమే ఉండదు. మనో నేత్రంలో మెదుల్తున్న సర్వ రూపాలూ చెరిగి పోతాయి. మృత్యుదేవత తన్ని కరుణించడానికి వచ్చి గోడవారల నిలబడి ఉన్నదని భావించేవాడు. ఆ దేవతను చూసి గత యాతనా స్మృతులు ఏకాకులై పారిపోతున్నట్లు తోచింది. ఇప్పుడు డాంటే గతాన్ని గురించి శాంతచిత్తంతో తలపోయగలుగుతున్నాడు. భవిష్యత్తును గురించి తలుచుకుంటేమాత్రం గుండె చెదిరిపోయేది. అందువల్ల ఆ రెండింటిమధ్యనూ ఒక విశ్రాంతినిలయాన్ని మనస్సులో స్థాపించుకున్నాడు.

డాంటే ఇలా తలపోశాడు: "నేను స్వేచ్ఛగా ఉన్న రోజుల్లో, నా దీర్ఘ ప్రయాణాలలో, ఎన్నిమార్లు ఆకాశంలో మేఘాలావరించడం చూశాను! తరంగాలు శివమెత్తి తాండవించడం, తుపాను చెలరేగి తన రెక్కలతో ఆకాశపు టంచుల్ని తాడించడం ఎన్ని మార్లు చూడలేదు! ఒక్కొక్కప్పుడు సముద్రాలలో, ఉవ్వెత్తుగా లేచి మీదికి వచ్చిపడుతున్నట్లు కనిపించే కొండలు గుట్టలు, మృత్యువునీడలవలె కనిపించేవి. హడలిపోయేవాడిని. వాని నుంచి తప్పించుకోడానికి సర్వయత్నాలూ చేసేవాడిని. నే నప్పుడు జీవితాన్ని ఆనందంగా గడిపేవాడిని. ఆ ఆనందాన్ని కాపాడుకోడంకోసం ప్రాణాల్ని కాపాడుకునేవాడిని. కాని ఇప్పుడదేమీ లేదు. జీవితంపైన కాంక్ష జనింపచెయ్యగల ప్రతి అంశమూ నష్టమైపోయింది. జోలపాడుతూ పసిబిడ్డని నిద్రపుచ్చే దాది చిరునవ్వు నవ్వినట్లుగా, మృత్యువు నన్నుచూసి నవ్వు తోంది."

ఈ యోచనతో యువకుని చంచలభావపరంపర ప్రశాంత మయింది. ఇప్పుడు విధికి శిరసొగ్గుతున్నాడు. జీర్ణవస్త్రంవలె జీవితాన్ని కూడా కోరినప్పుడు విసర్జించవచ్చును. అందువల్ల ఇంక ఈ బ్రతుకు నెట్టడం కొంత సులువయింది.

జీవితాన్ని అంతమొందించుకోడానికి రెండు మార్గా లున్నాయి. వీనిలో సులువైనపద్ధతి పై కిటికీ ఊచకి తువ్వాలు కట్టి

కంఠానికి ఉరి వేసుకుని వేలాడ్డం. రెండో మార్గం, ఆహారం తీసుకుంటున్నట్లు నటిస్తూ, ఆ మరణాంతం ఉపవాసం చెయ్యడం. మొదటి పద్ధతి తలుచుకున్నప్పుడు డాంటే కి ఒళ్లు జలదరించింది. ఇది అతి క్షుద్రమైనదనుకున్నాడు. అందువల్ల రెండో మార్గం అవలంబించాలని నిశ్చయానికొచ్చాడు.

కాని ఈ రీతిగా నాలుగేళ్లు గడిచిపోయాయి. చిట్టచివరికొకనాడు "నేను మరణించి తీరాలి" అని నిశ్చయపరుచుకున్నాడు. నిశ్చయం సడలిపోతుందనే భయంతో, ఈమారు ఘోర ప్రమాణం తీసుకున్నాడు. ఉదయం, సాయంకాలం జైలర్ తెచ్చి ఇచ్చే ఆహారాన్ని కిటికీలోనుంచి పారవేసి, తిన్నట్లు నటించాలనుకున్నాడు. ఈమారు నిజంగానే ఆహారం పారవేశాడు. ఆ కిటికీలోనుంచి ఆకాశం కొద్దిగా కనిపిస్తుంది. అటు చూస్తూ రోజూ రెండుసార్లూ పారవేసేవాడు. మొదట రెండో ఆలోచన ఉండేదికాదు. తరవాత కొంతసేపు యోచించి అప్పుడు పారవేసేవాడు. ఆ పైన చెయ్యి పనకాడేది. పారవేసేటప్పుడు చింత కలిగేది. తరవాత పారవెయ్యడానికి మాటిమాటికీ తన ప్రతిజ్ఞను జ్ఞప్తికి తెచ్చుకోవలసి వచ్చేది. ఇదివరలో అసహ్యించుకున్న ఆ ఆహారం నేడు ఆకలి పీడనవల్ల నోరూరిస్తోంది. పళ్లెం చేతపట్టుకుని ఒక్కొక్కప్పుడు గంటసేపు దానివంక చూస్తూ ఉండిపోయేవాడు. దృష్టి దానిపైనే లగ్నమై ఉండేది. అప్పుడప్పుడా కూపం పాడుగా లేదనిపించేది. భవిష్యత్తుకూడా అంత నిరాశపడవలసినది కాదని భావించేవాడు. అతనింకా యువకుడు. ఇంకా ఏభైయేళ్లయినా జీవించవచ్చును. ఈ యేభై ఏళ్లలో అనుకోని సంఘటన ఏదైనా సంభవించకూడదా? ఎప్పుడో చెరసాల తలుపులు తెరుచుకుని అతనికి స్వాతంత్ర్యాన్నివ్వకపోతాయా? చేత గుప్పెడు రొట్టె తీసుకుని దానివంక తీక్షణంగా చూసేవాడు. అది పెదవులవరకూ వచ్చి ఆగిపోయేది. వెంటనే ప్రతిజ్ఞ మనస్సులో తటుక్కున మెరిసేది. తన నిశ్చయాన్ని భగ్నం చేసుకునే దైన్య స్థితిని తల్చుకుని తిరిగి స్థైర్యం తెచ్చుకునేవాడు. అకుంఠిత మనోదార్ఢ్యంతో తన ప్రతిజ్ఞను నెరవేరుస్తున్నాడు. క్రమంగా అతనికి సత్తువ తగ్గిపోయింది. ఒకనాడు లేచి నిలబడలేనంత నీరసస్థితికి వచ్చాడు. తెచ్చిన ఆహా

రాన్ని పై కిటికీగుండా పారెయ్యడానికి కూడా ఓపిక లేకపోయింది. అతని ఆరోగ్యం చెడిపోయి ప్రమాదంలో పడ్డాడని జైలర్ భావించాడు. మరణం ఆసన్నమౌతున్నదని డాంటే ఆశపడ్డాడు. ఆ రోజు అలా గడిచిపోయింది. అతనికిమత్తు ఆవరిస్తున్నట్లయింది. చైతన్యం ఉడిగిపోవడం అతనికి కొంత సుఖమిచ్చింది. కడుపులో నరాల నులిమిడి తగ్గుతోంది. గొంతుక కొలే దాహం తగ్గుతోంది. కళ్లు మూసుకుంటే ఏవో చక్కని కాంతులు దృష్టిలో నాట్యమాడుతున్నాయి. అవి మృత్యుద్వారంలోని సంధ్యాకాంతులనుకున్నాడు.

ఆ రాత్రి తొమ్మిది గంటల వేళ, అకస్మాత్తుగా, దగ్గర గోడ కావలివైపున అస్పష్టమైన ఒక శబ్దం అతనికి వినవచ్చింది. ఈ కూపంలో అనేక రకాల కీటకాల ధ్వనులు విని నిర్లక్ష్యంగా ఊరుకోడం అతని కలవాటే. కాని నిరాహార స్థితివల్ల కాబోలు అతని జ్ఞానేంద్రియాలు ఇప్పుడు చురుగ్గా పనిచేస్తున్నాయి. లేదా ఆ శబ్దం పెద్దదై ఉండాలి. లేక ఈ క్లిష్టస్థితిలో మామూలు శబ్దాలు అలా వినిపించి ఉండాలి. తలెత్తి చెవి విన్నాడు. గట్టి గోళ్లతోనో, పళ్లతోనో, ఇనప పరికరంతోనో రాళ్లపై గీరుతున్నట్లు వినవచ్చింది.

పూర్తిగా శక్తి నశించిన ఆ యువకునికి వెంటనే స్వేచ్ఛ అనే భావం తట్టింది. ఖైదీలందరికీ కలిగే భావం ఇదేకదా! శ్రవణేంద్రియంచల్లారనున్నప్పుడే ఈ శబ్దం వినవచ్చినందువల్ల కాబోలు, డాంటేకిభగవంతుడే హెచ్చరిస్తున్నాడని తోచింది. మృత్యుగహ్వరంప్రవేశిస్తున్న అతన్ని ఈశబ్దం నివారించింది. తనను ప్రేమించే ఏ మిత్రులైనా తనకోసం వస్తున్నారేమో! దాదాపు మూడుగంటలసేపు ఈ శబ్దం వినపడింది. తరవాత ఏదో పడినట్లు గభాలున ధ్వని అయింది. ఆపైన శబ్దం ఆగిపోయింది. తరవాత మళ్ళీ కొన్నిగంటలక్కిశబ్దం వినవచ్చింది.

డాంటేకి ఆసక్తి హెచ్చింది. కాలక్షేపానికి ఇది బాగానే ఉంది. ఇంతలో జైలర్ హఠాత్తుగా ప్రవేశించాడు. నిరాహారదీక్ష అవలంబించిన ఈ నాలుగురోజులూ డాంటే జైలర్‌తో ఒక్కసారైనా మాట్లాడలేదు. సంగతేమిటని జైలర్ ప్రశ్నించినప్పుడు

సమాధాన మివ్వక ముఖం గోడవైపు తిప్పుకుని పడుకునేవాడు. కాని ఇవాళ శబ్దం విని జైలర్ అనుమానిస్తాడని డాంటే భయపడ్డాడు. ఇదమిద్ధమని తెలియని ఆ ఆశ కూడా అంతరిస్తుందనుకున్నాడు. జైలర్ ఆహారం తీసుకువచ్చాడు. డాంటే పడకపై నుంచి లేచాడు. గబగబా అదీ ఇదీ అని విచక్షణ లేకుండా, బడబడ వాగడం మొదలు పెట్టాడు. ఆహారం పాడుగా వుందని, నేల తేమగా ఉందని, ఏది మనస్సుకి తట్టితే దాన్ని గురించి వాగాడు. జైలర్‌ని దూషించాడు. నీరసించిన డాంటే నిమిత్తం ప్రత్యేక శ్రద్ధతో వేడి రొట్టె తెచ్చిన జైలర్‌కి విసుగెత్తింది. సంధి పట్టుకుందనుకున్నాడు జైలర్. ఆహారం అక్కడ పడేసి వెళ్లిపోయాడు. వెళ్లిపోగానే డాంటే మళ్లీ చెవులు రిక్కించి విన్నాడు. ఈమారు శబ్దం స్పష్టంగా వినపడింది.

"ఎవరో నావంటి నిర్భాగ్యుడే" అనుకున్నాడు డాంటే. "తప్పించుకోడానికి దారి చేసుకుంటున్నాడు కాబోలు. పాపం నేనుకూడా దగ్గరుంటే సహాయంచేసేవాణ్ని కదా!"

కాని ఇంతలోనే అతని ఆశ మాసుకుపోయింది. నిత్యం దుఃఖానికే అలవడిన అతనికి ఆనందమనేది నమ్మరానిది. పక్క కూపాన్ని మరమ్మత్తు చేయిస్తున్నారు కాబోలనుకున్నాడు. అదయితే అడిగితే తెలుస్తుంది. కాని అడగడంఎలాగ? ఈమారు జైలర్ వచ్చినప్పుడు తాను మౌనంగాఉండి చూడాలనుకున్నాడు. శబ్దాన్ని జైలర్ విన్నప్పుడు అతని ముఖలక్షణాలు గమనిస్తే గ్రహించవచ్చును. కాని దానివల్లఆశ భగ్నమై పోతుందేమో? నీరసించిన ఆ యువకుని యోచనలు అతక లేదు. సత్తువ తెచ్చుకోవలసిన అవసరం అతనికి గోచరించింది. మెల్లిగా లేచివెళ్లి దొన్నెఎత్తి పెదవులకు పట్టించి పులుసు తాగేశాడు. ఇప్పుడెంతో తృప్తికలిగిందతనికి.

క్రమంగా సత్తువచేరింది. అప్పుడిలా అనుకున్నాడు: "పరిశీలించి చూడాలి. కాని ఎవ్వరినీ బయటపడ నివ్వకూడదు. ఎవ్వరికీ తెలియనివ్వకూడదు. నేనుగోడపైన తట్టుతాను. కూలీలే మరమ్మతు చేస్తున్నట్లయితే, విని ఒక్కసారి ఆగినా, వంటనే మళ్లీ పని మొదలుపెడతారు. ఖైదీయే తవ్వుతున్నట్లయితే భయపడతాడు. కనుక్కుంటారని భయపడి, మళ్లీరాత్రివరకూ పని మొదలు

పెట్టడు. అప్పటికి అందరూ నిద్రపోతారనే భావంతో మళ్ళీ తవ్వుతాడు."

ఎడ్మండ్ మళ్లీ లేచాడు. ఒక మూలకు వెళ్లి చిన్న బెడ్డతీశాడు. శబ్దం ఎక్కడ ఎక్కువగా వినవస్తోందో చూసి, గోడపైన అక్కడ బెడ్డతో కొట్టాడు. వెంటనే అవతలశబ్దం నిలిచిపోయింది. డాంటే చెవులు రిక్కించి అతిజాగ్రత్తగా విన్నాడు. గంటయినా మళ్లీ ఆశబ్దం వినపడలేదు. రెండుగంటలైనా వినపడలేదు. డాంటేకి ఆశపుట్టింది. రొట్టెముక్క కొంత కొరికి తిన్నాడు. కొద్దిగా నీరు తాగాడు. తన పూర్వపు బలమంతా తిరిగికోలుకున్నట్లయింది.

ఆ రోజంతా ఏ శబ్దం లేకుండా గడిచిపోయింది. రాత్రి పడింది. అయినా శబ్దం లేదు. అమితానందంతో డాంటే అనుకున్నాడు "ఖైదీయే!"

రాత్రంతా శబ్దం వినపడలేదు. రాత్రి ఒక్క క్షణంకూడా డాంటేకి కంటిమీద కునుకు లేదు. మర్నాడు ఉదయం జైలర్ ఆహారం తీసుకొచ్చాడు. డాంటే గబగబా తినేశాడు. శబ్దం వినవస్తుందని ఆశతో కూచున్నాడు. గోడపై తట్టినది ఇంకొక ఖైదీయే నని గ్రహించలేకపోయిన ఆ ఖైదీ అవివేకానికి డాంటే చికాకు పడ్డాడు.

మూడు రోజులు—డెబ్బై రెండు గంటలు, గడిచిపోయాయి. డాంటే నిమిషనిమిషమూ లెక్కపెడుతున్నాడు. చివరి కొక నాడు సాయంకాలం, జైలర్ ఆహారమిచ్చి వెళ్లిపోయిన తరవాత, డాంటే చెవిని గోడ కానించి ఆలకిస్తున్నప్పుడు,తలకు చిన్న అదురు దెబ్బ తగిలినట్లయింది. డాంటే వెనక్కు ఒక అడుగు వేశాడు. రెండు సార్లు అటూ ఇటూ పచారుచేశాడు. మళ్ళీ చెవి గోడ కానించి విన్నాడు. ఇంక సందేహం లేదు. అవతలవైపు ఎవరో ఏదో చేస్తున్నారు. అయితే ఈమారు శబ్దం అస్పష్టంగా ఉంది.

ఇది కనిపెట్టినప్పుడు డాంటేకి చెప్పరాని ధైర్యం కలిగింది. రెండో ఖైదీకి సహాయపడాలని నిశ్చయించుకున్నాడు. గోడపైని వస్తున్న చోటికి దాపునే ఉన్న పడక ఎత్తాడు. తేమగా ఉన్న సిమెంటును గోకెయ్యడానికి వీలైన పరికరంకోసం చుట్టూ గాలించాడు. సిమెంటు గోకేస్తే ఒక రాయి తీసె

య్యటానికి ప్రయత్నించవచ్చును. పదునైన పరికరం ఏదీ కనిపించ లేదు. పై కిటికీకి ఊచలున్నాయి. కాని వాటిని కదల్చడంకూడా అసంభవమని అతనికి తెలుసును. గదిలో ఉన్నవి పడక, కర్ర కుర్చీ, ముక్కాలిపీట, ఒక లోటా, ఒక కూజా. పడక కిందచట్రానికి ఇనుప బద్దలున్నాయి. కాని అవి స్క్రూలతో కర్రలోకి గట్టిగా బిగించబడినాయి. స్క్రూడ్రైవర్ ఉంటే కాని అవి రావు. కుర్చీ, పీట పనికిరావు. ఇదివరలో లోటాకి పట్టుకోడానికి చెవి ఉండేది. అది కాస్తా తీసేశారు. ఇంక మిగిలినది ఒక్కటే. కూజాని బద్దలు కొట్టాలి. ఒక పెంకుతో పని ప్రారంభించాలి. కూజా నెత్తి గట్టిగా నేలకేసి కొట్టాడు. ముక్కముక్కలైంది. ముక్కల్లో పదునైనవీ, గట్టివీ రెండుమూడు పెంకు లేరాడు. మళ్ళీ పడక వేసి ఆ ముక్కల్ని దానికింద దాచాడు.

రాత్రిపడిన తరవాత పడక ఎత్తేసి, డాంటే ఒక పెంకుతో గోడగీకడం మొదలుపెట్టాడు. కాని చీకటిలో అట్టే పని సాగలేదు. అదీకాక పెంకులు పదునుపోయి మొద్దుబారాయి. గట్టిరాయి కాబోలు పెంకులకు తగిలింది. అంతటితో పని ఆపుచేసి పడకని యథాస్థానంలో చేర్చి, పగటి వెలుగుకోసం నిరీక్షించాడు. ఆశతో పాటు అతనికి అపారమైన ఓరిమికూడా వచ్చింది.

తెల్లవారింది. జైలర్ వచ్చాడు. నీళ్లు తాగుతున్నప్పుడు చెయ్యి జారికూజా బద్దలైందని డాంటే చెప్పాడు. తిట్టుకుంటూ కొత్త కూజాతీసుకురావడానికి జైలర్ వెళ్లాడు. అయితే పాతకూజా పెంకులు ఎత్తి పారెయ్యలేదు. త్వరలోనే తిరిగివచ్చి కొత్తది ఇచ్చి, ఈమారు జాగ్రత్తగా ఉండాలని హెచ్చరించి వెళ్లిపోయాడు. తలుపుల గరగర ఈమారు గుండెల్లో మంట రెచ్చగొట్టే బదులు, ఆనందాన్ని రేకెత్తించింది. కొంతసేపైన తరవాత పడక ఎత్తేశాడు.

కిటికీలోనుంచి వచ్చిన గుడ్డివెలుగులో చూశాడు. ఇంతవరకూ తాను చెక్కినది ఒక్కరాతిపైనని చూశాడు. చుట్టూ ఉన్న సిమెంటు తివ్వనే లేదు. తేమవల్ల ఇక్కడ సిమెంటు మెత్తబడింది. దాన్ని ఇప్పుడిట్టే చెక్కేశాడు. అర్ధగంటలో గుప్పెడు సిమెంటు తీశాడు. ఇన్నాళ్లుగా ఈపనికి పూనుకోనందుకు డాంటే తన్ను తాను నిందించుకున్నాడు. ఆశా నిరాశల్లోనూ, ప్రార్థనలోనూ

తన కౌలాన్నింతవరకూ వ్యర్థపరిచాడు. ఇంతవరకూ ఈ కూపంలో గడిపిన ఇన్నేళ్లలోనూ ఎంతె పనిసాధించ గలిగి ఉండేవాడు! ఈ యోచనతో అతనిలో కొత్త ఉత్సాహం, పట్టుదల కలిగాయి. మూడురోజులు అతి జాగ్రత్తగా కృషిచేసి రాతిచుట్టూ సిమెంటు చెక్కాశాడు. ఈగోడలో గతుకులరాళ్లు పేర్చబడి ఉన్నాయి. మధ్యమధ్యమాత్రం చెక్కబడినరాళ్లున్నాయి. ఇప్పుడు సిమెంటు పోయి బైటపడినది చెక్కబడిన రాయి. దీన్ని కదిలించి ఊడబెర కాలని డాంటే ప్రయత్నించాడు. ముందు గోళ్లుపయోగించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. నెరదల్లో కూజా పెంకులు పెట్టి ఎత్తడానికి చూశాడు. కాని పెంకులు ముక్కలై నాయి. గంటసేపు వృధా యత్నాలు చేసి చివరికి డాంటే లేచి నిల బడ్డాడు. ముఖాన చెమట తుడుచుకున్నాడు. అప్పు డతనికొక ఉపాయం తట్టింది. చిరునవ్వు నవ్వాడు.

జైలర్ ఎప్పుడూ ఒక రేకుపళ్లెంలో పులుసు తీసుకొస్తాడు. ఈ పళ్లానికి ఇనపకాడఉంది. ఇప్పుడది తీసుకోవా లనుకున్నాడు డాంటే. ఆ ఇనపకాడకోసం తన జీవితంలో పదేళ్లువెచ్చించ డానికి కూడా వెనుదియ్యడు. జైలర్ రేకుపళ్లెంతో పులుసు తీసుకొచ్చి ఒక మూకుడులో పోసేవాడు. ఆహారంతీసుకోగానే డాంటే మూకుడు కడిగిఉంచేవాడు. ఆరోజు సాయంత్రం మూకుడు తీసి, ముక్కాలి పీటకీ ద్వారానికీ మధ్యదారిలో ఉంచాడు. జైలర్ తలుపుతోసుకువచ్చి మూకుడు తొక్కాడు. అది పగిలి పోయింది. పులుసు పొయ్యడానికి ఇంకొకపాత్రకోసం జైలర్ చుట్టూచూశాడు. ఏదీ కనిపించలేదు.

“ఆ పళ్లెం ఇక్కడెందు కుంచకూడదు? రేపుపొద్దున్నవచ్చి నప్పుడు తీసుకుపోదువుగాని” అన్నాడు డాంటే.

ఇంకోమూకుడు తీసుకు రావడానికి సంకోచిస్తున్న జైలర్‌కి ఇది నచ్చింది. పళ్ళాన్ని అక్కడవొదిలేసి వెళ్లిపోయాడు. డాంటే ఆనందంతో వొణికిపోయాడు. గబగబా పులుసూ మాంసం కాజే శాడు. జైలర్ మళ్లీ మనస్సు మార్చుకుని రావచ్చునసే ఉద్దేశంతో సరిగ్గా ఒక గంటసేపు చూశాడు. తరవాత పక్క ఎత్తేశాడు. చెక్కినచోట రాతికింద పళ్ళెంకాడ గుచ్చి ఎత్తడానికి ప్రయత్నిం

చాడు. రాయి కొద్దిగా కదిలింది. గంటసేపు ఇలా కష్టపడిన తరవాత రాయి ఊడివచ్చింది. అడుగున్నర మేర కంత ఏర్పడింది.

చెక్కిన మట్టిఅంతా జాగ్రత్తగా పోగుచేసి ఒకమూలకి తీసుకెళ్లాడు. అక్కడొకచోట కూజా పెంకుతో చిన్న గొయ్యి తవ్వి సిమెంటుపొడి అందులోపోసి మళ్లీ పైన మట్టిని సమానంగా మెత్తేశాడు. తరవాత మళ్ళీ కంత దగ్గరకొచ్చి తవ్వకం మొదలెట్టాడు.

మర్నాడు ఉదయం రాతిని కంతలో పెట్టి మూసేసి, పక్క వేసి పడుకున్నాడు. జైలర్ వచ్చి రొట్టి ఇచ్చాడు.

"అయితే ఇంకో మూకుడు తేలేదన్నమాట" అన్నాడు డాంటే

"లేదు" అన్నాడు జైలర్. "నువ్వు కూజా బద్దలుకొట్టావు. మూకుడు దారిలో పెట్టావు. దాన్ని నేను తొక్కాను. ఈ పళ్లెం ను వుంచుకో. అందులోనే ఆహారం పెడుతూ ఉంటాను. దీన్ని బద్దలుకొట్టలేవు." డాంటే మనస్సులో భగవంతునికి నమస్కరించాడు. జీవితంలో ఎన్నడూ ఏ వ్యక్తిపట్ల కాని, భగవంతునిపట్ల కాని కలగని కృతజ్ఞతా భావం డాంటేకి ఇప్పుడీ రేకు ముక్కపట్ల కలిగింది. అయితే ఇప్పుడొకటి తెలిసివచ్చిందతనికి. తన పని మొదలెట్టిన తరవాత అవతలవైపున ఆ ఖైదీ తనపని నిలిపేశాడు. అంతమాత్రానికి తను మాన నవసరం లేదనుకున్నాడు డాంటే-పొరుగు ఖైదీ తనవద్దకు రాకపోతే, తనే అతనివద్దకు వెళ్లాలి. రోజంతా క్షణంవిశ్రాంతి తీసుకోకుండా డాంటే కృషిచేశాడు. సాయంత్రానికి పదిరాళ్లు, సిమెంటు తీసేశాడు.

మళ్ళీ జైలర్ వచ్చేసమయానికి వొంగిన పళ్లెంకాడ చేతనైనంతవరకు వంకరతీసి మామూలుచోట ఉంచాడు. జైలర్ ఆహార మిచ్చి వెళ్ళిపోయాడు. జైలర్ వెళ్ళిన తరవాత డాంటే శ్రద్ధగా చెవి ఒగ్గి విన్నాడు. నిజంగా పొరుగునున్న ఖైదీ తన పని మానేశాడా? తెలుసుకోవా లనుకున్నాడు. అంతా నిశ్శబ్దంగా ఉంది. డాంటే నిశ్వాసం విడిచాడు. తనని తన పొరుగు ఖైదీ నమ్మటం లేదు. అయినా డాంటే నిరుత్సాహపడలేదు. రెండుమూడు గంటలు శ్రమపడి తవ్విన తరవాత ఏదో అడ్డు తగిలినట్లయింది. చేత్తో తడిమి, తట్టిచూశాడు. అది ఒక దూలం. సరిగ్గా డాంటే తవ్విన కన్నాన్ని

కమ్ముతోంది. ఇప్పు డింక దూలానికి పైనకాని కిందకాని తవ్వాలి. డాంటె ఇటువంటి ఆటంకం వస్తుం దనుకోలేదు.

"అయ్యయ్యో! చివరి కిదేనా! ఈశ్వరుడు నా ప్రార్థన ఆలకించా డనుకున్నా నే! నా స్వేచ్ఛని అంతం చేశాడు. మృత్యువులో సర్వం విస్మరించా లనుకుంటే, అది నిరాకరించి నాకు మళ్ళీ ప్రాణం పోశాడు. అయ్యో! భగవంతుడా. నాపైన దయరాదా? నన్నిలా నిస్పృహలో మగ్గిపోనిస్తావా?" అని నిరాశ చెందాడు డాంటే.

కాని ఇంతలోనే నేల కిందనుంచి కాబోలు ఒక స్వరం వినవచ్చింది. అది గోడ మందాన్ని దాటి రావడంవల్ల, ఎవరో గోరీలోనుంచి మాట్లాడుతున్నట్లుంది. "ఇటువంటి సమయంలో నిస్పృహ చెందేవా రెవరు?" అన్న దా స్వరం.

డాంటే మోకాళ్ళ పైకూచో బడ్డాడు. ఒళ్ళంతా గగుర్పొడిచింది. "మనిషి గొంతుక" అని గొణిగాడు.

జైలర్ గొంతుక తప్ప మరొకనిమాటలు డాంటే విని నాలుగైదేళ్లు కావస్తోంది. జైలర్ కూడా మనిష నేభావమే అతనికి లేదు. వొణుకుతున్న కంఠంతో ఇలా అన్నాడు: "మీరెవరు? మీగొంతు కవింటే భయం వేసింది. కాని చెప్పండి, మీరెవరు?"

"మీరెవరో చెప్పండి" అన్న దా కొత్తగొంతుక.

"నిర్భాగ్యుడైన ఖైదీని. నాపేరు ఎడ్మండ్ డాంటే. నావికుణ్ణి."

"ఎన్నాళ్లనించి ఉంటున్నావు?"

"1815 ఫిబ్రవరి 28 నించి."

"నీ నేర మేమిటి?"

"చక్రవర్తి తిరిగి రావడానికి తోడ్పడ్డానని."

"ఏమిటి? చక్రవర్తి తిరిగి రావడానికా? అంటే? చక్రవర్తి కాదా ఇప్పుడు పరిపాలిస్తున్నది?"

"ఆయన 1814 లో ఫాంటెన్‌బ్లూలో రాజ్యాన్ని త్యజించాడు. ఆయన్ని దేశంనించి బహిష్కరించి ఎల్బాద్వీపానికి పంపారు. ఇదంతా మీకు తెలియనే తెలియదా? మీరెన్నాళ్ళ నించి ఇక్కడుంటున్నారు?"

"1811 నించి."

డాంటే కంపించిపోయాడు. తనకంటె ఇతను నాలుగేళ్లు ఎక్కువ అనుభవిస్తున్నాడు!

ఈమారు అవతల వ్యక్తి గబగబా అన్నాడు: "సరే మీపని ఆపుచేసి చెప్పండి. మీరు తవ్విన కన్నం నేల కెంతెత్తు నుంది?"

"సరిగ్గా నేల మట్టాన ఉంది, పడకచాటున."

"మీగది దాటితే అవతల ఏముంది?"

"వరండా."

"ఆపైన?"

"వరండా మధ్య ఆవరణలోకి దారితీస్తుంది."

"అయ్యో!" అన్నదా గొంతుక. "చివరికి మోసపోయాను. దిక్సూచి లేకపోడంవల్లనే దారి తప్పాను. ఒక చిన్న వంకరగీత వల్ల పదిహేనడుగులు తవ్వినది వ్యర్థమైపోయింది. మీరు తవ్వుతున్న ఆగోడే ఖైదు చివరిగోడనుకున్నాను."

"చివరిగోడయితే, అది సముద్రంలోకి దారితీస్తుందే!"

"నాకు కావలసింది అదే. సముద్రంలోకి దూకి ఇఫ్ కోటకి దగ్గిర్లోఉన్న ఏ చిన్న ద్వీపానికో ఫ్రాన్సు తీరానికో ఈదుకుపోవచ్చు ననుకున్నాను. ఆ తరవాత క్షేమంగా వెళ్లిపోయేవాడిని. కాని ఇప్పు డదంతా నష్టమైపోయింది. సరే జరిగిందేదో జరిగింది. మీరు తవ్వినగొయ్యి పూడ్చెయ్యండి. నేను మళ్లీ చెప్పేవరకు పని మానెయ్యండి."

"మీ రెవరో చెప్పలేదు."

"నేనా? నేను ఇరవైయేడో నంబరు."

"అంటే మీరు నన్ను నమ్మడంలే దన్నమాట." అన్నాడు డాంటే బిగ్గరగా. తన్ని విడిచిపెట్టి పొరుగుఖైదీ వెళ్లిపోతున్నాడనుకున్నాడు. ఇలా అన్నాడు: "నే నీ విషయాన్ని ఆ కిరాతకులకు చెప్పి రహస్యం బైటపెట్టడంకంటె నాప్రాణాలైనా సరే విడిచిపెడతాను. మనం ఇద్దరం కలుసుకునే ఈ అవకాశాన్ని విడిచిపెట్టకండి. ప్రాధేయపడుతున్నాను. నామాట నమ్మండి. మీ గొంతుక వినిపిస్తేచాలు. ఆ భాగ్యంకూడా లేకుండా చెయ్యకండి. నా కింక ఓపిక పోయింది. తల గోడకేసి కొట్టుకుని చచ్చిపోతాను. తరవాత మీవల్లనే చచ్చిపోయానని మీరు బాధపడవలసి వస్తుంది."

"నీకెన్నేళ్లు? నీ గొంతుక వింటే చిన్నవాడ వనిపిస్తోంది."

"నాకు తెలియదు. నేనిక్కడికి వచ్చింది మొదలు రోజులు లెక్క పెట్టలేదు. నాకు తెలిసినదల్లా ఏమిటంటే, నాకు పందొమ్మి దేళ్లున్నప్పుడు, 1815 ఫిబ్రవరి 28 న నన్నిక్కడికి తెచ్చారు."

"అంటే ఇంకా ఇరవైఆరేళ్లు నిండలేదన్నమాట. సరే అయితే రా. నీ వయస్సులో ఉన్నవాళ్లు సామాన్యంగా మోసం చెయ్యరు. నాతో మాట్లాడ్డం, నన్ను నువ్వు ప్రార్థించడం మంచిదే అయింది. అసలింకొక ఉపాయం ఆలోచించాను. దాంతో నీకు దూరమైపోయేవాణ్ణే. కాని నీచిన్నవయస్సువల్ల నాకు నమ్మకం కలిగింది. నే నొచ్చి నిన్ను కలుసుకుంటానులే."

"అయితే నన్ను విడిచిపెట్ట రన్నమాటేనా? మీ రొస్తా రుగా? లేకపోతే నేనే రానా? ఇద్దరం కలిసి తప్పించుకుని పారి పోదాం. తప్పించుకోలేకపోతే, ఇద్దరం కూచుని మాట్లాడుకో వచ్చు. మీ కెవరిపైన అపేక్ష ఉందో వారినిగురించి మీరు, నా కెవరిమీద ప్రేమ ఉందో వాళ్లని గురించి నేను చెప్పుకో వచ్చును. మీ రపేక్షించేవా ళ్లెవరైనా ఉన్నారా?"

"నే నీ ప్రపంచంలో ఒంటరిని."

"అయితే మీరు ఆదరించడానికి నే నుంటాను. మీకూ నా వయస్సే ఉంటే మనం సహోదరుల మౌదాం. వృద్ధు లైతే, మీకు నేను కొడుకువలె ఉంటాను. నా కొక తండ్రి ఉన్నాడు. ఆయన ఇంకా బతికుంటే ఇప్పుడు 70 ఏళ్లుంటాయి. మర్సిదా అనే ఒక అమ్మాయి ఉంది. ఆమెని నేను ప్రేమించాను. నాతండ్రి నన్ను మరిచిపోడు. అది నాకు గట్టిగా తెలుసును. కాని ఆమె— ఇంకా నన్నుగురించి అసలు తలుచుకుంటుందో లేదో ఆ భగవంతు డికే తెలియాలి. నేను నా తండ్రిని ప్రేమించినట్లుగా మిమ్మల్ని కూడా ప్రేమించగలను."

"సరే బాగానే ఉంది. రేపు మాద్దాం" అన్నాడు గోడ అవ తల ఖైదీ.

డాంటే ఇంకేమీ అడగలేదు. లేచి కన్నంలో రాళ్ళు పేర్చాడు. పడక గోడవాటున చేర్చాడు. పడుకుని ఆలోచించడం మొదలు పెట్టాడు. ఇంక తను ఒంటరిగా ఉండనక్కర్లేదు. అసలు

తప్పించుకోవచ్చునేమో! ఇంక తన కింతకంటె కీడు కలిగేదిలేదు. ఉంటే బందీగా ఉండిపోతాడు. బందీగా ఉన్నా, ఇప్పుడు తనకి తోడొక డున్నాడు. నిర్బంధంలో తోడుండడం సగం బాధలు తొలగిపోయినట్లే.

రోజంతా డాంటె అటూఇటూ పచారుచేశాడు. హృదయం తేలికపడింది. తనకి తెలియకపోయినా, తను చూడకపోయినా తానింత గాఢంగా ప్రేమిస్తున్న ఈ కొత్తవ్యక్తి తనకిదూరమై పోడుకదా అని రెండుమూడుసార్లు అనుమానం, భీతి కలిగాయి. అలా జరిగినట్లయితే ఏంచెయ్యాలని ముందే ఆలోచించాడు. జైలర్ వచ్చి పసికట్టి కన్నం చూసినట్లయితే, అమాంతం ఒకరాయెత్తివాడిబుర్ర బద్దలు కొట్టిచంపాలనుకున్నాడు. అప్పుడు తనకి మరణశిక్షవిధిస్తారు. అందులో సందేహంలేదు. ఈ శబ్దమే వినిపించకపోతే చచ్చిపోవాలనే కదా తను ప్రయత్నించినది! దానికి ఇప్పుడూ సిద్ధమే.

మామూలుగానే సాయంత్రం జైలర్ వచ్చాడు. డాంటె ఆ సమయానికి పక్కమీద పడుకుని జాగ్రత్త పడ్డాడు. జైలర్ వంక కొంత అనుమానంతో, అదోరకంగా చూశాడు డాంటె. జైలర్ అడిగాడు: "ఏం? మళ్లీ నీకు మతిస్థిరం తప్పుతోందా?"

డాంటె జవాబివ్వలేదు. నోరెత్తితే తన ఆవేగం బైటపడుతుందని భయపడ్డాడు. జైలర్ తల పంకిస్తూ వెళ్లిపోయాడు.

రాత్రి పడింది. అంతటా నిశ్శబ్దం అలుముకుంది. చీకటి వ్యాపించింది. తన మిత్రుడు వచ్చి మాట్లాడతాడని అనుకున్నాడు డాంటె—కాని డాంటెకి ఆశాభంగ మయింది. అతని కే శబ్దం వినరాలేదు. రాత్రి గడిచిపోయింది. మరునాడు పొద్దున్న జైలర్ వచ్చి వెళ్లిన తరవాత, డాంటె తన పక్క ఎత్తిబోతున్న సమయంలో గోడపైన మూడుసార్లు తట్టిన శబ్దం వినపడింది. డాంటె మోకాళ్లపై వొంగి కూచుని "మీరేనా? నే నిక్కడున్నాను" అన్నాడు.

"జైలర్ వెళ్లిపోయాడా?" అని అడిగింది అవతల కంఠం.

"వెళ్లిపోయాడు. మళ్ళీ సాయంత్రంవరకూ రాడు. మనకి పన్నెండు గంటలసేపు స్వేచ్ఛ."

"అయితే నేను రావచ్చునన్నమాట?"

"రావచ్చు. రండి. ఆలస్యం చెయ్యకండి."

డాంటే చేతులానినచోట కొంత మేర మన్ను ఊడింది. లేచి నిలబడ్డాడు. అతను చేసిన రంధ్రానికి కిందుగా రాళ్లు ఊడి పడ్డాయి. అక్కడింకొక రంధ్రం ఏర్పడింది. ఆ చీకటిసొరంగంలోనుంచి మొదట ఒకతల, తరవాత భుజాలు, క్రమంగా మనిషి ఇవతల కొచ్చాడు.

# 16

ఇన్ని రోజులుగా వేచిఉన్న డాంటే కొత్త మిత్రుని చూసీ చూడగానే గాఢాలింగనం చేసుకున్నాడు. ఆ చీకటికూపంలో రవ్వంత వెలుగు నిస్తున్న కిటికీవద్దకు తీసుకువెళ్లి అతన్ని చూశాడు.

కొత్త వ్యక్తి పొట్టిగా ఉన్నాడు. వయస్సువల్ల కాక, కష్టాల వల్ల అతని తల నెరిసి ముగ్గుబుట్టయింది. ఒత్తైన కనుబొమల కింద చిన్న కళ్లు తీక్షణంగా మెరుస్తున్నాయి. గడ్డం పొడుగ్గా పెరిగి ఉంది. అతని చప్పిదవడలు, ముఖంమీది ముడతలు శారీరక బలం కంటె మేధస్సునే అధికంగా వినియోగించే వ్యక్తి అని స్పష్టపరుస్తున్నాయి. నుదుట చెమటోడుతున్నది. ధరించిన వస్త్రాలు బొత్తిగా పేలికలై వేలాడుతున్నాయి. అరవై అయిదేళ్లున్నట్లు కనిపించాడు. కాని అతనిలో కనిపించే చురుకునిబట్టి వయస్సు తక్కువుంటుం దనుకోవాలి. కారాగారవాసంవల్ల వయస్సు మీరినట్లు కనిపించవచ్చును. కపట మెరుగని యువకుని సన్నిధిలో కరుడుగట్టిన వృద్ధుని హృదయం ద్రవించింది.

“ముందు ఈ కన్నం జైలర్ కి కనిపించకుండా ఎలా మూయ్యాలో చూద్దాం! రా” అన్నాడు. కన్నంవద్దకు వెళ్లి బరువైన రాతి నెత్తి కన్నం మూశాడు. “ఈ రాయి తియ్యడంలో నువ్వు అజాగ్రత్తగా పనిచేశావు. నీదగ్గర పరికరాలేవీ లేవనుకుంటాను”

డాంటే ఆశ్చర్యపడ్డాడు. “మీవద్ద ఏవైనా ఉన్నాయా?” అని ప్రశ్నించాడు.

“ఉన్నాయి. నేనే తయారుచేశాను. ఆకురాయి తప్ప, అవసరమైన మిగతా పరికరాలన్నీ ఉన్నాయి. ఇదిగో చూడు, ఇది ఉలి.” అని చెప్తూ వృద్ధుడు కర్రపిడిలో అమర్చబడిన ఇనప ముక్కొకటి చూపించాడు.

"దీన్నెలా తయారుచేశారు?"

"నా పడకచట్రానికున్న ఒక ఇనపరేకుతో. దీంతోనే నే నొచ్చిన దారి అంతా తవ్వాను. అంటే దాదాపు ఏభై అడుగుల పొడుగు దారి."

"అంటే, ఇక్కడికి రావడానికి ఏభై అడుగుల పొడుగున దారి తవ్వారా?"

"అవును. నీ గదికీ నా గదికీ మధ్యదూరం ఏభై అడుగులు. నీకు చెప్పానుగా. దారి చివరిగోడకి వెడుతుం దను కున్నాను. ఆ గోడ తవ్వి సముద్రంలోకి దూకాలనుకున్నాను. వరండాకింద అడ్డంగా తవ్వవలసింది, కాని వరండా పొడుగునా కింద సొరంగం తవ్వా నన్నమాట. ఇప్పుడా ప్రయాసంతా వృథా పోయింది. ఈ వరండా మధ్యఆవరణలోకి దారి తీస్తుంది. అక్కడ నేకనుంది సైనికు లుంటారు."

"నిజమే" అన్నాడు డాంటే. "కాని వరండా నాగదికి ఒకపక్కనే ఉంది. పోతే ఇంకా మూడు పక్కలున్నాయిగా!"

"ఉన్నా యనుకో, ఈపెద్ద కొండ ఉంది. ఈ కొండ తొలవాలంటే, సరైన పనిముట్లు ఉండి, పదిమంది పనిచేస్తే, పదేళ్లు పట్టుతుంది. ఆ పెద్ద బహుశా గవర్నర్ భవనానికి పునాది వున్న ట్టుంది. అక్కడ తవ్వితే సైనికులచేతిలో పడతాం. ఇంక మిగి లిన పక్క—ఆగు, చూద్దాం, ఈ గోడ అవతల ఏముందో కని పెట్టాలి."

ఆ గోడలోనే కిటికీ ఉంది. ఉందన్నమాటే కాని అది బొత్తిగా చిన్నది. వెలుగే సరిగ్గా రాదు. ఊచలు గట్టివి. వాటిని ఊడపెరికే ఆశ లేదు. వృద్ధుడు ముక్కాలిపీటను కిటికీ కిందికి లాగాడు.

"ఎక్కు" అన్నాడు డాంటేతో.

డాంటె పీట ఎక్కాడు. గోడకి వీపానించి చేతులు చాచాడు. వృద్ధుడు సులువుగా డాంటే భుజాలమీ దెక్కాడు. పైకప్పు నెత్తికి తగలడంవల్ల వొంగాడు. కిటికీ ఊచలవద్ద తలపెట్టి చూశాడు. చూసి చటుక్కున తల పెడకు వొంచాడు. "ఓ! అంతే ననుకున్నాను" అన్నాడు. డాంటే భుజాలమీదనుంచి కిందికి దూకాడు. "ఈ నాలుగో గోడపక్క పహరావాళ్లు తిరిగే

దారి ఉంది. తుపాకి పట్టుకుని ఒక సిపాయి పచారు చేస్తున్నాడు. నన్ను చూస్తాడని భయపడి దిగేశాను. నీ గదినించి తప్పించుకోడం అసాధ్యం."

"ఇంక మరేం చెయ్యాలి ?" అన్నాడు డాంటే.

"ఇంక మరేం చెయ్యాలి ? ఈశ్వరేచ్ఛ ఇలా వుంది" అన్నాడు వృద్ధుడు. అతని ముఖాన విషాదచ్ఛాయలావరించాయి.

చిరకాలం పెంచుకున్న ఆశలు భగ్నమైనప్పుడు, వేదాంత ధోరణిలో కర్మకు తలొగ్గిన వృద్ధుని చూసి డాంటే ఆశ్చర్య పడ్డాడు. వృద్ధునిపట్ల అతనిభక్తి ఇనుమడించింది.

"మీరెవరో చెప్పరా ?" అని అడిగాడు డాంటే.

నూతనవ్యక్తి విషాదభావంతో చిరునవ్వు నవ్వి అన్నాడు : "నా పేరు ఫెరయా. 1811 నించి ఇక్కడ ఖైదీగా ఉంటున్నాను. మూడేళ్లు ఫెనెస్ట్రెల్ కోటలో నిర్బంధించారు. 1811 లో పీడ్మాంట్ నించి నన్ను ఇక్కడికి మార్చారు. అప్పుడు నెపోలియన్ కి దేవుడు ఒకకొడుకుని ప్రసాదించాడు. ఆపసివాడిని రోమ్ మహారాజుగా చేశారని విన్నాను. కాని నువ్వు చెప్పినట్లు జరుగుతుందని నేను అనుమానించనైనా లేదు. నాలుగేళ్లతరవాత ఈబృహద్రథం భగ్నమై పోతుందనుకోలేదు. ఇప్పుడు ఫ్రాన్స్ని పరిపాలిస్తున్న దెవరు ? రెండో నెపోలియన్ పాలిస్తున్నాడా ?"

"కాదు. పద్ధెనిమిదో లూయీ."

"లూయీ! పదహారోలూయీ సోదరుడా? ఈశ్వర విలాసం విచిత్రమైనది. అది ఊహా కతీతం. మహోత్కృష్టస్థితికి తెచ్చిన వ్యక్తిని తిరిగి అధోగతిపాలుచెయ్యడంలో అర్థ మేమిటి ? అవమానంపాలైనవానిని ఉన్నతస్థితికి తేవడమెందుకు ? ఇంగ్లండ్ లో అలాగే జరిగింది. మొదటి ఛార్లెస్ తరవాత క్రామ్వెల్. క్రామ్వెల్ తరవాత రెండో ఛార్లెస్. రెండో జేమ్స్ తరవాత ఆరెంజ్ రాకుమారుడు. తరవాత ప్రజలకి కొన్ని హక్కులు, ఒక రాజ్యాంగయంత్రం—స్వేచ్ఛ ! అవును. ఎలాటి రోజులేనా వస్తాయి! అన్నీ చూడగలం." వృద్ధుని నేత్రాలు తళతళలాడుతున్నాయి. సర్వజ్ఞానసంపన్నునివలె డాంటేతో అన్నాడు. "నువ్వింకా యువకుడవ్. నువ్వదంతా చూడగలవ్."

"చూడగలను—ఎప్పటికైనా ఈ చెర వొదిలితే."

"అవును. మనం నిర్బంధితులం. అప్పుడప్పుడు నామాట మరిచి పోతుంటాను. నా సంకల్పన ఈ చెరసాలగోడల్ని దాటిపోతుంది. కాబట్టి నేను స్వేచ్ఛగా ఉన్నానని పొరబడుతుంటాను."

"మిమ్మల్నెందుకు బంధించారు?" అని అడిగాడు డాంటే.

"దేన్ని సాధించాలని నెపోలియన్ 1811 లో కలలు కన్నా డో, దానికోసం నేను 1807 లో కలలు కన్నందుకు. ముక్క ముక్కలై అంతః కలహాలతో మగ్గిపోతున్న ఇటలీ రాష్ట్రాలన్నింటినీ బలీయమైన ఏకైక రాజ్యంగా నిర్మించాలని మొకియావెలీ మాదిరిగా కోరినందుకు. రాజ లాంఛనాలు గ్రహించిన ఒక మూర్ఖుని మహోరాజు కాగలడని భ్రమించాను. అతను నాలక్ష్యాన్ని అర్థంచేసు కున్నట్లు నటించి నన్ను మోసగించాడు. నాపట్ల ద్రోహం చేశాడు. ఆరో అలెగ్జాండర్, ఏడో క్లెమెంట్‌లు దేనికోసం కృషి చేశారో, దాన్ని నేను సాధించాలనుకున్నాను. అదింక ఎన్నడూ సాధ్య పడదు. నెపోలియన్ కూడా దాన్ని సాధించలేకపోయాడు. ఇట లీని దుష్టగ్రహం ఏదో ఆవహించింది." వృద్ధుని శిరస్సు వొంగి పోయింది.

ఇటువంటివాటికోసం మనిషి ప్రాణహాని కూడా లక్ష్య పెట్టకుండాఎలా కృషిచేస్తాడో డాంటేకి అర్థంకావేదు. ఒక ఫాదరీని గురించి జైలర్ చెప్పినది నిజమే కాబోలనిపించిం దతనికి. "ఆరోగ్యం చెడిపోయిన ఫాదరీ అంటే మీరేనా?" అని అడిగాడు.

"అంటే, మతిస్థిరం తప్పడం అని కాముాను వ్యవహరిస్తున్నది?"

"అలా అడగలేకపోయాను" అన్నాడు డాంటే నవ్వుతూ.

"అవును" అన్నాడు ఫెరియా నవ్వుతూ. కాని ఆనవ్వులో జీవం లేదు. "చాలకాలంగా నన్ను పిచ్చివాడని అనుకుంటు న్నారు. అలా నటిస్తే జైలర్లు మన గోడవకి మనల్ని వొదిలేస్తారు. చిన్నపిల్లలుంటే చక్కగా కాలక్షేపం చెయ్యవచ్చును—ఇక్కడ లేరనుకో."

"అంటే ఇంక తప్పించుకు పారిపోవాలనే ఉద్దేశం మీరు మానుకున్నట్టేనా?"

"పారిపోడం అసాధ్యం. అసాధ్యమైనదానిని సాధించదలు

చుకోడం, దైవవిధిని ప్రతికూలించడానికి యత్నించటమన్న మాట."

"కాని ఇంత నిరుత్సాహపడ్డం ఎందుకు? ఇంకొక దారి కనిపెట్టలేరా?"

"ఇంతవరకూ నేను చేసిన కృషి నీకు తెలియకపోబట్టే నువ్వలా అడుగుతున్నావు. ఈ పనిముట్లు తయారు చెయ్యడానికి నాకు నాలుగేళ్లు పట్టిందని నీకు తెలుసునా? ఉక్కులా ఉన్న గోడని గీకి, గోలిచి, దారి చెయ్యడానికి రెండేళ్లు పట్టిందని తెలుసునా? కదపడం అసాధ్యమనుకున్న రాళ్లని కొద్ది కొద్దిగా కదిల్చి, ఊడపెరికాను. గంటలకు గంటలు రోజులకు రోజులు శ్రమపడ్డాను. రాతికంటె గట్టిగా బిగిసిన సిమెంటుని రాత్రంతా పనిచేసి ఒక్క అంగుళం మేర తియ్యగలిగినా సంతోషించాను. తవ్వపోసిన రాళ్లనీ మట్టినీ దాచడానికి ఒక చోట మెట్లకింద చీకటి చోటులోకి దారి తవ్వవలసివచ్చింది. ఇప్పుడా చోటు నిండిపోయింది. ఇంక అక్కడ గుప్పెడు మన్ను కూడా పట్టదు. ఈ పైన తవ్వేది అదెక్కడ దాచాలో తెలియదు. చిట్టచివరికి ఇన్నేళ్ల పరిశ్రమకీ ఫలితం లభించబోతున్నదనుకున్న సమయానికి భగవంతుడు నా ఆశలన్నిటినీ ఒక్క వేటుతో పటాపంచలు చేశాడు. ఇంక నేను నా స్వేచ్ఛకోసం పాటుపడలేను. ఆ ఆశ శాశ్వతంగా భగ్నం కావడమే భగవదిచ్ఛ అనిపిస్తోంది."

ఫెరయా డాంటే పడకపైన కూచున్నాడు. డాంటే నిలబడే ఉన్నాడు. ఇంతకుముందు డాంటే తప్పించుకోవాలని ఎన్నడూ అనుకోలేదు. మూడేళ్లు కష్టపడి నేలకింద ఏభై అడుగుల పొడుగున సొరంగం దొలిచినట్లయితే, తీరా సముద్రతీరాన ఒక కొండ అంచుపైకి దారి తియ్యవచ్చును. అక్కడనించి ఏభై అరవై అడుగులు నీటిలోకి దూకాలి. దూకడంలో ఏ రాతిపైనైనా పడితే, ఎముకలు పిండికావలసిందే. అలా కాక సముద్రంలోకే దూకినా, ఈలోగా గస్తీ సిపాయిల తుపాకికాల్పులనుంచి తప్పించుకోవాలి. అదీ తప్పించుకున్నా, సముద్రంలో మూడుమైళ్లు ఈదితే గాని కాలూనడానికి చోటు దొరకదు. ఇటువంటి ప్రయత్నం మృత్యువుకే దారితీస్తుందని డాంటే అభిప్రాయం. అందువల్లనే

డాంటే ఎన్నడూ ఇటువంటి సాహసానికి దిగాలని యోచించనే లేదు. కాని ఈ వృద్ధుని సాహసం, పట్టుదల చూసేసరికి, డాంటేకి అంతులేని ఉత్సాహం కలిగింది. అతనికి కొత్త బలం, పుష్టి వచ్చినట్లయింది. ఒక వ్యక్తి అంత కృషి చెయ్యగలిగినప్పుడు, తనింకెంతైనా చెయ్యగల ననిపించింది. ఫెరయా ఏభై అడుగుల సొరంగం తవ్వాడు. తను నూరడుగుల సొరంగం తవ్వగలడు. ఫెరయా మూడేళ్లు పాటు పడ్డాడు. తను కనీసం ఆరేళ్లలోనైనా చెయ్యగలడు. ఇఫ్ కోటను దాటి సముద్రంలో ఈదాలను కున్నాడు ఫెరయా. సముద్రమంటే భీతి లేని తనవంటి నావికుడు ఈ సాహసానికి పనుతియ్యడేమా ? డాంటేకి కావలసినదల్లా ప్రోత్సాహం; తార్కాణం. ఇంకొక మనిషి ఎవరు చేసేదైనా సరే, తాను చేసితీరగలడు. యువకుడు కొంతసేపు ఆలోచించాడు. చివరికన్నాడు: "మీరు దేనికోసం పాటుపడుతున్నారో, అది నేను కనిపెట్టాను."

ఫెరయా ఉలిక్కిపడ్డాడు.

"ఏం కనిపెట్టావ్?"

"మీరు తొలిచిన దిక్కుగానే మరికొంతదూరం తొలిచినట్లయితే, అది పహరా ఉన్నచోటికి దారితీస్తుంది."

"అవును."

"అక్కడివరకూ—అంటే పదిహేనడుగులు — దొలిచి, ఆచివర, భూమిపైకి దారిచేసుకోవచ్చును. అక్కడ గస్తీ సిపాయిని చంపేసి పారిపోవచ్చును. ఇలా చెయ్యాలంటే ధైర్యం అవసరం. చురుకుతనం కావాలి. మొదటిది మీకుంది. రెండోది నాకుంది. ఓపికసంగతి చెప్పనక్కర్లేదు. అది మీకెంతైనా ఉందని మీరు నిరూపించారు. నా కూ డా ఉందని నిరూపిస్తాను."

"ఒకసారి ఆగు" అన్నాడు ఫెరయా. "నీకింకా అర్థం కాలేదు నా సాహసం ఎటువంటిదో. నా బలాన్ని దేని కుప యోగించగలనో ఇంకా నువ్వేం చూడలేదు. స్వేచ్ఛకోసం ప్రయత్నించడం దైవకార్యమే ననుకున్నాను. నేనే దోషం ఎరగను. అందువల్ల శాశ్వతనిర్బంధం నా ప్రారబ్ధంలో రాసిపెట్టలే దనుకున్నాను. ఇంతవరకూ ప్రాణంలేని వస్తువులే

నాకునిరోధాలైనాయి. ఇప్పుడు మనుష్యులతో ప్రమేయం పెట్టుకో మంటున్నావు. గోడలు తవ్వి దాటగలను. కాని మానవుల్ని నా దారినుంచి తొలగించలేను. ప్రాణిని నాశనం చెయ్యలేను."

"స్వేచ్ఛ లభించేచోట, ఇటువంటి సంకోచాలతో వెను దీస్తారా?"

ఫెరయా అన్నాడు: "అయితే ఇది చెప్పు. ముక్కాలి పీటతో జైలర్ బుర్ర బద్దలు కొట్టి, నువ్వు వాడి దుస్తులు తొడుక్కొని పారిపోడాని కెందుకు ప్రయత్నించలేదు?"

"అసలా ఆలోచనే నాకు తట్టలేదు."

"అలా కాదు. అటువంటి నేరం చెయ్యడానికి నీ అంత రాత్మ ఒప్పుకోలేదు. సక్రమమైన చిన్న చిన్న విషయాల్లో నీతి తప్పవద్దని మనలో ప్రకృతి మనల్ని హెచ్చరిస్తూ ఉంటుంది. పెద్ద పులి చిన్న జంతువుల్ని చంపి నెత్తురోడ్చగలుగుతున్నదంటే, అది దాని ప్రకృతిఆజ్ఞల్ని నిర్వర్తిస్తోం దన్నమాట. కాని మానవుడు నెత్తురోడ్చడానికి జంకుతాడు. హత్య చెయ్యకుండా మానవుని నివారించేది అతని సమాజనీతి కాదు, సహజ ప్రకృతి."

డాంటిమనస్సు వికలమయింది. ఫెరయా చెప్పినదంతా సంస్కారజనితమైన ఛాందస శంకా ఫలితమే. కాని అవే భావాలు డాంటె మనస్సునుకూడా ఇదివరలో అతనికి తెలియకనే అతన్ని కలవర పెట్టాయి.

ఫెరయా అన్నాడు: "కారాగారంలో ఉన్న ఈ దీర్ఘ కాలంలో తప్పించుకోడానికి సామాన్యంగా అందరికీ తెలిసిన మార్గాల్ని గురించి అనేక పర్యాయాలు యోచించాను. సావధానంగా ఆలోచించి, ఉపాయం పన్ని, అతి జాగ్రత్తగా పని కుపక్రమించినవాళ్లు తప్పించుకో గలిగారు. ప్రమాదవశంవల్ల అవకాశం లభించి, తప్పించుకున్నవాళ్లున్నారు. రెండోమార్గమే ఉత్తమమని నా ఉద్దేశం. మనం ఆ అవకాశంకోసం నిరీక్షించాలి. అది లభించినప్పుడు వినియోగపరుచుకోగలగాలి."

డాంటే నిశ్వాసం విడిచి అన్నాడు: "మీరు నిరీక్షించగలి గారు. ఇన్నాళ్లు మీరు చేసిన పనివల్ల మీ ధ్యానం దీనిపైనే లగ్నమయింది. ఈ కాలక్షేపం లేనప్పుడు మీకు ఆశఅనేది ఉంది."

"కాని నాకింకా ఇతర కర్తవ్యాలు చాలా ఉన్నాయి. నేను చదివాను. వ్రాశాను."

"అంటే మీకు కాగితాలు, కలం, సిరా ఇచ్చారా?"

"ఇవ్వలేదు. నేనే తయారుచేశాను. నువ్వు నాగదికి వచ్చినప్పుడు నేను వ్రాసినది చూపిస్తాను. నాజీవితమంతా వినియోగించి రోమ్, వెనిస్, ఫ్లారెన్స్ నగరాల్లో పరిశోధన జరిపి, నాలో నేను చర్చించుకుని, ఒక గ్రంథం వ్రాశాను. చివరి కా గ్రంథాన్ని ఇఫ్‌కోటలో ఈనాలుగు గోడలమధ్యా ముగించవలసి వస్తుందని వాజన్మలో అనుకోలేదు. ఇటలీలో ఏకైక రాజరిక సంస్థాపనావకాశాల్ని గురించి వ్రాసిన దా గ్రంథం. చాలా పెద్దపుస్తకమౌతుంది.

"అది మీరు రాశారా?"

"అవును. నా రెండు చొక్కాలమీద రాశాను. నే నొక పదార్థం కనిపెట్టాను. దాన్ని గుడ్డమీద వాడినట్లయితే, గుడ్డ చక్కగా చదునై, వ్రాయడానికి వీలుగా చిక్కనౌతుంది."

"అటువంటి గ్రంథం రాయాలంటే పుస్తకాలు చదవాలికదా? మీ కిచ్చారా?"

"రోమ్‌లోనా స్వంతగ్రంథాలయంలో అయిదు వేల గ్రంథాలున్నాయి. వాటిని చదివి చదివి ఒక అభిప్రాయానికొచ్చాను. మానవునికి తెలిసిన జ్ఞానాన్ని సంపూర్తిగా కాకపోయినా, కనీసం ప్రతిమానవుడూ తెలుసుకోవలసిన దానినంతనీ, నూటయేభైపుస్తకాల్లో చదవవచ్చును. అటువంటి నూట యేభైపుస్తకాల్ని ఎంచి, అన్నిటినీ ఒకొక్కసారి కాదు, అనేక సార్లు చదివాను. అలా మొత్తం మూడేళ్లు చదివాను. నేను అరెస్టయ్యేరోజుకి ఆ పుస్తకాలన్నీ నాకు దాదాపు కంఠస్థమైనాయి. ఇప్పుడు నిర్బంధంలో ఉన్నాను కాబట్టి, కొంత ప్రయత్నంచేస్తే అదంతా జ్ఞప్తికొస్తుంది. థ్యూసిడైడిస్, క్జెనోఫన్, ప్లూటార్క్, షేక్స్పియర్, స్పినోజా, మెకియవెలీ మొదలైనవారి రచనల్ని చదివి వినిపించగలను. ఇప్పుడు ముఖ్యమైనవాళ్ల పేర్లుమాత్రమే చెప్పాను."

"మీకు చాలా భాషలు తెలుసన్నమాట?"

"నేను ఆధునికభాష లైదు,—జర్మన్, ఫ్రెంచ్, ఇటాలియన్, ఇంగ్లిష్, స్పానిష్—మాట్లాడగలను. పురాతన గ్రీక్ భాష తెలుసు కాబట్టి, కొన్ని తప్పుల్తో ఆధునిక గ్రీక్ భాష మాట్లాడ

గలను. అయినా ఇప్పుడా భాష చదువుతున్నాను. నాకు పరిచయమున్న పదసంచయాన్ని జ్ఞప్తికి తెచ్చుకుని, వివిధరీతుల ప్రయోగాల్ని ప్రయత్నిస్తాను. దాదాపు వెయ్యిపదాలు తెలుసును. నిఘంటువుల్లో లక్షలకొద్దీ పదా లుంటాయి. కాని నా భావాల్ని ప్రకటించడానికి నాకు ఆ వెయ్యి పదాలూ చాలు."

డాంటీచకితుడైనాడు. ఈ వింతవ్యక్తిలో మానవాతీతమైనవి అద్భుత ప్రజ్ఞ లున్నా యనుకున్నాడు.

"మీకు కలా లివ్వలేదుకదా, ఇంత ఉద్గ్రంథాన్నెలా రాశారు?" అని అడిగాడు.

"అప్పుడప్పుడు మనకి పెట్టే చేపల ముళ్లుతీసి కలాలు తయారుచేశాను."

"సిరా ?"

"నా గదిలో ఇదివరకు పొయ్యి పెట్టేవా రనుకుంటాను. పొగపోయే గొట్టం ఒకటుంది. అదంతా మసి దట్టంగా పట్టిఉంది. ఆ మసి తీసి, నా కిచ్చే ద్రాక్షసారాయంతో కలిపితే, చక్కగా వ్రాస్తుంది. పాఠాంతరాలుకాని ముఖ్యమైన గమనికలుగాని ఉంటే, నా వేలు గీసి నెత్తుటితో వ్రాశాను."

"ఇదంతా నా కెప్పుడు చూపిస్తారు ?"

"ఇప్పుడే ! రా." అన్నాడు ఫెరయా. మెల్లిగా సొరంగం ప్రవేశించాడు. డాంటీ అతనివెంట ప్రవేశించాడు.

# 17

సొరంగమార్గంలో దేకి వెళ్లి ఇద్దరూ రెండో చివరి గది ప్రవేశించారు. గదిఅంతా రాతిపలకలతో కప్పిఉంది. ఫెరయా తన గదిగోడ కన్నాన్ని ఒక రాతిపలకతో కప్పాడు. ఆ వ్యూల బొత్తిగా చీకటిగా ఉంది. డాంటీ సొరంగంలో దేకి, గదిలోకి వచ్చి లేచి నిలిచాడు. గది చుట్టూ కలయచూశాడు.

ఫెరయా అన్నాడు : "ఇప్పుడు పన్నెండుంబావుమాత్రమే అయింది. మన కింకా చాలా వ్యవధి ఉంది."

ఏ గడియారం చూసి ఫెరయా కాలనిర్ణయం చేశాడో డాంటీకి తెలియలేదు. గది అంతటా చూశాడు.

"ఈ తాడు దేంతో అల్లారు ?"

"నేను ఫెనెస్ట్రెల్‌లో నిర్బంధంలో ఉన్న మూడేళ్లలో చొక్కాలు చింపి, పడకమెత్త లో భాగాన్ని దొలిచి, ఆ సరుకుతో తయారు చేశాను. నన్నిక్కడికి తెచ్చినప్పుడు దీన్ని దాచి తెచ్చాను. ఇక్కడి కొచ్చినతరవాత ఈ పని పూర్తిచేశాను."

"మరి మీ పడక మెత్తని ఎవ్వరూ చూడలేదా?"

"లేదు. దాన్ని ఈ సూదితో కుట్టేశాను." అని ఫెరయా తన చిరిగిన కోటులోనించి మరొక చేపముల్లు తీసి చూపించాడు. అది సన్నగా పొడుగ్గా ఉంది. దానిచివర దారం వేలాడు తోంది.

"ఇదివరలో ఈకిటికీలో నుంచితప్పించుకోవా లనుకున్నాను. ఇది నీకిటికీకంటె పెద్దది. మెల్లిగా ఊచలు పీకి ఈతాడు నిచ్చెన సహాయంతో పారిపోవాలనుకున్నాను. కాని ఆ కిటికీలోనించి వెడితే పెద్ద ఆవరణలోకి దారితీస్తుంది. అందువల్ల ఇది ప్రమాదమైన పని అనుకుని విరమించుకున్నాను. అయినా ఈతాడు నిచ్చెన దాచి ఉంచాను."

డాంటీ తాడు నిచ్చెన పరీక్షిస్తున్నట్లు నటిస్తూ, మరొక విషయంగురించి ఆలోచించడం మొదలెట్టాడు. ఇంత ప్రజ్ఞావం తుడు, ఉపాయం తెలిసినవాడు తన దురదృష్టానికి మూలమైన కారణాన్ని తనకి చెప్పలేడా ? ఆ కారణ మేదో తన కెంత యోచించినా తెలియడంలేదు.

"ఏమి టాలోచిస్తున్నావ్ ?" అన్నాడు ఫెరయా. తనపట్ల ప్రశంస ప్రకటించడానికి మాటలుకూడా రాక, మౌనంగా ఉన్నా డనుకున్నాడు.

"మీ కున్న అపారజ్ఞానసంపదవల్ల ఇటువంటివి సాధించగలి గారు. మీకే స్వేచ్ఛఉంటే, ఏంచేస్తారని ఆలోచిస్తున్నాను."

"ఏం చేస్తాను? ఏమీ చెయ్యనేమో! అల్పవిషయాలపైన నా బుద్ధిని వ్యర్థపుచ్చేవాడినేమో. పొందిక లేకుండా నలువంకలకీ దారితీసే నాలోని ప్రజ్ఞావిశేషాలు, నిర్బంధంవల్ల ఏకోన్ముఖమై నాయి. స్థానం పరిమితమైనందువల్ల పరస్పరం సంఘర్షణ చెందాయి. మేఘాల సంఘర్షణవల్ల విద్యుచ్ఛక్తి, విద్యుచ్ఛక్తివల్ల మెరుపు, మెరుపువల్ల వెలుగు పుడతాయి."

"నిజంగా నాకు తెలిసినది శూన్యం!" అన్నాడు డాంటే, తన అజ్ఞానానికి చింతిస్తూ. "మీరు చెప్పేమాటల్లో సగం నాకు అర్థం తెలియనివి. ఇంత జ్ఞానాన్ని ఆర్జించిన మీరు చాల అదృష్ట వంతులు."

ఫెరయా నవ్వాడు: "కాని నువ్వు రెండు విషయాల్ని గురించి యోచిస్తున్నావు. నాకు ఒక్కటే చెప్పావు."

"అవును. మీరు మీ జీవితాన్ని గురించి నాకు చెప్పారు. నా జీవితంగురించి మీకు తెలియదు."

"నీ జీవితం ఎంతోయ్! ఇంకా ఏం గడిచింది? చెప్పుకో వలసిన ఘట్టా లుండడానికి అవకాశమే లేదు."

"కావచ్చును. అయినా, ఆ కొ స్తలోనే ఘోరదుర్ఘటన ఇమిడి ఉంది. ఈ దురదృష్టం రాసిపెట్టడానికి నేనే పాపం చెయ్యలేదు. దీనికి కారకులైన దుష్టు లెవరో తెలియదు. అది తెలిస్తే భగవంతుని నిందించవలసినపని ఉండదు. అప్పుడప్పుడు భగవంతుని దూషించాను కూడా."

"అంటే నీపైన మోపబడిన అపరాధం నువ్వు చెయ్యలేదనే అంటావా?"

"నేనే అపరాధం చెయ్యలేదు. నా తండ్రితోడు; నా ప్రియురాలు మర్సిదాతోడు, నే నేమీ ఎరగను. నా జన్మలో నేను వా రిద్దరి నే ప్రాణపదంగా ప్రేమించాను."

తరవాత డాంటే మెల్లిగా తన కథంతా చెప్పాడు. మార్సేల్స్ చేరడం, అక్కడ తండ్రినీ, మర్సిదానీ చూడ్డం, పెళ్లి ప్రధానపు విందు జరగడం, చివరికి తన అరెస్టు, విల్ ఫర్ట్ పరీక్ష, తన నిర్బంధం, అన్నీ విపులంగా చెప్పాడు. కథ ఇక్కడితో అఖరయింది. ఇంతకంటె డాంటేకి తెలియదు.

ఫెరయా అన్నాడు: "క్షుద్రమైన మనస్సుకి దురాలోచనలు కలిగినప్పుడు తప్ప, సర్వసామాన్యంగా మానవస్వభావం పాపం జోలికిపోదన్నది నిత్యంసత్యమే. అయినా మన నాగరికతలో రకరకాల కోరికలు, దురభ్యాసాలు, అసహజమైన వాంఛలు బయలుదేరాయి. అవి మానవుని సహజప్రకృతి లక్షణాలను మాపు చేసి పెడదారులు పట్టిస్తాయి. అందువల్ల పై సత్యాన్ని ఇప్పటికీ విశ్వసించవచ్చును. నిజమైన నేరస్థుడెవరో తెలుసుకోవాలంటే,

ముందుగా ఆ నేరంవల్ల ఎవరు లబ్ధి పొందగలరో కనిపెట్టు. నువ్వు కనిపించకుండా పోయినట్లయితే లబ్ధి ఎవరికి కలుగుతుందో చెప్పు."

"దేవుడిదయవల్ల ఎవరికీ లబ్ధి కలిగే వీలు లేదు. నేనంత గొప్ప వాడిని కాను."

"అలా చెప్పకు. అలా అంటున్నావంటే, నీలో హేతు జ్ఞానం, మానవవిజ్ఞానం లోపించాయన్న మాట. కొద్ది గొప్ప తేడాలు తప్ప, అంతటా ప్రకృతి ఒక లేనోయ్. వారసుల కడ్డు నిలిచే మహా రాజుల మొదలు, ఎంత చిన్న ఉద్యోగంలో ఉన్నా ఇంకొక నిర్భాగ్యుడికి అవకాశమివ్వని కొద్ది మనుష్యులవరకూ, అందరూ ఒకే స్థితిలో ఉంటారు. నువ్వు ఫరావో నౌక కెప్టెన్ కావలసిన వాడవు. సుందరయువతి నొకామెను వివాహం చేసుకోడానికి సిద్ధంగా ఉన్న వాడవు. అంతే కదా?"

"అవును."

"నువ్వు ఫరావో కెప్టెన్‌గా నియమించబడకుండా ఉండా లని కోరుకున్న వారెవరూ లేరా? మర్సిదాని నువ్వు వివాహం చేసుకోకుండా నివారించాలని కోరుకున్నవారెవరైనా ఉన్నారా? ముందుగా మొదటిప్రశ్నకి బవాబియ్యి. ఏ సమస్యల్ని పరిష్కరిం చాలన్నా, క్రమబద్ధంగా ఆలోచించాలి."

"ఎవరూ లేరు. నాకలో అందరికీ నాపట్ల ఇష్టమే. కెప్టెన్ గా ఒకరి నెంచే హక్కు నావికులకే ఉన్నట్లయితే, నన్నే ఎంచే వారు. ఒక్క వ్యక్తికిమాత్రం నాపైన క్రోధం ఉంది. అతనితో ఒక తగవొచ్చింది. ద్వంద్వయుద్ధానికి రమ్మన్నాను. కాని నిరాకరిం చాడు."

"అతని పేరు?"

"డాంగ్లర్. ఓడలో సరుకుపై అజమాయిషీ చేసే ఉద్యోగి."

"నిన్ను కెప్టెన్‌గా నియమించి ఉన్నట్లయితే, అతన్ని ఆ ఉద్యోగంలో ఉండనిచ్చేవాడివా?"

"అది నాచేతిలో ఉంటే, ఉండనిచ్చేవాణ్ణి కాను. అతని పద్దుల్లో తప్పు లెక్కలున్నాయి."

"సరే, ఇది చెప్పు. కెప్టెన్ లక్లేర్‌తో ఆఖరిసారి నువ్వు మాట్లాడినప్పుడు అక్కడెవరైనా ఉన్నారా? లేక మీరు మాట్లా డిన దెవరైనా విని ఉంటారా?"

"ఆ! అవును. తలుపుతీసివుంది. ఇప్పుడు తల్చుకుంటే జ్ఞాపకంవస్తోంది. గ్రాండ్‌మార్షల్ కివ్వాలని చెప్తూ కెప్టెన్ లక్లేర్ నా చేతికి బంగీ ఇచ్చినప్పుడు, సరిగ్గా ఆసమయంలోనే, డాంగ్లర్ ఆ దారిని వెళ్లాడు."

"అల్లా చెప్పు" అన్నాడు ఫెరయా. "ఇప్పుడు మనం సరైన దారిలో పడ్డాం. నువ్వు ఎల్బాద్వీపంలో దిగినప్పుడు నీతోకూడా ఎవరినైనా తీసుకువెళ్ళావా?"

"ఎవరినీ తీసుకువెళ్లలేదు."

"అప్పుడక్కడ నీ కొక ఉత్తరం ఇచ్చారు కదూ?"

"అవును. గ్రాండ్‌మార్షల్ ఇచ్చారు."

"దాన్నేం చేశావప్పుడు?"

"దాన్ని నాజేబు పుస్తకంలో దాచాను."

"అది అప్పుడు నీజేబులోనే ఉందన్నమాట. అంతేనా? కాని రాజోద్యోగులిచ్చిన పెద్దఉత్తరాన్ని, నీ జేబులో పట్టేటంత పుస్తకంలో ఎలా దాచావు?"

"అవును. మీరు చెప్పింది నిజమే. అసలు నేను ద్వీపంలో దిగినప్పుడు ఆ పుస్తకాన్ని ఓడలోనే ఉంచేశాను."

"అంటే, నువ్వు మళ్ళీ తిరిగి ఓడెక్కినతరవాతనే ఆ ఉత్తరాన్ని ఆ పుస్తకంలో దాచావా?"

"లేదు."

"మరైతే ఓడెక్కగానే ఆ ఉత్తరాన్నేంచేశావు?"

"చేతులో పట్టుకున్నాను."

"అయితే నీచేతిలో ఒక ఉత్తరం ఉన్నట్లు, ఓడలో డాంగ్లర్‌తో సహా నావికులందరూ చూశారన్నమాట?"

"చూశారు."

"సరే, సరిగ్గా జ్ఞాపకం తెచ్చుకుని చెప్పు. నీపైన నేరం మోపిన ఉత్తరంలో వాక్యాలేమిటో సరిగ్గా నాకు చెప్పగలవా?"

డాంటీ కొంచెంసేపు ఆలోచించాడు. "ఆ. జ్ఞాపకం ఉంది. అందులో ఇలా వుంది: 'మహారాజుయొక్క హితంకోరిన ఒక మిత్రుడు, రాజశాసనాధికారి నీ కిందివిధంగా హెచ్చరిస్తున్నాడు: స్మిర్నానుంచి బయలుదేరి, నేపుల్స్, ఫెరాజోరేవులగుండా ప్రయాణంచేసి, ఇవాళ ఉదయమే మార్సేల్స్ చేరిన ఫరావో

నౌకలో మేట్‌గా పనిచేస్తున్న ఎడ్మండ్ డాంటే అనే ఒక యువకుడు, నేపుల్స్ రాజు (నెపోలియన్ బావమరిది)వద్దనుంచి నెపోలియన్‌కు ఒక ఉత్తరం ఇచ్చి, పారిస్‌లో బోనపార్టిస్ట్ కమిటీకి ఇవ్వడానికి నెపోలియన్ వద్దనుంచి ఒక ఉత్తరం తీసుకు వెడుతున్నాడు. ఆ యువకుని అరెస్టుచేసినట్లయితే, రుజువు దొరుకుతుంది. నెపోలియన్ ఉత్తరం అతనివద్దకాని, అతని తండ్రిఇంటిలో కాని, ఫరావో నౌకలో అతని గదిలోకాని దొరుకుతుంది."

ఫెరయా భుజా లెగరేశాడు. "ఏముంది ? వెలుగులా వచ్చి పోయింది అసలు విషయం. డాంగ్లర్ దస్తూరీ మామూలుగా ఎలా వుంటుంది. ?"

"చక్కని కలిపిరాత."

"ఈ ఆకాశరామన్న ఉత్తరంలో దస్తూరీ వంకర టింకరగా ఉందా?"

"అవ్నే. పెద్దపెద్ద అక్షరాలున్నాయి."

"ఆగు" అన్నాడు ఫెరయా. తన కలం తీసి సిరాలోముంచి, చిక్కపరచిన ఒక గుడ్డముక్క మీద ఎడమ చేత్తో పై వాక్యాలనే వ్రాశాడు.

డాంటే చూసి ఉలికిపడ్డాడు. భీతితో ఫెరయావంక చూశాడు.

"అబ్బ! ఏమి చిత్రంగా ఉంది! ఆ ఉత్తరంలో దస్తూరీ సరిగ్గా ఈపోలికనే ఉంది." అన్నాడు.

"ఎందువల్లనంటే, దాన్ని ఎడమచేత్తో రాసినందువల్ల. కుడిచేతి దస్తూరీల్లో పోలిక లుండకపోయినా, కుడిచేత్తో రాయడం అలవాటున్నవాళ్లు ఎడమచేత్తో రాసినట్లయితే, దాదాపు అన్నీ ఒకే పోలిక నుంటాయి. సరే. ఇంక రెండో అంశం చూద్దాం. నువ్వు మర్సిదాని వివాహం చేసుకోకుండా వారించాలని కోరేవారెవరైనా ఉండిఉంటారా?"

"ఉన్నాడు. ఆమెను ప్రేమించిన కాటలన్ యువకుడొకడున్నాడు. అతని పేరు ఫెర్నాండో."

"అతనీ ఉత్తరం రాయగలడా?"

"రాయలేడు. నన్ను పొడిచెయ్యగలవాడే కాని, రాయగలవాడు కాడు. అంతే కాదు. ఆ ఉత్తరంలో ఉన్న సంగతు లేవీ అతనికి తెలియవు."

"నువ్వీ సంగతు లేవీ ఎవ్వరికీ చెప్పలేదా? నీ ప్రియురాలికి కూడా చెప్పలేదా?"

"లేదు. మర్సిదాకికూడా చెప్పలేదు"

"అయితే డాంగ్లర్ రాశా డన్నమాట."

"అవును. ఇప్పుడింక నాకు సందేహం లేదు" అన్నాడు డాంటీ.

"ఆగు. ఫెర్నాండోని డాంగ్లర్ కి తెలుసా?"

"లేదు - కాని. అవును. ఇప్పుడు జ్ఞప్తికొస్తోంది. ప్రధానపు విందుకి ముందురోజు సాయంకాలం ఇద్దరూ కలిసి రిజర్వ్ హోటల్లో కూచునిఉండగా చూశాను. డాంగ్లర్ స్నేహభావంతో అతన్ని పరిహాసం చేస్తున్నాడు. ఫెర్నాండో ముఖం పాలిపోయి ఉంది."

"వాళ్లిద్దరే ఉన్నారా?"

"లేదు. మూడోవాడుకూడా ఉన్నాడు. మా పొరుగునుండే దర్జీ. అతని పేరు కొడరూస్. అతన్ని నాకు బాగా తెలుసు. కాని అతనప్పుడు బాగా మత్తుగా తాగిఉన్నాడు. అరె! ఇప్పుడు తల్చుకుంటే జ్ఞాపకం వస్తోంది -" అన్నాడు డాంటీ. కళ్లు పెద్దవిచేసి చూస్తున్నాడు. చేత్తో కణత నొక్కుకున్నాడు. "వాళ్ల మేజా మీద అప్పుడు కలం, సిరా, కాగితంకూడా ఉన్నాయి. దురంతకులు! ఘాతకులు!"

"ఇంకేమైనా బోధపడవలసినవున్నాయా?" అన్నాడు ఫెరయా నవ్వుతూ.

"ఉన్నాయి. మీరు అన్ని విషయాల ఆంతర్యం గ్రహించగలరు. నన్ను ఒక్కసారే ఎందుకు పరీక్ష చేశారు? నాపైన బహిరంగ విచారణ కెందుకు జరపలేదు? శిక్ష విధించకుండా నన్ని నిర్బంధంలో ఎందుకు పడేశారు?"

"అది కనుక్కోడం కొంచెం కష్టమైన పని. న్యాయ నిర్ణయ విధానం అయోమయం. అనూహ్యంగా ఉంటుంది. నీ మిత్రులిద్దర్ని గురించీ కనిపెట్టినది ఏమంత కష్టం కాదు. అది చిటికలో పని. ఎవరైనా కనిపెట్టగలరు. కాని ఈ విషయంలో, సమాచారం పొల్లుపోకుండా, పొరపాటు లేకుండా చెప్పాలి. ని న్నెవరు పరీక్ష చేసినది?"

"రెండో రాజశాసనోద్యోగి."

"అతను వృద్ధుడా, యువకుడా?"

"యువకుడు. ఇరవై ఏడు, ఇరవై ఎనిమిదేళ్లుంటాయి."

"సరే. అంటే అవినీతి అంటలేదన్నమాట ఇంకా. కాని ఉన్నతికోసం దురాశాపరుడై ఉండవచ్చు. నీపట్ల ఎలా ప్రవర్తించాడు?"

"కఠినంగా లేదు. సానుభూతితో ఉన్నాడు."

"అతనికి విషయమంతా పూర్తిగా చెప్పావా?"

"పూర్తిగా చెప్పేశాను."

"నిన్ను పరీక్షచేస్తున్నప్పుడు అతని ముఖంలో భావాలు మారాయా?"

"ఆ. నాపైన నేరంమోపిన ఆ ఉత్తరాన్ని చదువుతున్నప్పుడు, నాదురదృష్టం చూసి చాలా కలవరపడినట్లు కనిపించాడు."

"నీ దురదృష్టంవల్లనే అతను కలవరపడ్డాడని నీకు గట్టిగా నమ్మకమేనా?"

"ఆ. నమ్మకమే. నాపట్ల దయకలిగిందని రుజువుకూడా చూపించాడు. ఉత్తరాన్ని అక్కడే నిప్పులోపడేసి కాల్చేశాడు."

"ఏది, ఆకాశరామన్న ఉత్తరాన్నా?"

"కాదు. అసలు ఉత్తరాన్నే. నేను చూస్తుండగానే దాన్ని కాల్చేశాడు. కాల్చి, నాతో అన్నాడు: 'ఇదిగో, నీపై దోషం ఆరోపించే ఈఒక్క ఆధారాన్నీ నాశనంచేస్తున్నాను. చూడు' అన్నాడు."

"ఓ! ఇటువంటి ప్రవర్తన అద్భుతం. కాని సహజం మాత్రం కాదు. ఆఉత్తరంపైన ఎవరి చిరునామా ఉంది?"

"నయర్ టైర్. 13 కాక్ హెరాన్ వీధి, పారిస్."

"ఈఉత్తరాన్ని కాల్చెయ్యడంలో, ఈ అధికారికి స్వార్థమేదైనా ఉంటుందని నీకు శంక కలగలేదా?"

"స్వార్థం ఉండవచ్చు. ఎందుకంటే ఆఉత్తరంసంగతి ఎవ్వరికీ చెప్పవద్దని నాదగ్గిర రెండుమూడుసార్లు వాగ్దానం తీసుకున్నాడు. అయితే అది నాకోసమే నని చెప్పాడు. చిరునామాలో ఉన్న పేరు ఎక్కడా మళ్ళీ ఉచ్చరించనైనావద్దని చెప్పి, నాచేత ప్రమాణం చేయించాడు."

"నయర్ టైర్!" అన్నాడు ఫెరయా. "నయర్ టైర్! నాకు ఒక నయర్ టైర్‌ని గురించి తెలుసును. అతను ఇట్రురియా మహా రాణి ఆస్థానంలో ఉండేవాడు. ఇంకొక నయర్ టైర్ ఉన్నాడు. అతను ఫ్రెంచి విప్లవకాలంలో గిరాండిస్ట్. నిన్ను పరీక్షించిన వ్యక్తి పేరు?"

"విల్‌ఫర్ట్."

ఫెరయా ఫకాలున నవ్వాడు. "అదుగో ఆ సూర్యకిరణాన్ని చూడగలవా? విను. విషయమంతా స్పష్టంగా తెలిసిపోయింది. పాపం! విల్‌ఫర్ట్ నీపట్ల చాలా దయతో మాట్లాడాడు కాదూ? పాపం! చాలాగొప్పవాడు! ఉత్తరాన్ని కాల్చి పారేశాడు! నయర్ టైర్ పే రెక్కడా ఎత్తవద్దని నీచేత ప్రమాణం చేయించాడు కాదూ?"

"అవును."

"అయ్యో! గుడ్డివాడా! ఈ నయర్ టైర్ ఎవరో నీకు కొంచెమైనా తెలియదా? నయర్ టైర్, విల్‌ఫర్ట్ తండ్రి."

డాంటీకి నెత్తిమీదపిడుగు పడినట్లయింది. తల పగిలిపోతుందని భయపడుతున్నట్లు, గట్టిగా రెండుచేతుల్తోనూ తలపట్టుకుని, లేచినిలబడ్డాడు.

"అతని తండ్రా? అతని తండ్రా?" అని అరిచాడు.

"అవును. అతని తండ్రి"

యువకుని మనస్సులో పెద్దమెరుపు మెరిసినట్లయింది. ఇంత వరకూ అయోమయంగా ఉన్న విషయం తెల్లమయింది.

పరీక్షచేసే సమయంలో విల్‌ఫర్ట్ ముఖంలోని మార్పులు, అతను చేసిన నటనలు, కాల్చి వేసిన ఉత్తరం, తనచేత చేయించిన ప్రమాణం, బతిమాలిన అతని మాటలు, తన్ని హింసలగొట్ట వలసినది పోయి అనునయించడం, అంతా స్పష్టంగా అతని కళ్లకు కట్టినట్లయింది. మత్తునివలె తూలాడు. బిగ్గరగా అన్నాడు: "అబ్బ! ఆలోచించాలి. ఇదంతా ఆలోచించాలి. ఒక్కణ్ణే ఆలోచించాలి"

డాంటే తన గదికి వెళ్లి పడకమీద వాలిపోయాడు. సాయంకాలం జైలర్ వచ్చేసరికి అల్లాగే పడుకుని ఉన్నాడు. నిశ్చల ప్రతిమవలె నిశ్చేష్టుడై కనుపాప కదల్చక అలా ఉండిపోయాడు.

చాలసేపు ఆలోచించాడు. ఆలోచించి తిరుగులేని ఒక నిశ్చయాని కొచ్చాడు. ఘోరప్రతిజ్ఞ తీసుకున్నాడు.

చివరికొక గొంతుక వినిపించి, అతని ధ్యానం భగ్నమయింది. జైలర్ వెళ్ళిపోగానే ఫెరయా మెల్లిగా వచ్చి పిలిచాడు. తనతో కలిసి ఆహారం తీసుకోమని డాంటేని ఆహ్వానించాడు.

హాని చెయ్యలేనివాడనీ, పిచ్చిధోరణివల్ల వినోదం మాత్రమే చేకూర్చ కలవాడనీ పేరు సంపాదించిన ఫెరయాకి, జైలుఅధికారులు కొన్ని ప్రత్యేక సౌకర్యాలు ఇస్తున్నారు. ఆదివారాలు తెల్లరొట్టె, ద్రాక్షసారాయం ఇస్తారు. ఇవి రుచి చూపించడానికి ఫెరయా డాంటేని పిలిచాడు.

డాంటే మాట్లాడకుండా లేచి అతన్ని అనుసరించాడు.

"నీకు అదంతా చెప్పి నీ మనస్సుకి కల్లోలం తెచ్చిపెట్టాను. కాని ఏం చెయ్యను? ఇప్పుడు నీహృదయంలో పగ తీర్చుకోవాలనే ఊహ బయలుదేరింది."

"ఇతర విషయాలు మాట్లాడదాం" అన్నాడు డాంటే.

ఫెరయా అతనివంక చూశాడు. విషాదసూచకంగా తల పంకించాడు. ఏవేవో ఇతర విషయాల్ని గురించి మాట్లాడ్డం మొదలు పెట్టాడు.

వృద్ధుని ప్రసంగంలో డాంటే కొత్తగా నేర్చుకున్న సమాచారం ఎంతో ఉంది. డాంటేమనస్సు మరుపులో పడింది. వృద్ధుడు తన కష్టాల్ని గురించి ఏమీ చెప్పలేదు. డాంటే ప్రశంసాపూర్వకంగా వింటున్నాడు. వృద్ధుడు చెప్పే విషయాలలో కొన్ని డాంటే అనుభవానికి సన్నిహితంగా ఉన్నాయి. మిగతావి డాంటేకి బొత్తిగా అర్థంకాలేదు. ఇదివరలో ఎన్నడూ యోచించని విషయాల్ని గురించి ఫెరయా తెలియచెప్పాడు. కొత్త కొత్త భావాలు డాంటే మనస్సులో ఉత్పన్నమైనాయి. తనకంటె విద్యపొందిన మరొక వ్యక్తే ఉంటే, ఫెరయా ప్రసంగిస్తున్న విషయాల్ని ఎంతో ఆసక్తితో వినేవాడని అనుకున్నాడు డాంటే.

"మీకు తెలిసినదానిలో కొద్దిగానైనా మీరు నాకు బోధించాలి." అన్నాడు డాంటే. "నాతో సాన్నిధ్యం మీకు విసుగు కలిగించే వరకూ నాకు చెప్పండి. ముందు ఏం నేర్పుతారు?

వెంటనే మొదలుపెట్టాలని నాకు తొందరగా ఉంది. నేర్చుకో వాలన్న తృష్ణ అమితంగా పుట్టింది."

"నువ్వు సర్వం నేర్చుకోవాలి" అన్నాడు ఫెరయా.

ఆరోజు సాయంత్రమే ఖైదీ లిద్దరూ కూచుని విద్యాబోధకి ఒక కార్యక్రమం నిర్ణయించుకున్నారు. మరునాడు కార్యక్రమంఆరంభ మయింది. డాంటీ ధారణాశక్తి అపారం. సూక్ష్మగ్రాహి. గణితశాస్త్రంలో చాల చురుకు చూపించాడు. రసగ్రహణ పారీణత కూడా అతని కధికం. అంక గణితం, రేఖాగణితాలలో కూడా అతనికి ఉత్సాహం పురిగొల్పే అర్థాలు, లక్ష్యాలు గోచరించాయి. అతని కింతకు ముందే ఇటాలియన్ భాష తెలుసును. నౌకాప్రయాణాలలో కొద్దిగా రోమేక్ భాష నేర్చాడు. ఈ రెండు భాషల సహాయంతో మిగతా భాషల స్వరూపాన్ని ఊహించుకో నారంభించాడు. ఆరు మాసాల్లో స్పానిష్, ఇంగ్లిష్, జర్మన్ భాషల్ని మాట్లాడ గలిగాడు. ఏడాది పూర్తయేసరికి, మనిషే పూర్తిగా మారిపోయాడు. ఫెరయా మాత్రం రోజు రోజుకీ నిరుత్సాహ పడుతున్నట్లు డాంటీ కని పెట్టాడు. ఏదో ఒక్క విషయం అతన్ని నిత్యం పీడిస్తున్నట్లు తోచింది. ఒకొక్కప్పుడు దీర్ఘయోచనానిమగ్నుడై ఉండే వాడు. దీర్ఘనిశ్వాసం విడిచేవాడు. ఉన్నట్టుండి హఠాత్తుగా ఉద్రేకం అతన్ని ఆవహించేది. గబగబా గదిలోపచారు చేసేవాడు.

ఒకనా డిలా పచారుచేస్తూ, చటుక్కున ఆగిపోయాడు:

"అబ్బబ్బ! అక్కడ పహరావాడే లేకపోతే, ఎంత బాగుండేది. !" అన్నాడు.

"మీరు తలుచుకున్నట్లయితే అక్కడ పహరావాడుండడు." అన్నాడు డాంటీ, మిత్రుని అభిప్రాయాన్ని కనిపెట్టి.

"కాని హత్య అంటే నాకు తీరని భయమని చెప్పలేదా నీకు ?"

"కాని ఈ హత్య జరిగినట్లయితే, అది ఆత్మరక్షణకోసం చేసినదే అవుతుంది."

"అయినా తేడా లేదు. రెండూ ఒకటే."

"అయినా మీరు దాన్ని గురించే నిత్యం ఆలోచిస్తున్నారే?"

"నిత్యం ఆలోచిస్తున్నాను!" అని గొణిగాడు ఫెరయా.

"దాని కొక మార్గం గురించి మీరు ఆలోచించారా ?"

"ఆ! ఆలోచించాను. మూగి, చెవిటి అయిన పహరాని అక్కడ పెట్టినట్లయితే బాగానే ఉండును."

"సరే అయితే. వాడు మూగవాడైపోతాడు; చెవిటివాడై పోతాడు." అన్నాడు డాంటీ. ఈమారు డాంటీ దృఢస్వరాన్ని విని, ఫెరయా చకితుడైనాడు.

"అబ్బెబ్బె, అది కుదరదు" అన్నాడు ఫెరయా కంగారుగా.

డాంటీ ఇంకా మాట్లాడేవాడే. కాని ఫెరయా బుర్ర అడ్డంగా తిప్పేశాడు. ఇంక మాట్లాడ్డాని కూడా ఒప్పుకోలేదు.

మూడు మాసాలు గడిచాయి. చివరి కొక నాడు ఫెరయా అడిగాడు:

"ఎడ్మండ్! నీకు తగినంత బలం ఉందా?"

డాంటీ ఉలితీసుకున్నాడు. దాన్ని నాడంలా వంచి, మళ్ళీ వంకర తీసి చూపించాడు.

"మార్గాంతరం లేకపోతే తప్ప, పహరావాడిని చంపనని నాకు మాటిస్తావా ?"

"నా పరువునంతా పణంపెట్టి ప్రమాణంచేస్తాను."

"అయితే ఇంక మనం అనుకున్న పని నెరవేరుద్దాం."

"నెరవేర్చడాని కెన్నాళ్లు పట్టుతుంది ?"

"కనీసం ఏడాది పట్టుతుంది. కాని వెంటనే పని మొదలెడదాం. ఇదిగో నేనుచెప్పే కార్యక్రమం ఇది." అంటూ ఫెరయా, తమ రెండుగదులు, సొరంగాల ఉనికిని గీసి చూపించాడు. సొరంగంమధ్యలో ఒకచోట వరండాకి దారి తవ్వడం, అక్కడ నించి భూమిపైకి తవ్వడం, అక్కడొక రాతిపలక అడ్డుగా ఉంచడం తన ఉపాయమని చెప్పాడు. తరుణం చూసి అది తీసేస్తే పహరావాడు అందులో పడతాడు. అప్పుడతన్ని నోట్లో గుడ్డలు కుక్కి కట్టి పడేసి, ఇద్దరూ కలిసి వరండాచివర కెళ్లి, పైనున్న ఒక కిటికీగుండా తాటినిచ్చెనసహాయంతో అవతలి గోడ దాటి, తప్పించుకోవాలి.

డాంటీ సంతోషం పట్టలేక చప్పట్లు కొట్టాడు. అతని కళ్లు తళతళ మెరిశాయి. ఉపాయం సులువైనది. తప్పకుండా నెర వేరి తీరుతుంది.

ఆరోజు నే ఇద్దరూ తవ్వకం ఆరంభించారు. జైలర్ వచ్చే వేళకి పని ఆపుచేసి ఎవరిగదికి వాళ్లు వెళ్లారు. ఎంత దూరాన ఉన్నా జైలర్ అడుగుల చప్పుడు ఇద్దరికీ పరిచయమైనందువల్ల, ఎన్నడూ ఇద్దరిసట్టూ బైటపడలేదు. అదనుకి ఎవరిగదిలో వారుండేవారు. తవ్వగా వచ్చిన మట్టిని కొద్దికొద్ది చొప్పున ఇద్దరూ వారి కిటికీలలో నుంచి విసిరేవారు. అతిజాగ్రత్తతో రాయిముక్కైనా మిగలకుండా నలగ్గొట్టేవారు. కొంతమట్టి గాలికి లేచిపోయేది.

ఏడాదిపైగా గడిచిపోయినా పని సాగుతూనే ఉంది. ఇద్దరూ ఉపయోగించిన పరికరాలు చిన్న ఉలి, కత్తి, కర్రముక్క మాత్రం. ఈపని చేస్తూనే ఫెరయా డాంటెకి విద్యాబోధ సాగిస్తూ వచ్చాడు. ఒక్క భాషలో కాక అనేకభాషల్లో అతనితో మాట్లాడేవాడు. దేశాల చరిత్రలు, మహాపురుషుల జీవిత విశేషాలు ఏకరువు పెట్టేవాడు.

పదిహేను మాసాలకి వరండాకింద సొరంగం తవ్వకం పూర్తయింది. ఇప్పుడు వారికి పైన పహారావాడు ఇటూ అటూ తిరుగుతున్న అడుగుల చప్పుడు స్పష్టంగా వినపడుతోంది. కాని తప్పించుకోడానికి వీలైనరోజుకోసం ఇద్దరూ నిరీక్షిస్తున్నారు. పట్టుబడకుండా తప్పించుకోవాలంటే, ఆకాశమంతా మేఘాలు కమ్మి, కన్నుపొడుచుకున్నా కనిపించని చీకటిరాత్రివచ్చే వరకూ ఆగాలనుకున్నారు. కాని ఈలోగా వారికి భయం వేసింది. ప్రమాదవశం వల్ల పహారాసిపాయి తిరుగుతున్నప్పుడు కుండే నేల సళ్లి పడి పోతే? అందుకని పునాదుల్లో తవ్వుతుండగా దొరికిన ఒక చిన్న కర్రదూలాన్ని తీసుకొచ్చి బోటుపెట్టారు.

ఒకనాడు డాంటే ఈదూలాన్ని వరండాకింద సొరంగంలో బోటు పెడుతున్నాడు. ఫెరయా డాంటె గదిలో కూచుని, తాడు నిచ్చెన వేలాడతియ్యడానికి మేకొకటి తయారుచేస్తున్నాడు. ఆ సమయంలో డాంటెకి ఆర్తనాదం వినవచ్చింది. డాంటే గబగబా దేకుతూ తన గదికి వెళ్లాడు. ఫెరయా గదిమధ్యలో నిలబడి ఉన్నాడు. అతని ముఖం తెల్లగుడ్డపేలికవలె పాలిపోయింది. నుదుట చెమట ధారలు కట్టింది. పిడికిళ్లు బిగిసి ఉన్నాయి.

ఫెరయాను చూసి డాంటే నిశ్చేష్టుడైనాడు. చేతిలో ఉలి జారి పడింది.

"ఏమయింది?" అన్నాడు.

"అయ్యో! నా పనైపోయింది. ఇలా విను. నాకొక భయంకరమైన వ్యాధిపుట్టింది. నాకు తెలుసును. అది ముంచుకువస్తోంది. దానికొక్కటే మందుంది. నా గదిలో పడక కాళ్లదిక్కున కింద చూడు. అక్కడొక గొయ్యిలో చిన్నసీసా ఉంది. అందులో సగానికి ఎర్రని ఔషధం ఉంది. అది తీసుకొచ్చి నా కియ్యి— ఊహు. అలా కాదు. వొద్దు. తీరా ఇది తెలిసిపోవచ్చు. నాకింకా సత్తువ పూర్తిగా పోకముందే, నన్ను నా గదిలో చేర్చు. వ్యాధి ప్రకోపించినప్పుడు ఏమౌతుందో ఎవరికి తెలుసు?"

డాంటే వృద్ధుని మెల్లిగా నడిపించుకు వెళ్లాడు. ఫెరయా గది చేరగానే అతన్ని పడకమీద చేర్చాడు.

వృద్ధుడు నిలువెల్లా ఒణికిపోతున్నాడు. మెల్లిగా డాంటేతో ఇలా చెప్పాడు: "ఇదొక రకం మూర్ఛ. ఇది వచ్చినప్పుడు నరాలన్నీ బిగుసుకుపోతాయి. ఒళ్లంతా కొయ్యబారిపోతుంది. నోట మాటైనా రాకపోవచ్చు. నోటి చివర నురుగు రావచ్చు. అప్పుడప్పుడు పెద్ద కేకలు పెట్టవచ్చు. నా కేకలు ఎవరికీ వినపడకుండా జాగ్రత్త తీసుకో. ఇది చాలా ముఖ్యం. లేకపోతే అధికారులొచ్చి గది మార్చగలరు. అలా జరిగితే ఇంక మనం కలుసుకోడం అనేది ఉండదు. ఒంటిలో కదలిక లేకుండా ఆగిపోయిన తరవాత, ఒళ్లు చల్లబడినప్పుడు—ఆ తరవాత నే సుమా—నోరు పగల తెరిచి ఎనిమిది లేక పది చుక్కలు ఆ ఔషధం నా గొంతుకలో పొయ్యి. అప్పుడు నేను తేరుకోవచ్చు."

"తేరుకోవచ్చు!" అన్నాడు డాంటే.

ఇంతలో ఫెరయా "చచ్చిపోతున్నాను. అబ్బ! రా. రా. సాయం—" అన్నాడు.

మూర్ఛ అకస్మాత్తుగా వచ్చిపడింది. ముఖం నల్లబడింది. కళ్లు పెద్దవైనాయి. మూతి వంకర తిరిగింది. ఫెరయా మెలికలు తిరుగుతున్నాడు. నోట నురుగు వస్తోంది. దుప్పటి కప్పి కేకలు పైకి వినబడకుండా కాపాడుతున్నాడు డాంటే. ఈవిధంగా రెండుగంటలసేపు గడిచింది. తరవాత ఫెరయా శరీరం బిగుసుకు

పోయింది. మృత్యు వాసన్న మైనట్లు కనిపించింది. అప్పుడు డాంటే అతని నోటిని తెరిచి పదిచుక్కలు మందుపోసి చూశాడు.

గంటసేపు గడిచింది కాని వృద్ధునిలో చలనమైనా లేదు. మందు పొయ్యటంలో ఆలస్యమైందని డాంటే భయపడ్డాడు.

చిట్టచివరికి వృద్ధుని పాలిపోయిన ముఖంలో రంగు తిరిగింది. వెళ్ళబెట్టినట్లుండిపోయిన కనుపాపలు కదల నారంభించాయి. దీర్ఘ నిశ్వాసం విడిచి మెల్లిగా కదిలాడు.

"అమ్మయ్య. బతికాం" అన్నాడు డాంటే.

అయితే రోగి ఇంకా మాట్లాడే స్థితిలో లేడు. ఆందోళనతో ద్వారంవంక చేసంజ్ఞ చేశాడు.

డాంటే విన్నాడు. జైలర్ అడుగులచప్పుడు వినవచ్చింది. అప్పుడే ఏడుగంటలయింది కాని, డాంటే అది గమనించలేదు. గభాల్న లేచి సొరంగంలో దూరి రాతిపలక కప్పి తనగది చేరాడు.

జైలర్ డాంటే గదికి వచ్చాడు. ఖైదీ మామూలుగా పక్కమీద కూర్చుని ఉన్నాడు. జైలర్ వెళ్ళిపోయాడో లేదో, ఆహారాన్ని ముట్టుకోకుండా వెంటనే సొరంగంగుండా వృద్ధునిగదికి వెళ్లాడు. వృద్ధునికి చైతన్యం వచ్చింది. కాని పక్కమీద పడుకునే ఉన్నాడు.

డాంటే తిరిగి రాగానే ఫేరియా అన్నాడు: "నిన్ను మళ్ళీ చూస్తాననుకోలేదు డాంటే. పారిపోవడానికి అంతా సిద్ధంగా ఉంది. నువ్వు పారిపోతావనుకున్నాను."

"మీరు లేకుండానా?" అన్నాడు డాంటే. "నేనటువంటి పని చెయ్యగలననుకున్నారా మీరు?"

"కాని నేను మోసపోయాను. నా కిప్పుడు రవంతైనా సత్తువ లేదు. బొత్తిగా కుంగిపోయాను."

"ధైర్యం తెచ్చుకోండి. మీకు తిరిగి సత్తువ చేకూరుతుంది."

ఫేరియా అన్నాడు: "కిందటిపర్యాయం మూర్ఛవచ్చినప్పుడు అరగంటసేపుంది. అది పోగానే నాకు ఆకలి వేసింది. ఒకరి సహాయం అవసరం లేకుండా నేనే లేవగలిగాను. ఇవాళ కుడి చెయ్యీ, కుడి కాలూ కదల్చ లేకుండా ఉన్నాను. యోచనాశక్తి తగ్గింది. అంతా అయోమయంగా ఉంది. అంటే మెదడు పాడయిం

దన్న మాట. మూడోసారి ఈ మూర్ఛవచ్చిందంటే ఒళ్ళంతా పక్షవాతమైనా వ్యాపిస్తుంది. చచ్చి పోవడమైనా సంభవిస్తుంది."

"అబ్బెబ్బే అల్లా కాదు. ధైర్యం తెచ్చుకోండి. మీరు మరణించరు. మూడోసారి మూర్ఛవచ్చినా, అప్పటికి మీరు స్వేచ్ఛగా ఉంటారు. ఇప్పటి మాదిరిగా నే అప్పుడూ తగ్గిపోతుంది. అప్పుడు చికిత్సకి అన్ని అవకాశాలూ ఉంటాయి. మీ ఆరోగ్యం చక్క బడుతుంది."

వృద్ధుడన్నాడు : "నాయనా ! నిన్ను నువ్వు మోసపుచ్చుకోకు. ఇప్పుడొచ్చిన మూర్ఛ నన్ను శాశ్వతంగా చెరసాలలో నిర్బంధించింది. తప్పించుకోవాలంటే నడవగలగాలికదా !"

"అయితే వారం రోజులు చూద్దాం. నెల చూద్దాం. అప్పటికి మీకు తిరిగి బలం వస్తుంది. ఇప్పుడంతా సిద్ధంగా ఉంది. ఎప్పుడు పారిపోవాలో నిర్ణయించడం ఇంక మన చేతిలో పని. మీకు బలం చేరి, ఈదగలరని తోచినప్పుడు, ఆ రోజు నే తప్పించుకోవచ్చును."

"నే నింక ఈదగలగడం అనేది ఉండదు. పక్షవాతంవల్ల ఈ చెయ్యి పడిపోయింది. ఒక రోజుపాటికి కాదు. ఇదింక ఎప్పుడూ ఇలాగే ఉండిపోతుంది. నువ్వే చూడు ఈ చేతి నెత్తి."

యువకుడు వృద్ధుని చెయ్యి పైకెత్తి విడిచి పెట్టాడు. అది తామరకాడలాగ జారిపడిపోయింది.

"ఇప్పుడేనా నమ్మకం కలిగిందా ఎడ్మండ్? నా మాట విను. నేచెప్తున్నది నిజం. ఇదిలా సంభవిస్తుందని నేను ముందే అనుకున్నాను. ఇది మావంశంలో వారసత్వంవల్ల వచ్చింది. నాతండ్రి మూడో పర్యాయం మూర్ఛలో చనిపోయారు. నా తాత కూడా అంతే. నాకీ ఔషధం ఇచ్చిన వైద్యుడు నాకూ అదే గతి అని ఎప్పుడో చెప్పాడు"

డాంటే ఏడ్పుగొంతుకతో అన్నాడు: "వైద్యుడు పొరబడ్డాడు. అయినా మీకు పక్షవాతం వస్తే మాత్రమేం? నేను మిమ్మల్ని భుజంపైన వేసుకుని ఈదగలను."

"నాయనా ! ఎందుకు భ్రమలో పడతావ్ ? నామాట విను. నాకు మృత్యువొచ్చి ముక్తి నిచ్చేవరకూ నే నిక్కడే ఉంటాను.

నువ్వు పారిపో. వెంటనే తప్పించుకో. నువ్వింకా యువకుడవ్. నీకు బలముంది. నీలో చురుకుతనముంది. నన్నుగురించి వ్యగ్రపడకు. నీ వాగ్దానాన్ని ఉపసంహరించుకోనిస్తున్నాను. నామాట విను."

"అదే తప్పనిసరైతే, నేనూ ఉండిపోతాను." అంటూ డాంటే లేచి వృద్ధునికి తనచేతి నందించాడు. "దేవుని పైన ప్రమాణం చేసి చెప్తున్నాను. మీ అవసానంవరకూ నేను మిమ్మల్ని విడిచి వెళ్లను."

ఫెరయా తలెత్తి యువకునివంక చూశాడు. భక్తిభావం, ఉదాత్తగుణం, నిరాడంబరత, అవ్యాజప్రేమ యువకుని ముఖంలో ఉట్టిపడుతున్నాయి.

వృద్ధుడన్నాడు: "సరే. నీ ప్రమాణాన్ని అంగీకరిస్తున్నాను." యువకునికి తన చెయ్యి అందించి అన్నాడు: "నీ ఉదారగుణానికి బహుశా నీవు ప్రతిఫలం పొందవచ్చును. ఇప్పుడింక నేను తప్పించుకోలేను. నువ్వు తప్పించుకో నంటున్నావు. అందువల్ల వరండా కింద సొరంగాన్ని పూడ్చిపెట్టు. గస్తీ సిపాయి అక్కడ గొయ్యి ఉన్నట్లు కనిపెట్టి అధికారులికి ఫిర్యాదు చేశాడంటే, మనగుట్టు బయటపడిపోతుంది. మనల్ని ఇంక కలుసుకోకుండా చేస్తారు. అవసరమైతే రాత్రంతా పనిచెయ్యి. రేపు జైలర్ వచ్చి వెళ్లేవరకూ ఇక్కడికి మళ్లీ రాకు. రేపు వచ్చినతరవాత నీకు ముఖ్యమైన సంగతొకటి చెప్పాలి."

# 18

మరుచటి ఉదయం డాంటే మిత్రుని గదికి వెళ్లాడు. ఫెరయా కోలుకుని, ప్రశాంతంగా కూచుని ఉన్నాడు. వెలుగు కెదురుగా ఒక కాగితపు ముక్కని ఎడమచేత్తో పట్టుకుని చూస్తున్నాడు. అతని కుడిచెయ్యి స్వాధీనంలో లేదు. కాగితంముక్క వంకర తిరగడంలేదు. మాట్లాడకుండా ఫెరయా ఆ కాగితాన్ని డాంటేకి అందించాడు.

"దీన్ని జాగ్రత్తగా చూడు" అన్నాడు ఫెరయా చిరునవ్వుతో. "ఈ కాగితపుముక్కే నా కున్న భాగ్య మంతా. ఇవాళ్టి నుంచి ఈ భాగ్యంలో సగం నీకు చెందుతుంది."

డాంటే ముఖాన చెమట పట్టింది. ఫెరయా ఉన్మత్తుడనే వదంతికి ఆధారమైన ఈ ధన నిక్షేపాన్ని గురించి, ఈ రోజువరకూ మాట్లాడకుండా తప్పించుకుంటూ వచ్చాడు. ఈ విషయాన్ని డాంటే ఎన్నడూ ఎత్తలేదు. ఫెరయాకూడా ఈ ప్రసక్తి తేలేదు.

ఫెరయా మౌనాన్నిబట్టి అతనికి మతి స్థిరం కోలుకుందను కున్నాడు డాంటే. కాని ఈ మూర్ఛ తరవాత ఇప్పుడీ మాటలు ఫెరయా నోటివెంట రావడంతో, తిరిగి అతనికి మతి స్థిరంపోయి, భ్రమలో పడుతున్నాడని డాంటే భయపడ్డాడు.

"ధనమా?" అన్నాడు డాంటే తడబడుతూ.

"అవును" అన్నాడు ఫెరయా. "ఎడ్మండ్! నీ హృదయం విశాలమైనది. నువ్వేమని భావిస్తున్నావో నాకు తెలుసును. కాని నేను పిచ్చివాడిని కాను. ఈ ధన నిక్షేపం నిజంగా ఉంది డాంటే. కాని దాన్ని అనుభవించే అదృష్టం నాకు లేకపోయింది కాబట్టి నువ్వు అనుభవిస్తవు కాని. నా మాట ఎవరూ వినిపించు కోరు. ఎవరూ నమ్మపలుచుకోలేరు. ఎందుకంటే, నాకు మతిలే దనుకున్నారు. కాని నాకు మతిపోలేదని తెలిసిన నువ్వు నా మాట వినాలి. తరవాత నీ యిష్టం, నమ్మితే నమ్ము."

"మూర్ఛవల్ల మీ సత్తువంతా పోయింది. ముందు కొంచెం విశ్రాంతి తీసుకోండి. మీరు కోరినట్లయితే కథంతా చెప్తే వింటాను. కాని ఇవాళ మీ ఒంటిని గురించి శ్రద్ధ తీసుకోండి. అదీకాక ఈ భాగ్యం అంత జరూరైన విషయమా?" డాంటే చిరునవ్వు అణచు కోలేక పోయాడు.

"జరూరే ఎడ్మండ్" అన్నాడు వృద్ధుడు. "ఏమో ఎవరికి తెలుసును? రేపే, రేపు కాకపోతే ఎల్లుండే, నాకు మూడో మూర్ఛ రావచ్చు. అప్పుడంతా ఆఖరైపోదా? అదిమాత్రం నిజం. ముమ్మాటికీ నిజం. పది కుటుంబాలకి అదృష్టం తెచ్చిపెట్టగల ఈ భాగ్యం, నన్ను పీడిస్తున్న ఈ దుష్టులకు చెందకుండా పోయిందని తరుచు సంతోషిస్తూ ఉంటాను. కాని నా ఈ రహస్యంవల్ల నీ కెంత సౌఖ్యం చేకూరుతుందో తలుచుకుంటే, ఒక్క క్షణంకూడా

జాప్యం చెయ్యలేను. సుస్తంగా భద్రపరచబడిన ఈ ధన నిక్షేపం నీవంటి వారసుని చేతపడకుండా పోతుందని భయపడుతున్నాను." డాంటే ముఖం పెడమరతిప్పి, దీర్ఘ నిశ్వాసం విడిచాడు. ఫెరయా అన్నాడు: "నీ అపనమ్మకాన్ని నువ్వు విడిచిపెట్టలేకపోతున్నావు కదూ, ఎడ్మండ్? నా మాటలవల్ల నీ కింకా నమ్మకం కలగలేదుకదూ? నీకు రుజువు లవసరం. అందుకే ఈ కాగితం చదువు. దీన్ని నే నింతవరకెవరికీ చూపించలేదు."

వృద్ధుని భ్రమా పరికల్పనకు దోహదం మివ్వరాదనే భావంతో డాంటే "రేపు చూద్దాం లెండి" అన్నాడు.

"సరే రేపటివరకూ మనం దాన్ని గురించి మాట్లాడవద్దు. కాని ఈకాగితాన్ని మాత్రం ఇప్పుడు చదువు."

ఇంక అతనికి కోపం తెప్పించ కూడ దనుకున్నాడు డాంటే. కాగితంతీసుకుని చూశాడు. సగం కాలిపోయి ఉంది. దానిలో ఇలా ఉంది:

"ఈనిధి, దాదాపు రెండు......
రోమన్ క్రౌన్లు ఉంటుంది. ఆగూల.........
రెండో గుహ.........
అతడే సర్వానికీ వార......
ఏప్రిల్ 25, 149......

డాంటే తలెత్తిచూశాడు. "ఏం?" అన్నాడు ఫెరయా.

"కాని ఈ వాక్యాలన్నీ అసంపూర్తిగా ఉన్నాయి. కాగితం చాలావరకు కాలిపోయి నట్టుంది. బొత్తిగా తెలియడం లేదు."

"మొట్టమొదటి సారిగా చదువుతున్నావు కాబట్టి నీకు తెలియడంలేదు. కాని దీర్ఘ రాత్రులు తదేకంగా ఆ వాక్యాల వంక నే చూస్తూ ధ్యానించిన నాకు బోధపడుతుంది. అందులో ప్రతి పదాన్నీ తిరిగి తిరిగి యోచించి వాక్యనిర్మాణాన్ని ఊహించాను. ఆ వాక్యాల భావాలు నాకు అవగతమే."

"అంటే వీటిలోని అంతరార్థాన్ని మీరు కనిపెట్టారా?"

"కనిపెట్టానని నాకు గట్టిగా నమ్మకమే. కాని నీ అంతట

నువ్వే నిర్ణయించుకో. ముందుగా ఈ కాగితానికి సంబంధించిన చరిత్ర విను."

"ఆగండి" అన్నాడు డాంటే. "అడుగుల సవ్వడి వినపడు తోంది. ఎవరో వస్తున్నారు. నేను వెళ్ళిపోవాలి." కథా, వృద్ధుని వివరణా, వినకుండా తప్పించుకో గలిగినందుకు సంతోషిస్తూ డాంటే సొరంగంగుండా నాగుపాములాగ పాకి వెళ్ళిపోయాడు. ఆకథ వింటే తన మిత్రుని మనోవైకల్యం స్థిరపడి పోతుందని డాంటే భయపడ్డాడు. ఫెరయా తత్తరపడి రాతిపలకను యథాస్థానంలోకి కాలితో నెంటాడు.

ఫెరయా అనారోగ్య సమాచారాన్ని జైలర్ వల్ల విని, అదెంత ప్రమాదమైనదో స్వయంగా చూసి తెలుసుకోవాలని గవర్నర్ వచ్చాడు.

ఫెరయా కాలూ, చెయ్యీ పడిపోయినట్లు తెలియ నివ్వకుండా జాగ్రత్తపడ్డాడు. గవర్నర్‌కి జాలి కలిగి ఇంతకంటె మంచి గదికి మారుస్తాడని ఫెరయా భయపడ్డాడు. దానివల్ల తన మిత్రునినుంచి వేరై పోవలసి వస్తుంది. కాని అలా జరగలేదు. ఈ ఉన్మత్తుడు ఏదో స్వల్ప అనారోగ్యంవల్ల బాధపడు తున్నాడని భావించి గవర్నర్ వెళ్లిపోయాడు.

ఇంతసేపూ డాంటే పడకపై విశ్రమించి యోచిస్తున్నాడు. ఈ నిధినిగురించి ఫెరయా మోసగించబడ్డాడా? లేక ఫెరయాను గురించి అందరూ మోసపోతున్నారా? ఆ రోజంతా డాంటే తన గదిలోనే ఉన్నాడు. ఫెరయా మతి లేనివాడని రూఢికాగల దుర్వార్తాన్ని దూరం చెయ్యడానికి ప్రయత్నిస్తూ కూచు న్నాడు. కాని సాయంకాలం వేళ, జైలర్ వచ్చి వెళ్లిపోగానే ఫెరయా సొరంగంద్వారా రావాలని ప్రయత్నించేశాడు. ఒక కాలూ, ఒక చెయ్యీ స్వాధీనం తప్పిన వృద్ధుడు, శరీరాన్ని దాదాపు ఈడ్చుకుంటూ వస్తున్న సవ్వడి విని డాంటే కంపించిపో యాడు. చివరికి అతను వృద్ధుని సహాయానికి వెళ్లక తప్పిందికాదు. నిస్సహాయంగా వృద్ధుడు డాంటే గదిలోకి ప్రవేశించలేదు.

డాంటేని చూసి వృద్ధుడన్నాడు: "ఇదిగో నేనే వచ్చాను చూశావా? ఏమయినా సరే నిన్ను విడిచిపెట్టకుండా వున్నాడుతు

న్నావు. నే నిచ్చేదాన్ని అంగీకరించకుండా తప్పించుకోవాలని చూస్తున్నావు. కాని నువ్వు తప్పించుకోలేవు. ఇదిగో విను."

ఎడ్మండ్ వృద్ధుని తన పక్క పైకి చేర్చాడు. అతనిపక్క నే ముక్కాలిపీటమీద కూచున్నాడు.

ఫెరయా మెల్లిగా చెప్పాడు: "స్పాడా వంశస్థులలో తుది రాజకుమారుడు కార్డినల్ స్పాడావద్ద నేను కార్యదర్శిగా పని చేశాను. అది నీకు తెలుసుగా. నేను నా జీవితంలో సౌఖ్యం, ఆనందం అనుభవించానంటే, దానికి కార్డినల్ స్పాడా చలవే కారణం. అతని కుటుంబానికి అపార భాగ్యముందని పేరున్నప్పటికీ, అతనంత భాగ్యవంతుడు కాడు. అయినా విలాసంగా జీవితం గడుపుతాడని పేరుపడ్డాడు. అతని విశాల రాజభవనం నాకు స్వర్గప్రాయంగా ఉండేది. అతని సోదరుని బిడ్డలిద్దరికీ నేను విద్య బోధించేవాడిని. ఇద్దరూ చనిపోయారు. అతడు ప్రపంచంలో ఒంటరివాడైపోయినప్పుడు, పదేళ్లు నాకు చేసిన ఉపకారానికి ప్రతిఫలంగా, నేనతని కోరికల్ని పొల్లుపోకుండా తీర్చేవాడిని. కార్డినల్ ఇంటిలో నాకు తెలియని రహస్యాలనేవి ఉండేవి కావు. కార్డినల్ స్పాడా నిత్యం పూర్వ గ్రంథాలను పరిశీలిస్తూ ఉండేవాడు. తన వంశానికి చెందిన పురాతనపత్రాలు చదువుతూ ఉండేవాడు. ఈ నిరర్థకమైన పరిశ్రమనుంచి అతన్ని నివారించడానికి ఒక రోజున ప్రయత్నించాను. వెతికి వెతికి నిరుత్సాహంతో చింతామనస్కుడై కూచుని ఆలోచించేవాడు. ఇది తగదని నేను చెప్పినప్పుడు, విషాదభావంతో నాకేసి చూసి, రోమ్ చరిత్ర గ్రంథ మొకటి నాచేతి కిచ్చి, ఒక ప్రకరణం చూపించాడు. క్రైస్తవమత సర్వాధికారి (పోప్) ఆరో అలెగ్జాండర్ జీవిత చరిత్రలో ఇరవైమూడో ప్రకరణంలో ఈ విధంగా వ్రాసి ఉంది. ఆ వాక్యాలను నే నెన్నడూ మరిచిపోలేదు:

'రొమానా యుద్ధాలు ముగిశాయి. విజయం సాధించిన సీజర్ బార్జియాకు ఇప్పుడు ఇటలీ దేశాన్ని ఏకంగా కొనెయ్యడానికి ధనం కావలసివచ్చింది. పరాజయాలెన్ని కలిగినా లొంగని ఫ్రెంచి రాజు పన్నెండో లూయీతో వ్యవహారాలు పరిష్కరించుకోడానికి పోప్‌కికూడా ధనం అవసరమయింది. అందువల్ల నిరుపేద దేశమైన ఇటలీలో దుర్ఘటమైనప్పటికీ ద్రవ్యార్జన కేదో ఒక ఎత్తు

వెయ్యాపం అవసరమయింది. పోప్‌కి ఒక ఆలోచన తట్టింది. ఇద్దర్ని కార్డినల్స్‌గా నియమిస్తే సరి.'

"ఆ తరవాత కథ టూకీగా చెప్తాను విను. రోమ్‌లో కెల్ల ధనాఢ్యులైన ఇద్దరు ఉత్తమవంశ సంజాతుల్ని కార్డినల్స్‌గా నియమించినందువల్ల పోప్‌కి రెండువిధాల ప్రయోజనం కలిగింది. పదవులివ్వడానికి ఇద్దరివద్దనుంచీ ధనం తీసుకున్నాడు. ఆయిద్దరూ అప్పుడేయే పదవుల్లో ఉన్నారో ఆ పదవుల్నీ, కార్యాలయాల్నీ అమ్మి బోలెడు ధనం సేకరించారు. ఇదికాక మూడో ప్రయోజనం ఒకటుంది. అది తరవాత చెప్తాను. ముందుగా సీజర్ బార్గియా, పోప్ కలిసి ఇద్దరు ధనాఢ్యుల్ని చూశారు. క్రైస్తవమతంలో నాలుగు ముఖ్యోద్యోగాలు ఆక్రమించిన జీన్ రాస్పిగ్లియోజీ ఒకడు. రోమన్లలో కెల్ల భాగ్యవంతుడు, ఉత్తమ పురుషుడూ అయిన సీజర్ స్పాడా ఒకడు. పోప్ ఇవ్వచూపిన పదవుల విలువ వారిద్దరికీ తెలుసును. ఇద్దరూ ఆశాపరులే. ఇద్దరూ కార్డినల్ పదవులకోసం అపారంగా ధనాన్ని ధారపోశారు. ఈ యిద్దరి పాత ఉద్యోగాల కోసం ఎనిమండుగురు కొత్త వ్యక్తులుకూడా ధనం ధారపోశారు. పోప్‌కీ, సీజర్ బార్గియాకీ మొత్తం ఎనిమిది లక్షల క్రౌన్లు లభించాయి.

"ఆ తరవాత ఏమి జరిగిందంటే: రాస్పిగ్లియోజీ, స్పాడాలకు కార్డినల్ పదవులిచ్చి బుజ్జగించాడు పోప్. లేనిపోని ఋణాల నిమిత్తం ఆస్తుల్ని కట్టబెట్టనిచ్చి, ఇద్దర్నీ రోమ్‌లో నివాసం ఏర్పరుచుకో నిచ్చాడు. తరవాత సీజర్ బార్గియాతో కలిసి ఆయిద్దర్నీ విందుకు ఆహ్వానించాడు.

"పోప్‌కి చెందిన ఒక చక్కని భవనంలో విందు ఏర్పాటయింది. ఈ భవనాని కున్న కీర్తి ఇద్దరికీ తెలుసును. కాని రాస్పిగ్లియోజీ పదవీ వ్యామోహంలోపడి అంధుడైనాడు. స్పాడా మాత్రం వివేకంతో ప్రవర్తించాడు. అతను ప్రాణంగా చూసుకునే తమ్ముని కొడుకు కొకడున్నాడు. అతనిపేరు గైడోస్పాడా. సైన్యంలో కెప్టెన్‌గా ఉండేవాడు. పోప్ విందులో ఏం జరుగబోతుందో ముందే భయపడి, స్పాడా విందుకి వెళ్లేముందు, తన మరణశాసనాన్ని వ్రాసేశాడు. పోప్ భవనంముందు తనకోసం వేచి ఉండవలసిందని గైడోకు కబురుపంపాడు.

కాని అతను కనపడలేదని వార్తాహరుడు చెప్పాడు. స్పాడా రెండుగంటల వేళకి విందుకి బయలుదేరాడు. పోప్ అతనికోసం నిరీక్షిస్తున్నాడు. స్పాడా అక్కడికి వెళ్ళగానే అతనికళ్ళ బడిన దృశ్యాన్ని చూసి నిశ్చేష్టుడైనాడు. గైడో, సీజర్ బార్గియావద్ద నిలబడి ఉత్సాహంతో ప్రసంగిస్తున్నాడు. బార్గియా ఆ యువకునిపట్ల అతి మక్కువ నటిస్తున్నాడు. స్పాడా ముఖం పాలిపోవడం బార్గియా కనిపెట్టాడు. తాననుకున్నంతా జరగబోతోందని స్పాడా గ్రహించాడు. అందరూ విందుకు కూచున్నారు. గంటలో స్పాడా, గైడో మరణించారు. కుక్కగొడుగులు తిన్నందువల్ల ఇద్దరూ చనిపోయినట్లు వైద్యుడు నిర్ణయంచేశాడు. స్పాడా పోప్ భవనంవద్దనే మృతి చెందాడు. గైడో ఇంటివరకూ వెళ్ళి ద్వారంవద్ద పడిపోయాడు. అతనిభార్య సమీపించే సరికే అతని ప్రాణాలు పోయినాయి.

"వెంటనే మృతుల పత్రాలు పతకాలనే మిషతో, పోప్, సీజర్ బార్గియాలు వారసత్వ హీనులైన వారి సంపదని వశంచేసుకోడానికి బయలుదేరారు. కాని స్పాడా రాసిపెట్టిన వీలునామా ఒక్కటే వారికి దొరికింది. అందులో తన ధనమూ గ్రంథాలయమూ గైడోకి చెందాలని రాశాడు. ఇంతే. పోప్, సీజర్ కలిసి స్పాడా భవనమంతా గాలించారు. కాని వెయ్యి క్రౌన్లు, కొద్ది నగలు తప్ప ఇంకేమీ దొరకలేదు. గైడో ప్రాణాలు విడుస్తూ భార్యకు ఒక్కమాట చెప్పగలిగాడు—వీలునామా ఉంది జాగ్రత్తపెట్టు, అని. తండ్రీకొడుకులు (సీజర్ బార్గియా, పోప్ కుమారుడే) ఎంత వెతికినా స్పాడా సంపద దొరకలేదు. రెండుభవనాలు, ద్రాక్షతోట మాత్రం గైడో భార్యకు మిగిలాయి.

"కొన్ని మాసాలు గడిచేసరికి పోప్ పొరపాటున విషంమింగి చనిపోయాడు. తరువాత సీజర్ బార్గియా రోమ్‌నగరం విడిచి వెళ్ళిపోయాడు. ఒకరాత్రి సంఘర్షణలో అతను హతుడైనాడు. స్పాడా వంశస్థుల స్థితి అయోమయంగా ఉండిపోయింది. హత్యల గురించిన వదంతులు దేశమంతటా వ్యాపించాయి. తండ్రిని మించిన కొడుకు సీజర్ బార్గియాయే కార్డినల్స్ ఇద్దరి సంపదనూ కొల్లగొట్టాడని అంతా అనుకోనారంభించారు. రాస్పిగ్లియోజీ అజాగ్రతవల్ల అతని సంపదంతా పోయింది."

ఇక్కడ ఫెరయా అకస్మాత్తుగా ఆగాడు. "ఇప్పటివరకూ కథ, పిచ్చివాడు చెప్పినట్టు లేదుకదా?" అని అడిగాడు.

"లేదు లేదు" అన్నాడు డాంటే. "రసవత్తరమైన చరిత్ర ఘట్టాన్ని చదువుతున్నట్లుంది. ఆపైన ఏం జరిగిందో చెప్పండి."

"స్పాడా వంశస్థులలో ఆఖరి రాకుమారుడు కౌంట్ స్పాడాని గురించి ఇప్పుడు చెప్తాను. నేను అతనివద్ద కార్యదర్శిగా పనిచేశాను. అత నెప్పుడూ తన పదవికి తగిన ధనం లేదని నిస్పృహ చెందేవాడు. క్రైస్తవ కీర్తనల గ్రంథం ఒకటి పారంపర్యా వస్తున్నది. కార్డినల్ స్పాడా వీలునామాలో ఇది అత్యంత ముఖ్యమైనదని చెప్పబడింది. ఆ వంశానికి చెందిన పత్రాలన్నిటినీ నేను పరిశీలించ నారంభించాను. కాని వానిలో ఏమీ కనిపించలేదు. తరవాత బార్గియా వంశస్థుల ఆస్తిపాస్తుల్ని గురించి, బార్గియా ఆర్జించిన ధనాన్ని గురించి పరిశోధనచేశాను. స్పాడాభాగ్యం అతనివద్ద చేరిందో లేదో పరిశీలించాను. కాని రాస్పిగ్లియాజీ సంపదొక్కటే అతనికి లభించినట్లు తేలింది. అప్పుడు నాకర్థమయింది. కార్డినల్ స్పాడా సంపదబార్గియా వశం కాలేదు. స్పాడావంశస్థు లనుభవించడం లేదు. ఎక్కడో ఏ పాతరలోనో దాగిఉందని గ్రహించాను.

"కొన్నాళ్లకి కౌంట్ స్పాడా మృతిచెందాడు. తన వంశ పత్రాల్ని, అయిదు వేల గ్రంథాల్ని, మత గ్రంథాన్ని, వెయ్యి క్రౌన్ల రొక్కాన్ని నాకిచ్చిపోయాడు. ఏటేటా తన స్మృత్యర్థం ప్రార్థనలు జరపించాలని నాకు కర్తవ్యం విధించాడు. తన వంశ చరిత్రను వ్రాయాలని కోరాడు. అతను కోరినవన్నీ నిర్వర్తించాను.

"డాంటే, తొందరపడకు. నా కథ ఆఖరు కొవచ్చింది. నేను అరెస్టు కాకముందు, 1807 లో, కౌంట్ స్పాడా చనిపోయిన పదిహేను రోజులికి, సరిగ్గా డిసెంబర్ 25 వ తేదీని, స్పాడావంశ పత్రాల్ని మళ్లీ తిరగవేస్తున్నాను. తేదీ ఇంత స్పష్టంగా ఎందుకు జ్ఞాపకముందో నీకు ఇప్పుడే తెలుస్తుంది. ఆపత్రాల్ని అప్పటికి నేను వెయ్యిసార్లయినా చదివిఉంటాను. భుక్తాయాసంవల్ల మధ్యాహ్నం మూడుగంటల వేళకి నాకు నిద్రపట్టింది. తిరిగి మేలుకు నేసరికి గడియారం ఆరుగంటలు కొట్టుతోంది. గది అంతా చీకటిగా ఉంది. పరిచారకుల్ని దీపం తీసుకురమ్మని కేక వేశాను. ఎవ్వరూ

పలకలేదు. నేనే లేచి దీపం వెలిగించాలనుకున్నాను. పక్క నేఉన్న ఒక దీపం చేత తీసుకున్నాను. ద్వారంవద్దనున్న దీపం సహాయంతో దీన్ని వెలిగించడానికి కాగితంముక్క కోసం తడిమాను. ప్రమాదవశంవల్ల అమూల్యమైన ఏ కాగితాన్నైనా కాల్చివేస్తానన్న భయంతో, చెయ్యి వెనక్కి లాక్కున్నాను. అప్పుడు జ్ఞాపకం వచ్చింది. దగ్గర మేజాపైన మతగ్రంథంలో పసుపుపచ్చని కాగితం ఒకటుంది. స్పాడా వంశీకులా కాగితాన్ని అలాగే ఉంచేశారు. అది పుటల్ని గుర్తుపెట్టుకోడానికి ఉపయోగపడుతోంది. మెల్లిగా వెతికి ఆ కాగితం తీశాను. చింపి ఒక ముక్క తీసుకుని ద్వారం వద్దకెళ్ళి అక్కడి దీపానికి ముట్టించాను. వెంటనే ఇంద్రజాల మహిమవల్లనన్నట్లు, ఆ పచ్చ కాగితంమీద పసుపుపచ్చని అక్షరాలు కనిపించడం మొదలుపెట్టాయి. హడలిపోయాను. వెంటనే కాగితాన్ని నలిపి మంట ఆర్పేశాను. త్వరత్వరగా దీపం వెలిగించాను. దీపపు వెలుగులో, నలిపిన కాగితాన్ని విప్పి చూశాను. అప్పుడు నా మనోభావాల్ని వర్ణించడం నా తరం కాదు. అతి వేడిమి తగిలినప్పుడుమాత్రమే కనిపించే, రహస్యమైన ఒక రకం సిరాలో వ్రాసినవి ఆ అక్షరాలు. దాదాపు మూడోవంతు కాగితం కాలిపోయింది. మిగిలినదే ఇవాళ ఉదయం నువ్వు చదివినది. ఇప్పుడు మళ్ళీ చదువు ఆ కాగితాన్ని. పోయిన వాక్యభాగాల్ని నేను పూరించి, అర్థం చెప్తాను."

ఫెరియా పచ్చ కాగితాన్ని డాంటిచేతి కిచ్చాడు. డాంటి అత్యంత కుతూహలంతో ఇలా పైకి చదివాడు :

"ఇవాళ, అనగా 1498 ఏప్రిల్ 25వ తేదీని, పోప్ ఆరో....
కెప్రరా, కార్డినల్ బెంటివాగ్లియో విషప్ర......
నావద్ద తీసుకున్న ధనంతో తృప్తిచెందక, నా సంపద
నంత......
భయంతో ఈ కింది వివరాలను ఈ లేఖద్వారా నా సోద
రుని కుమారుడు గైడో......
బంగారు వెండి అచ్చుల్ని, ద్రవ్యాన్ని, నగల్ని,.........
మాంట్ క్రిస్టో ద్వీపంలోని కొండ గుహల్లో.........
ఇద్దరం కలిసేవల్లి అక్కడ దాచివచ్చినందువల్ల............
విలువ ఇరవైలక్షల రోమన్ క్రౌన్లు.........

లోనికి చొచ్చుకువెళ్లినచోట చివర దిగి, తూర్పు.........
ఇరవమ్యో రాతినెత్తి...............
రెండోద్వారం దాటి వెళ్లిన తరవాత చివరిమూల.........
నిధినంతనీ సంక్రమింపచేస్తున్నాను.
"సీజ.........
"25 ఏప్రిల్ 14.........

డాంటే చదవడం పూర్తిచేశాక ఫెరయా మరొక కాగిత మిచ్చి చదవమన్నాడు. అందులో ఇలా ఉంది.

"......అలెగ్జాండర్ నన్ను విందుకి ఆహ్వానించారు.
ఇది వరలో కార్డినల్
.........మోగంవల్ల చనిపోయిన సంగతి నాకు తెలు
సును. కార్డినల్ పదవి నిచ్చినందుకు
.........నీ కొల్లగొట్టే దురుద్దేశంతో, విందులో
నాకువిషం పెట్టగలర నే
.........స్పాడాకు తెలియపరుస్తున్నాను. నాకున్న
......విలువైన ఇతర సామగ్రిని
......దాచి ఉంచాను.
......అ నెక్కడున్నదీ గైడోకి తెలుసును. మొత్తం
ఆ నిధి
......ఉంటుంది. ఆ ద్వీపంతీరాన సముద్రజలం
......దిక్కుగా నడిచివల్లి
......గుహలో ప్రవేశించాలి. ఈ గుహలో రెండు
చోట్లద్వారా లున్నాయి.
......ను నిధి దాచబడింది. నాకు ఏకైక వారసుడైన
గైడోస్పాడాకు ఈ
...ర్ స్పాడా"
......98"

ఫెరయా యువకునివంక ఆత్రుతతో చూశాడు. "ఇప్పుడీ రెండు ముక్కల్నీ దగ్గర చేర్చి చదువు. అప్పుడు నీఇష్టంవచ్చిన అభిప్రాయానికి రావచ్చును" అన్నాడు.

డాంటే అలాగే రెండుముక్కల్నీ చేర్చి ఈమారు చదివాడు. అది ఇలా ఉంది:

"ఇవాళ, అనగా 1498 ఏప్రిల్ 25 వ తేదీని, పోప్ అగోఅలెగ్జాండర్ నన్ను విందుకి ఆహ్వానించారు. ఇదివరలో కార్డినల్ కెప్రరా, కార్డినల్ బెంటి వాగ్లియో విషప్రయోగంవల్ల చనిపోయిన సంగతి నాకు తెలుసును. కార్డినల్ పదవినిచ్చినందుకు నా వద్ద తీసుకున్న ధనంతో తృప్తిచెందక, నా సంపదనం తనీ కొల్లగొట్టే దురుద్దేశంతో, విందులో నాకు విషం పెట్టగలర నే భయంతో, ఈకింది వివరాలను ఈ లేఖద్వారా నాసోదరుని కుమారుకు గైడో స్పాడాకు తెలియపరుస్తున్నాను. నా కున్న బంగారు వెండి అచ్చుల్ని, నగల్ని, వజ్రాల్ని, విలువైన ఇతరవస్తు సామగ్రిని మాంట్ క్రిస్టో ద్వీపంలోని కొండగుహల్లో దాచి ఉంచాను. ఇద్దరం కలిసే వెళ్లినందువల్ల అవెక్క డున్నదీ గైడోకి తెలుసును. మొత్తం ఆ నిధి విలువ ఇరవైలక్షల రోమకక్రౌన్లు ఉంటుంది. ఆ ద్వీపం తీరాన సముద్రజలం లోనికి చొచ్చుకువెళ్ళినచోట, చివర దిగి, తూర్పుదిక్కుగా నడిచి వెళ్ళి, ఇర వయ్యోరాతినెత్తి గుహ ప్రవేశించాలి. ఈగుహలో రెండుచోట్ల ద్వారా లున్నాయి. రెండో ద్వారం దాటి వెళ్ళినతరవాత చివరిగూటలను నిధి దాచబడింది. నాకు ఏకైక వారసుడైన గైడోస్పాడాకు ఈ నిధి నంతనీ సంక్రమింప చేస్తున్నాను."

సీజ"ర్ స్పాడా."

"25 ఏప్రిల్ 1498."

"ఇప్పు డేమంటావ్?" అన్నాడు ఫెరయా.

డాంటే అన్నాడు : "ఇదేనా కార్డినల్ స్పాడా మరణ శాసనం? ఇంతకాలం వెతుకుతున్న కాగితం ఇదేనా?"

"అవును. అవును. వెయ్యిసార్లు అవునని చెప్తున్నాను" అన్నాడు ఫెరయా ఉద్రేకంతో.

"ఈ వాక్యాల నెవరు పూరించారు?"

"నేనే. నిప్పులో కాలిపోగా మిగిలిన కాగితంలో పంక్తుల్ని బట్టి, పూర్తి కాగితంలో పంక్తుల పొడవెంత ఉంటుందో లెక్క గట్టాను. భూగర్భాంతరమార్గంలో నడిచేవాళ్ళు, చీకటిలోని కొద్ది తెల్లని ఛాయల్ని బట్టి మార్గం వెతికినట్లు, తెగిన వాక్యాలఅర్థాల్ని గురించి యోచించి ఊహించాను."

"కాగితంలోని విషయాన్ని పూర్తిగా గ్రహించిన తరవాత మీ రేం చేశారు?"

"వెంటనే బయలుదేరా లనుకున్నాను. నిజానికి అప్పుడే బయలుదేరానుకూడా. కాని చక్రవర్తి పోలీసులు నాపైన నిఘా పెట్టారు. అప్పటి కింకా నెపోలియన్‌కి కొడుకు పుట్టలేదు. అప్పుడింకా రాష్ట్రాన్ని విభజించా లనే ప్రయత్నంలో ఉన్నాడు నెపోలియన్. ఉన్నట్టుండి నేను బయలుదేరేసరికి, పోలీసులికి అనుమానం కలిగింది. నేను పియోంబినోలో ఓడ ఎక్కబోతుండగా నన్ను అరెస్టుచేశారు. ఇంక ఆ తరవాత జరిగిన దంతా నీకు తెలుసు." ఫేరియా పితృసహజమైన వాత్సల్యంతో డాంటేవంక చూసి, "మనం ఇద్దరం కలిసి ఎప్పటికైనా తప్పించుకుని పారిపోగలిగితే, ఆ ధనంలో సగం నీకు చెందుతుంది. నేనిక్కడే మరణించడం సంభవిస్తే, నువ్వొక్కడివే పారిపోవచ్చును. అప్పుడా ధనం యావత్తూ నీ పరమౌతుంది." అన్నాడు.

డాంటే ఆశంకతో అన్నాడు: "కాని ఈ భాగ్యానికి సక్రమమైన వారసు లెవరూ లేరా?"

"లేరు. నువ్వు ఆ విషయమై శంకించ నవసరం లేదు. ఆ వంశం అంతరించింది; వారిలో ఆఖరివాడైన కౌంట్ స్పాడా తన సర్వస్వానికీ నన్ను వారసుని చేశాడు. ఆ మతగ్రంథాన్ని నాకిచ్చి, ఆ ధనమంతా నాకు సంక్రమింపచేశాడు. నువ్వా విషయమై చింతపడ నవసరం లేదు. ఈ భాగ్యం ఎప్పుడైనా మనవశమైనట్లయితే, నిశ్చింతగా, నిర్మలాంతఃకరణతో మనం దాని ననుభవించవచ్చును."

"ఈ భాగ్యం మొత్తం ఎంత ఉందన్నారు?"

"ఇరవైలక్షల రోమన్ క్రౌన్లు. అంటే, ఇప్పటి మన ద్రవ్యంలో కోటి ముప్ఫైలక్షలు."

"అసంభవం" అన్నాడు డాంటే బిగ్గరగా. అంత మొత్తాన్ని గురించి తలుచుకునేసరికి అతనికి తల తిరిగినట్లయింది.

ఫెరయా మెల్లిగా చెప్పాడు: "ఇంత కాలమూ ఈ రహస్యాన్ని నీకు చెప్పకుండా ఎందుకు దాచానంటే, మొదట నీకు నిరూపించాలి. తరవాత నిన్ను ఒక్కసారిగా ఆశ్చర్యచకితుణ్ని చెయ్యాలనుకున్నాను. నాకీ మూర్ఛ రాకముందు మనం తప్పించుకుని ఉన్నట్లయితే, నిన్ను తిన్నగా మాంట్ క్రిస్టో ద్వీపానికి తీసుకువెళ్ళేవాడిని. కాని ఇప్పుడు నువ్వే నన్నక్కడికి తీసుకువెళ్లాలి. డాంటే, ఆగు. నువ్వు కృతజ్ఞత చూపవలసిన పని లేదు."

"కాదు" అన్నాడు డాంటే. "ఈ భాగ్యమంతా మీకే చెందుతుంది. ఇంకెవ్వరికీ చెందదు. నాకెలాంటి హక్కూ లేదు. నేను మీకు రక్తబంధువు నైనా కాను."

"నువ్వు నాకు కుమారుడివైనావు డాంటే. నా నిర్బంధంలో నువ్వు వరప్రసాదివైనావు. నా వృత్తివల్ల నేను ఆజన్మబ్రహ్మచారిగా ఉండవలసిన వాడినే. జన్మలో తండ్రికాలేని వాడిని, ఎన్నడూ స్వేచ్ఛ పొందలేని ఖైదీని, ఊరడించడానికే భగవంతుడు నిన్ను పంపాడు." ఫెరయా స్వాధీనంలో ఉన్న చేతి నందించాడు. డాంటే చెయ్యి అందుకుని వృద్ధుని పరిష్వంగం చేసుకున్నాడు.

# 19

దీర్ఘకాలంగా వృద్ధుని మనోవ్యథకు హేతువైన ధన నిక్షేపం, పుత్ర సమానునిగా ప్రేమిస్తున్న వ్యక్తికి వినియోగపడుతుందని ఇంక విశ్వాసం కలగడంతో, వృద్ధుని దృష్టిలో ఆ నిక్షేపం యొక్క మూల్యం రెండింతలయింది. రోజూ ఆ ధన మొత్తాన్ని గురించే డాంటేతో ప్రసంగిస్తూ ఉండేవాడు. కోటి ముప్పై లక్షల ద్రవ్యంతో మనిషైనవాడు మిత్రుల కెంత సహాయం ఏ రీతిగా చెయ్యగలడో వృద్ధు డుపన్యసించేవాడు. డాంటే ముఖం మేఘాచ్ఛన్నమయ్యేది. పగతీర్చుకోవాలని తీసుకున్న ప్రతిజ్ఞ అతనికి జ్ఞప్తికి వచ్చేది. ఇంత ధనంతో శత్రువుల కెంతటి అపకారం చెయ్యవచ్చునో అతను యోచించేవాడు. ఫెరయా మాంట్ క్రిస్టో

ద్వీపాన్ని చూడలేదు. డాంటే ఎల్బాద్వీపానికీ, కార్సికాకూ మధ్య నౌకలో ప్రయాణిస్తున్నప్పుడు, అనేకమార్లు దూరాన ఆ ద్వీపాన్ని చూశాడు. ఆద్వీపం ఎప్పుడూ నిర్జనంగా ఉండేది. అది దాదాపు కోణాకారంలో ఉన్న ఒక పెద్ద పర్వతం అని చెప్పవచ్చును. ఏ అగ్నిపర్వత ప్రజ్వలనవల్లనో సముద్రాంతర్భాగంనుంచి పైకి వచ్చింది కాబోలు.

డాంటే ఆ ద్వీపం ఉనికిని చూపే చిత్రపటం గీసి ఫెరయాకి చూపించాడు. నిధిని ఎలా వెతకాలో సులువైన మార్గాన్ని ఫెరయా నిర్దేశించాడు. కాని ఫెరయాకి ఉన్నంత ఉత్సాహం డాంటేకి లేదు. ఫెరయా పిచ్చివాడు కాడని డాంటే అర్థం చేసుకున్న మాట నిజమే. కాని ఆ నిధి అక్కడ ఒకప్పుడు దాచబడినప్పటికీ, ఇప్పుడింకా అక్కడే ఉంటుందని డాంటేకి నమ్మకం లేదు. నిధి వృద్ధుని భ్రమా పరికల్పన కాకపోవచ్చు కాని, ఇప్పటికింకా అక్కడే ఉంటుందంటే అతను నమ్మలేకుండా ఉన్నాడు.

బందీల తుది ఆశల్ని తుంచిపెట్టేసి, శాశ్వతంగా వారిని నిర్బంధంలోనే ఉంచడానికి విధి కుట్రపన్నినట్లు, ఇప్పుడొక దుర్ఘటన సంభవించింది. సముద్రం పక్కనున్న వరండా మరమ్మత్తుకి వచ్చింది. కొత్త పునాదులు వేసి వరండా మరమ్మత్తు చేశారు. బందీలిద్దరూ కష్టపడి తవ్వి సగంలో ఆపుచేసిన గొయ్యి, ఇప్పుడు రాళ్లతో పూడ్చబడింది. ఇప్పుడు వారి మార్గానికి నిశ్చయమైన నిరోధం ఏర్పడింది.

యువకుడు విషాద స్వరంతో అన్నాడు "మహాశయా! నాకు మీపట్ల గలభక్తికి ప్రతిఫలమని మీరు భావిస్తున్న దానిని, నాకు లభించనివ్వకూడదని భగవంతుడే నిర్ణయించాడు. నేనెప్పటికీ మీతోనే ఉంటానని మాటిచ్చాను. ఇప్పుడింక ఆమాట నిలబెట్టుకోక నాకు గత్యంతరం లేదు. మీసహవాసాన్ని మించిన భాగ్యం నాకేదీ లభించదు. మన మిద్దరం ఇంకెన్నటికీ ఈచోటు విడిచి వెళ్లలేం. నాభాగ్యం వాస్తవంగా మాంట్ క్రిస్టో కొండలమధ్య నిరీక్షిస్తున్న ద్రవ్యసంపద కాదు. మీరు నాలో వెలిగించిన జ్ఞానజ్యోతి, నా స్మృతిలో శాశ్వతంగా నెలకొల్పిన భాషాజ్ఞానసంపదలు మాత్రమే నా వాస్తవభాగ్యం. మీ అపారజ్ఞాన నిధి తవ్వి నాకిచ్చిన సులభ్య విజ్ఞానసంపదలే, సుబోధ్యమానవ విజ్ఞానమే నాకు లభించిన

భాగ్యం. ఇంతకాలం మీ సాహచర్యంవల్ల, నాలో నూతన భావాలనుత్పన్నంచేసే మీ సమున్నత వాక్ప్రభావం వల్ల, నాకు మనోశక్తి లభించింది. నాకు విశేషప్రజ్ఞ సిద్ధించింది. ఇప్పుడెంతటి కార్యాలకైనా వెనుదియ్యని శక్తి వచ్చింది. నిస్పృహా నిరాశలకు లోనై చెదిరిపోతున్న మనస్సు, మీ పరిచయభాగ్యంవల్ల స్థిరమయింది. ఇదేనాభాగ్యం. ఇదేనా శాశ్వతమైన నాసంపద. దీనికంతటికీ మీరే కర్తలు. సీజర్ బార్జియాలు కాదు, ప్రపంచంలోని సకలవస్తువులంతా ఏకమైనా సరే నా ఈభాగ్యాన్ని కొల్లగొట్టలేరు."

ఈ రీతిగా భాగ్యహీనులైన ఇద్దరు బందీలకూ రోజులు గడుస్తున్నాయి. రోజులు సుఖంగా గడవకపోయినా, దుర్భరం కాలేదు. తన నిక్షేపాన్ని గురించి ఇంతవరకూ రహస్యంగా తన మనస్సులోనే ఉంచుకున్న ఫేరియా, ఇప్పుడు నిత్యం దాన్ని గురించే మాట్లాడుతున్నాడు. అతని పక్షవాతం అలాగే ఉంది. ఇంక కోలుకోగలనే ఆశ పూర్తిగా అంతరించింది. కాని తన సహఖైదు తప్పించుకున్నట్లు కలలు కంటూ, అతని భాగ్యం గురించి ఊహల్లోనే సంతోషించేవాడు. ఎప్పుడైనా ఆ ఉత్తరం పోతుందేమోననే భయంతో, దాంటేచేత పదేపదే చదివించేవాడు. చివరికి ఉత్తరంలోని విషయమంతా దాంటెకి కంఠస్థమయింది. అప్పుడు మిగిలిన రెండో కాగితపు ముక్కని కాల్చివేశాడు. ఇప్పుడు మొదటికాగితం ముక్క ఎవరిచేతుల్లో పడినా భయంలేదు. రహస్యం బహిర్గతం కాదు. స్వేచ్ఛ లభించినప్పుడు దాంటేకి ఉపకరించగలవనుకున్న విషయాలన్నిటిని గురించి ఫేరియా దాంటేకి బోధించేవాడు. స్వేచ్ఛ లభించిన రోజునే, ఆక్షణంలోనే దాంటే మాంటెక్రిస్టో ద్వీపానికి ప్రయాణం తప్ప మరొక యోచనే ఉండరాదని చెప్పాడు. ఆద్వీపం మళ్లీ సమాల్లో గుర్తు చెప్పబడిన ఆచోటు చేరాలి.

ఈలోగా ఘడియలూ రోజులూ గడిచిపోతున్నాయి. చకచకా గడిచిపోకపోయినా కాలం ఇద్దరికీ దుర్భరంగా మాత్రం లేదు. ఫేరియాకి కాలూ చెయ్యీ తిరిగి స్వాధీనంలోకి రాకపోయినా, అతని మేధాశక్తి ఆవంతైనా క్షీణించలేదు. క్రమక్రమంగా డాంటేకి ఫేరియా నిగ్రహజీవనాన్ని అలవరింపచేశాడు.

అల్పవిషయాలలో కూడా అత్యంత శ్రద్ధవహించగల సూక్ష్మ పరిశీలనా బుద్ధినీ, ఓర్మినీ డాంటేకి చేకూర్చాడు. నిర్బంధప్రారంభానికి లోను కాని అన్యులకువలె నే, ఈయిద్దరికీ కూడా కాలం ప్రశాంతంగా గడిచిపోతోంది. కాని పైపైకి ప్రశాంతంగా రోజులు గడుపుతున్న ఈ యిద్దరూ, ఇద్దరి గదులలోనూ వేరై కూర్చున్నప్పుడు, తీరని కోర్కెలు, అణచబడిన వాంఛలు వారి హృదయాలలో తలెత్తేవి. అప్పుడు గాఢ నిశ్వాసాలు విడిచేవారు.

ఒకనాటి రాత్రి డాంటే నిద్రలోనుంచి ఉలిక్కిపడిలేచాడు. తననెవరో పిలుస్తున్నట్లు అతనికి తోచింది. కన్నులు తెరిచి చుట్టూ గాఢంగా అలుముకున్న చీకటిని చీల్చి చూడ్డానికి ప్రయత్నించాడు. ఎవరిదో ఆర్తనాదం, అందులో నే తనపేరు విన వచ్చినట్లయింది. డాంటే పడకపైనుంచి లేచాడు. ముఖమంతటా చెమటపట్టింది. జాగ్రత్తగా చెవులొగ్గి ఆలకించాడు. నిస్సందేహంగా పిలుపు తన మిత్రుని గదివద్దనుంచే వచ్చిందనుకున్నాడు.

"అయ్యో దేవుడా! అదేనా?" అనుకున్నాడు డాంటే. రాతి నెత్తి సొరంగంగుండా గబగబా వెళ్ళాడు. రెండో చివర రాతిపలక తీసేసి ఉంది. రెపరెప లాడుతున్న కొవ్వొత్తిదీపం వెలుగులో, పడకను కరిచి పట్టుకుని గజగజ వొణికిపోతున్న వృద్ధుడు కనిపించాడు. వృద్ధుడు పాలిపోయి ఉన్నాడు. మెలికలు తిరిగిపోతున్నాడు.

వృద్ధుడు నీరస స్వరంతో విషాదభావంతో అన్నాడు: "మాశావా డాంటే! నా పనేమైందో? ఏం జరిగిందో నీకు వేరే చెప్ప నవసరం లేదు."

ఎడ్మండ్ కి మతిపోయి నట్లయింది. తన ఉనికినే మరిచిపోయి, ద్వారంవద్దకు పరుగెత్తి "రండి! రండి! త్వరగా రండి" అని సహాయం కోసం అరిచాడు.

ఫెరియా లేని సత్తువ తెచ్చుకొని "ఆగాగు. ఏమిటా పిచ్చి పని?" అన్నాడు. "ఇలా గయితే మన పని అఖరే ఇంక. ఇప్పుడింక మనం ఆలోచించవలసింది నిన్ను గురించే. నాయనా! ఇంక నీ చెర నీకు దుర్భరం కాకుండా ఉండాలంటే, నువ్వు తప్పించుకోడానికి ఏం చెయ్యాలో అది ఆలోచించాలి. నేనిక్కడ చేసిన పనంతా నువ్వొక్కడవూ మళ్లీ చెయ్యాలంటే అనేక సంవత్సరాలు పట్టు

తుంది. అంతే కాదు. నేను విడిచిపెట్టబోతున్న ఈ కూపం ఖాళీగా ఉండిపోదు. మరొక నిర్భాగ్యుణ్ని ఎవరినో ఇక్కడికి తీసుకొస్తారు. వచ్చే కొత్తబందీకి నువ్వు దేవతలా దొరుకుతావు. అతను బహుశా యువకుడై ఉండవచ్చు. నీ మాదిరిగానే బలశాలి, ఓర్మి కలవాడు కావచ్చును. నావల్ల జాప్యమైన నీ పరారీకి అతను తోడ్పడవచ్చును. భగవంతుడే నీ శ్రమకి ప్రతిఫల మివ్వగలడు. నష్టపరిచే దానికంటె దేవుడు ప్రసాదించేదే ఎప్పుడూ అధికం. ఇంక నేను మరణించే సమయం ఆసన్నమయింది."

డాంటే చేతులు జోడించి "అయ్యయ్యో! అలా అనకండి" అని మాత్రం అనగలిగాడు. వృద్ధుని మాటలవల్ల ఉబికి వచ్చిన దుఃఖాన్ని అణుచుకుని ఇలా అన్నాడు: "ఇంతకు ముందొకసారి మిమ్మల్ని రక్షించాను. ఇప్పుడు మళ్లీ రక్షించగలను." పడక నెత్తి కాళ్ల దిక్కున గోతిలో సీసాతీశాడు. అందులో మూడో వంతు ఔషధం ఇంకా ఉంది. "ఇదిగో చూడండి. ఈ అద్భుత సంజీని ఇంకా ఉంది. చప్పున చెప్పండి. ఈమాటు దీంతో నేనేం చెయ్యాలి? కొత్తగా చెయ్యవలసినదేమైనా ఉందా? చెప్పండి. మిమ్మల్ని కాపాడతాను."

"ప్రయత్నించు. కాని అప్పుడే నా ఒళ్లు చల్లబడి పోతోంది. మళ్ళీ వొణుకు ఎక్కువగా వచ్చేస్తోంది. పళ్లు పటపటలాడుతున్నాయి. ఎముకలు బిగిసిపోతున్నట్లున్నాయి. అయిదునిమిషాల్లో మూర్ఛ పూర్తిగా వచ్చేస్తుంది. పావుగంటలో ఇక్కడింక నేనుండను. నా శవం మాత్రం మిగుల్తుంది."

"అయ్యయ్యో" అన్నాడు డాంటే దుఃఖిస్తూ.

"మొదటిసారి ఏంచేశావో ఇప్పుడూ అదే చెయ్యి. అయితే ఈమాటు అంత సేపు వేచి ఉండవద్దు. జీవతంత్రులప్పుడే మూగపోతున్నాయి." స్వాధీనంలో లేని కాలుచేతుల వంక కళ్లతో చూపుతూ, "మృత్యుదేవతకి ఆట్టే కష్టం ఉండదు. ఈమారు పదికి బదులు పన్నెండు చుక్కలు నాగొంతుకలో పొయ్యి. అప్పుడు నేను తేరుకోకపోయినట్లయితే, ఇంక నువ్వు నన్ను విడిచి వెళ్ళిపోవచ్చును. ఇంక నేను నిలవలేను. నన్ను పడకమీదికి చేర్చు" అన్నాడు.

ఎడ్మండ్ వృద్ధుని రెండు చేతులతోనూ ఎత్తి పడకపై పడుకోబెట్టాడు.

ఫెరయా మెల్లిగా చెప్పాడు: "పోతున్నాను డాంటే! ఇంక నిన్ను శాశ్వతంగా విడిచి వెళ్ళిపోతున్నాను. నాయనా! నీకు సర్వ సౌఖ్యాలూ, సర్వ సౌభాగ్యం లభించాలని ఆశీర్వదిస్తున్నాను."

యువకుడు మోకాళ్లపై వొంగి ముఖాన్ని పడకలో దాచుకుని దుఃఖించ నారంభించాడు.

"డాంటే! ఈ తుదిక్షణంలో, నాకు పరమ విశ్రాంతి లభించ నున్న ఈక్షణంలో, నేను చెప్తున్నమాట శ్రద్ధగా విను. నాకన్నులపై కమ్మిన మాయతెర లన్నిటినీ భగవంతుడు తొలగించాడు. స్పాడా వంశస్థుల ధననిక్షేపం నిజంగానే ఉంది. నామాట నమ్ము. నువ్వు తప్పించుకో గలిగినట్లయితే, వెంటనే, జాప్యం చెయ్యకుండా, మాంట్ క్రిస్టో ద్వీపానికి వెళ్లు. ఆభాగ్యమంతటినీ స్వాధీనం చేసుకో. నువ్వనుభవించిన కష్టాలింక చాలు. ఆభాగ్యంతో సౌఖ్యాలనందుకో."

వృద్ధుని శరీరం ఒక్కసారి గట్టిగా కంపించింది. డాంటే తలెత్తి చూశాడు. వృద్ధుని నేత్రాలు రక్తరాగ రంజితాలైనాయి. తరవాత తెరిచిన కన్నులు చలనం లేకుండా ఉండిపోయినాయి. అతని పెదవులేవో మాటలు చ్చరిస్తున్నాయి.

"అయ్యయ్యో. నన్నప్పుడే విడిచిపోకండి. అయ్యో దేవుడా! ఆయనకి సత్తువనిచ్చి రక్షించు."

మరణోన్ముఖుడైన వృద్ధుడు డాంటేని వారించాడు. "బిగ్గరగా అరవకు. జాగ్రత్త! ఎవరైనా వినగలరు. అప్పుడు నన్ను రక్షించినా ప్రయోజనం ఉండదు. మనల్ని విడదీసేస్తారు. జాగ్రత్త."

"అవును. మీరు చెప్పినది నిజం. నేను నిశ్శబ్దంగా ఉంటాను. మిమ్మల్ని రక్షిస్తాను. మీరు బాధ పడుతున్నారే కాని, ఈమారు మూర్ఛ కిందటి మారు వచ్చిన దానికంటె తక్కువే."

"నాయనా! మోసపోతున్నావు. ఇప్పుడు తక్కువే బాధ పడుతున్నాను. కారణం, నిరోధించడానికి నాలో సత్తువ ఉడిగిపోయింది. నీవయస్సులో ఉన్న వారికైతే, ప్రాణాలపై తీపి, ఆత్మ

విశ్వాసం ఉంటాయి. కాని వృద్ధులికి మృత్యువు స్పష్టంగా కనిపిస్తుంది. అదుగో, వస్తోంది. నా చూపు తగ్గిపోతోంది. నా మెదడు కల్లోలమై పోతోంది. నీ చెయ్యేది డాంటే! వెళ్ళిపోతున్నాను."

వృద్ధుడు ఒంటిలో మిగిలిన సత్తువనంతనూ తెచ్చుకుని, ఒళ్ళు బిగపట్టి, పక్కపైనుంచి కొద్దిగా లేచి, "మాంట్ క్రిస్టో మాట మరిచిపోకు." అని అరిచి వెనక్కి వాలిపోయాడు.

ఈసారి మూర్ఛ భయంకరంగా వచ్చింది. కాలుచేతులు వంకర్లు తిరిగిపోయాయి. కనురెప్పలు వాచిపోయాయి. పెదవులమధ్య నురుగు వచ్చింది. చివరికి పక్కపైన నిశ్చలమైన శరీరం మిగిలింది. కొద్ది క్షణాలకుముందు అద్భుత మేధా సంపదగల ప్రజ్ఞాపురుషుడున్న స్థానంలో చలనం లేని కట్టె మిగిలింది. డాంటే దీపం తీసి, తలవంక ఒక రాతిపై పెట్టాడు. నిశ్చలదృష్టితో డాంటే వృద్ధుని పరికించాడు. మెల్లిగా వృద్ధుని నోరు తెరిచి, కత్తి అడ్డుపెట్టి, సరిగ్గా పన్నెండు చుక్కలు ఔషధం పోశాడు. ఇంకా సీసాలో ఔషధం మిగిలిఉంది. ఏం జరుగుతుందోనని నిరీక్షిస్తూ కూచున్నాడు డాంటే. పది నిమిషాలు గడిచింది. పావుగంట గడిచింది. అరగంట గడిచింది. కాని వృద్ధుని శరీరంలో కదలిక లేదు. డాంటే కంపించిపోతున్నాడు. అతని జుట్టు నిక్కపొడుచుకుంది. ముఖమంతా చెమటపట్టింది. గుండె గబగబ కొట్టుకుంటోంది. తుది యత్నం చెయ్యాలనుకున్నాడు. ఈసారి మిగిలిన ఔషధమంతా వృద్ధుని గొంతుకలో పోశాడు. వెంటనే వృద్ధుని శరీరం గిజగిజలాడింది. కనుగ్రుడ్లు గిరగిరా తిరిగాయి. ఏడ్పువలె వినవచ్చిన నిశ్వాసం ఒకటి వెలువడింది. కొంతసేపటికి గిజగిజ కొట్టుకుంటున్న శరీరం కర్రవలె బిగిసిపోయింది. కన్నులు తెరుచుకుని ఉండిపోయినాయి. అరగంట గడిచింది, గంట గడిచింది. డాంటే వృద్ధుని గుండెలపై చెయ్యివేసి గంటసేపూ దుర్భర మనోవేదనతో నిరీక్షిస్తున్నాడు. క్రమక్రమంగా వృద్ధుని హృదయస్పందన క్షీణించింది. శరీరమంతా చల్లబడిపోయింది. చివరికి వృద్ధుని ప్రాణాలు ఎగిరిపోయినాయి.

అప్పటికి ఉదయం ఆరుగంటలయింది. తెల్లవారుతోంది. కొవ్వొత్తి దీపపు వెలుగు, కిటికీలోనుంచి వస్తున్న వెలుగులో

క్షీణించి పోతోంది. చీకటి వెలుగులమధ్య సంఘర్షణ సాగుతున్నంతసేపూ డాంటే ఆశతో పెనుగులాడుతూనే ఉన్నాడు. కాని పొద్దుటి వెలుగుతో గది నిండిపోగానే అతని ఆశలన్నీ అడుగంటాయి. ఇంక పడకపైనున్నది శవంమాత్రమే నని నిర్ధారణయింది. అతన్ని భీతి ఆవహించింది. డాంటే కొవ్వొత్తి దీపాన్ని ఆర్పి, జాగ్రత్తగా దాచి, సొరంగం ప్రవేశించి, రంధ్రాన్ని రాతి పలకతో కప్పివెళ్ళిపోయాడు. జైలర్ వచ్చే వేళయింది. జైలర్ ముందుగా డాంటే గదికి వచ్చాడు. తరవాతనే ఫెరయా గదికి వెళ్ళాడు. అక్కడేం జరుగుతుందో చూడాలని డాంటేకి గట్టికోరిక కలిగింది. మెల్లిగా సొరంగంలో కెకి వెళ్ళి, రాతిపలక చాటున నిలబడి సవ్వడి ఆలకించాడు. జైలర్ సహాయంకోసం కేకలు పెట్టడం విన్నాడు. వార్డర్లు కొందరు వచ్చారు. తరవాత సిపాయిలు వచ్చారు. చివరికి గవర్నర్ వచ్చాడు. తరవాత పడక కదిలిన చప్పుడయింది. ముఖంపైన చన్నీళ్లు చల్లాలని గవర్నర్ ఆజ్ఞ ఇచ్చాడు. ఫలితం లేక పోవడంవల్ల కొంచోలు డాక్టర్ని పిలిపించడానికి గవర్నర్ ఆజ్ఞ ఇచ్చాడు. గవర్నర్ గదివిడిచి వెళ్లాడు. వెళ్లేముందు మొరటుపరిహాసంతో కూడిన సానుభూతి వాక్యాలు పలికాడు.

"చివరికి పిచ్చివాడు తన ధనంకోసం వెతుక్కుంటూ వెళ్లాడు." అన్నాడొకడు.

"ఎన్ని లక్షలుంటే ఏం లాభం? పాపం శవంమీద కప్పడానికి గుడ్డైనా లేదు" అన్నాడు మరొకడు.

"అబ్బే! లేకేం! ఇఫ్ కోటలో శవాలు కప్పే గుడ్డలకి లోటేమిటి?" అన్నాడింకొకడు.

ఎడ్మండ్ అతి జాగ్రత్తగా విన్నాడు. చివరికి మనుషుల మాటలు ఆగిపోయాయి. అందరూ వెళ్లిపోయారనుకున్నాడు. కాని అక్కడెవరినైనా కాపలా ఉంచి ఉంటారనే భయంవల్ల డాంటే గది ప్రవేశించడానికి సాహసించలేదు. గట్టిగా ఊపిరైనా విడవకుండా డాంటే మౌనంగా నిరీక్షిస్తూ అక్కడే ఉండిపోయాడు. గంటసేపటికి మళ్లీ అడుగుల చప్పుడు వినబడింది. డాక్టర్తోనూ కొందరు ఆఫీసర్లతోనూ కలిసి గవర్నర్ మళ్లీ వచ్చాడు.

అంతా నిశ్శబ్దంగా ఉన్నారు. డాక్టర్ పడక సమీపించి శవాన్ని పరీక్ష చేశాడు. కొన్ని ప్రశ్నలు వేసి రోగలక్షణాలు పరిశీలించాడు. చివరికి బందీ మృతుడైనా డని నిర్ధారణచేసి చెప్పాడు.

గవర్నర్ అన్నాడు: "పాపం. చాలా నెమ్మదైనవాడు. ఎవరికీ అపకారం తలపెట్టేవాడు కాదు. తన భ్రమల్లో తను ఆనందించే వాడు. అదుపులో ఉంచడానికి కష్టమే లేకపోయింది."

"అవునండి పాపం" అన్నాడు జైలర్. "అసలు అతన్ని కనిపెట్టి చూడవలసిన అవసరమే లేకపోయేది. ఏభై యేళ్లు ఖైదులో ఉంచినా సరే తప్పించుకుని పారిపోయే రకం కాదు."

"నువ్వెంత నమ్మకంగా చెప్పినా సరే, వాడు చచ్చిపోయాడని నిర్ధారణగా తేల్చవలసిందే. అప్పుడు కాని నాబాధ్యత తీరదు." అన్నాడు గవర్నర్.

కొద్దిసేపు అందరూ నిశ్శబ్దంగా ఉన్నారు. శవాన్ని డాక్టర్ మళ్ళీ పరీక్షచేస్తున్నాడని డాంటే భావించాడు.

"ఇతను నిశ్చయంగా చచ్చిపోయాడు. నాదీ జవాబుదారీ" అన్నాడు డాక్టర్.

గవర్నర్ అన్నాడు: "ఇటువంటివిషయాల్లో మామూలు నాడి పరీక్షల్తో నాకు తృప్తికలగదని మీకు తెలుసును డాక్టర్. పైకి ఎలా కనిపించినప్పటికీ, మా నియమాలప్రకారం అన్నీ జరిపి మరీ నిర్ధారణచెయ్యాలండి."

"తప్పకుండా, అలాగే. ఇనపకడ్డీలు ఎర్రగా కాల్చి తెప్పించండి. నిజానికిదంతా అనవసరమే."

కాల్చిన ఇనపకడ్డీల మాట వినపడేసరికి డాంటే కంపించిపోయాడు. గబగబ అడుగుల చప్పుడు, తలుపులు తీసినచప్పుడూ వినవచ్చాయి. తరవాత కొంతసేపటికి జైలర్ మాటలు వినిపించాయి. "ఇవిగోనండి ఇనపకడ్డీలు."

తరవాత కొంతసేపు నిశ్శబ్దంగా ఉంది. ఆపైన చిటపటమన్న చప్పుడు వినవచ్చింది. దానితోపాటు చర్మం కాలినవాసన వేసింది. డాంటేకి నరాలపట్లు తప్పినట్లయింది. తరవాత డాక్టర్

మాటలు వినవచ్చాయి. "దాశాగా! ఇతను చచ్చిపోయాడు. మసిమలు కొల్చుపేమే దీనికి నిర్ధారణ. పాపం ఇతని పిచ్చికుదిరిపోయింది. చెర ఆఖరయింది. ఇంక శవానికి జరిపించవలసిన క్రియలన్నీ సవ్యంగా జరిపించవచ్చును."

"అవును అవును. మా దగ్గరున్న గోనెసంచుల్లో కొత్తది తెచ్చి అందులో అతన్ని కప్పుతాం. ఆచారాలన్నీ అనుసరించబడతాయి."

"శవాన్ని గోనెలో చుట్టమంటారా?" అని అడిగాడు జైలర్.

"అవును. వెంటనే కానియ్యి. నే నిక్కడే రోజంతా కనిపెట్టుకుని ఉండలేను."

తరవాత మళ్ళీ పదధ్వనులు వినవచ్చాయి. పక్క చప్పుడయింది. తరవాత ఎవరో బరువు మోస్తున్నట్లు బరువైన పదధ్వనులు వినిపించాయి. తిరిగి బరువును దించిన చప్పుడయింది.

"సరే. ఇది ఇవాళ సాయంకాలం చూదాం" అన్నాడు గవర్నర్.

"అంత్యక్రియలు జరిపేచోట ప్రార్థన లుంటాయా?" అని ఒక ఆఫీసరు అడిగాడు.

"అబ్బెబ్బె అదెల్లాగ?" అన్నాడు గవర్నర్. "చాప్లెన్ (క్రైస్తవ ప్రార్థనలు చదివేవాడు) వారంరోజులు సెలవడిగాడు. వెళ్లిరమ్మన్నాను. అంత్యక్రియల సమయంలో ప్రార్థనలు జరపాలని కోరుకున్నవాడైతే, ఈ ఫాదరీని ఇంత తొందరపడి ఎవరు రావమన్నారు?"

అందరూ ఫకాలున నవ్వారు.

"సరే ఇది ఇవాళ సాయంకాలం జరుగుతుంది" అన్నాడు గవర్నర్.

"ఎన్ని గంటలకండి?" అని అడిగాడు జైలర్.

"పది, పదకొండు గంటలకి"

"శవందగ్గిర ఎవరైనా కాపలా ఉండాలా?"

"అక్కర్లేదు. మామూలుగానే గదికి తాళంవెయ్యి."

తరవాత అందరూ వెళ్ళిపోయారు. తలుపులు మూయ్యబడినాయి. గదిఅంతటా ఘోరమైన నిశ్శబ్దం వ్యాపించింది. ఈ నిశ్శబ్దంలో యువకుని హృదయం దుఃఖంతో బ్రద్దలౌతున్నట్లుంది. మెల్లిగా రాతి పలకనెత్తి గదిలోకి తొంగిచూశాడు. తరవాత గది ప్రవేశించాడు.

# 20

కిటికీలోనుంచి వస్తున్న వెలుతురులో చూశాడు. పడకపైన నిలువెల్లా ఆక్రమించిన గోనెసంచి కనపడింది. ఇదే ఫేరయా శరీరాన్ని కప్పిన తుది ఆచ్ఛాదన! డాంటేకీ అతని మిత్రునికీ మధ్య ఇప్పుడీ ఒక్క ఆచ్ఛాదన అడ్డుగా ఉంది. డాంటే పడకచివర కూర్చుని దుఃఖిస్తున్నాడు. ఇప్పుడతను మళ్లీ ఒంటరైనాడు. మళ్ళీ ఘోర నిశ్శబ్దం అతని జీవితాన్ని ముంచివేస్తుంది. ఇంక అతను ప్రాణమిత్రుని చూడలేడు. అతనిని కుమారునివలె ప్రేమించి ఉపదేశాలిచ్చిన ఫేరయా కంఠస్వరం ఇంక వినరాదు. ఫేరయావలెనే తన మనుగడసమస్యను కూడా ఇంక పరిష్కరించుకుంటే మేలు కాదా అని ప్రశ్నించుకున్నాడు. మొదట శారీరకబాధ ననుభవిస్తే మాత్రమేం? ఫేరయా మైత్రివల్ల మాను కున్న ఆత్మహత్యాభావం తిరిగి అతని మనస్సులో ఉత్పన్నమయింది. మిత్రుని కళేబరం సన్నిధిలో తిరిగి ఆత్మహత్యా పిడకల వలె పొడగట్టింది.

"నేను చనిపోయినట్లయితే, అతనెక్కడికి వెళ్లాడో నేనూ అక్కడికే వెళ్లాలి. కాని ఎలా మరణించడం? అయినా అది చాల సులువైనదే ననిపిస్తోంది. నేనిక్కడే ఉండిపోయి, తలుపు తీసి లోనికి వచ్చే వ్యక్తిపైన పడి, గొంతు పిసికి చంపినట్లయితే, నన్ను ఉరితీస్తారు."

కాని ఇటువంటి నీచమైన మరణానికి డాంటే మనస్సు ఒడబడలేదు. స్వేచ్ఛాజీవనం గడపాలనే వాంఛ వచ్చి ఈ తలపులన్నీ మరపింపచేసింది.

"చచ్చిపోవడమా? ఉహూ. వొద్దు. వొద్దు" అనుకున్నాడు. "ఇన్నాళ్లు బతికి, ఇంతకాలం కష్టా లనుభవించి, ఇప్పుడు చచ్చి

పోవడమా? ఇదివరలో, కొన్ని ఏళ్ల కిందట అటువంటి నిశ్చయం చేసుకున్నానంటే, అది అప్పటికి మంచిదే. కాని ఇప్పుడు చావుకి యత్నించడం అంటే, దుర్విధికీ, దుఃఖానికీ లొంగిపోవడ మన్నమాట. అలా వీల్లేదు. నేను జీవించాలి. బలాత్కారంగా నిర్మూలించబడిన నా సౌఖ్యాన్ని నేను తిరిగి జయించి తెచ్చుకోవాలి. నేను చనిపోయే ముందు, నన్నీ యాతనలకు గురిచేసినవారిని శిక్షించాలి. కొందరు మిత్రు లున్నారేమో! ఎవరికి తెలుసును? వారికి ప్రతిఫల మివ్వాలి. ఇక్కడే నిర్బంధంలో ఉండిపోయి, ఫెరయా వలె సమాధికి వెళ్లడమా? అలా జరగకూడదు!"

ఈమాట లనుకుంటూ ఉండగా, ఎడ్మండ్ ఉలిక్కిపడ్డాడు. తరవాత నిశ్చలంగా ఉండిపోయాడు. అకస్మాత్తుగా ఏదో భయంకరమైన యోచన తట్టినవానివలె, గుడ్లు వెళ్లబెట్టి చూస్తూ ఉండిపోయాడు. మెల్లిగా లేచాడు. తల దిమ్మెక్కినట్లు కణతలు నొక్కి పట్టుకున్నాడు. రెండుమూడుసార్లు ఇటూ అటూ పచారు చేశాడు. పడకవద్ద నిలిచాడు. "ఆ! ఇటువంటి ఆలోచన నాకెలా కలిగింది? ఎవరు కలగచేశారు? అయ్యో! భగవంతుడా! నువ్వే ఈ ఆలోచన నాకు కలిగింప చేశావా? మృతిచెందినవారు తప్ప ఈచోటు విడిచివెళ్లలేరు కాబట్టి, మృతిచెందినవారి స్థానం ఆక్రమించరాదా?"

రెండోసారి ఆలోచించడానికైనా ఆగకుండా, డాంటే వెంటనే గోనె సంచిమీదికి వంగి, కత్తితో తాళ్లు కోసి తెరిచాడు. కత్తి ఫెరయా తయారుచేసినదే! జాగ్రత్తగా శవాన్ని సంచిలోనుంచి తీశాడు. సొరంగ మార్గంగుండా శవాన్ని తన గదికి తీసుకువెళ్ళి తన పడకపై పరుండ బెట్టాడు. ఆఖరుసారి వృద్ధుని నుదుటిని చుంబించాడు. శిరస్సుపై గుడ్డకట్టాడు. తెరిచి ఉన్న కళ్లను మూయ్యడానికి ప్రయత్నించాడు, కాని విఫలుడైనాడు. ముఖం గోడవైపుకు తిప్పి పడుకోబెట్టాడు. జైలర్ ఆహారం తీసుకువచ్చినప్పుడు డాంటేయే నిద్రపోతున్నాడని భావించడానికి, ఒంటిపైన గుడ్డ కప్పాడు.

సొరంగం ప్రవేశించి, పడకను గోడకుదగ్గరగా లాగి, రంధ్రాన్ని రాతితో మూసేశాడు. రెండోగది ప్రవేశించి, గోతిలో దాచ

బకిన సూదీ, దారం తీసుకున్నాడు. తన వస్త్రాలు విడిచేసి వాటిని చేతపట్టి గోనెసంచిలో దూరాడు. కాళ్లుచాచి, సంచిని పైన మూసి, లోపలినుంచి సూదీదారంతో కుట్టేశాడు. ఇప్పుడు గోనెసంచి తాకేవారికి లోపల నగ్నమైన శరీరమే ఉన్నట్లు చేతికి తగుల్తుంది. అసలు జైలర్ వచ్చివెళ్ళేవరకూ వేచి ఉండేవాడే. కాని ఈలోగానే గవర్నర్ మనస్సు మార్చుకుని రావచ్చునని డాంటే భయపడ్డాడు. అలా జరిగితే, డాంటే తుదిఆశకూడా భగ్నమైపోతుంది. నిశ్చయించుకున్న కార్యాన్ని వెంటనే నెరవేర్చాడు. ఇకముందు ఏం చెయ్యాలో డాంటే ఆలోచించడం మొదలుపెట్టాడు. శవాన్ని సమాధివద్దకు తీసుకువెళ్లేదారిలో, శవవాహకులు తాము మోస్తున్నది సజీవియైన వ్యక్తి అని అనుమానించినట్లయితే, వాళ్లకి పరిశీలించడానికైనా అవకాశ మివ్వకూడదనుకున్నాడు. సంచిని కత్తితో ఒక్కవేటున చీల్చి, బైటపడి వాళ్ళు బెదిరిపోయిన అదనులోనే పారిపోవాలి. వాళ్లు పట్టుకోడానికి ప్రయత్నించినట్లయితే కత్తినెత్తి వాళ్ళ నెదిరించాలి. అలా జరక్కుండా వాళ్లు అతన్ని సమాధివద్దకు తీసుకువెళ్లి పాతిపెట్టినట్లయితే, మాట్లాడకూరుకుంటాడు. వాళ్లు మన్నుపోసి పూడ్చిపెడతారు. రాత్రి చీకటిపడేవరకూ నిరీక్షించి, తరవాత లేచి తప్పించుకుని వెళ్లిపోవాలి. పూడ్చిపెట్టిన మట్టి బరువై, ఊపిరాడక చచ్చిపోతే, మరీ మంచిది. అప్పుడంతా అఖరైపోతుంది.

ఇంకొక ప్రమాదం కూడా ఉందనుకున్నాడు డాంటే. జైలర్ డాంటే గదిలో శవాన్ని కనిపెట్టి, మోసం బైటపెట్టవచ్చును. కాని తరుచు డాంటే నిద్రిస్తున్న సమయంలోనే జైలర్ ఆహారం తెచ్చిఇవ్వడం జరిగేది. జైలర్ మాట్లాడకుండా ఆహారాన్ని ముక్కాలిపీట పైన పెట్టి వెళ్లిపోయేవాడు. ఈమారు జైలర్ పలకరించాలనుకుంటే? సమాధానం రాక, అతను పడకవద్దకు వెళ్లి చూసినట్లయితే? అప్పుడంతా తెలిసిపోతుంది.

ఏడుగంటలు కొట్టింది. జైలర్ వచ్చేవేళయింది. డాంటే మనోవేదన ఇనుమడించింది. ఒక చేతితో ఛాతీ నొక్కిపట్టి, గుండె దడ నణుచుకోడానికి ప్రయత్నించాడు. రెండో చేతితో, నుదుట ధారలు కట్టి కారుతున్న చెమటను తుడుచుకుంటున్నాడు. మాటిమాటికీ అతని శరీరం కంపించ నారంభించింది.

గంటలు మెల్లిగా నడుస్తున్నాయి. ఎక్కడా కలకలం వినరావటం లేదు. అందువల్ల తనగదిలో మోసాన్ని జైలర్ కనిపెట్టలేదని డాంటే గ్రహించాడు. చివరికి పదిగంటలవేళ ద్వారంవద్ద అడుగుల చప్పుడయింది. డాంటే ధైర్యం చిక్కబట్టుకుని, ఊపిరి బిగబట్టాడు. హృదయస్పందన ఆగిపోతే బాగుండు ననుకున్నాడు. ఇద్దరు మనుష్యులు వచ్చి ద్వారంవద్ద ఆగినట్లు డాంటే ఊహించాడు. ఇద్దరూ శవవాహకు లనుకున్నాడు. శవాలను మోసే బల్లనెక్కను కింపడజేసిన చప్పుడు విన్న తరవాత అతని ఊహ స్థిరపడింది. తలుపులు తెరుచుకున్నాయి. పెద్ద కాగడా వెలుగులో ఇద్దరి ఆకారాలు గోచరిస్తుండగా కనపడ్డాయి. ఆ ఆకారాలు పడకవద్దకు వచ్చాయి. మూడో ఆకారం ద్వారంవద్ద ఉంది. కాగడా అతని చేతిలో ఉంది.

ఇద్దరు శవవాహకులూ వచ్చి గోనెసంచిని చెరొక చివరా పట్టుకున్నారు. తలవంక నున్నవాడు సంచిని ఆ చివర నెత్తి, "అరే! ముసలాడు బక్కచిక్కి ఉంటేవాడే! కాని ఎంత బరువున్నాడో!" అన్నాడు.

కాళ్ళపక్క మరొకడు సంచీ నెత్తి, "ఏడాదికి అర పౌను లెక్కని ఎముకలు బరువెక్కుతా యంటారు" అన్నాడు.

"ముడేశావా?"

"ఇప్పుడెందుకులే. బరువెక్కువౌతుంది. అవసరం తరవాత ముడేస్తాలే."

"ముడా? ముడెందుకు?" అనుకున్నాడు డాంటే తనలో.

శవం అనుకున్నదాన్ని ఇద్దరూ మోసి బల్లమీదికి చేర్చారు. ఎందుకేనా మంచిదని డాంటే ఒళ్లు బిర్ర బిగించాడు. శవవాహనం మెల్లిగా మెట్లెక్కింది. ముందొకడు కాగడా పట్టుకుని నడుస్తున్నాడు. అందరూ ఆవరణలోకి వచ్చారు. డాంటేకి చల్లని గాలి సోకింది. శుభ్రవాయువు సోకగానే డాంటేని ఆనందం, ఆందోళన ఒక్కసారి ముప్పిరిగొన్నాయి. శవవాహకులు ఇరవై అడుగులు నడిచి బల్లను నేలకు దించారు. ఒకడు నడిచి వెళ్లిపోయాడు. ఇటుక

రాళ్లపైన అతని అడుగులు స్పష్టంగా వినపడ్డాయి డాంటేకి. వెంటనే లేచి పారిపోవాలనిపించింది. కాని ఆ కోరికను అణుచుకున్నాడు.

తరవాత పక్కగా ఒక బరువైన వస్తువుని పడవేసిన చప్పుడయింది. వెంటనే కాళ్ళకు ఒక పగ్గం గట్టిగా బిగించి ముడివెయ్యబడింది. డాంటేకి నొప్పి కలిగింది.

"మూట. ముడి సరిగ్గా బిగిసిందా?" అన్నాడొకడు.

"ఓ! బాగా బిగిసింది."

"సరే నడు."

మళ్లీ బల్లనెత్తి శవవాహకులు మోసుకువెళ్లారు. కొద్ది దూరంలో ఆగి ఒక ద్వారం తలుపులు తీశారు. ద్వారం దాటగానే రాళ్లగుట్టలపై విరిగిపడుతున్న సముద్ర కెరటాల ఘోషణ డాంటేకి వినవచ్చింది.

"మబ్బు పట్టింది. గాలిపాటు ప్రశాంతంగా లేదు. సముద్రంలో మునకలకి మంచి వేళ కాదు" అన్నాడొకడు.

"పాపం ఫారియాకి ఒళ్లు తడిసి ముద్దౌతుంది" అన్నాడు మరొకడు. ఇద్దరూ నవ్వుకున్నారు.

ఈ పరిహాసం డాంటేకి బోధపడలేదు. భయంతో అతనికి ఒళ్లంతా గగుర్పొడిచింది.

"ఆ! ఇంక దించు" అన్నాడొకడు.

"కాదు కాదు. ఇంకొంచెం దూరం నడు" అన్నాడు మరొకడు. "జ్ఞాపకం లేదూ? కిందటిసారి శవం మధ్యలోనే రాళ్ళ మీద పడిపోయింది. గవర్నర్ మనల్ని ఒట్టి సోమరిపోతులన్నాడు కూడా."

ఇద్దరూ ఇంక కొంచెం దూరం వెళ్లారు. అక్కడ బల్ల దించి, కాళ్ళొకడు, తలొకడు పట్టుకుని డాంటేని లేవదీశారు. ఆపైన గంజికావడి పట్టినట్లు ఇటూ అటూ ఊపడం మొదలుపెట్టారు.

"ఒకటి, రెండు, మూడు, ఊ!" అన్నారు శవవాహకులు. ఒక్క ఊపున గాలిలోకి విసరబడినట్లయింది డాంటేకి. తుపాకి

దెబ్బతిన్న పక్షిలాగ గాలిలో జారిపోతున్నాడు. గుండె ఆగిపోయి నట్లయిందిఅతనికి. పెద్ద బరువొకటి వేలాడుతున్నందువల్ల మరింత వేగంతోపడిపోతున్నాడు. పడిపోడానికి ఒక యుగం పట్టుతున్న ట్లుంది. తరవాత నరాలు బిగిసే చన్నీళ్లలో తభాలున పడ్డాడు. అతని ఆర్తనాదం నీటిచప్పుళ్లలో మణిగిపోయింది.

డాంటేని సముద్రంలోకి విసిరేశారు. కాళ్లకు కట్టిన ఇనప గుండు అతన్ని అతివేగంతో కిందికి లాక్కుపోతోంది.

ఇఫ్ కోటలో బందీలకి సమాధి సముద్రమే !

# 21

డాంటేకి చేష్టలుడిగినాయి. ఊపిరాడలేదు. సమయస్ఫూర్తి తెచ్చుకుని శ్వాస బిగబట్టాడు. కుడిచేతిలోని కత్తితో గోనెసంచిని చీల్చివేశాడు. గెంటో చెయ్యి, తల విడివడ్డాయి. కాని ఎంత ప్రయత్నించినా ఇనపగుండును వొదిలించుకోలేక పోతున్నాడు. ఆ గుండు అతన్ని సముద్రంలో కిందికి వేగంగా లాక్కుపోతోంది. చివరికి శరీరాన్ని బాణంవలె వంచి, కాళ్ళకు కట్టబడిన పగ్గాన్ని అందుకున్నాడు. పగ్గాన్ని కత్తితో కోసి వేశాడు. ఒక్కసారి బలంగా కాళ్లు విదల్చి, శరీరాన్ని నిలువుగా పైకి ఒక్క ఊపు ఊపాడు. ఇనపగుండు గోనెసంచిని సముద్రమట్టానికి లాక్కుపోయింది.

ఊపిరి తీసుకోడానికి డాంటే క్షణంసేపు నిదానించి, తరవాత మరొకసారి పైకి ఈదాడు. ఈమారు నీటిపైకి రాగలిగాడు. కాని ఎవరైనా చూస్తారనే భయంతో నీటిలోకి చప్పున మునిగాడు.

ఈమారు డాంటే నీటిపైకి వచ్చినప్పుడు ఇఫ్‌కోట గుట్టలకు ఏభై అడుగుల దూరంలో ఉన్నాడు. అతనిముందు ఒడ్డులేని విశాల సముద్రం ఘూర్ణిస్తోంది. అతని వెనుక బ్రహ్మాండమైన కొండ ఒకటి ఒక చివర మొనతేరి, బలికోసం చెయ్యి చాచినట్లు రాక్షసి వలె భయంకరంగా చూస్తోంది. సముద్రకెరటాలు తుపాను నాహ్వానిస్తున్నట్లు కల్లోలం చేస్తున్నాయి. కొండపైన గుడ్డిదీపం

పక్కన ఇద్దరు వ్యక్తుల ఆకారాలు ఇంకా కనిపిస్తున్నాయి. ఇద్దరూ ఆందోళనతో సముద్రంవంక చూస్తున్నట్లు అతనికి అనిపించింది. అతని కేకను ఇద్దరూ వినేఉంటా రనుకున్నాడు.

మరొకసారి నీటిలో మునిగి కొంతదూరం ఈదాడు. తిరిగి పైకివచ్చేసరికి దీపం మాయమయింది. ఇప్పుడతను చుట్టూ కలయ చూశాడు. ఇఫ్‌కోటకు సమీపంలోని ద్వీపాలలో జనావాసాలున్నాయి. వీనికంటె మూడుమైళ్ళలోఉన్న టైబోలెన్, లెమార్ ద్వీపాలు క్షేమమని భావించాడు. కాని ఈ చీకటిలో వాటి నెలా కనిపెట్టడం ?

ఆ క్షణంలో డాంటేకి ప్లానీర్‌ద్వీపంలో దీప స్తంభం కనపడింది. అటువంక తిరిగి, ఇప్పుడు తనకు ఎడమవైపున టైబోలెన్ ద్వీపం ఉందని గ్రహించాడు. ఎడమవంకకు ఈదినట్లయితే సులువుగా చేరుకోవచ్చును. ఇన్నేళ్ల నిర్బంధం అతనిలోని శక్తిని హరించలేదని గ్రహించి డాంటే ఆనందభరితుడైనాడు. బాల్యంలో నేర్చిన ఈత నతడు మరిచిపోలేదు. భయం అతని వేగాన్ని ఇనుమడింపచేసింది. కెరటాల శిఖరాలపైకి లేచినప్పుడెల్ల శ్రద్ధతో ఆలకించేవాడు. చుట్టూ గాఢాంధకారాన్ని చీల్చుకుని చూడ్డానికి ప్రయత్నించేవాడు. ప్రతి పెద్ద కెరటమూ అతన్ని వెన్నాడి తరుముతున్న పడవేనని భయపడుతూ, మరింత వేగంతో ఈదేవాడు. క్రమంగా ఆ నిశ్శబ్దనిశీధిలో భయంకరమైన ఇఫ్‌కోట అంతర్ధానమయింది. అది ఇంక కంట పడకపోయినప్పటికీ, దాని ఉనికి అతని మనస్సులో పొడగట్టుతూనే ఉంది. అదే అతన్ని వేగంతో తరుముతోంది.

"గంటసేపటినించి ఈదుతున్నానేమో !" అనుకున్నాడు డాంటే తనలో. "ఎదురుగాలి అడ్డగిస్తోంది. నాలుగోవంతు నా శ్రమంతా వ్యర్థమైపోతోంది. నేను మోసపోకుండా ఉన్నట్లయితే, టైబోలెన్‌ద్వీపాన్ని సమీపించి ఉండాలి. ఏమో ! పొరబడ్డానేమో ?"

భీతితో కంపించిపోయాడు డాంటే. విశ్రాంతికోసం నీటిపైన తేల వారంభించాడు. కాని సముద్రం క్రమ క్రమంగా మరింత కల్లోలిత మాతోంది. ఈ విశ్రాంతి అసాధ్య మనుకున్నాడు.

"ఏమయినా సరే కడంటూ చూడాలి. కాళ్లూ చేతులూ అలసి పోయేవరకూ, ఒళ్ళు కొంకర్లుపోయేవరకూ ఈదిపోవాలి. సత్తువ నశించి మునిగిపోతే పోవచ్చును. కాని సత్తువ ఉన్నంతవరకూ పట్టు వదలకూడదు" అనుకున్నాడు. ప్రాణాలకు తెగించి లేనిబలం తెచ్చుకుని ఈదడం మొదలు పెట్టాడు.

హఠాత్తుగా ఆకాశమంతా చీకటితో మరింత దట్టమైనట్లు డాంటేకి పొడగట్టింది. మోకాటికి గట్టి దెబ్బ తగిలింది. డాంటే చేతులు చాచి తడిమాడు. ఏదో కఠిన పదార్థం తగిలింది. జాగ్ర త్తగా ముందుకు ఈదాడు. నేల తగిలింది.

డాంటే తలెత్తి చూశాడు. లేచి ముందుకు కొన్ని అడుగులు వేశాడు. తరవాత కఠిన శిలాసముదాయంపైన నడుము వాల్చాడు. ప్రస్తుత స్థితిలో ఇదే అతనికి మెత్తని పాన్పుగా సుఖవిశ్రాంతి నిచ్చింది. తనకు విముక్తి నిచ్చినందుకు భగవంతుని హృదయ పూర్వకంగా ప్రశంసించాడు. హోరుగాలి కాని, వర్షపాతం కాని అతని సుఖ సుషుప్తిని వారించలేకపోయినాయి. అలసటవల్ల అతని శరీరం నిద్రాసక్తమయింది. కలనైనా కనలేకపోయిన స్వేచ్ఛా సౌఖ్యాశయం పరితృప్తి చెందనున్న అతని అంతరాత్మ, గాఢ సుషు ప్తిలో తన్మయానందం అనుభవిస్తోంది.

గంటసేపటికి పెద్ద ఉరుమువల్ల డాంటేకి నిద్రాభంగ మయింది. క్షణక్షణానికీ విద్యుత్సర్పాలవలె తటిల్లతలు, గుమిగూడుతున్న మేఘాల భయంకర స్వరూపాన్ని వెలిగింప చేస్తున్నాయి.

డాంటే టైబోలెన్ ద్వీపాన్ని చేరినట్లు గ్రహించాడు. నిర్జనం, నిరాశ్రయమైన ఈ ద్వీపంలో తలదాచుకోడానికి చోటు లేదని డాంటేకి తెలుసును. అందువల్ల తుపాను పోగానే మళ్ళీ సము ద్రంలోకి దూకి, లెమార్ ద్వీపానికి ఈదుకుని వెళ్లాలని నిశ్చయించు కున్నాడు. అది కూడా ఆశ్రయం దొరకని ద్వీపమే. కాని పెద్ద దైవందువల్ల విశ్రాంతికి అనుకూలంగా ఉంటుందనుకున్నాడు. పక్కల అంచు తేరి, కింద నీడనివ్వగల ఒక కొండదరి చేరి, అంతకంతకు తీవ్ర మౌతున్న తుపానులో డాంటే తలదాచుకున్నాడు.

ద్వీపమంతా కంపించిపోతున్నట్లుంది. అనుక్షణమూ కట్టు తెగిన పడవమాదిరిగా ద్వీపం సముద్రంలో తేలిపోతుందన్నట్లుంది. పెద్ద సుడిగుండంలోనికి లాక్కుపోతుందనిపిస్తున్నది.

ఇంతలోనే ఆకాశాన్ని ఒక్క వేటున చీల్చినట్లు పెద్ద మెరుపొకటి మెరిసింది. ఆ మెరుపువెలుగులో, మైలుదూరంలో ఒక చిన్న బోటు కనిపించింది. చేపలుపట్టే పల్లెవాసులకు చెందినది కాబోలనుకున్నాడు. అది కల్లోల సముద్రంలో, నిస్సహాయంగా కెరటాలపై ఆకువలె తేలిపోతోంది. అకస్మాత్తుగా మాయమైనట్లు మాయమై, ఇంతలోనే ఒక తరంగశిఖరం పై తేలి కనపడుతోంది. మళ్ళీ దూసుకుపోయి మాయమౌతోంది.

డాంటే గొంతెత్తి బిగ్గరగా పిలిచాడు. సంజ్ఞచేశాడు. మళ్లీ మెరుపు మెరిసింది. బోటులో నలుగురు నావికులు తెరచాప కొయ్యనూ, పగ్గాలనూ ప్రాణపణంగా పట్టుకున్నట్లు డాంటే చూశాడు. అయిదో నావికుడు విరిగిన చుక్కాని పట్టుకున్నాడు. కొయ్యనంటిన తెరచాప చినిగి తూట్లుపడి ఉంది. గాలి జోరులో రెపరెపలాడుతోంది. చివరికి కొయ్యను కట్టిన బంధ విరిగి పోయింది. బోటు నిశాంధకారంలో అంతర్ధానమయింది.

వెంటనే పటపట శబ్దం. దానివెంట ఆర్తనాదాలు వినవచ్చాయి. మరొక మెరుపులో బోటు ముక్కలైనట్లు డాంటేకి కనపడింది. చెక్కలు వెదచల్లబడిన తరంగాలలో దీనముఖాలు, పైకి చాచిన చేతులు కనిపించాయి. తిరిగి అంతా అంధకార బంధుర మయింది. ఆ ఘోరదృశ్యం మెరుపువలెనే ఇట్టే మాయమయింది.

జారుతున్న ఒక రాతిపైన చేరబడి డాంటే కనురెప్పలు వాల్చక చూస్తున్నాడు. శ్రద్ధగా ఆలకించాడు. ఇప్పుడు ఏ ఆర్తనాదాలూ వినరాలేదు. ఎవరూ కనిపించలేదు. ఆర్తనాదాలు, ప్రాణాలకోసం పోరాటం అంతమయినాయి. తుపానుగాలి గర్జన మాత్రమే వినపడుతోంది.

క్రమక్రమంగా వాయుఘోషణ క్షీణించింది. పెద్ద మబ్బులు పడమరకు సాగిపోతున్నాయి. నీలిఆకాశం, మిణుకు మిణుకు మంటున్న నక్షత్రాల కాంతి క్రమంగా కానవచ్చాయి. తూర్పున

ఆకాశం అంచులలో ఎర్రని కాంతిపుంజం తెలినీలిమబ్బులమధ్య వ్యాపించ నారంభించింది. తొలి కాంతులలో నాట్యమాడుతున్న తరంగాలశిఖరాలు హేమకిరీటాలు ధరించాయి.

తెల్లవారింది. ఈ అద్భుత దృశ్యాన్ని చూస్తూ, డాంటే మూగ వోయి, నిశ్చేష్టుడై నిలబడిపోయాడు. అతడు జన్మలో మొట్ట మొదటిసారిగా ఇటువంటి దృశ్యాన్ని చూస్తున్నట్లుంది. చిరకాల నిర్బంధంలో ప్రకృతి సౌందర్యాన్ని, అద్భుత దృశ్యాల్ని మరచి పోయినట్లున్నాడు. ఇఫ్ కోట రౌద్రాకారాన్ని పరికించాడు. సము ద్రమంతా కలయ చూశాడు. సముద్రగర్భంలోనుంచి లేచి నిల్చి, తీవిగా సముద్రుని అజ్ఞాపిస్తున్నట్లుంది దుర్గం. ఉదయం బహుశా అయిదు గంటలై ఉంటుంది. సముద్రం ప్రశాంతమౌతున్నది.

డాంటే ఇలా అనుకున్నాడు: "ఇంక రెండుమూడు గంటల్లో జైలర్ నాగదికి వెడతాడు. పాపం నామిత్రుని శవంకనిపిస్తుంది. అదిచూసి నాకోసం వెతుకుతాడు. కేకలు వేసి అందర్నీ పిలుస్తాడు. అప్పుడు పడకపక్క రంధ్రమూ, సొరంగమార్గమూ బయటపడ తాయి. నన్ను సముద్రంలోకి విసిరినవాళ్లని పరీక్షచేస్తారు. పడి నప్పుడు నేపెట్టిన కేకనూ వాళ్లు వినేఉంటారు. సైనికుల్ని నింపు కుని బోట్లు బయలుదేరతాయి - పరారైన నిర్భాగ్యుని వెతకడానికి. అట్టేదూరం పోలేడనుకుంటారు. ఫిరంగి మోగుతుంది. ఒంటిపైన బట్టలైనా లేక, ఆకలితో మాడుతూ తిరిగే ఏమనిషికీ ఆశ్రయ మివ్వ కూడదని తీరవాసులందర్నీ ఫిరంగిమోత హెచ్చరిస్తుంది. మార్సెల్స్ పోలీసులూ గూఢచారులూ తీరప్రాంత మంతా గాలిస్తారు. ఇఫ్ కోట గవర్నర్ సముద్రంపైన నన్ను వెంటాడతాడు. సముద్రంలోనూ, తీరప్రాంతంపైనా అందరూ నన్ను చుట్టుముట్టి పట్టుకుంటారు. అప్పుడు నా గతేమౌతుంది? ఇరవైఫ్రాంకులకోసం ఆశపడే ఏరైతో నన్ను పట్టిఇవ్వకమానడు. నా కింక బలమంతా పోయింది, ధైర్యంనశించింది. ఉపాయం తోచడంలేదు. అయ్యో భగవంతుడా! నే ననుభవించిన క్లేశం చాలదా? అసమర్థుడనైన నన్ను కాపాడలేవా?"

డాంటే భగవంతుని దీనంగా ప్రార్థిస్తున్న ఈ సమయంలోనే, పామెగ్ ద్వీపంవద్ద ఒకచిన్న ఓడ కనపడింది. దానికి మూడు తెర

చాపలున్నాయి. డాంటే అనుభవం కల నావికుడు. అది జినోవాలో నిర్మించబడినదని ఇట్టే గ్రహించాడు. మార్సేల్స్ నించి వెళ్లిపోతోంది. డాంటే ఇలా అనుకున్నాడు: "పరారి ఖైదీనని తెలుసుకుని మార్సేల్స్‌కి తీసుకువెళ్లి ఒప్పగిస్తారనే భయమే లేకపోయినట్లయితే, అరగంటలో వెళ్లి ఆ బోటు నందుకోగలవాడినే. ఇప్పుడేం చెయ్యాలం? వాళ్లకి చెప్పడానికి ఏకథ అల్లను? వాళ్లు వ్యాపార మిషతో తీరసమీపాన తిరిగే సముద్రపు దొంగలు కావచ్చు. అక్రమవ్యాపారులు కావచ్చు. లాభం లేదనుకుంటే నన్ను అమ్మెయ్యగలరుకాని దయచూపించరు. ఇంకా కోటఫిరంగి మోగలేదు. ఇప్పటికేమీ అనుమానించరు. రాత్రి సముద్రంపాలైన బోటులో నావికుడినని చెప్పుకోవచ్చును అవును. అదే మంచిది. వెంటనే వెళ్లాలి."

డాంటే రాత్రి బోటుకనపడిన దిక్కు చూశాడు. చూసి కంపించిపోయాడు.

ఒకరాతిఅంచున ఫ్రిజియన్ టోపి ఒకటిచిక్కుకుని ఉంది. అది రాత్రి కనపడిన నావికులలో ఒకడు ధరించి ఉండాలి. విరిగిన బల్లచెక్కలు పక్కనే నీటిలో తేలుతున్నాయి.

డాంటే సముద్రంలోకి దూకి టోపీవంకకు ఈదుకు వెళ్లాడు. అది అంగుకుని తలపై ధరించి ఒక బల్లచెక్క పట్టుకుని, జినోవా పడవదిక్కుగా ఈదుకు వెళ్ళాడు.

"ఇంక ఫరవాలేదు" అనుకున్నాడు డాంటే. ఈ భావం స్థిరపడ్డంతోనే అతని కెక్కడలేని బలం వచ్చింది. ఆ చిన్న ఓడ ఇఫ్‌కోటక్కి, ప్లానీర్ దీపస్తంభానికీ మధ్యగా వెడుతోంది. క్రమంగా డాంటే నీటిపై తేలి, టోపి తీసి ఆడించి, సంజ్ఞచేశాడు. కాని ఎవరూ చూడలేదు. ఓడ మరొకదిక్కుగా వెడుతోంది. బల్లచెక్క తెచ్చుకున్నందుకు సంతోషించాడు. నీరసించి ఉన్నందువల్ల ఇటువంటి సహాయం లేకపోతే ఓడని సమీపించే వరకూ నీటిలో నిలవలేకపోయేవాడే. ఓడ దాటిపోతే తీరమైనా చేరలేకపోయేవాడే. ఒకసారి ఓడ ఆగి అతనివంక వస్తున్నట్లు తోచింది. కాని ఇంతలోనే మళ్ళీ దూరంగా వెళ్లిపోతోంది.

డాంటే ఈమారు మళ్ళీ నీటి పైకి లేచి టోపీఎత్తి ఊపాడు. బిగ్గరగా పిలిచాడు. సముద్రదేవత ఎవరో విలపిస్తున్నట్లుంది ఆ పిలుపు. ఈమారు నావికులు అతని పిలుపు విన్నారు. అతన్ని చూశారు. వెంటనే చుక్కాని తిప్పి ఓడని డాంటేదగ్గరికి నడిపారు. ఓడమీది నుంచి చిన్న తెడ్డు పడవ దించబడింది. డాంటే బల్లచెక్క గెంటేసి పడవవైపుకు ఈదాడు. కాని ఉన్నదనుకున్నంత సత్తువ వాస్తవంగా అతని ఒంటిలో లేదు, బల్లచెక్క ఎంత అమూల్య సహాయం చేసిందో అతను గుర్తించలేదు. చేతులూ కాళ్ళూ బిగబట్టాయి. ఈతవేటు నీరసంగా పడుతోంది. ఆయాసం అధికమయింది. గట్టిగా అరిచాడు. నావికులు మరింత వేగంతో వస్తున్నారు. ఒకడు ఇటాలియన్ భాషలో అన్నాడు: "ఫరవాలేదు ధైర్యం తెచ్చుకో."

ఒక తరంగం అతన్ని నురుగులో ముంచివేస్తున్న సమయంలో ఈమాట వినపడింది. డాంటే తిరిగి పైకి తేలాడు. మరొకసారి బిగ్గరగా అరిచాడు. మళ్లీ మునిగిపోయాడు. అతని శరీరమే అతనికి బరువై కిందికి దిగలాగుతోంది. ఆఖరుసారి శక్తినంతా వినియోగించి పైకి లేచాడు. పైకి తేలగానే ఒకరు అతని జుట్టు అందుకున్నారు. తరవాత అతనికేదీ వినిపించలేదు. ఏమీ కనిపించలేదు. స్పృహ తప్పిపోయింది.

కన్నులు తెరిచి చూసేసరికి డాంటే ఓడపైన ఉన్నట్లు గ్రహించాడు. మొట్టమొదట ఓడ ఏ దిక్కుగా వెడుతున్నదో అతడు పరికించాడు. ఇఫ్‌కోట దూరంలో వెనక పడిపోయింది. సంతోషంతో ఒక్క కేక పెట్టాడు. కాని నీరసస్థితిలో ఉన్న అతని కేక బాధాజనిత మనుకున్నారు నావికులు. డాంటే కాళ్లను ఒకడు ఉన్ని గుడ్డతో రుద్దుతున్నాడు. మరొకడు సారకాయబుర్రతో నోటికి కల్లు పట్టిస్తున్నాడు. ఒక వృద్ధ నావికుడు అతన్ని జాలితో పరికిస్తున్నాడు. రేపో మాపో తప్పని దుర్గతిని నేడు తప్పించుకుని, అదే మరొకనికి పట్టినప్పుడు చూస్తే కలిగే భావమే వృద్ధుని ముఖంలో కానవస్తోంది. అతను ఓడ కెప్టెన్. పట్టించిన కల్లుతో డాంటేకి సత్తువ చేరుకుంది. కాళ్లు, చేతులు స్వాధీనంలోకి వచ్చాయి.

"నువ్వెవరు?" అని ప్రశ్నించాడు వృద్ధుడు, వచ్చీరాని ఫ్రెంచిభాషలో.

"నేను మాల్టాద్వీపానికి చెందిన నావికుణ్ణి." అన్నాడు డాంటే, వచ్చీరాని ఇటాలియన్ భాషలో. "సారాయీ, ధాన్యం వేసుకుని సిరక్యూస్ నుంచి వస్తున్నాం. రాత్రి మార్గియన్ అగ్రం దగ్గ గుండాగా తుపాను వచ్చింది. పడవ మునిగిపోయింది. అదుగో ఆ గుట్టదగ్గిరే మునిగిపోయింది."

"ఇప్పు డెక్కడనించి వచ్చావ్?"

"ఆ గుట్ట దగ్గిరనించే. నాతోటి నావికులు ముగ్గురూ మునిగి పోయారు. నేనొక్కడినే తప్పించుకున్నా ననుకుంటాను. మీ ఓడ చూసి, రావడానికి ఒక చెక్క పుచ్చుకున్నాను. మీరునన్ను రక్షించారు. మీ ఋణం తీర్చ లేనిది. నేను మునిగిపోయేవాడినే. మీలో ఒకరు నన్ను జుట్టు అందుకుని తీసి రక్షించారు."

"నేనే" అన్నాడు ఒకడు, కోరమీసాలు దువ్వుకుంటూ. "సరిగ్గా అదను చూశాను. నువ్వప్పుడు మునిగిపోతున్నావు."

"అవునండి" అన్నాడు డాంటే అతనికి నమస్కరిస్తూ. "ఇంకోసారి మీకు నా కృతజ్ఞత తెలుపుకుంటున్నాను."

"నిజంగా చెప్పవద్దూ" అన్నా డతను. "ముందు జంకాను సుమా! మాసిన గడ్డం, అడుగు పొడుగు పెరిగిన జుట్టు నిన్ను చూసి దారిదోపిడిగాడి వనుకున్నాను."

ఇఫ్ కోటలో నిర్బంధానికి వెళ్ళినదిమొదలు జుట్టు కత్తిరించుకోలేదనీ, గడ్డం గీసుకోలేదనీ డాంటేకి అప్పుడు జ్ఞప్తికి వచ్చింది. "అవును" అన్నాడు డాంటే. "ఒకసారి నేను గండంలో పడిన ప్పుడు, పదేళ్లపాటు క్షౌరం చేయించుకోనని మొక్కుకున్నాను. ఇవాళతో గడువు తీరిపోయింది. సరిగ్గా గడువు రోజునే మళ్ళీ నీటిగండంనించి నా ప్రాణాలు దక్కాయి."

"ఇప్పు డేం చేస్తావు?" అన్నాడు కెప్టెన్.

"మీ రేం చెయ్యమంటే అదే చేస్తాను. నేను హస్తవాసికల నావికుణ్ని. మొట్టమొదట తగిలే రేవులో నన్ను విడిచిపెట్టండి.

సులువుగా ఏ వ్యాపారనౌకలోనో ఉద్యోగం సంపాదించుకో గలను."

"నీకు మధ్యధరా సముద్రం బాగా తెలుసా?"

"ఈ సముద్రంలో నే నెరగని రేవులంటూ లేవు. ఏ రేవు కైనాసరే కళ్లుమూసుకుని వెళ్ళగలను. ఇప్పుడు మీ రెక్కడ కెడు తున్నారు?"

"లెగ్ హారన్"

"అయితే ఇన్నిసార్లు చుక్కాని తిప్పుతూ కాలం నష్టపరు చుకుంటున్నా రెందుకు? గాలివాలు నే త్వరగా పోవచ్చు నే?"

"ఎందుకంటే, ఇప్పుడు మేం తిన్నగా రయన్ద్వీపానికి వెళ్లాలి."

"అంటే నూటపాతిక అడుగుల్లో చేరగల మన్న మాట."

"చుక్కాని అందుకో. నీ కెంత తెలుసో చూసాను" అన్నాడు కెప్టెన్.

యువకుడు లేచి చుక్కానివద్ద చేరాడు. కొంచెం అటూ ఇటూ కదిపి, ఇరుసుగూలంమీద ఏ పాటి మోపు ఉందో చూశాడు. అప్పుడు నావికులకు ఆజ్ఞ ఇచ్చాడు: "తెరచాపల పగ్గాలు అందుకోండి." నలుగురు నావికులు గబగబా అందుకు న్నారు. "లోపలికి తిప్పండి. ఊఁ. ఇప్పుడు కట్టండి" అన్నాడు డాంటే.

ఆ చిన్న ఓడ ఈమాటు పెడకు తిరక్కుండా తిన్నగా నడి చింది. మెల్లిగా ద్వీపాన్ని సమీపించింది.

"బలే" అన్నాడు కెప్టెన్.

"బలే" అన్నారు నావికులంతా. ఇంత చురుకు, ఇంత తెలివి చూపిన యువకుని ఆశ్చర్యంతో, ప్రశంసాభావంతో చూశారు నావికులు.

"చూశారా!" అన్నాడు డాంటే, చుక్కాని విడిచిపెట్టి. "ఈ ప్రయాణంలో నావల్ల కొంతైనా మీకు ప్రయోజనం ఉండకపోదు. లెగ్ హారన్ వెళ్లినతరవాత చూడండి. నావల్ల ఉపయోగం ఉంటుం దనుకుంటే నన్ను ఉంచవచ్చు. లేదనుకుంటే అక్కడే నన్ను విడిచి

పెట్టెయ్యవచ్చు. అక్కడ ఉద్యోగం సంపాదించుకుంటాను. నా మొదటినెల జీతంతో, ఇప్పుడు మీరు నాకు పెడుతున్న తిండికీ బట్టలకీ డబ్బు చెల్లించుకుంటాను. మీరు ఎవరేనా ఒకటే. ఇంకొకరి కిచ్చేదే నాకూ ఇస్తే, న్యాయమే."

"అట్బ్బె అదేం న్యాయం?" అన్నాడు డాంటేని రక్షించిన నావికుడు "నీకు మాకంటే చాలా తెలుసు."

"ఈ వ్యవహారంలో నీ జోక్య మేమిటోయ్, జకోపో? మధ్య నీ కెందుకు?" అన్నాడు కెప్టెన్. "ఎవరు కోరినంత జీతానికి వాళ్లు ఉంటారు. ముందుగా నీకోటొకటీ, రెండు పంట్లాములూ ఇతని కిస్తే చాలే. నీ కింకో జత ఉంటేనే ఇయ్యి."

"లేదు" అన్నాడు జకోపో. "కాని నాదగ్గిర ఒక చొక్కా, పంట్లాం ఉన్నాయి."

"అవి చాలు నాకు" అన్నాడు డాంటే.

జకోపో ఇట్టే వళ్ళి దుస్తులు తెచ్చాడు. డాంటే వాటిని ధరించాడు.

"ఇంకేమైనా కావాలా?" అని అడిగాడు కెప్టెన్.

"ఉంటే కొంచెం రొట్టిముక్క, మరి కొంచెం కల్లు ఇవ్వండి. ఈమాదిరి కల్లురుచిచూసి చాల రోజులయింది."

డాంటేకి బ్రాందీ తెచ్చియిచ్చారు. జకోపో సారకాయ బుర్ర ఇచ్చాడు. అందులో బ్రాందీ పోసుకుని డాంటే తాగబోతున్న సమయంలో, "ఆగండి. ఏమి టది? ఇఫ్ కోటలో ఏదో జరుగుతున్నట్టుంది" అన్నాడు కెప్టెన్.

ఇఫ్ కోట దక్షిణదుర్గం సమీపంలో తెల్లని పొగ లేచింది. మరుక్షణంలో ఫిరంగిధ్వని అస్పష్టంగా వినపడింది. నావికు లొకరి ముఖా లొకరు చూసుకున్నారు.

"దీ నర్థ మేమిటి?" అన్నాడు కెప్టెన్.

"రాత్రి ఖైదీ లెవరో పారిపోయుంటారు. ఫిరంగి పేల్చి అందర్నీ హెచ్చరిస్తున్నారు" అన్నాడు డాంటే.

కెప్టెన్ యువకుని పరికించాడు. యువకుడీ మాటలు చెప్పి బొన్ను ఎత్తి బ్రాందీ తాగేశాడు. అతని నిశ్చలభావం, సంతృప్తి

గమనించిన కెప్టెన్‌కి, మనస్సులో తోచిన అనుమానం నివృత్తి అయింది.

అలసిపోయిన మిషతో డాంటే చుక్కాని దగ్గర కూర్చో నివ్వమని కోరాడు. అక్కడ నావికుడు కెప్టెన్‌వంక చూశాడు. కెప్టెన్ కనుసంజ్ఞ చూసి,అతను చుక్కాని యువకుని చేతి కిచ్చాడు. డాంటే ఇప్పుడు మార్సెల్స్‌వంక దృష్టి నిగిడ్చాడు

"ఇవాళ ఎన్నో తారీఖు?" అని అడిగాడు డాంటే, దగ్గర చేరిన జకోపోను చూసి. ఇఫ్‌కోట క్రమంగా కంటికి కనిపించ కుండా దూరమైపోతోంది.

"ఫిబ్రవరి 28."

"ఏ సంవత్సరం?"

"ఏ సంవత్సరమా? తెలియదూ? అరే! ఇది 1829"

అంటే, డాంటే అరెస్టయి ఈ రోజుకి సరిగ్గా పధ్నాలుగేళ్లు గడిచాయన్నమాట! అతను ఇఫ్‌కోటలో ప్రవేశించినప్పుడు వయస్సు పందొమ్మిది. ఇప్పుడతనికి 33 ఏళ్లు! విచారభరమైన చిరునవ్వొకటి డాంటేముఖంలో ద్యోతకమయింది. ఈ దీర్ఘ కాలంలో మర్సిడా ఏమయియుంటుంది? అనుకున్నాడు డాంటే. బహుశా తను చనిపోయి ఉంటాడనుకుంటుంది. ఇంత క్రూర నిర్బంధానికి కారకులైన ముగ్గురు వ్యక్తులూ జ్ఞప్తికిరాగానే, అతనికన్నులు చిరచిరలాడాయి. కారాగారంలో ఉండగా డాంగ్లర్, ఫెర్నాండో, విల్‌ఫర్ట్‌లపైన పగతీర్చుకోవాలని తీసుకున్న ఘోర ప్రతిజ్ఞను తిరిగి ఇప్పుడు డాంటే ఉచ్చరించాడు. ఇదింక నిరర్థకమైన క్రోధ ప్రకటన కాదు. ఇది వాస్తవం. ఎంత వేగంతో ఏ నౌక వచ్చి నాసరే మధ్యధరాసముద్రంలో ఈ జినోవానౌక నెవరూ అందు కోలేరు. నౌక లెగ్‌హారన్‌దిశగా పరుగుతీస్తోంది.

## 22

డాంటే అక్రమవ్యాపారుల నౌకలో ఉన్నాడని గ్రహించడం కష్టంకాదు. నౌకపేరు జాన్ ఎమిలీ. కెప్టెన్ మొదట డాంటేపట్ల అనుమానంతో ఉన్నాడు. ఈ కెప్టెన్ సంగతి

తీరంలో కస్టమ్స్ అధికారులందరికీ తెలుసును. ఇతనికీ వారికీ మధ్య జరిగే ప్రచ్ఛన్న సంఘర్షణవల్ల, ఈ అక్రమవ్యాపారాన్ని కనిపెట్ట డానికి డాంటేనివారే పంపి ఉండవచ్చుననుకున్నాడు. ఇతని రహస్యాల్ని తెలుసుకోడానికి ఉప్పపన్ను అధికార్లు అన్నిరకాల తంత్రాలూ పన్నుతారు. కానిడాంటే అప్రమత్తతవల్లనూ, సహృదయతవల్లనూ కెప్టెన్‌కి క్రమంగా అనుమానం తొలగిపోయింది.

డాంటేకి కెప్టెన్ రహస్యాలన్నీ తెలుసును. కాని కెప్టెన్‌కి డాంటేచరిత్ర తెలియదు. కెప్టెన్ కాని, ఇతర నావికులు కాని, ఎన్ని విధాల అతన్నిగురించి తెలుసుకోవాలని ప్రయత్నించినా, డాంటే తన రహస్యాన్ని భద్రంగా దాచుకోగలిగాడు. ఈ రేవులన్నీ ఇదివరలో డాంటేకి కొట్టిన పిండి. అందువల్ల ఎంతసేపూ మాల్టాగురించి, నేపుల్స్‌గురించే కాని ఇతర విషయాలు మాట్లాడే వాడు కాడు. మొదట చెప్పిన కథను మరిచిపోకుండా నిలుపుకుంటూ వచ్చాడు. చివరికి నౌక లెగ్‌హారన్ చేరింది.

ఇప్పుడు డాంటేకి మరొక పరీక్ష ప్రారంభమయింది.పద్నాలు గేళ్ల క్రిందట చూసుకున్న ముఖాన్ని ఇప్పుడు అద్దంలో చూసుకుని గుర్తుపట్టగలడా? యువకుడుగా అతని ప్రతిబింబం అతనికి చక్కగా గుర్తే. పూర్ణవికాసం పొందిన పురుషుడై ఇప్పుడెలా ఉంటాడో అద్దంలో చూడాలి.

లెగ్‌హారన్ చేరగానే డాంటే ఒక క్షౌరశాలకు దారి తీశాడు. ఇతని జుట్టూ గడ్డమూ చూసి మంగలి నిర్ఘాంతపోయాడు. కాని మాట్లాడకుండా పనికి ఉపక్రమించాడు.

పూర్తయినతరవాత డాంటే గడ్డం తడుముకున్నాడు. అద్దం తెప్పించుకుని సవిమర్శగా చూశాడు. ఇఫ్‌కోటకి వెళ్లేముందు అతనిముఖం గుండ్రంగా ఉండేది. అమాయకత్వం, అకారణానందం ఆ ముఖంలో ఉట్టిపడేవి. జీవితంలో తొలిఘట్టాలు సులువుగా తేలిపోయాయి. భవిష్యత్తు కూడా అదేవిధంగా ఉంటుందనే భావంతో ఉండేవాడు. కాని ఇప్పుడంతా మారిపోయింది. ముఖం చిక్కిపొడుగ్గా కోలగా ఉన్నట్లు కనిపించింది. నవ్వుతున్న ముఖం లేదిప్పుడు. పెదవులు బిగిసి దృఢనిశ్చయాన్నీ,పట్టుదలనూ సూచిస్తున్నాయి. నుదురు ముడతలు పడుతోంది. కళ్లు గాఢవేదనను, విషా

దాన్ని దాచుకున్నట్లున్నాయి. అప్పుడప్పు డానుదుటిపైన రౌద్రరేఖలు, మానవజాతిపట్ల ద్వేషభావం ప్రకటించే కాళచ్ఛాయలు గోచరిస్తున్నాయి. ముఖం తెల్లగా పాలిపోయి ఉంది. నల్లని జుట్టూ, తెల్లని ముఖమూ ఒక అందాన్ని చేకూర్చుతున్నాయి.

డాంటె ఆర్జించిన విజ్ఞానం, విద్య అతని ముఖానికొక వికాసం, కాంతి ఇస్తున్నాయి. శరీరంలో కొత్త పటుత్వం పుట్టినట్లుంది. సన్నగా నాజూకుగా ఉండే చేతులు, కండలు తేరి గుండ్రనైనాయి. ప్రార్థనలు, ఆక్రందనలవల్ల కాబోలు అతని కంఠస్వరం పూర్తిగా మారిపోయింది. మధ్య మధ్య కర్కశమైన ధ్వని వినవచ్చినప్పటికీ, మార్దవ మొకటి అబ్బింది. అభ్యాసవశంవల్ల అతని కన్నులు చీకటిలోకూడ చూడగల తీక్ష్ణత, తోడేలు కన్నులలోని చురుకుదనం అపాదింప చేసుకున్నాయి.

ప్రతిబింబం చూసుకుని డాంటే చిరునవ్వు నవ్వుకున్నాడు. ఎంతటి ప్రాణమిత్రుడైనాసరే అతన్ని గుర్తుపట్టడం అసాధ్యం. అతని, అతనే గుర్తుపట లేకపోతున్నాడు.

డాంటేని తన నౌకలోనే ఉంచుకోవాలని కోరుకున్న కెప్టెన్, రాగల లాభంలో పాలుపరంగా కొంత ధనం ముందే ఇచ్చాడు. ఇప్పుడా ధనంతో, డాంటే తెల్లని పంట్లాము, చారల చొక్కా, టోపీ కొన్నాడు. కొత్త దుస్తులు ధరించి, జకోపో ఇచ్చిన దుస్తుల్ని చేత పట్టుకుని, జూన్ ఎమిలీ కెప్టెన్‌వద్దకు వెళ్లాడు. కెప్టెన్ డాంటేని మొదట గుర్తుపట్టలేదు. తరవాత యువకుని పోల్చి సంతోషంతో పొంగిపోయాడు. శాశ్వతంగా తన నౌకలో ఉద్యోగమిస్తానన్నాడు. కాని మూడు మాసాలపాటు మాత్రమే పని చెయ్యడానికి డాంటే ఒప్పుకున్నాడు.

జూన్ ఎమిలీ చురుగ్గా ప్రయాణం చెయ్యగలదు. కెప్టెన్ కాలాన్ని వ్యర్థపుచ్చడు. లెగ్‌హారన్‌లో ఆ నౌక వారం రోజులైనా ఉండలేదు. రంగురంగుల వస్త్రం, పొగాకు మొదలైన సరుకుతో ఓడ నింపి బయలుదేరాగు. పన్నులు వసూలుచేసే అధికారులకు తెలియకుండా సరుకు ఓడెక్కింది లెగ్‌హారన్‌నించి బయలు

దేరి కార్సికా వెళ్ళాలి. అక్కడనించి ఈ సరుకుని ఫ్రాన్స్ రవానా చెయ్యడానికి కొందరు వ్యాపారు లున్నారు. నౌక కార్సికా దిశగా పయనిస్తోంది.

మరునాడు కెప్టెన్ మామూలు వేళకి డెక్ మీదికి వచ్చాడు. డాంటే పైనుంజ నానుకుని దూరాన నీరెండలో మెరుస్తున్న నల్లని కొండను వింతగా పరిశీలిస్తున్నట్లు కెప్టెన్ చూశాడు. అది మాంట్ క్రిస్టో ద్వీపం. దాదాపు మైలుదూరంలో ఉంది. ఆ ద్వీపం దరి నుంచి నౌక ప్రయాణిస్తుంటేగా, సముద్రంలోకి దుమికినట్లయితే, అరగంటలో అక్కడికి చేరవచ్చునని డాంటేకి తోచింది. కాని తవ్వడానికి పరికరాలుగాని, ఆత్మరక్షణకు ఆయుధాలు కాని లేకుండా ఏం చెయ్యగలడు? నావికు లేమంటారు? కెప్టెన్ ఏమను కుంటాడు? అలా కాదు. కొన్నాళ్ళు నిరీక్షించాలి. నిరీక్షించటం డాంటేకి అనుభవమే. స్వేచ్ఛకోసం పధ్నాలుగేళ్లు నిరీక్షించాడు. ఇప్పుడు స్వేచ్ఛ లభించిన తరవాత, భాగ్యంకోసం ఆరుమాసాలూ, కాకపోతే ఏడాదీ నిరీక్షించగలడు.

రాత్రి పడుతోంది. క్రమక్రమంగా మారుతున్న సంధ్యా కాంతులలో మాంట్ క్రిస్టో ద్వీపాన్ని చూశాడు. డాంటే చూపులు చీకటిలోకూడా ఆద్వీపాన్ని చూడగలుగు తున్నాయి. రాత్రి అందరికంటె ఆఖరున డెక్ దిగివచ్చినవాడు డాంటే.

మరుచటి ఉదయం నౌక ఆల్జీరియాతీర సమీపంలో ఉంది. రోజంతా నౌకగమనం మార్చుకుంటూ వెళ్లింది. సాయంసమయ మయేసరికి, తీరంపైన ఒకచోట రెండు మంటలు కనిపించాయి. ఓడపై జండా తీసేసి, అక్కడ ఒక దీపం పెట్టి, మెల్లిగా తీరాన్ని సమీపించారు. తీరంనించి తుపాకిబారుదూరంలో ఓడ ఆగింది. నాలుగు చిన్నపడవలు ఓడవద్దకు చేరాయి. ఓడలో సరుకుతొట్టి ద్వారం తెరవబడింది. గప్‌చుప్‌గా పని జరిగిపో యింది. రెండు గంటలయేసరికి నౌకలోని సరుకంతా నాలుగు పడవల్లోకీ ఎక్కింది. పడవలు సరుకుని తీరం చేర్చాయి. తరవాత నౌక సార్డినియాద్వీపానికి ప్రయాణం చేసింది. అక్కడ మళ్లీ రహస్యంగా సరుకు వేసుకుంది. హవానా చుట్టలూ, ద్రాక్ష సారాయీ లగ్గా రాజ్యానికి తీసుకువెళ్ళాలి. అయితే ఉప్పుపన్ను

అధికారులతో తగవు పడకుండా పోలేదు. ఒకణ్ని కొట్టి డెక్ మీద పడేశారు. డాంటేకీ మరొక నావికునికీ గాయాలు తగి లాయి. డాంటేభుజాన్ని దూసుకుపోయిన తుపాకి గుండు గాయం చేసింది. డాంటే తన శౌర్యప్రదర్శనానికి పొంగిపోయాడు.

ప్రమాదాన్నీ, శారీరకబాధనీ ఎంత నిర్లక్ష్యంతో పరిగణించ గలడో ఇప్పుడతనికి తెలిసివచ్చింది. గాయపడిన పన్ను అధికారుల్ని చూసి అతనికి జాలికూడా కలగలేదు. దయాదాక్షిణ్యాలు అతనిలో అంతరించాయి. గుండె కరడుగట్టింది. కోరిన మార్గాన్ని డాంటే అనుసరించగలుగుతున్నాడు. వైరభావం అతన్ని మార్చి వేసింది. గాయపడి కింద పడిపోయిన డాంటేని చూసి భయపడి జకోపో పరు గెత్తుకువచ్చాడు. ప్రాణమిత్రునివలె డాంటేకి పరిచర్య చెయ్యనా రంభించాడు. కాని డాంటేకి తగిలిన గాయం అంత పెద్దది కాదు. సార్డినియాలో వృద్ధ స్త్రీలు అమ్మిన మూలికలు తెచ్చి చికిత్స చేశారు. గాయం త్వరలోనే నయమయింది.

ఈ ప్రయాణాలలో రెండున్నర మాసాలు గడిచింది. డాంటే నూరు స్పానిష్ డాలర్లు నిలవచేసుకున్నాడు. మాంట్ క్రిస్టోద్వీపం ప్రక్కగా అటూఇటూ ఇరవైసార్లు ప్రయాణంచేసి ఉంటాడు. కాని అక్కడ దిగడాని కెప్పుడూ అవకాశం లభించలేదు. చిట్ట చివరికి, నౌకలో మూడుమాసాల ఉద్యోగపు గడువు పూర్తికాగానే, స్వయంగా ఒకచిన్న పడవకొని, ఏదో ఒక మిషతో మాంట్ క్రిస్టోద్వీపం వెళ్లి పరిశోధించాలని నిశ్చయాని కొచ్చాడు. అనోన్యపాయాలవల్ల ఎలాగైనా ఆ ద్వీపంలో దిగాలని అనేకమార్లు అనేకమార్గాలు తలపోశాడు కాని ఏదీ సక్రమంగా కనిపించలేదు. ఇలా ఎటూ నిశ్చయం చేసుకోలేకుండా ఉన్న సమయంలో, ఒకరోజున కెప్టెన్ అతన్ని సాదరంగా పిలిచి, లెగ్‌హారన్‌లో ఒక హోటల్‌కి తీసుకువెళ్లాడు. డాంటేని ఎలాగైనా నౌకలో శాశ్వతంగా నియమించాలని కెప్టెన్ కోరిక. అక్రమ వ్యాపారం సాగించే వారందరూ చేరే ఈహోటల్లో ఒక ముఖ్యమైన విషయం చర్చించబడింది. టర్కీనుంచి తివాసీలు, కాశ్మీర్ శాలువలు, లెవాంట్ నుంచి కొంత సరకు వేసుకురావాలి. ఏ దేశపు ప్రభుత్వాధికారులకూ అందనిచోటు చూడా లిప్పుడు.

అటువంటి చోటైతే సరుకు మార్పిడికి అనుకూలంగా ఉంటుంది. అక్కడనించి సరుకుని స్వయంగా ఫ్రాన్సుతీరానికి తీసుకువెళ్ల వచ్చును. మాంట్ క్రిస్టో ద్వీపం ఇందుకు అనుకూలంగా ఉంటుందని జూక్ ఎమిలీ కెప్టెక్ అన్నాడు. అక్కడ జనసంచారం అసలు లేదు. అందువల్ల ప్రభుత్వాధికారులు కాని సిపాయిలు కాని ఎవరూ అక్కడికి రారు.

మాంట్ క్రిస్టో పేరు వినగానే డాంటేఆనందానికి మేర లేకపోయింది. పరవశుడైనాడు. అది తెలియనివ్వకుండా కప్పిపుచ్చు కోడానికి, లేచి అటూ ఇటూ పచారు చెయ్యడం మొదలుపెట్టాడు. హోటల్లో అనేకభాషల మాంఎలికాలు వినపడుతున్నాయి. డాంటే మళ్ళీ కెప్టెక్ దగ్గరకు చేరేసరికి, మరుచటిరాత్రే ప్రయాణం కట్టడానికీ, మాంట్ క్రిస్టో ద్వీపంలో దిగడానికీ నిర్ణయమయింది.

# 23

చిరకాలం క్లేశమనుభవించిన వారికి అకస్మాత్తుగా అదృష్టం అబ్బినట్లు, డాంటేకి చిరకాల వాంఛితమైన అవకాశం దానంతటదే, సహజంగా, సులువుగా లభించింది. ఎవ్వరికీ ఆవంత అనుమానం కలగకుండా ఇప్పుడా ద్వీపానికి వెళ్లగలుగుతున్నాడు. బయలుదేరడానికి ముందు ఒకరాత్రి ఇంకా గడవాలి. ఆరాత్రి డాంటే భావావేశం చెప్పతరంకాదు. కన్నులు ముయ్యగానే కార్డినల్ స్పాడా లేఖలోని అక్షరాలు గోడపై జ్వాలా లేఖినితో లిఖించినట్లు డాంటేకి మనోగోచరమైనాయి. కునుకుపట్టితే స్వప్నాలు ముసురుకువచ్చి, మనస్సు కల్లోలిత మౌతోంది. గుహలలో రత్నాలు పరిచిన నేలపై నడుస్తున్నట్లు, కెంపులు, పచ్చలు, వజ్రాలు తాపిన గోడలను చూస్తున్నట్లు కలలు కంటున్నాడు. వర్షపు నీటిబింధువుల వలె ముత్యాలు రాలుతున్నట్లు కనిపిస్తోంది. దిగ్భ్రమ చెంది, పరవశుడై జేబులన్నీ అమూల్యమైన వజ్రాలతోనూ, రత్నాలతోనూ నింపుకుంటున్నట్లు కలగన్నాడు. పగటి వెలుగులో చూసే సరికి అవన్నీ గులకరాళ్లుగా మారినాయి. తిరిగి ఆ అద్భుతమైన గుహల్ని ప్రవేశించడానికి ప్రయత్నించాడు. కాని ఈమారు

దారి వంకరటింకరగా తిరిగి అయోమయమైపోయింది. బైటపడే దారి కూడా కనపడలేదు. అలీబాబా కథలో గుహద్వారాన్ని తెరవడానికి ఏమంత్రం పలికాడో దానిని జ్ఞప్తికి తెచ్చుకోడానికి ప్రయత్నించాడు. కాని అంతా నిరర్థకమయింది. అంతర్థానమైన అమూల్యవస్తు నిక్షేపం మళ్ళీ రక్షిస్తున్న భూతం వశమయింది కాబోలు. క్షణకాలంపాటు కనపడి దిగ్భ్రమ కలిగించిన ఆ భాగ్యరాసిని దొంగిలించాలన్న ఆశ అంతరించింది.

మరునాడు ఉదయం మేలుకునే సరికి డాంటే మెదడు కుత కుత ఉడుకుతున్నట్లుంది. భ్రమాపరి కల్పనలో అల్లలాడిన డాంటే క్రమంగా తెలివిలో పడ్డాడు. కొంతకాలంగా ఊగులాడుతున్న ఒక ఉపాయాన్ని ఇప్పుడు నిర్వర్తించాలని నిశ్చయించుకున్నాడు. పగలంతా క్రమంగా గడిచింది. చీకటిపడిన తరవాత ప్రయాణ సన్నాహాలు జరుగుతున్నాయి. ఈ సందడిలో డాంటే తన ఉద్రేకాన్ని పైకి కనపడనియ్యలేదు. క్రమక్రమంగా నావికులపైన పెత్తనం సంపాదించాడు. హద్దుమీరని అతని ఆజ్ఞల్ని నావికులు సంతోషంతో వెంటనే నిర్వర్తిస్తున్నారు.

ఏడుగంటలకి అంతా సిద్ధమయింది. మరి పదినిమిషాలలో, దీపస్తంభం ఇంక వెలిగించబడుతుందనగా, అప్పుడే ఓడ దాటింది. సముద్రం ప్రశాంతంగా ఉంది. ఆగ్నేయ దిశనుండి శుభ్రవాయువులు వీస్తున్నాయి. డాంటే చుక్కాని పుచ్చుకుని, అందరూ నిద్రపోవచ్చునని చెప్పాడు. డాంటే చుక్కాని పుచ్చుకున్నాడంటే అందరికీ తృప్తికలిగింది. అందరూ పడకలు చేరారు. కారాగారంలో ఏకాంతవాసంనుంచి బైటపడి నలుగురిలోనూ మసులుతున్న డాంటే, ఇప్పుడు తరుచు ఏకాంతంగా ఉండాలని కోరుకుంటున్నాడు. ఈమారు ఈ ఏకాంతంలో అతన్ని అనేక ఆలోచనలు ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. అంధకారనిశీధి అతని భావపరికల్పనతో జాజ్వల్యమానమయింది. మాటిమాటికీ అత డుచ్చరిస్తున్న ప్రతిజ్ఞా వాక్కులు నిశ్శబ్దతను భంగపరుస్తున్నాయి. తెరచాపలన్నీ ఎత్తిఉన్నాయి. నౌక అతి వేగంగా అధిగమిస్తోంది.

చిట్టచివరికి ఆకాశంలో ఒకమూల మాంట్ క్రిస్టో ద్వీపం ప్రత్యక్షమయింది. డాంటే చుక్కానిని ఒక నావికుని కిచ్చి,

లోనికి వెళ్లి శరీరాన్ని పడకపై చేర్చాడు. రాత్రి నిద్రలేకపోయి నప్పటికీ, డాంటీకి ఇప్పుడూ నిద్రపట్టడం లేదు.

తిరిగి రెండుగంటల్లో డాంటీ డెక్ మీదికి వెళ్లాడు. నౌక ఎల్బా ద్వీపాన్ని దాటుతోంది. వెనుక నీలి ఆకాశంవల్ల, మాంట్ క్రిస్టో పర్వతశిఖరం స్పష్టంగా కనపడుతోంది. క్రమంగా ద్వీపం చేరువౌతోంది. ఓడను సూటిగా ద్వీపం దిక్కుగా తిప్పినడిపాడు డాంటీ.

సాయంకాలం అయిదుగంటలవేళకి ద్వీపం సమీపించింది. డాంటీ ద్వీపంపై కొండల్ని కొంకుతో పరిశీలిస్తున్నాడు. సంధ్యా కాంతులతోపాటు కొండలు కూడా ఎర్రని ఎరుపునించి నీలి వర్ణానికి మారుతున్నాయి.

రాత్రి పడింది. పదిగంటలకి నౌక తీరం సమీపించింది. డాంటీ ఆత్మనిగ్రహం ఇంక సడలిపోయింది. అందరికంటేముందుగా తీరంపైకి దుమికాడు. ఇతరు లున్నారనే భయమే లేక పోతే, అతడు నేలను ముద్దుపెట్టుకునేవాడే.

పదకొండు గంటలకి చంద్రు డుదయించాడు. పండు వెన్నెల కొండ లన్నిటినీ ముంచెత్తుతోంది. సముద్ర కెరటాలు వెండినురుగులు కక్కుతున్నాయి.

ఈ ద్వీపం జాన్ ఎమిలీ నావికులకు పరిచితమైనదే. ఇక్కడ తరుచు మజిలీ చేసేవారు. డాంటీ తన ప్రయా ణాలలో ఈ ద్వీపాన్ని తరుచు చూసేవాడు. కాని ఎన్నడూ ఇక్కడ దిగలేదు. ఇదే అతనికి మొదటిసారి. జకోపోని పిలిచి డాంటీ అడిగాడు: "ఈ రాత్రి ఎక్కడ గడుపుదాం?"

"నౌకలోనే. ఇం కెక్కడ?"

"గుహల్లో పడుకోకూడదూ?"

"ఇక్కడ గుహ లేవీ ఉన్నట్టు తెలియదే!" అన్నాడు జకోపో.

డాంటీ నిరుత్తరుడైనాడు. తరవాత బహుశా ఏ ప్రమాదం వల్లనో గుహలు కప్పబడిపోయుండాలని తలపోశాడు. లేదా క్షేమ మని భావించి కార్డినాల్ స్పాడా పూడ్చిఉండాలనుకున్నాడు. ఏమయితేనేం? రాత్రివేళ వెతకడం నిరర్థకం. ఉదయం వెతకా

లనుకున్నాడు డాంటే. ఇంతలోనే మైలున్నరదూరంలో ఒకదీపం కనపడింది. అది సంజ్ఞఇవ్వగానే ఇంక పనికి ఉపక్రమించవలసి ఉంటుందని తెలుసుకున్నాడు. జూన్‌ఎమిలీ ప్రతిసంజ్ఞచేసింది. మరొక నౌకవచ్చి పగ్గం వేసే దూరంలో లంగరు వేసింది. చీకటిలో వ్యాపారం చకచకా జరిగిపోయింది.

మరునాడు ఉదయం డాంటే తుపాకి చేత తీసుకుని, తుపాకిమందు, గుళ్లు భద్రపరుచుకుని వేటకి బయలుదేరాడు. గుట్టల మీద దుమికి పరుగులెత్తుతున్న కొండమేకల్ని వేటాడాలని కోరికున్నట్లు మిత్రులికి చెప్పాడు. ఒంటరితనాన్ని అపేక్షించి డాంటే వెడుతున్నాడని వారనుకున్నారు. జకోపో ఒక్కడే కూడా వస్తానని పట్టుబట్టాడు. డాంటే వద్దన్నా వినలేదు. వద్దని మరీ బలవంతం చేసినట్లయితే అతనికి అనుమానం కలగవచ్చుననే భీతివల్ల డాంటే వారించలేకపోయాడు. కొండమేకను చంపడానికి చాలదూరం వెళ్లవలసి వచ్చింది. ఒక మేకని చంపగానేదాన్ని జాకోపోకి ఒప్పగించి మిత్రులవద్దకు తీసుకువెళ్లి వండించమని డాంటే చెప్పాడు. వంట పూర్తికాగానే తుపాకి పేల్చినట్లయితే, ఆసంజ్ఞ అందుకుని రాగలనని చెప్పిపంపాడు.

డాంటే మాటిమాటికీ వెనక్కి తిరిగిచూస్తూ ముందుకి సాగిపోయాడు. ఒక కొండ శిఖరం ఎక్కి కిందికి చూశాడు. అనెయ్యి డుగులకింద, దూరంలో వంటచేస్తున్న జకోపో, అతని మిత్రులూ కనపడ్డారు. వారందరికంటె తానధికుడన్న భావంతో చిరునవ్వు నవ్వుకున్నాడు.

“రెండు గంటలలో ఏభై స్పానిష్‌డాలర్లు సంపాదించి అందరూ మళ్ళీ బయలుదేరతారు.” అనుకున్నాడు డాంటే. “ఇంకొక ఏభై సంపాదించడానికి ప్రాణాపాయాన్ని కూడా లక్ష్యపెట్టరు. ప్రాణాలకు వెరవక సంపాదించిన ఈ ధనాన్ని నవాబుల మాదిరిగా వెదజల్లుతారు. ఈ రోజున నా ఆశలతో పోల్చి వారి భాగ్యాన్ని అల్పంగా పరిగణిస్తున్నాను. వారి ఈ ధనం దారిద్ర్యంకింద లెక్కగట్టుతున్నాను. రేపటికి నా యీ ఆశ అంతరించవచ్చును. వారి దారిద్ర్యమే మహాభాగ్యమని భావించవలసినగతి పట్టవచ్చును. కాని అదెలాగ? అన్నిటా నూత్న

బుద్ధి, మేధా సంపన్నుడైన ఫెరయా ఈ ఒక్క విషయంలోనూ మోసపోలేదు కదా! అదీగాక ఈ నికృష్ట జీవనం గడిపేకంటే మరణించడం మేలు."

మూడు మాసాల క్రిందట స్వేచ్ఛ లభిస్తే చాలునని వాపోయిన డాంటే, ఇప్పుడు స్వేచ్ఛతో తృప్తి చెందలేకపోతున్నాడు. భాగ్య సంపదలకోసం పరితపిస్తున్నాడు. కాని దోషం అతనిదికాదు. భగవంతుడే మానవునికి పరిమితశక్తి నిచ్చికూడా, అంతులేని ఆశల్ని పురిగొల్పాడు.

తరవాత రెండు కొండల మధ్య నుండి, పైకి కనిపించని ఒక మార్గాన్ని అనుసరించి డాంటే నడిచాడు. ఏ సెల యేటివల్లనో ఏర్పడిన ఈ మార్గం, ఇంతవరకూ మానవు డెవడూ అడుగుపెట్ట లేదన్నట్లుంది. నిజంగా ఉన్న ఆ గుహలకి ఇదే దారితీస్తుందని డాంటే భావించాడు.

ప్రతి చిన్న వస్తువునీ అతి శ్రద్ధతో పరిశీలిస్తూ వెడుతున్న డాంటేకి, కొండలపై దూరాన కొన్ని గుర్తులు కనిపించాయి. అవి ఎవరో లోతుగాగీసిన గీతలవలె ఉన్నాయి. కాలం ఆ గుర్తుల్ని చెరిపివెయ్యలేకపోయింది. అవి ఒక క్రమాన్ని అనురించిఉన్నట్లు, ఒకదారిని చూపుతున్నట్లు కూడా డాంటేకి తోచింది. అక్కడక్కడ పొదలమాటున అవి మాయమయేవి. పొదలు తొల గించి రాళ్ళపై పట్టిన నాచు గీసివేసి గుర్తులకోసం వెతికాడు. ఈ గుర్తు లతనిలో ఆశను రేకెత్తించాయి. ఇవి కార్డినల్ స్పాడా తన అన్నకుమారునికోసం పెట్టిన గుర్తులు కాకూడదా, అని డాంటే అనుకున్నాడు. ఘన నిక్షేపాన్ని దాచాలనుకుంటే, ఈ ఏకాంత మైన స్థలం తప్పకుండా అనుకూలమైనదే.

తీరందిగినచోటికి దాదాపు అరవైఅడుగుల దూరంలో గుర్తులు ఆఖరైనట్లు కనిపించింది. ఆచోటు మిట్టగా ఉన్నందువల్ల అతను మిత్రులకు కనిపించడు. కాని ఈగుర్తు ఏ గుహదగ్గరికీ తీసుకు పోలేదు. గుర్తుల దారినే వెళ్లి ఒక గుండ్రని రాతివద్దకు చేరాడు. తీరా దారికి చివరకొసచేరే బదులు మొదటికి వచ్చినట్లు డాంటే అనుమా నించాడు.

ఈ వ్యవధిలో అతని మిత్రులు, చిన్న సెలయేటినుంచి నీరు తీసుకువచ్చారు. ఓడలోనుంచి రొట్టి, ఫలాలు తీసుకువచ్చారు. కొండమేకను వండి, నిప్పులపైనుంచి తీస్తున్న సమయంలో వారికి దూరంలో రాళ్లపై గంతులువేస్తూ వస్తున్న డాంటే కనపడ్డాడు. జకోపోవంటయిందని తెలపడానికి తుపాకి పేల్చాడు. డాంటే ఇదివిని మిత్రులవద్దకు పరుగుతీశాడు. గుట్టలు దిగి దూకుతూ వస్తున్న యువకుని నావికులు చూస్తున్నంతలో, అతనికి కాలుజారింది. ఒక గుట్టమీదపడి, కేక పెట్టి డాంటే మాయమైనాడు.

అందరూ ఒక్క ఉదుటునలేచి దూసుకుని పరుగెత్తారు. డాంటే అంటే వారందరికీ ప్రీతి.

ముందుగా జకోపో యువకుని సమీపించాడు. స్పృహతప్పి నెత్తుటిలో పడిఉన్నాడు డాంటే. పన్నెండు పదమూడడుగుల ఎత్తునుంచి పడిఉంటా డనుకున్నారు. డాంటే నోరుతెరిచి, కొద్దిగా సారాయి పోశారు. డాంటే కన్నులు తెరిచాడు. మోకాలు, వెన్ను తీవ్రంగా నొప్పిపెడుతున్నాయని చెప్పాడు. తల దిమ్ముగా ఉంది. మిత్రులతన్ని తీరంవద్దకు మోసుకు వెళ్లాలనుకున్నారు. లేవతియ్యడానికి జకోపో అతన్ని ముట్టుకున్నంతలోనే బాధ అధికమయింది. ఏపాటి కదిపినా సహించలేనిస్థితిలో ఉన్నట్లు డాంటే చెప్పాడు.

ఇంక ఇప్పు డాహారం తీసుకునే ఆశ డాంటేకి లేదు. మిత్రుల్ని విందు మానవద్దని పట్టుబట్టాడు. తనకి విశ్రాంతినిస్తే చాలునన్నాడు. తిరిగివారు వచ్చేసరికి నొప్పి తగ్గవచ్చును. నావికుల్ని ఆట్టే బలవంతపెట్ట నవసరం లేకపోయింది. వారికి అమితమైన ఆకలి వేస్తోంది. గంటసేపటిలో విందు ముగించుకుని వచ్చారు.

ఒక రాతిపైన ఆనుకోడానికి రెండు గజాలు దేకాడు డాంటే. నొప్పి అంతకంతకు అధికమౌతున్నట్లుంది. సరుకు తీసుకువెళ్లి ఫ్రాన్స్‌లో ఒప్పగించకతప్పదు. డాంటే ఎలాగైనా సరే లేచిరావాలని కెప్టెన్ పట్టుబట్టాడు.

డాంటీ శక్తినంతా వినియోగించి లేవడానికి ప్రయత్నించాడు. కాని క్రిందపడిపోయాడు. ముఖం పాలిపోయింది. మూలుగు ఎక్కువయింది.

"నన్నుకి దెబ్బ తగిలింది" అన్నాడు కప్టెన్ మెల్లిగా పక్కవారితో. "అయితేం! పాపం మంచివాడు. మనం ఇతన్ని విడిచి పెట్టెయ్యకూడదు. ఓడ దగ్గిరికి మోసుకు వెడదాం."

కదిపితే కలుగుతున్న బాధ భరించేకంటె, అక్కడే చచ్చిపోవడం మేలని డాంటీ అన్నాడు.

"ఏమయినా సరే, నీవంటి ధైర్యశాలి అయిన మిత్రుణ్ని ఆపదలో విడిచి వెళ్లిపోయామనే మాట మాకు రాకూడదు. ఇవాళ సాయంకాలం బయలుదేరనే వద్దు:" అన్నాడు కప్టెన్.

డాంటీ ఒప్పుకోలేదు. "తప్పు నాది. దానికి ఫలితం నేననుభవించవలసిందే. నాకు కొన్ని బిస్కట్లు, ఒక తుపాకి, గుళ్ళు, మందు, ఒక పలుగు, కత్తి, ఉంచి వెళ్లిపొండి. మేకల్ని కొట్టుకోడానికీ, ఆత్మరక్షణకీ తుపాకి అవసరం. మీరు మళ్లీ రావడానికి చాలా రోజులు పట్టవచ్చు. ఆవాసం ఏర్పాటుచేసుకోడానికి పలుగు, కత్తి అవసరం."

"నువ్వు ఆకలితో చచ్చిపోతావు" అన్నాడు కప్టెన్.

"కదల్చినట్లయితే పడే బాధకంటె అలా చచ్చిపోవడమే మంచిది. ఒకటి రెండు రోజుల్లో, మీదారిలో ఈ ప్రాంతాలకి వచ్చే పడవేదైనా కనబడితే, ఇక్కడికి వచ్చి నన్ను తీసుకువెళ్ళమని చెప్పండి. నన్ను లెగ్‌హారన్ తీసుకువెళ్లడానికి పాతిక స్పానిష్ డాలర్లు చెల్లిస్తాను."

కప్టెన్‌కి ఇది నచ్చలేదు. తల అడ్డంగా తిప్పాడు.

జకోపో అందుకున్నాడు: "నేనొక ఉపాయం చెప్తాను. నేనితనిదగ్గిరుండి కాపాడతాను."

"నాకోసం లాభాలలో నీ భాగాన్ని వొదులుకుంటావా?" అన్నాడు డాంటీ.

"ఫరవాలేదు. నాకు ఆ చింత లేదు."

"నా మాట విను జకోపో" అన్నాడు డాంటే. "నీ దాక్షిణ్యానికి భగవంతుడు నిన్ను దయతో చూస్తాడులే. నా కెవ్వరి సహాయం అక్కరలేదు. ఒకటి రెండు రోజులు విశ్రాంతి తీసుకున్నట్లయితే కుదిరిపోతుంది. ఈ కొండల్లోనే మంచి మూలికలు దొరుకుతాయి. వెతికి తీసి చికిత్స చేసుకుంటాను."

డాంటే ముఖంలో ఒక వింత చిరునవ్వు కనపడింది. జకోపో చేతిని ఆప్యాయంగా పట్టుకున్నాడు. కాని ఒక్కడే ఉండిపోవాలని పట్టుదల విడిచిపెట్టలేదు. అవసరమైన సామాను అంతా ఇచ్చి, అందరూ వెళ్ళిపోయారు.

అందరూ కనుమరుగైన తరవాత డాంటే తనలోతాను నవ్వుకున్నాడు. "ఎంత చిత్రంగా ఉంది! ఇటువంటి అక్రమ వ్యాపారులుకూడా స్నేహానికీ, ప్రీతికీ కట్టుబడి ఉండడం ఎంత చిత్రం!"

ఒక గుట్ట అంచుకి దేకివెళ్లాడు డాంటే. అక్కడనించి అతను నావికులికి కనపడడు. ఓడ అతనికి కనపడుతోంది. ఓడ లంగరు ఎత్తి మెల్లిగా బయలుదేరింది. క్రమంగా గంటసేపటిలో ఓడ కంటికి కనిపించనంత దూరం వెళ్లిపోయింది.

డాంటే లేచాడు. తుపాకి, పలుగు, కత్తి చేత పుచ్చుకున్నాడు. కొండమేకలకంటె చురుగ్గా గుట్టలపై దుముకుతూ వెళ్లాడు. గుర్తులు మాయమైనచోట ఆ రాతివద్దకు వెళ్ళాడు.

"అమ్మయ్య" అనుకున్నాడు డాంటే. ఫేరయా చెప్పిన ఆలీబాబా కథ అతనికి జ్ఞప్తికి వచ్చింది.

# 24

సూర్యుడు ఉదయిస్తున్నాడు. గడ్డి పురుగులు సన్నని రొద చేస్తున్నాయి. చెట్ల ఆకులు మెల్లిగా కదలాడుతున్నాయి. డాంటే వేస్తున్న ప్రతి అడుక్కీ బల్లులో, పురుగులో చెదిరి పరుగులు తీస్తున్నాయి. కొండమేకలు గుట్టలమీద కెగబడి పారిపోతున్నాయి. ద్వీపమంతా మేలుకొంది. చైతన్యం ఉబుకుతోంది. అయినా, ఏకాకినైనట్లు, భగవంతుడు తప్ప మరొక తోడులేనట్లు డాంటేకి అనుభవమౌతోంది. ఏదో తెలియరాని

భీతి అతన్ని ఆవహించింది. ఎడారిలోకూడా వెయ్యికన్నులై పరికిస్తున్నట్లుండే . పగటివెలుగును భరించలేకుండా ఉన్నాడు. ఈ ఆవేగం అతన్ని వివశుని చేసింది. పని ప్రారంభించబోతూ ఆగిపోయాడు. పలుగు కిందపడేశాడుతుపాకి పట్టుకుని, ద్వీపంలో కెల్ల ఎత్తైన కొండ ఎక్కి, చుట్టూచూశాడు. దూరాన నౌక, చుక్కవలె కనిపిస్తోంది.

డాంటీకి విశ్వాసం చిక్కింది. సమీప ప్రాంతాన్ని ఒకసారి పరికించాడు. బ్రహ్మాండమైన పీఠంపైన నిలబడిఉన్నాడు డాంటీ. దగ్గరలో ఒక్క ప్రాణికూడా లేదు. కొండల చరియలపై విరుచుకుపడి వెండినురుగులు కక్కుతున్న కెరటాల నీలిసముద్రం తప్ప ఇంకేమీ కనపడలేదు. చివరికి డాంటీ గబగబా కొండ దిగాడు. కాని నటించిన ప్రమాదం నిజమౌతుందనే భయంతో జాగ్రత్తగా గుట్టలు దిగాడు. ఈ మాటు ఆ గుర్తుల్ని వెనక్కి చూసుకుంటూ వెళ్లాడు. సముద్రంలోనికి చొచ్చుకుని సన్నని పాయగా ఏర్పడిన ఒక చోటుకి ఆ గుర్తులు దారితీశాయి. ఈ సముద్రపుపాయ అట్టే వెడల్పుగా లేదు. ఒక చిన్న బోటురావడానికి మాత్రం వీలుగాఉంది. సముద్రంనుంచి కనిపించకుండా చాటుగా కూడా ఉంది. ఫెరయా నేర్పిన పరిశోధనా చాతుర్యంవల్ల డాంటీ సంభవాలు, అసంభవాలు అన్నీ ఆలోచించి, తూచి నిర్ధారించడం మొదలుపెట్టాడు. కార్డినల్ స్పాడా, ఎవరి కంటనూ పడకూడదని జాగ్రత్తపడి, ఇక్కడ ఈ పాయలోకి వచ్చి దిగి, బోటు దాచి, ఈమార్గాన్ని అనుసరించివెళ్లి, ధనాన్ని దాచిఉంటాడని డాంటీ భావించాడు. ఇప్పు డీ భావం తోచినందువల్ల అతను తిరిగి ఆ గుర్తులవెంట ఆ గుండ్రని రాతివద్దకు వెళ్ళాడు. ఒక్కటే దీనిలో చిక్కు వస్తోంది. అనేక టన్నుల బరువుండే ఈ రాతిని, తగినంత బలం, బలగం లేకుండా స్పాడా ఎలా కదిల్చిఉండగలడు?

డాంటీ మనస్సులో ఒక ఆలోచన తటుక్కున మెరిసింది. "ఈ రాతిని పైకి తియ్యడానికి బదులు, లోపలికి గెంటాలేమో!" అమాంతంగా రాతినెక్కి, అది దేని పైన నిలిచిఉందో చూశాడు. పక్కనే వాలు కనపడింది. అంటే ఈ రాతిని మెల్లిగా ఈ కొద్దిమేరా దొర్లించి ఉండాలి అనుకున్నాడు. ఈ

రాతికింద మరొక రాయి పెట్టి, ఎత్తి, దొర్లించి ఉండాలి. చుట్టూ పడిన నెరదల్ని కప్పిపుచ్చడానికి, రాళ్లు, మట్టి పోసి ఉండాలి. వాటిపైన ఈపాటికి గడ్డి మొలిచి ఉంటుంది. అక్కడ కొంత మన్ను తీసి చూచాడు. ఇప్పుడాలోచించినదంతా నిజంగా జరిగి ఉంటుం దనుకున్నాడు. పలుగెత్తి రాతికింద రాతిని బద్దలుగొట్టడం ప్రారంభించాడు. పది నిమిషాలలో రాయి కొంచెం ఎడమిచ్చింది. చెయ్యి దూర్చగలిగినంత ఎడం ఏర్పడింది. తరవాతి దగ్గరలో కనిపించిన వృక్షాన్ని ఒక కొమ్మకొట్టి తెచ్చాడు. ఆకులూ, రెమ్మలూ దూసి వేశాడు. దానిని రాతికింద ఏర్పటిన రంధ్రంలోకి చొనిపి రాతిని కదిలించడానికి ప్రయత్నించాడు. కాని రాయి బరువుగా ఉంది. కింది రాతిలో కూరుకుపోయి ఉన్నందువల్ల కదల్చడానికి అలవికాలేదు. ఇంక కింది రాతినే బద్దలు కొట్టక తప్పదని తేలింది. కాని అదెలాగ? అటూ ఇటూ చూశాడు. జకోపో తుపాకిమందు దట్టించి ఇచ్చిన కొమ్ము కనపడింది. డాంటే నవ్వుకున్నాడు. మారణ హోమంకోసం కనిపెట్టబడిన ఈ మందు తన కిప్పుడుపకరించాలి. పలుగు తీసుకుని పై రాతికీ కిందిరాతికీ మధ్య చిన్న గొయ్యి తవ్వాడు. మానవుల కాయ కష్టాన్ని తగ్గించడానికి దేశదేశాలా ఈ ఉపాయం అనుసరించబడుతోంది. గోతిలో మందు దట్టించాడు. చేరుమాలు చించి, పెట్లుప్పులో ముంచి, ఒక చివర నిప్పుముట్టించి పెట్టి, దూరానికి వెళ్లి నిలబడ్డాడు. మందు అంటుకోడానికి ఆట్టేసేపు పట్టలేదు. అంటుకుని పెద్దపెట్టున పేలింది. పైరాయి బ్రహ్మాండమైన శబ్దంచేస్తూ కదిలిపోయింది. కిందిరాయి ముక్కముక్కలై పోయింది. అక్కడనుంచి రకరకాలు పురుగులు పిలపిలమంటూ బైటపడి నలుదిక్కులకూ పారిపోయాయి. ఒక పెద్దసర్పం తలెత్తిచూసి వెళ్లిపోయింది. ఇప్పుడాధారంలేక పెద్దరాయి సముద్రంవంక వొరిగింది. పట్టువిడువక, యువకుడు పరిశీలించాడు. ఆధారం ఎక్కడ బలహీనంగా ఉందో పరిశోధించాడు. అక్కడ కొమ్మ చొనిపి బలంగా ఎత్తాడు. ప్రేలుడువల్ల స్థానభ్రష్టంచెందిన రాయి కదిలింది. డాంటే మరింత బలంగా కొమ్మతో కదిపాడు. చివరికి రాయికదిలి దొర్లిపోయింది. దొర్లి సముద్రజలంలో పెద్దపెట్టునధ్వని చేస్తూపడిపోయింది. ఇప్పుడు అక్కడ గుండ్రని మార్గం ఏర్పడింది. మధ్య ఇనుపవంకీ

తగిలించిన చతుర్భుజాకారపు శిల ఒకటి కనపడింది. డాంటే సంతోషం పట్టలేక వెర్రికేక పెట్టాడు. తొలి ప్రయత్నంలోనే ఈ రీతిగా అద్భుత ఫలితాలు కలిగిన దక్కడా లేదు. డాంటే ఆనందాతిరేకంతో కంపించిపోయాడు. గుండె గబగబ కొట్టుకుంది. కన్నులు చిరతలు కమ్మాయి. క్షణకాలం అలా ఉండిపోయాడు.

డాంటే వెంటనే తేరుకున్నాడు. కొమ్మను ఇనుప వంకీలో దూర్చి పలకరాతి నెత్తడానికి ప్రయత్నించాడు. అది మెల్లిగా కదిలివచ్చింది. అది తియ్యగానే వాలునమెట్లు కనపడ్డాయి. మెట్లు దిగి డాంటే ఒక గుహ ప్రవేశించాడు. గుహలో కొంత మేర దిగిన తరవాత ఇంక అక్కడ అంధకారంలో కంటి కేమీ కనపడలేదు. ఈ స్థితిలో మరొకరుంటే, ఆనందంతో ఉప్పొంగుతూ ముందుకు వెళ్లిపోవలసిందే. కాని డాంటే నిలిచిపోయాడు. అతని ముఖం పాలిపోయింది. గట్టిసందేహం కలిగింది.

"ఇది తగదు. నేను పురుషుణ్ణి. ధైర్యం చిక్కబట్టుకోవాలి" అనుకున్నాడు తనలో. "నిత్యం ప్రతికూల పరిస్థితులికి అలవాటు పడిన నేను, మోసానికి లోబడకూడదు. లేదా, పడిన శ్రమంతా వృధా కాకమానదు. ఆశతో ఆకాశసౌధాలు కట్టిన మనిషి క్రూర వాస్తవికతను తెలుసుకుని గుండె బ్రద్దలు చేసుకోవలసి వస్తుంది. ఇదంతా కేవలం ఫెరయా భ్రమమాత్రమే. కార్డినల్ స్పాడా ఈ గుహల్లో ఏమీ దాచిపెట్టలేదేమో! అసలిక్కడికి రానే లేదేమో. వచ్చినా, అసాధారణ సాహసంకల సీజర్ బార్గియా ఇక్కడికి వచ్చి మార్గం కనిపెట్టి ఆరాతి నెత్తించివచ్చి సంపద కొల్లగొట్టి ఉంటాడు."

యోచిస్తూ డాంటే కదలకుండా నిలబడిపోయాడు. చీకటిలో అతని చూపు కేంద్రీకరించి ఉంది. మళ్ళీ ఇలా అనుకున్నాడు: "ఇటలీదేశం అరిటిపండు వంటిదని చెప్పిన సీజర్ బార్గియా, తన కాలాన్ని వ్యర్థపుచ్చి మళ్ళీ ఈ పెద్దరాతినెత్తి గుహద్వారాన్ని మూసివేసేటంతటి అవివేకి కాడు. కిందికే వెడతాను."

మానవుని వేదాంతంలో తుది ఆధారమైన "కావచ్చు" అనే పదం పలికి డాంటే,శంకాన్వితమైన వక్రహాసంతో కిందికి దిగాడు.

అంధకార బంధురమై ఊపిరాడకుండా ఉంటుం దనుకున్న గుహలో చిత్రమైన నీలికాంతులు కనిపిస్తున్నాయి. పై మార్గంలో నుంచే కాక, చుట్టూ రాళ్లలో చెక్కబడిన రంధ్రాలలోనుంచి వెలుగు, గాలి వ్యాపిస్తున్నాయి. ఆ రంధ్రాలు బైటినుంచి చూస్తే కనపడవు.

తేమతో దుర్భరంగా ఉండవలసిన గుహలో వెచ్చగాఉంది. లోపల చక్కని పరిమళం వ్యాపించిఉంది. డాంటే కొన్ని క్షణాలు నిలబడి గుహ చివరికొసవరకూ చూశాడు. కఠినమైన నల్లని రాతిగోడ లలో అంచులు తేరి నునుపైనచోట, వజ్రాలు మెరుస్తున్నట్లుకన పడింది.

కంఠస్థమైన మరణశాసనంలోని వాక్యాలు డాంటేకి జ్ఞప్తికి వచ్చాయి: "రెండోద్వారం దాటివెళ్లిన తరువాత చివరమూల" ఇప్పటి కింకా అతను మొదటి గుహలోనే ఉన్నాడు. రెండో గుహ ద్వారం ఎక్కడుందో ఇంకా కనిపెట్టాలి. అంతటా కలయ చూశాడు. రెండో గుహ, ద్వీపంలో మధ్యకి వ్యాపించిఉండా లనుకున్నాడు. రాతి గోడల్ని పరీక్షించాడు. భద్రతకోసం గోడల్లో ఎక్కడో ద్వారం గుప్తంగా నిర్మించబడి ఉంటుందనుకున్నాడు. ఒక గోడపైనమోగించిచూశాడు.పలుగుదెబ్బకు ప్రతిధ్వని వచ్చింది.కాని అది ఓటి మోత కాదు. బరువుగా, సగం చచ్చివచ్చింది. డాంటే నుదుట చెమట ధారలు కట్టింది. అంతటా మోగించి చూశాడు. చివరి కొకచోట ప్రతిధ్వని వాయుకెరటాలమీద వచ్చినట్లు తోచింది. అక్కడ అతి జాగ్రత్తగా పరిశీలించాడు. ఇక్కడే ఎక్కడోమార్గం ఉంటుం దనుకున్నాడు. అయితే తన శ్రమ వృథా కారాదని భావించి, తుపాకి మొదలుతో గోడల్నీ నేలనీ తాటిం చాడు. అనుమానం తగిలిన చోటెల్ల మన్ను తీసి చూశాడు. కాని ఎక్కడా అవకాశం కనిపించలేదు. తిరిగి మొదట ఓటిదెబ్బ తగిలిన గోడదగ్గిరికి వచ్చాడు. ఈమారు మరింత గట్టిగా కొట్టాడు. ఇక్క డొక చిత్రం జరిగింది. సున్నపుగోడ బెల్లులు రాలినట్లు మెత్తని మన్ను రాల నారంభించింది. రాలిన మన్ను వెనుక మెత్తని తెచి రాయి కనపడింది. అక్కడ డాంటే పలుగుతో పొడిచాడు. అంగుళం లోతు దిగింది. తవ్వవలసిన చోటు ఇదే నని తేలింది.

కాని మానవస్వభావం విచిత్రమైనది. ఫెరయా కథనం సత్యమని నిరూపించే తార్కాణాలు కనపడుతున్నకొద్దీ, డాంటీ విశ్వాసం మరింత సన్నగిల్లుతోంది. కొత్తగా కనిపెట్టిన ఈద్వారం వల్ల అతనికి కొత్త ఉత్సాహం కలగవలసినదిపోయి, సత్తువ క్షీణించ నారంభించింది. గునపాన్ని కింద పడవేశాడు. ముఖాన చెమట తుడుచుకున్నాడు. మెల్లిగా తిరుగుదారిపట్టి గుహనుంచి బైటకి వచ్చాడు. ఎవరైనా కనిపెడుతున్నారేమోననే సందేహంతో చుట్టూ చూశాడు. వాస్తవానికి అతనికి విశ్రాంతి అవసర మయింది. శోష వస్తుందని భయపడ్డాడు.

గుక్కెడు సారాయి తాగాడు. కొంత సత్తువ తేరుకున్న తరవాత మళ్ళీ గుహ ప్రవేశించాడు. ఇప్పుడు పలుగుఎత్తాడు. ఇంతకుముందు బరువై జారిపోతున్న పలుగు ఇప్పుడు తేలికైన ట్లుంది. కొద్ది దెబ్బలతో అక్కడి రాళ్లు కదిలిపోయాయి. ఈ రాళ్లమధ్య సిమెంటు దట్టించబడలేదని తేలింది. అవి ఒకదానిపైన ఒకటి పేర్చబడినాయి. ఒక నెరదలో పలుగు దూర్చి రెండో చివర గట్టిగా నొక్కాడు. పెద్ద రాయొకటి ఊడి అతని పాదాలవద్ద పడింది. తరవాత మిగిలిన రాళ్లని చేతితో తీసేశాడు. మనిషి ప్రవేశించడానికి తగిన పెద్ద రంధ్రం ఏర్పడింది.

రెండో గుహ మరింత చీకటిగా ఉంది. అక్కడ వాయుచలనం లేదు. కొంతసే పాగి, లోనికి ప్రవేశించాడు.

ఈ ద్వారానికి ఎడమచేతి వైపున దగ్గరలోనే గోడలమూల ఒకటుంది. అక్కడనించి గుహ నంతటినీ పరికించాడు. మొదటి గుహ మాదిరిగానే ఇదికూడా ఖాళీగా ఉంది. ఆ సంపదే నిజంగా ఉన్నట్లయితే, ఈ చీకటిమూలనే పాతిపెట్టబడి ఉండాలి. అతనికి పరీక్షా సమయం ఆసన్నమయింది.

రెండడుగుల లోతు నేల తవ్వాలి. ఉత్కృష్టవాంఛా పరితృప్తో, లేక దురంతమైన ఆశాభగ్నమో నిర్ణయమై పోతుంది. ఈ నిర్ణయానికి ఇంక రెండడుగుల లోతు నేల మాత్రం అవధి. ధైర్యంతో పలుగుతీసి తవ్వడం ప్రారంభించాడు. అయిదారుదెబ్బల తరవాత పలుగు ఇనపవస్తువుపైన పడి ఖంగున మోగింది. ఇంతవరకూ ఏ ధ్వనీ శ్రోత నింత దిగ్భ్రమ చెందించలేదని చెప్పవచ్చును. మళ్లీ అక్కడే

పలుగు వేశాడు. ఈమారు దెబ్బ మెత్తని వస్తువుపైన పడింది. "అది ఇనపరేకులతో బిగించిన కర్ర పెట్టి" అనుకున్నాడు.

ఇంతలో ఉన్న కొంత వెలుగూ మూసుకుపోయింది. ఏదో నీడ అడ్డువచ్చింది. డాంటే వెంటనే పలుగు కిందపడవేసి తుపాకి పుచ్చుకుని పైకి వెళ్లాడు. కొండమేకొకటి వచ్చి అక్కడ నిలబడింది. ఆహారం సంగతి జ్ఞప్తికి వచ్చింది. ఇదే మంచి అదను అనుకున్నాడు. అయితే తుపాకి మోత విని ఎవరైనా రాగలరని భయపడ్డాడు. క్షణంసేపు ఆలోచించాడు. ఒక చెట్టుకొమ్మ కోసి, తన మిత్రులు వంటచేసుకున్న చోటికి వెళ్లి, అక్కడింకా రాజుతున్న నిప్పులో పడవేశాడు. మరొక కొమ్మ తీసి దివిటీలా ఉపయోగించడానికి మంట అంటించి తెచ్చుకున్నాడు. గుహ ప్రవేశించి తవ్వుతున్న చోటును దివిటీ వెలుగులో చూశాడు. అతను పొరపడలేదు. పలుగుదెబ్బలు కర్ర చెక్కమీదా ఇనపబద్దీలమీదా తగిలాయి. మూత మధ్యలో, వెండితో తయారుచెయ్యబడిన ఇటాలియన్ ఆయుధ చిహ్నం, స్పాడా వంశనామం ఉన్నాయి. మట్టిలో కప్పబడినా వెండిమెరుగు తరగలేదు. డాంటే ఇట్టే గుర్తుపట్టాడు. ఈ గుర్తుని ఫేరియా తన కెన్నిసార్లు గీసిచూపలేదు!

క్రమంగా పెట్టి అంతా బయటపడింది. పెట్టిని మూడు తాళాలు బిగించి ఉన్నాయి. కొక్కాలుపట్టుకొని పెట్టిని ఎత్తడానికి ప్రయత్నించాడు కాని సాధ్యంకాలేదు. తెరవాలని ప్రయత్నించాడు. తాళాలు లొంగలేదు. మూతకింద పలుగు మొన దూర్చి పెగలదీశాడు. మూతలో ఒక చెక్క విరిగింది. ఇనపరేకులు ఇప్పుడు నిరర్థకమైనాయి. వాటిని పలుగుతో వొంచి తీసేశాడు.

డాంటే ఉద్రేకపూరితుడైనాడు. తల దిమ్మెక్కుతున్నట్లుంది. తుపాకి ఎత్తి గుళ్లునింపి చేతికి అందుబాటులో పెట్టుకున్నాడు. కన్నులు మూసుకున్నాడు—ఆకాశంలో చుక్కలకంటె, భావకల్పనలో ఎక్కువ చూడ్డానికి పసిపిల్లలు కన్నులు మూసినట్లు మూసి, మళ్లీ కళ్లు తెరిచాడు. కంటబడినది చూసి అతని కళ్లు చెదిరిపోయినాయి.

పెట్టిలో మూడు అర లున్నాయి. మొదటిదానిలో బంగారు కాసు లున్నాయి. రెండవదానిలో మెరుగులేని బంగారు అచ్చులు పేర్చిఉన్నాయి. మూడవ అరలో సగానికి వజ్రాలు, ముత్యాలు, కెంపులు, పచ్చలు ఉన్నాయి. డాంటే వాటిని గుప్పెడు తీసిపోశాడు. అవి అరచేతినుండి రాలుతున్న రంగుల వర్ష బిందువులవలె ఉన్నాయి. అద్దాల కిటికీలపైనపడే వడగళ్ల ధ్వని చేశాయి. వానిని చేతితో పట్టిచూసి విడిచిపెట్టిన తరవాత తీవ్రంగా కొట్టుకుంటున్న గుండెతో, డాంటే లేచి గుహద్వారం వద్దకు వెళ్లాడు. ఉన్మత్తుని ఆనందావేశం అతనిలో కనిపిస్తోంది. ఒక గుట్టనెక్కి సముద్రంవంక చూశాడు. ఏమీ కనిపించలేదు. ఒంటరిగానే ఉన్నాడు. మితిలేని ఈఅపార సంపదతో తానొక్కడే ఉన్నాడు. అదంతా తనదే.

కాని ఇది తన భ్రమ కాదుగదా? లేక వాస్తవమేనా? పోతున్న చైతన్యాన్ని ఒడిసి పట్టుకోడాని కన్నట్లు చేతులతో తల నొక్కి పట్టుకున్నాడు. దారి తెన్నులతో నిమిత్తంలేక ద్వీపంలో అడ్డంగా పరుగుతీశాడు. దారిలో కొండమేకలు ఉలిక్కిపడి పారిపోయాయి. అతని కేకలువిని సముద్రపు పక్షులు ఆకాశంలోకి ఎగిరిపోయాయి. వెనక్కి తిరిగి వచ్చిన దారినే వెళ్లాడు. గుహలోకి పరుగెత్తి వెళ్లి ధనరాసులముందు నిలిచి చూశాడు. మోకాళ్లపై వొంగి, కంపిస్తున్న హృదయాన్ని రెండు చేతులతో నొక్కిపట్టుకుని, భగవంతుని ప్రార్థించాడు.

క్రమంగా డాంటే శాంతపడ్డాడు. ఆ క్షణంనుంచే అతనికి తన భాగ్య మెంతటిదో తెలిసివచ్చింది. తరవాత ధనాన్ని లెక్కించ నారంభించాడు. రెండు, మూడు పౌనుల బరువున్న బంగారు అచ్చులు వెయ్యి ఉన్నాయి. ఇరవైఅయిదు వేల బంగారుకాసు లున్నాయి. ఒక్కొక్క కాసు విలువ పాతిక ఫ్రాంకులు. వానిపై పోప్ ఆరో అలెగ్జాండర్ ప్రతిమలూ, అతని పూర్వుల ప్రతిమలూ ఉన్నాయి. ఆపైన సగమే నిండిఉన్న అరలో చూశాడు. వజ్రాలు, రత్నాలు దోసిళ్లతో కొలిచాడు. పది దోసి ళ్లున్నాయి. వీనిలో అమూల్యమైన వజ్రా లున్నాయి. అందంగా చెక్కబడిన వున్నాయి.

క్రమంగా పొద్దు వాటారుతోంది. గుహలోనే ఉండిపోతే అకస్మాత్తుగా ఎవరైనా పట్టుకుంటారని భయపడి, డాంటే తుపాకి సుతీకుని పైకి వెళ్ళాడు. బిస్కట్టు తిని సారాయి తాగాడు. మొదటిగుహా ద్వారంవద్ద రాతిని మూసి దానిపై పడుకుని నిద్ర పోయాడు.

# 25

డాంటే ఉదయమే మేలుకున్నాడు. మేలుకుని లేచి, ద్వీపంలోకెల్ల ఎత్తైన కొండనెక్కి చుట్టూ చూశాడు. ఒక్క ప్రాణి కానరాలేదు. కొండ దిగివచ్చి గుహ ప్రవేశించాడు. వజ్రాలు, రత్నాలతోనూ, బంగారు నాణేలతోనూ జేబులు నింపు కున్నాడు. విరిగిన మూత సర్ది, పెట్టిని మన్నుతో కప్పివేశాడు. మట్టిని తొక్కి చదును చేశాడు. అనవాళ్లేవీ కనపడకుండా దాని పైన ఇసుక చల్లాడు. గుహ వెలుపలికి వచ్చి రాతిపలకతో ద్వారం మూశాడు. అది కనపడకుండా దానిపై రాళ్లు పరిచి, రాళ్ల మధ్య మట్టిపోశాడు. ఆపైన గడ్డినారు, దుబ్బు మొలకలు వేసి, ఆ నేలనంతనీ నీటితో తడిపాడు. దారిలో అడుగుజాడలు చెరిపివేస్తూ యథా స్థానం చేరి, అక్కడ మిత్రులకోసం ఆత్రుతతో నిరీక్షిస్తూ కూర్చు న్నాడు.

డాంటే మళ్లీ స్వేచ్ఛగా మానవసమాజంలో చరించాలని ఆతుర పడుతున్నాడు. నలుగురి మధ్యనూ మసలాలని కోరిక గలి గింది. సమాజంలో కేవలం ఐశ్వర్యంవల్లనే లబ్ధి కాగల పరపతి, ఉన్నతి, ఆధిక్యం, అధికారం వెంటనే పొందాలనే వాంఛ బలీయ మయింది.

ఆరవ రోజుకి అతని మిత్రులు వచ్చారు. డాంటే తీరంవరకూ డేకుతూ వెళ్లాడు. తన స్థితి కొంత మేలే అయినప్పటికీ, ఇంకా నొప్పి పూర్తిగా తగ్గలేదని మిత్రులతో చెప్పాడు.

మిత్రులు తమ సాహసకార్యాలను గురించి డాంటేకి వివరిం చారు. అంతా కలబోసిచూస్తే వారికి లాభమే కనపడింది. డాంటే రాలేక పోయినందుకు విచారపడ్డారు. వారిలో ప్రతి ఒక్కడూ

ఏభై స్పానిష్ డాలర్లు సంపాదించాడు. డాంటే దీనిని పోగొట్టు కున్నందుకు జకోపో చింతపడ్డాడు. పోగొట్టుకున్న ఈ సంపాదన గురించి విన్న డాంటేకి చిరునవ్వైనా రాలేదు.

డాంటే జూన్ ఎమిలీ నౌకలో లెగ్ హారన్ రేవు చేరాడు. అక్కడ ఒక యూదు వ్యాపారివద్దకు వెళ్లి నాలుగు చిన్న వజ్రా లను ఒక్కొక్కటి అయిదు వేల ఫ్రాంకులకు విక్రయించాడు. నావి కుడైన వానికి ఈ అమూల్య వజ్రా లెలా లభించాయని వ్యాపారి అడగవలసిందే. కాని, ఒక్కొక్కదానిపైన వెయ్యి ఫ్రాంకుల లాభం లభిస్తున్నదని చూసి వ్యాపారి మౌనం వహించాడు.

మరునాడు ఉదయం డాంటే ఒక కొత్త బోటు కొని జకో పోకి బహూకరించాడు. అవసరమైన సామగ్రినంతా కొనడానికి వెయ్యి స్పానిష్ డాలర్లు ఇచ్చాడు. మార్సెల్స్ వెళ్లి మైలాన్‌వీధిలో లూయీడాంటే అనే వృద్ధునిగురించీ, కాటలన్స్ గ్రామంలో మర్సిదా అనే ఒక యువతినిగురించీ సమాచారం తెలుసుకు రావల సిందని జకోపోను పంపాడు. ఇదంతా చూసి జకోపో కలకంటు న్నట్లు ఆశ్చర్యపడ్డాడు. డాంటే, తన తల్లిదండ్రులు ధన మివ్వ నందుకు కోపించి పారిపోయి నావికుడుగా చేరినట్లు, ఇప్పుడు లెగ్ హారన్ రాగానే పినతండ్రి ఆస్తి తనకి సంక్రమించినట్లు కథ అల్లి చెప్పాడు. ఈ ఆస్తి కంతకీ తానే వారసు డన్నాడు. అతని విద్య, సద్వర్తన గమనించిన జకోపో, ఈ కథను సులువుగా నమ్మాడు.

మరుచటి రోజే జకోపో మార్సెల్స్‌కి ప్రయాణమై వెళ్లాడు. తిరిగి మాంట్ క్రిస్టో ద్వీపంలో కలుసుకోడానికి ఏర్పాటయింది. డాంటే మిగిలిన తన మిత్రు లందరికీ ఉదారంగా పారితోషికా లిచ్చి, వారివద్ద సెలవు తీసుకున్నాడు. కాని ఎక్కడికి వెడు తున్నదీ ఎవరికీ చెప్పలేదు.

డాంటే ఇంక జాప్యంచెయ్యకుండా రహస్యంగా బయలు దేరి జినోవా చేరాడు. అక్కడ రేవులో అతనికి చక్కని బోటు ఒకటి కనపడింది. అది ఒక బ్రిటిష్ దేశస్థునికోసం అతి వేగంగా సముద్రాలలో ప్రయాణంచెయ్యడానికి వీలుగా నిర్మించబడింది. బ్రిటిష్ దేశస్థుడు నలభైవేల ఫ్రాంకు లివ్వడానికి నిర్ణయించుకుని

ఉన్నాడు. డాంటే దానిని వెంటనే అరవై వేల ఫ్రాంకు లిచ్చి కొన డానికి సిద్ధపడ్డాడు. బేరం కుదిరింది. నౌకా నిర్మాతని ఒక యూదు వ్యాపారివద్దకు తీసుకువెళ్లి అక్కడ ధన మిచ్చాడు. తరవాత బోటులో పడక గదిలోని పడక తల క్రింద రహస్యమైన పెట్టె నిర్మించాలని నిర్మాతకి పురమాయించాడు. పెట్టెలో మూడు అర లుండాలి. అవి తెరవడానికి స్ప్రింగులు, ఎవరికీ కనపడని చోట ఏర్పాటు కావాలి. ఒక్క రోజులో అంతా ఏర్పాటయింది.

అంతా సిద్ధమైన తరవాత డాంటే తన కొత్త బోటులో ప్రయాణ మైనాడు. నావికు లెవరూ అవసరం లేకనే అత నొక్కడే బోటు నడిపాడు.

త్వరలోనే కొత్తబోటు నడపడంలో డాంటేకి చెయ్యి నలిగింది. ఆ బోటు బుద్ధి తెలిసిన ప్రాణివలె దిక్కు లెరిగి సముద్రాల పైన చరచరా పయనిస్తోంది. నిజంగా జినోవా నౌకానిర్మాతలు ప్రపంచంలోకెల్ల శ్రేష్ఠులని డాంటే అనుకున్నాడు. ఆ బోటు ఎక్కడికి వెడితే అక్కడ ప్రజలు విరగబడి చోద్యం చూసేవారు. అది ఎక్కడికి వెడుతున్నదో, ఎక్కడినుంచి వస్తున్నదో ఎవరికీ తెలియదు. మాంట్ క్రిస్టో ద్వీపంసంగతి ఎవరికీ యోచన కలగలేదు.

ఒకనాడు డాంటే తన బోటులో మాంట్ క్రిస్టో ద్వీపానికి వెళ్లి, మామూలు రేవులో కాక, లోనికి చొచ్చుకున్న సముద్రపు పాయలో ప్రవేశించి ఒక గట్టున దిగాడు. గుహలోకి వెళ్లి చూడగా అంతా ఎప్పటిమాదిరిగానే ఉంది. మరునాడు గుహలోని నిక్షేప మంతా బోటులోకి తరలించబడింది. అది పడక తలకింద రహస్యపు పెట్టెలో గుప్తపరచబడింది.

డాంటే అక్కడ వారంరోజు లున్నాడు. వారం రోజులూ బోటులో చుట్టూ తిరుగుతూ ద్వీపాన్ని జాగ్రత్తగా పరిశీలించాడు. నిపుణుడైన రౌతు తన గుర్రాన్ని పరిశీలించినట్లుగా డాంటే ద్వీపాన్ని పరిశీలించి, నైసర్గికస్థితి నంతా ఆకళింపుచేసుకున్నాడు.

ఎనిమిదవ రోజున దూరాన ఒక బోటు కనపడింది. డాంటే సంకేత మిచ్చాడు. అది దగ్గరకు వచ్చింది. బోటులోనించి జకోపా దిగివచ్చాడు.

జకోపో తెచ్చిన సమాచారం డాంటేకి దుఃఖకారణమయింది. వృద్ధుడు లూయీడాంటే మృతిచెందాడు; మర్సిదా ఎక్కడికో మాయ మయింది.

డాంటే నిశ్చలభావంతో సమాచారం విన్నాడు. తన నెవ్వరూ అనుసరించరాదని చెప్పి, ఒక్కడూ తీరానికి వెళ్ళాడు. రెండుగంటలలో తిరిగివచ్చి, జకోపో పంపిన ఇద్దరు నావికుల సహాయంతో తన బోటును పాయనుంచి తిప్పించి సముద్రంలోకి తెచ్చాడు. అక్కడనించి మార్సెల్స్ రేవుకు వెళ్ళాలని నావికులకు ఆజ్ఞ ఇచ్చాడు.

తన తండ్రి చనిపోయి ఉంటాడని డాంటే ముందే ఊహించుకు న్నాడు. కాని మర్సిదా ఏమయింది? ఆమె ఆచూకీ తియ్యడానికి మార్గం చెప్పాలంటే, తన రహస్యాన్ని బయలుపెట్టక తప్పదు. అదీ కాక అతనికి మరికొంత సమాచారంకూడా తెలుసుకోవలసిన అవ సరం ఉంది. అది తనకే కాని అన్యులెవరికీ తెలియరానిది. అందు వల్ల తనే బయలుదేరాలని డాంటే నిశ్చయించుకున్నాడు.

ఒకనాటి ఉదయం రెండు బోట్లు మార్సెల్స్ రేవు చేరాయి. ఇఫ్‌కోటకి డాంటేని తీసుకువెళ్లినప్పుడు, సిపాయిల పడవ ఎక్కడ బయలుదేరిందో, సరిగ్గా అక్కడే రెండుబోట్లు లంగరు వేశాయి.

సమీపంలోనే మరొక బోటులో సిపాయిలు కనపడగానే, డాంటేకి ఒళ్లు జలదరించింది. అయితే అభ్యాసంవల్ల, లోని ఉద్వే గాన్ని సులువుగా అణుచుకో గలిగాడు. లెగ్‌హారన్‌లో కొన్న ఇంగ్లీష్ ప్రయాణపు అనుమతి పత్రాన్ని చూపించి తీరంలో దిగాడు. ఇంగ్లీషువారిని ఆ రోజుల్లో ఫ్రాన్స్ దేశస్థులు ఆదరించే వారు.

డాంటేకి కానిబయర్ వద్ద మొట్టమొదట ఫరావో నావికు డొకడు ఎదురైనాడు. ఆ నావికుడు పూర్వం డాంటే అధీనం లో పనిచేసినవాడే. కాబట్టి, ఇప్పుడు తననుచూసి పూర్వం సన్నిహితులైనవారు గుర్తుపట్టగలరో, లేరో పరిశీలించడానికి డాంటేకి మంచి అదను లభించింది. తిన్నగా అతన్ని సమీపించి అవీ ఇవీ అడిగాడు. అతడు డాంటేని జన్మలో ఎన్నడూ చూడనట్లే, అపరి

చితునితో మాట్లాడుతున్నట్లే జవాబు లిచ్చాడు. డాంటే తృప్తి పడి అతని చేతిలో ఒక నాణెం పెట్టాడు. నావికుడు వెళ్లిపోతూ నాణెం చూసి ఆగిపోయాడు. ఆశ్చర్యపడి డాంటే వెనకనే పరుగెత్తి వచ్చి, "మీరు పొరపడినట్టున్నారు. నాకిచ్చినది బంగారు నాణెం."

డాంటే చూశాడు: "అవును. పొరపాటే జరిగింది. నువ్వు నిజాయితీ పరుడివి. అది తీసేసుకో," అన్నాడు. నావికుడు నిశ్చేష్టుడై చూశాడు. నిశ్చింతగా వెళ్లిపోతున్న యువకుని చూసి "అబ్బో! ఎవరో ఇండియానుంచి వచ్చిన పెద్ద నవాబు కాబోలు!" అనుకున్నాడు.

మార్సేల్స్ నగర వీథులలో డాంటే మెల్లిగా నడిచి వెడుతున్నాడు. అడుగడుగునా అతనికి ఆవేగం అధికమౌతోంది. ప్రతి వీథి మలుపునా పూర్వస్మృతులు ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. ప్రతివీథీ అతని బాల్యజీవనాన్ని జ్ఞప్తికి తెస్తోంది. చివరికి తండ్రి నివసించిన ఇంటివద్దకు చేరాడు. వృద్ధు డతిశ్రద్ధతో పెంచి కిటికీ ఊచల నెక్కించిన పూలతీగె లిప్పుడు లేవు. డాంటే ఒక చెట్టు మొదలు నానుకుని నిలిచి, ఆ పేదగృహం మీద్దవంక చూస్తూ ఉండిపోయాడు.

కొంతసేపటికి తేరుకుని ద్వారం సమీపించి పిలిచాడు. ఆ యింటిలో బస చెయ్యగోరినట్లు చెప్పాడు. కాని ఖాళీ లేదు. కనీసం మేడమీదిగదిని ఒక్కసారి చూడనివ్వాలని ప్రార్థించాడు. కొత్తగా పెళ్లి చేసుకున్న దంపతు లిద్దరాగదిని అద్దికి తీసుకున్నారు. వారి అనుమతితో డాంటే గదిని పరిశీలించాడు. కాని, పూర్వస్మృతులు తెచ్చేవి ఏవీ ఆగదిలో మొదట కనపడలేదు. గోడలు వెల్ల వెయ్యబడి ఉన్నాయి. కుర్చీలు, బల్లలుకొత్తవి. పడకమాత్రం అదే, ఎప్పటిస్థానంలోనే ఉంది. అది చూడగానే డాంటేకి కళ్లు చెమ్మగిలినాయి. అక్కడే తన తండ్రి తన పేరు తలుచుకుంటూ ప్రాణాలు విడిచి ఉంటా డనుకున్నాడు.

కొత్తదంపతు లిద్దరూ డాంటేని చూసి చకితులైనారు. నిశ్చేష్టుడై పడకవంక చూస్తున్నాడు. అచంచలమైన

మనోదార్ఢ్యాన్ని ప్రస్ఫుటంగా ప్రకటించే అతని ముఖం కొద్దిగా వివర్ణమయింది. కళ్లవెంట నీటిబిందువులు జారుతున్నాయి. పరితాపం పవిత్రమైనదని తలిచి, నూతన దంపతులు నిశ్శబ్దంగా గదివిడిచి వెళ్లి పోయారు. తరవాత డాంటే గదివిడిచి రాగానే, ఇద్దరూ అతన్ని అనుసరించారు. కోరినప్పుడు వచ్చి ఆ గది చూడవచ్చని చెప్పారు.

మేడదిగి వచ్చి డాంటే పక్క తలుపుతట్టి కాడరూస్‌ను గురించిన సమాచారం అడిగాడు. కాడరూస్ కష్టాలలోపడి దర్జీ వృత్తి మానుకుని, ఇప్పుడు బెల్‌గార్డ్—బుకేర్ రోడ్డులో ఒక హోటల్ పెట్టుకున్నాడని తెలిసింది.

ఇంటియజమాని పేరడిగి తెలుసుకుని, డాంటే అతనివద్దకు వెళ్లాడు. అతనితో తనపేరు లార్డ్ విల్మోర్ అని చెప్పి, ఇంటిని కొనడానికి బేరం పెట్టాడు. ఇంటి అసలు విలువ పదిహేను వేలే అయినప్పటికీ, లక్ష ఫ్రాంకులకైనాసరే కొనితీరాలని డాంటే పట్టుదల. చివరికి పాతిక వేలకుకొనేశాడు. ఆ రోజునే మేడమీదిగది ఖాళీచెయ్యాలని కొత్తదంపతులకు తెలియపరచబడింది. అదే ఇంటిలో మరే గదులైనాసరే కోరుకోవచ్చునని డాంటే వారికి చెప్పాడు. ఈ చిత్రసంఘటనగురించి మైలాన్ వీధిలో వారం రోజులపాటు చర్చలు, వదంతులు చెలరేగాయి. అందరూ అనేకరకాలుగా ఊహించుకున్నారు. కాని, నిజం తెలుసుకోగలిగినవారెవరూ లేరు.

ఇంతకంటె ఎక్కువగా అక్కడి ప్రజల్ని ఆశ్చర్యపరిచిన విషయం మరొకటుంది. ఇంతటి ఐశ్వర్యవంతుడైన ఈ నూతన వ్యక్తి కాటలన్స్ పల్లెవాసుల గ్రామానికి వెళ్లి ఒక గుడిసెలో ఎవరితోనో గంటసేపు మాట్లాడాడు. పదిహేను, పదహారేళ్లలో చనిపోయినవారు, మాయమైనవారు కొందరినిగురించి సమాచారం అడిగాడు. తనకు సమాచారం చెప్పిన పల్లెకారికి మరునాడు కొత్త బోటొకటి, రెండు కొత్తవలలు కొని బహూకరించాడు. తరవాత, తన నావికులకు ఆజ్ఞలిచ్చి పంపివేశాడు. డాంటే ఒక గుర్రమెక్కి మార్సేల్స్‌నగరం విడిచి వెళ్లిపోయాడు.

# 26

దక్షిణఫ్రాన్స్‌లో బెల్ గార్డ్ - బుకేర్ రహదారిలో ఒక చిన్న హోటల్ ఉంది. హోటల్ వెనక ఒక చిన్న తోటకూడా ఉంది. తోటవెనక ఒక ద్వారం ఉంది. పేరుకి అది తోటేగాని, ఆరవణలో కొద్దిగా గిడసబారిన చెట్లు, ఒక్కటే పెద్ద వృక్షం, అక్కడక్కడ కాయగూరల పాదులూ మాత్రమే ఉన్నాయి. వాయవ్య పవనాల తాకిడికి చెట్లన్నీ ఆగ్నేయముఖంగా తలలు వంచుకున్నాయి. ఆ ప్రాంతమంతా నేల చవుకుబారి మొక్కలాట్టే లేక, బొగులు బొగులుమంటూ ఉంటుంది. అక్కడా అక్కడా చెదురుగా గోధుమ చేలున్నాయి.

హోటల్ యజమానికి దాదాపు నలభైఅయిదేళ్లుంటాయి. పొడుగ్గా బక్కపలచగా ఉంటాడు. కొంకిముక్కు, చురుకు చూపులు, చిన్నికళ్లు దక్షిణప్రాంతవాసి అని తెలుపుతున్నాయి. మాంసభక్షణచేసే జంతువుల మాదిరిగా అతనిపళ్లు తెల్లగా మెరుస్తున్నాయి. వయస్సు ముదిరినా అతనికి జుట్టు నెరుపు పట్టలేదు. గడ్డం ఒత్తుగా పెరిగింది. ప్రతిరోజు ఉదయంనించి సాయంకాలం వరకూ అదేపనిగా గుమ్మంవద్ద ఎండలో నిలవడంవల్ల కాబోలు చర్మం కమలింది. తలకు రుమాలు చుట్టుకున్నాడు. ఇతనే కాడెరూస్. ఇతని భార్యపేరు రాడెల్. అనారోగ్యంవల్ల చిక్కి, పాలిపోయి ఉంటుంది. లోజ్వరంవల్ల క్రమక్రమంగా ఆమె సౌందర్యం క్షీణించిందని చూడగానే కనిపెట్టవచ్చును. ఎప్పుడూ మిద్దెమీద తన గది విడిచి వచ్చేదికాదు. పక్కపైన పడుకునో, పడక కుర్చీలో ఊగుతూనో నిత్యం భర్తనిసాధిస్తూ ఉంటుంది. సాధింపుబాధ తప్పించుకోడానికీ, రహదారి నెవరైనా వస్తూఉంటే చూడ్డానికీ కాడెరూస్ ఎప్పుడూ వీధిగడపవద్దనే ఉంటాడు. భార్య సాధింపులికి అత నెప్పుడూ ఇచ్చే సమాధానం ఒక్కటే. "ఇది మన కర్మం. తప్పించుకోవాలన్నా తప్ప దిది." హోటల్‌లో వ్యాపారం లేకపోయినా అది కనీసంఅతనికి ఆశ్రయ మిస్తోందని తృప్తి పడుతున్నాడు.

ఆ రోజున కాడెరూస్ కోళ్లవంక చూస్తూ గుమ్మంవద్ద నిలబడగా, అతనికి భార్య పిలుపు వినవచ్చింది. రోడ్డుపైన

అటూఇటూ కనుమాపుమేర చూసి, ఎవరూ రావటం లేదని గ్రహించి కాడరూస్ లోనికి వెళ్లాడు. కాని, అతనక్కడే మరొక క్షణం ఉండిఉంటే దూరంనించి గుర్రంపైన వస్తున్న ఒక ఫాదరీ కనపడే వాడే. ఎడారిలాగ ఉన్న ఈ ప్రాంతంలో ఈ మధ్యాహ్నపు మండువేళ సామాన్యంగా ఎవరూ రోడ్డెక్కరు. ఈ కాని వేళ గుర్రపురౌతు వచ్చి హోటల్ వద్ద ఆగాడు. రౌతు గుర్రందిగి, కళ్ళాన్ని పాతకిటికి తుప్పుఊచకి కట్టాడు. ముఖాన చెమట తుడుచు కుంటూ ద్వారం సమీపించి తలుపుపైన మూడుమార్లు తట్టాడు. నల్లని పెద్దకుక్క ఒకటివచ్చి అపరిచితుని చూసి మొరగసాగింది. ఇంటిలో కర్రమెట్లు టకటక మన్నాయి. హోటల్ యజమానివచ్చి ఆ గంతకుని ఆహ్వానించాడు. కుక్కని అదిలించి "ఇది కరవదు లెండి. ఊరికే మొరుగుతుంది. ఫరవాలేదు. దయచెయ్యండి. తమరేం తీసుకుంటారు? ద్రాక్ష సారాయి తెచ్చేదా? ఎండ పేల్చివేస్తోంది," అని, తరవాత ఫాదరీని నిదానించిచూసి, "క్షమిం చాలి. తమరేం తీసుకుంటారో అదే చెప్పండి," అన్నాడు.

ఫాదరీ అతన్ని వింతగా క్షణంసేపు పరికించాడు. తనని కూడా అతను అలా పరికించడానికిగాను కొంతసేపుమాట్లాడక ఊరు కున్నాడు. కాని, కాడరూస్ గుర్తుపట్టిన సూచనలేవీ కనపడ లేదు. జవాబివ్వనందుకు మాత్రం ఆశ్చర్యపడ్డాడు. ఫాదరీ అతన్ని సూక్ష్మంగా పరిశీలించి, "మీరేనా కాడరూస్?" అన్నాడు.

"అవును నేనే" అన్నాడు కాడరూస్, మరింత ఆశ్చర్య పడుతూ, "నాపేరు గాస్పర్డ్ కాడరూస్. తమకేం కావాలి?"

"ఓహో! గాస్పర్డ్ కాడరూస్! అవును. పేరు, ఇంటిపేరు అవే. మైలాన్ వీధిలో ఇదివరలో మీరు దర్జీవృత్తిలో ఉండేవా రనుకుంటాను. కాదూ?"

"అవును. కాని, ఆ నాకొవృత్తిలో బొత్తిగా కిట్టలేదండి. మార్సెల్స్ లో వేడి, ఉక్క ఎక్కువవడంవల్ల కాబోలు దర్జీపని వాళ్లు అక్కడ బాగుపడే యోగ్యత లేదండి. వేడంటే జ్ఞాపకం వచ్చిందది. గాడ్పు వీస్తోంది. తమ రేమైనా చల్లనిపానీయం పుచ్చు కుంటారా?"

"మంచి సారాయం తెచ్చిపెట్టండి. మనం ఇంకా మాట్లాడాలి."

తరుణం తప్పిపోకూడదని కాడరూస్ తనవద్దఉన్న సరుకులో కల్ల నాణ్యమైనది తెచ్చాడు. ఫాదరీ మేజాపై చేతులానించి కుర్చీలోకూర్చున్నాడు. కుక్క దూరంగా నేలపై పడుకుని ఓర కంటఫాదరీని గమనిస్తోంది.

కాడరూస్ సీసా, గ్లాసులు తెచ్చి మేజామీద పెట్టాడు. "మీరిక్కడ ఒంటరిగానే ఉన్నారా? లేక ఇంకెవరైనా ఉన్నారా?" అని అడిగాడు ఫాదరీ.

"ఒంటరిగానే ఉన్నానని చెప్పవచ్చునండి. ఏం చెయ్యను? భార్య ఉంది కాని, సహాయపడదండి. నిత్యం జబ్బే. పాపం."

"ఓ. మీరు వివాహితు లన్నమాట" అన్నాడు ఫాదరీ.

"తమరు చూస్తున్నారుగా, నేను భాగ్యవంతుణ్ణికాను. ఎలా కాగలను ? నీతివంతుడైనంతమాత్రంచేత ఈ ప్రపంచంలో భాగ్యం రాదు కదండీ !"

ఫాదరీ అతనివంక సూటిగా చూశాడు. "అవునండి" అన్నాడు కాడరూస్. "ఏమున్నా లేకపోయినా, నేను నీతివంతు ణ్నని మాత్రం చెప్పుకో గలనండి. ఈ రోజుల్లో ఆమాత్రం చెప్పు కునేవాళ్ళు ఎక్కడున్నారు?"

"అదే నిజమైతే మరీ మంచిది" అన్నాడు ఫాదరీ. "నాకు ఒక విషయంలో గట్టి నమ్మకం ఉంది. నీతివంతుడైనవానికి ఇప్పుడుకాకపోతే త్వరలోనైనా ప్రతిఫలం అందకపోదు. దురా త్ములికి శిక్షపడకమానదు."

"అలా చెప్పడం మీ ధర్మమండి." అన్నాడు కాడరూస్ నిస్పృహతో. "ఎవరి అభిప్రాయాలు వారివే అనుకోండి."

"పొరపడుతున్నారు మీరు" అన్నాడు ఫాదరీ. "అది ఇప్పుడే మీకు రుజువు చెయ్యగలను. అయితే ముందుగా నేను వెతుకుతున్నది మిమ్మల్నే అని నాకు రూఢి కావాలి. నా కొక విషయం చెప్పండి. 1814 లో కాని, 1815 లో కాని మీరు డాంటే అనే నావికుని ఎరుగున్నారా ?"

"డాంటేయా ? డాంటేని నేను ఎరక్కపోవడమేమిా ?" అన్నాడు, కాడరూస్ కొంచెం బిగ్గరగా. అతని ముఖం ఎర్రబడింది కూడా. ఫాదరీ అతని ముఖలక్షణాల్ని అతి శ్రద్ధగా పరిశీలిస్తున్నాడు. "పాపం. అతను నా ప్రాణ స్నేహితుల్లో ఒకడండి. ఏ మైనాడో పాపం మీా కేమైనా తెలుసా ? మీారు అతన్ని చూశారా ? ఇప్పుడతను స్వేచ్ఛగా సౌఖ్యంగా ఉన్నాడా ?"

"ఉరి కంబమెక్కే శిక్షితులకంటె ఘోరదుఃఖం అనుభవించి, ఆకలు కూలిపోయి, అతను ఖైదులో మరణించాడు."

కాడరూస్ ముఖం పాలిపోయింది. ముఖం పక్కకు తిప్పుకున్నాడు. అతను చేరుమాలుతో కన్నీరు తుడుచుకోవడం ఫాదరీ చూశాడు.

"పాపం" అని గొణిగాడు కాడరూస్. "అయ్యో ! భగవంతుడెప్పుడూ దుర్మార్గుల్నే కాపాడి పైకి తెస్తున్నాడు. ప్రపంచం మరీ అధోగతి పాలౌతోంది. ఒక్కసారిగా ఈ లోకాన్ని భస్మం చేసేస్తే పీడ పోతుంది."

"ఇతనంటే మీాకు అపేక్ష ఉన్నట్టుంది ?" అన్నాడు ఫాదరీ.

"అవును. అపేక్ష ఉండేది—ఒక్కసారి, ఒక్క క్షణం మాత్రం అతని భాగ్యాన్ని చూసి నేను అసూయపడినమాట నిజమే. అందుకు నన్ను నేను దూషించుకోవలసిందే. కాని, నేను మీా సన్నిధిలో ప్రమాణంచేసి చెప్తున్నానండి. అతనికి పట్టిన దుర్గతికి నే నెంతో పరితపించాను. మీాకు అతన్ని తెలుసునా ?"

"అతనికి తుది ఘడియల్లో ఉపశమనం కలిగించడానికి నన్నే పిలిపించారు."

"అత నెలా చనిపోయాడు ?"

"నిర్బంధంలో ముప్పైయేళ్ల మనిషి ఎలా చచ్చిపోతాడు ? నిర్బంధంవల్లనే చచ్చిపోతాడు."

కాడెరూస్ ముఖం తుడుచుకున్నాడు. ఫాదరీ ఇలా చెప్పాడు. "అన్నిటికంటె చిత్రమైనవిషయం ఏమిటంటే

డాంటే చనిపోయే నిమిషంలోకూడా క్రీస్తుదేవుని పేరుమీద ప్రమాణంచేసి, తన్ని ఏ నేరానికి నిర్బంధించారో తనకి తెలీయదన్నాడు."

"అది నిజమే." అన్నాడు కాడరూస్. "అతని కెలా తెలుస్తుంది? తెలియదు. ఈ విషయంలో అతను మీవద్ద అబద్ధమాడలేదండి. పాపం!"

"అందువల్లనే అతను కనిపెట్టలేకపోయిన ఈమాయ ఏదో తెలుసుకుని, వచ్చిన అపవాదును తొలగించాలని నన్ను నియోగించాడు." ఈ మాటలు చెప్తూ ఫాదరీ నిశితంగా అతనిముఖాన్ని పరిశీలించాడు. ఫాదరీ మళ్ళీ ఇలా చెప్పాడు: "అతని దురదృష్టంలో పాలుపంచుకున్న భాగ్యవంతుడైన ఒక బ్రిటిష్ దేశస్థుడు విడుదలై వెళ్ళిపోతూ, డాంటేకి ఒక అమూల్యమైన వజ్రాన్ని ఇచ్చాడు. అతను జబ్బులో ఉండగా డాంటే సోదరునివలె పరిచర్య చేసినందుకుగాను ఈ బహుమతి నిచ్చాడు. దానిని జైలర్లకి లంచంపెట్టడానికిబదులు, డాంటే భద్రంగాదాచాడు. లంచంపెట్టినా వాళ్లు అది తీసుకుని ద్రోహంచేసి ఉండేవాళ్లేమో! ఎప్పటికైనా విడుదలైతే అది తనకిఅపారమైన భాగ్య సంపదలు తెచ్చిపెట్టగలదనే ఆశతో దాచుకున్నాడు."

"నిజంగా?" అన్నాడు కాడరూస్. అతనికళ్లు ఈమారు మెరుస్తున్నాయి. "అది అంత విలువైన వజ్రమా?"

"దేని విలువైనా లెక్కగట్టే మనుష్యుల్నిబట్టి ఉంటుంది" అన్నాడు ఫాదరీ. "అది ఎడ్మండ్ దృష్టిలో అంత విలువైనదిగా కనిపించి ఉంటుంది. బహుశా దాని వెల ఏభైవేల ఫ్రాంకు లుండవచ్చు. మీరే చూడండి."

ఫాదరీ తన జేబులోనించి చిన్న తోలుపెట్టె తీసి మూత తెరిచి, వజ్రాన్ని పైకి తీసిపట్టుకుని చూపించాడు. అది చక్కని ఒక ఉంగరంలో పొదగబడి ఉంది. కాంతులు కురిపిస్తున్న ఆ వజ్రంచూసి కాడరూస్ కళ్లు జిగేల్‌మన్నాయి.

"దీని వెల ఏభైవేలా?" అన్నాడు.

"వజ్రం ఒక్కటే అయితే. ఉంగరం వెలకూడా తక్కువ కాదు." అంటూ ఫాదరీ దాన్ని పెట్టెలో పెట్టి మూతవేసి జేబులో దాచేశాడు. కాని, అది ఇంకా కాడరూస్ కళ్లలో మెరుస్తున్నట్లే ఉంది.

"ఈ వజ్రం మీవద్ద కెలా వచ్చిందండి? మీకు ఇచ్చేశాడా?"

"లేదు. సంరక్షుణకి మాత్రం ఇచ్చాడు. ఇచ్చినాతో ఇలా చెప్పాడు: 'నేను ప్రేమించిన యువతి కాక నాకు ముగ్గురు మంచి మిత్రులున్నారు. కావలసినవారు నలుగురు. నా గతి తెలుసుకుని ఆ నలుగురూ దుఃఖిస్తారు. వారిలో ఒకడు కాడెరూస్. రెండో నాడు డాంగ్లర్; మూడోవాడు ప్రతికక్షి అయినా అతిసన్నిహితుడు."

కాడరూస్ ముఖంలో వికృతమైన హాసం పొడగట్టింది. ఫాదరీని మాటలమధ్యలోనే ఆపి ఏదో చెప్పబోయాడు. ఫాదరీ అతన్ని వారించి, "ఆగు. ముందు నన్ను చెప్పనీ. ఈ మూడో వ్యక్తి పేరు ఫెర్నాండో. ప్రియురాలి పేరు మర్సిడా."

"తరవాత?"

"ముందు నాకు ఒక గ్లాసు మంచి నీళ్లివ్వండి."

ఫాదరీ రెండు గుక్కెళ్లు తాగి గ్లాసు మేజామీద పెట్టి అన్నాడు: "ఆ! ఇప్పు డెక్కడున్నాం మనం? అవును. ఆ తరవాత డాంటే ఇలా చెప్పాడు నాతో 'మీరు మార్సెల్స్ వెళ్ళాలి. వెళ్ళి ఈ వజ్రాన్ని అమ్మి అయిదు సమాన వాటాలుగా విభజించి ఈ అయిదుగురికీ ఇవ్వండి. ఈ ప్రపంచంలో నాకు కావలసినవారంతా వీరే.'"

"అదేమిటి? అయిదు వాటాలా? మరి మీరు నాలుగు పేర్లే చెప్పారే?"

"నేను విన్నదాన్నిబట్టి, అయిదోవ్యక్తి మరణించాడు. ఆయన డాంటె తండ్రి."

"అవును. పాపం అవును" అన్నాడు కాడరూస్. అతని మనస్సు కలవరపడింది. "పాపం చచ్చిపోయాడు."

"నా కీ వార్త మార్సెల్స్‌లో తెలిసింది" అన్నాడు ఫాదరీ

నిర్లక్ష్యభావం నటిస్తూ. "కాని ఆయన చనిపోయి చాలకాలమైపోయినందువల్ల వివరాలేవీ నాకు తెలియలేదు. ఆయనెలా చనిపోయారో మీ రేమైనా తెలపగలరా ?"

"అవును. అది నాకంటె ఎక్కువ మరెవరికి తెలుసు ? నేను అదే ఇంట్లో వృద్ధునితో కలిసిఉన్నాను. పాపం కొడుకు కనిపించకుండా మాయమైపోయిన ఏడాదిలో వృద్ధుడు ప్రాణాలు విడిచాడు. డాక్టర్లు ఏదో రోగ కారణం చెప్పారు. ఆయన్ని తెలిసినవారు దుఃఖంవల్ల గుండె బద్దలై చనిపోయారన్నారు. కాని కళ్లారా చూసినందువల్ల నిజం నాకు తెలుసును. వృద్ధుడు ఆకలితో అలమటించి చనిపోయాడు."

"ఆ ! ఆకలి వల్లనా ?" అన్నాడు ఫాదరీ బిగ్గరగా. కుర్చీలో కూర్చోలేక లేచిపోయాడు. "ఆకలివల్లనా ? క్రూరజంతువులు కూడా ఆకలివల్ల చచ్చిపోవే ! వీధుల్లో తిరిగే కుక్కలికి కూడా ఎవరైనా చెయ్యి విదుపుతారుకదా ! ఇంక మనిషై పుట్టినవాడికి, క్రైస్తవమతస్థునికి, క్రైస్తవులని చెప్పుకునే పదిమందిమధ్యనూ ఉంటేగా, అన్నం దొరకలేదా ? ఒట్టిది ! అసంభవం !"

"నేను చెప్పవలసింది చెప్పాను." అన్నాడు కాడరూస్.

"చెప్పి, విరగడైపో" అని మెట్లవద్దనుంచి దూషణ వినవచ్చింది. "ఈ గొడవలన్నీ నీ కెందుకు ? నీ తలెందుకు దూర్చుతావ్ ?"

ఇద్దరూ మెట్లవైపు చూశారు. రాడెల్ పాలిపోయిన ముఖం కనపడింది. ఇద్దరి సంభాషణా వినడంకోసం ఆమె అక్కడికి వచ్చి పైమెట్టుమీద కూర్చుంది.

"నీ కెందుకు మధ్య ?" అని అరిచాడు కాడరూస్. "ఈ పెద్దమనిషి సమాచారం అడుగుతున్నారు. మర్యాదకోసమైనా చెప్పవద్దా ?"

"అవును. కాని తెలివి ఉంటే చెప్పనవాలి. నీచేత ఇదంతా చెప్పించడానికి ఆయనకే మవసరమో నీకేం తెలుసు ?"

"మంచి అవసరమే. మీ భర్త భయపడవలసిన పనిలేదు." అన్నాడు ఫాదరీ. "నావల్ల మీ కెలాంటి అపకారం రాదు. దానికి నాది పూచీ."

రాడెల్ అస్పష్టంగా గొణిగి ఊరుకుంది. అరచేతుల్లో గడ్డం ఆనించి శ్రద్ధగా వింటూ అక్కడే కూర్చుంది. ఫాదరీ మంచినీళ్లు తాగి అన్నాడు "ఇటువంటి ఘోరమరణానికి గురికావడానికి వృద్ధుణ్ని లోకంలో అందరూ విడిచిపెట్టేశారా?"

"లేదండి. లేదు." అన్నాడు కాడరూస్. "వృద్ధుణ్ని మర్సిదా, మారెల్ మాత్రం విడిచిపెట్టలేదు. కాని డాంటే ప్రాణ మిత్రుడని చెప్పుకున్న ఫెర్నాండో అంటే, వృద్ధుడు ముఖమైనా చూసేవాడు కాదు."

"అయితే అతను మిత్రుడు కాడా?"

"గాస్పర్డ్" అని బిగ్గరగా అరిచింది రాడెల్. "నువ్వేం చెప్తున్నావో తెలుసుకో. జాగ్రత్త!"

"తన ప్రియురాలిని కాంక్షించే ప్రతికక్షి మిత్రుడెలా కాగలడు? డాంటేహృదయం బంగారం. కాబట్టి అందరూ మిత్రులే అనుకునేవాడు పాపం! పోనీలెండి. అది అతనికి తెలియకపోవడం మంచిదే. తెలిస్తే చనిపోయే సమయంలోనైనా క్షమించడం అసాధ్యమయ్యేది. లోకం ఏమనుకుంటే నాకేం. బ్రతికున్నవాళ్ల ద్వేషంకంటె చచ్చిపోయినవాళ్ళ శాపం అంటే నా కెక్కువ భయం."

"చవటదద్దమ్మ!" అంది రాడెల్.

"అయితే డాంటేకి ఫెర్నాండో చేసిన అపచార మేమిటో మీకు తెలుసునా?" అని ప్రశ్నించాడు ఫాదరీ.

రాడెల్ ఈమారు మరింత బిగ్గరగా అరిచింది. "గాస్పర్డ్ నీ ఇష్టం వచ్చినట్లు నువ్వు చేసుకోవచ్చు. నిన్ను ఎవరూ అదుపులో పెట్టరు. కాని నా సలహా వినాలని ఉంటే చెప్తున్నాను, నువ్వేమీ చెప్పకు."

"ఈమాటు నువ్వు చెప్పిందే నిజం రాడెల్" అన్నాడు కాడరూస్.

"అయితే నాకు సమాచారం చెప్పరా?" అన్నాడు ఫాదరీ.

"ఏమిటి ప్రయోజనం?" అన్నాడు కాడరూస్. "పాపం డాంటే బ్రతికిఉండి, మళ్లీ ఒకసారి మాలోకి వస్తే, అప్పుడు అతను మిత్రు లెవరో విరోధు లెవరో తెలుసుకోవాలనుకుంటే, ఆ పరిస్థితి వేరు. ఇప్పుడు అతనీ లోకంలో లేడు. అతని కింక పగతో నిమిత్తంలేదు. అదంతా మరిచిపోతే మేలు."

"అయితే విశ్వాసపాత్రులైనవారికే చెందవలసిన ఈ ప్రతిఫలాన్ని, మైత్రికి తగని మోసకారులని మీరు చెప్తున్న ఈ వ్యక్తులికి ఇవ్వమంటారా?"

"మీరు చెప్పినదీ నిజమే. అయినా డాంటే ఇచ్చే ఈ బహుమతులు వారి కేపాటి? మహాసముద్రంలో ఒక్క నీటిచుక్క!"

"వాళ్లు నిన్ను క్షణంలో అణిచెయ్యగలరుకూడా" అంది రాడెల్.

"అంటే, ఈవ్యక్తులు భాగ్యం, అధికారం సంపాదించారా?"

కాడరూస్ క్షణంసేపు ఆలోచించాడు.

"మీకు ఇష్టంలేకపోతే చెప్పనవసరంలేదు" అన్నాడు ఫాదరీ, అత్యంత నిర్లక్ష్యంతో. "మీకు ఆక్షేపణ ఉంటే నేను మన్నిస్తాను. ఇంక ఈ విషయమై మనం మాట్లాడనవసరంలేదు. నేను నిర్వర్తించవలసింది కేవలం ఒక్క లాంఛనం మాత్రమే. ఇప్పుడు నేను వజ్రాన్ని అమ్మాలి."

ఫాదరీ మళ్లీ జేబులోనించి తోలుపెట్టె తీసి, అందులోనించి వజ్రాన్ని తీసి పట్టుకుని చూశాడు.

కాడరూస్ భార్యని పిలిచాడు. "ఇదిగో, ఇది చూడు. ఇలారా" అతని గొంతుక బొంగురుపోయింది.

"ఏమిటది, వజ్రమా?" అంది రాడెల్ ముందుకు వంగి చూస్తూ. మెల్లిగా మెట్లు దిగి సావడిలోకి వచ్చింది. "ఇదేమిటి? ఎవరిది?"

"నువ్వు వినలేదా ?" అన్నాడు కాడరూస్. "దీన్ని పాపం ఎడ్మండ్ నాకు, తన తండ్రికీ, డాంగ్లర్, ఫెర్నాండో, మర్సిదాలకీ ఇచ్చిపోయాడు. దీని ఖరీదు ఏభైవేలుంటుందిట. అందులో అయిదోవంతు మాకు వస్తుంది కాదండీ ?"

"అవును" అన్నాడు ఫాదరీ. "ఇదికాక డాంటే తండ్రి భాగంలోవంతుకూడా వస్తుంది. ఆ భాగాన్ని మీ నలుగురికీ పంచాలనుకుంటాను."

"మా నలుగురికీ పంచడం ఎందుకు ?"

"మీరు నలుగురూ ఎడ్మండ్‌కి మిత్రులు కాబట్టి."

"ద్రోహం చేసినవాళ్లు మిత్రులు కారు" అంది రాడెల్ సన్నగా.

"అవును" అన్నాడు కాడరూస్. "నేనూ అదే చెప్తున్నాను. ఇది ఘోరపాపం. అంతటి ద్రోహానికి ఇలా ప్రతిఫలమివ్వడం అన్యాయం."

ఫాదరీ వజ్రాన్ని జేబులో పెట్టుకుంటూ, "అలాగే జరుగుతూ ఉంటుంది. ఇప్పుడు ఈ మిత్రుల చిరునామాలు నాకివ్వండి. డాంటే తుది కోరిక చెల్లిస్తాను."

కాడరూస్ చెమటలు కక్కుతున్నాడు. ఫాదరీ సమ్మంబద్దకు వెళ్లి గుర్రాన్ని చూసివచ్చాడు. వచ్చేలోగా భార్యాభర్తలు ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు.

"ఆ వజ్రం అంతా మనదే అవుతుంది. ఫాదరీలు ఎప్పుడూ మోసం చెయ్యరు" అన్నాడు కాడరూస్ భార్య చెవిలో మెల్లిగా.

"నీ ఇష్టం వచ్చినట్లు చెయ్యి. నేనుమట్టుకు ఇందులో తల దూర్చను" అంది రాడెల్. వొణికిపోతూ ఆమె మెట్లెక్కి వెళ్లిపోయింది. పైన మొదటిమెట్టుమీద నిలబడి"బాగా ఆలోచించుకో" అంది. దీర్ఘ నిశ్వాసం విడిచి రాడెల్ తన గదిలోకి వెళ్లింది. మిద్దెమీద ఆమె అడుగులు స్పష్టంగా వినపడుతున్నాయి. పడకకుర్చీలో ఆమె కూలబడింది.

ఫాదరీ వచ్చి "ఏం నిశ్చయించు కున్నారు ?" అన్నాడు.

"అంతా చెప్పేస్తాను" అన్నాడు కాడరూస్.

అదే మంచిదని నేనూ గట్టిగా అనుకుంటున్నాను" అన్నాడు ఫాదరీ. "అంటే మీ కిష్టంలేనిది చెప్పాలని నేననడంలేదు. కాని డాంటే కోరికప్రకారం అతని ధనాన్ని పంచడంలో మీరు నాకు సహాయపడం మంచిదని నా ఉద్దేశం."

"ఒక్క క్షణం ఉండండి, మనకి అడ్డంకి ఏదీ రాకూడదు. అసలు మీ రిక్కడున్నట్లు ఎవరికీ తెలియడం మంచిదికాదు." అన్నాడు కాడెరూస్. లేచి వెళ్ళి సావడి తలుపు మూసివేసి వచ్చాడు.

ఈలోగా ఫాదరీ లేచివెళ్ళి మేజాపక్క ఒక మూలకుర్చీలో కూర్చున్నాడు. అక్కడ కొద్దిగా చీకటిగా ఉంది. అక్కడి నించి కాడెరూస్ ముఖలక్షణాల్ని సూక్ష్మంగా గమనించడానికి వీలుంది. శ్రద్ధగా కథంతా వినడానికి ఫాదరీ కూర్చున్నాడు.

# 27

"ఈ కథంతా ఏకరువుపెట్టేముందు ముఖ్యంగా మిమ్మల్ని ప్రార్థించవలసింది ఒకటుంది." అన్నాడు కాడెరూస్. "నేనెవర్ని గురించి ఇప్పుడు చెప్పబోతున్నానో వారిప్పుడు ధనాఢ్యులు, అధికారసంపన్నులు. తల్చుకుంటే నన్ను చిటికెలో నాశనం చెయ్యగలరు. అందువల్ల నేనిప్పుడు చెప్పే సంగతుల్ని ఎక్కడైనా ఎప్పుడైనా మీరు ఉపయోగించవలసివచ్చినట్లయితే, వీటిని నేను తెలియపరిచినట్లు బయటపెట్టకూడదు. అలాగని మీరు వాగ్దాన మివ్వండి."

"ఆ విషయమై మీరు భయపడనవసరంలేదు" అన్నాడు ఫాదరీ. "నేను మతబోధకుణ్ణి. నావద్ద ఎవరు ఏ రహస్యాల్ని చెప్పుకున్నా భద్రంగా దాచగలను. మీరు నిస్సంకోచంగా సర్వం నావద్ద చెప్పవచ్చును. కోపద్వేషాలు మరచి, నిష్పక్షపాతబుద్ధితో అన్నీ చెప్పండి. సత్యమే చెప్పండి. అసత్యం వద్దు. నేను భగవత్సేవా తత్పరుణ్ని. మనుష్యుల రాగద్వేషాలతో నాకు నిమిత్తం లేదు. ఈ కర్తవ్యం నెరవేరగానే, నేను నా మతప్రచారకసంస్థకి తిరిగి వెళ్ళిపోతాను. మరణోన్ముఖుడైన ఒక వ్యక్తి అంతిమప్రార్థన పాలించడానికి నా చోటు విడిచివచ్చాను. అంతే."

ఈ మాటలతో కాడరూస్ స్థిమితపడ్డాడు. "సరే అయితే. సర్వం నిస్సంకోచంగా చెప్పేస్తాను. డాంటే నమ్మిన ఈ స్నేహితుల వాస్తవగుణగణాల్ని తెలిపి, జరిగిన మోసాన్ని మీకు తెలియపరచాలి."

"ముందుగా అతని తండ్రిని గురించి మొదలుపెట్టండి. ఆయన్ని గురించి ఎడ్మండ్ నాతో నిత్యం చెప్తూ ఉండేవాడు. అతనికి తండ్రిపట్ల అపారమైన ప్రేమ."

"అది తల్చుకుంటే చాలు దుఃఖం వస్తుందండి" అన్నాడు కాడరూస్. "మొదట ఏం జరిగిందో మీకు తెలిసే ఉంటుంది."

"అవును. అతను అరెస్టయేవరకూ ఏం జరిగిందో ఎడ్మండ్ చెప్పాడు."

"అరెస్టయినది రిజర్వ్ హోటల్లో. ఇప్పుడు తల్చుకుంటే అదంతా మళ్ళీ నాకళ్ల ఎదుట జరుగుతున్నట్లుంటుంది. పాపం అప్పుడక్కడే అతని పెళ్లి ప్రధానపు విందు జరుగుతోంది. ఎంత ఆనందంతో ప్రారంభమయిందో, ఆ విందు అంత దారుణంగా ముగిసింది. ఒక పోలీసుఅధికారి, నలుగురు సిపాయిలు వచ్చి డాంటేని అరెస్టుచేశారు."

"నాకు సరిగ్గా అంతవరకే తెలుసును."

"డాంటే అరెస్టుకాగానే మారెల్ సమాచారం తెలుసుకోడానికి వెళ్లాడు. తిరిగి వచ్చి చెప్పిన సమాచారం విని అందరూ విచారపడ్డారు. అతని తండ్రి ఒంటరిగా ఇంటికి తిరిగి వెళ్లాడు. పెళ్లికిధరించిన సిల్కు దుస్తులు తీసేశాడు. ఆ రోజూ ఆరాత్రీ ఏడుస్తూనే ఉన్నాడు. పక్కనే నేనుండే వాడిని. నిద్రపోకుండా పచారుచేస్తున్న అతని అడుగుల చప్పుళ్ళు రాత్రంతా వినపడుతూనే ఉన్నాయి. మరునాడు ప్రొద్దున్న మర్సిడా విల్ఫర్ట్ దగ్గరకెళ్లి డాంటని రక్షించాలని ప్రాధేయపడింది. కాని ఉపయోగం లేకపోయింది. తరవాత వృద్ధుడిదగ్గర కెళ్లి తన ఇంటికిరమ్మని బ్రతిమాలుకుంది. అతని దుఃఖానికి మితిలేదు. ఎవరికీ అతన్ని పట్టతరం కాలేదు. రానని చెప్పాడు. 'నేను రాను. ఈ యిల్లు విడిచిపెట్టి రాను' అన్నాడు. 'డాంటేకి నాపైన ఉన్నంత ఆపేక్ష మరెవరి

పైనా లేదు. మైదునించి విముదలైవ స్తే, తప్పకుండా నాకోసం పరుగెత్తుకుంటూ వస్తాడు. నే నిక్కడ అదనుకి లేకపోతే ఏమను కుంటాడు ?' నా కతని మాటలు వినపడుతూనే ఉన్నాయి. ఎలా గైనా అతన్ని మర్సిదా ఇంటికి పంపాలనుకున్నాను. రాత్రి వేళ నిద్రలేక తిరుగుతున్న అతని అడుగుల చప్పుడు వల్ల నాకు ఒక్క క్షణం విశ్రాంతి లభించలేదు."

"మీా అంతట మీారు వెళ్లి ఆయన్ని అనునయించడానికి ప్రయత్నించలేదా ?"

"అనునయించడానికి వీలెక్కడ ? వినేవారైతే ఏదైనా చెప్పవచ్చును. వినకూడదనుకున్న వా రికేం చెప్పగలం ? ఏది చెప్పినా అతను వినదల్చుకోలేదు. అదీకాక, అతనికి నేనంటే అంత ఇష్టం లేదనుకుంటాను. ఎందుకో తెలియదు. అయినా సరే ఒకరోజు రాత్రి అతని ఏడుపువిని ఇంక ఊరుకోలేకపోయాను. పైకివెళ్లి తలుపుదగ్గిర నిలబడ్డాను. వెంటనే అతను ఏడ్పు మానేసి భగవంతుణ్ని ప్రార్థించడం మొదలుపెట్టాడు. అతని మొరవిని నాకు గుండె బద్దలయింది. నేనూ ఒక తండ్రిని కానందుకు ఆ క్షణంలో దేవుడికి నమస్కారం చేశాను. నేనే తండ్రినై, అటు వంటి కష్టం నాకే వచ్చినట్లయితే, భరించలేక సముద్రంలోపడి ప్రాణాలుతీసుకునే వాడినే."

"అయ్యో పాపం." అన్నాడు ఫాదరీ, అస్పష్టంగా.

"రోజులు గడిచినకొద్దీ అతను ఎవరితోనూ మాట్లాడేవాడు కాడు. మారెల్, మర్సిదామాత్రం అతన్ని చూడ్డానికి తరుచు వచ్చేవారు. నిత్యం గదితలుపులు మూసుకునే వాడు. వాళ్లు పిలిస్తే లోపలఉండికూడా పలికేవాడు కాదు. ఒకనాడు మాత్రం మర్సిదా పిలవగానే పలికి లోపలికి తీసుకెళ్లాడు. పాపం ఆమెకి దుఃఖం ముంచుకువస్తున్నా, అణుచుకుని, వృద్ధుని సముదా యించడానికి ప్రయత్నించింది. వృద్ధుడు ఆమెతో ఇలా అన్నాడు: 'అమ్మాయ్! నామాట నమ్ము. వా డింక బతికిలేడు. చచ్చిపోయాడు. వాడికోసం మనం కనిపెట్టుకుని కూచోకూడ దింక. మనకోసమే వాడు చూస్తున్నాడు. నాకు వయస్సు మీారి

పోయింది. ఫరవాలేదింక. ఆటే రోజులుపట్టదు. అందరికంటె ముందుగా నేనే వాడివగ్గరకి వెడతాను.' అన్నాడు.

"నిత్యం దుఃఖిస్తూ ఇతరుల్ని దుఃఖపెట్టేవారిని కాలక్రమేణా అందరూ విడిచిపెట్టేస్తారు. చివరికి లూయీ డాంటెనికూడా అందరూ అలాగే ఒంటరిగా విడిచిపెట్టేశారు. తరవాత మేడ మీదికి వెళ్లేవాళ్లే కనపడలేదు నాకు. ఎప్పుడైనా అరుదుగా కొత్త ముఖాలు కనపడేవి. వాళ్లు దిగి వెళ్లిపోయేటప్పుడు ఏవో పొట్లాలు దాచుకొని తీసుకువెళ్లేవాళ్లు. అవేమిటో నాకు కొన్నాళ్లతరవాత గాని తెలియలేదు. రోజు గడవనందువల్ల రోజురోజూ ఇంట్లో సామాన్లు అమ్మేశాడు. అన్నీ ఆ మాటలు. చిట్టచివరికి పాపం తన దుస్తుల్ని కూడా అమ్ముకోవలసివచ్చింది. గదికి మూడుమాసాల అద్దె బాకీపడ్డాడు. తీర్చకపోతే ఇంటిలోనించి నెట్టివేస్తానని యజమాని బెదిరించాడు. వారం రోజులు గడువివ్వవలసిందని అతని కాళ్లు పట్టుకున్నాడు. యజమాని ఒప్పుకున్నాడు. ఇదంతా నాకు ఎల్లా తెలిసిందంటె, యజమాని అతనివద్దనించి తిన్నగా నాదగ్గరకే వచ్చి చెప్పాడు మూడురోజులు రాత్రీ పగలూ వృద్ధుడు గదిలో పచార్లు చేస్తూనే ఉన్నాడు. నాలుగో రోజుని నిశ్శబ్దమైపోయింది. ధైర్యంచేసి అతని గదికి వెళ్లాను. తలుపు వేసిఉంది. తాళపుకన్నం లోనించి తొంగిచూశాను. తెల్లగా పాలిపోయి ఉన్నాడు. బొత్తిగా సత్తువలేకుండా ఉన్నట్లు కనిపించాడు. జబ్బుగా ఉన్నాడని భయపడి, ఈ సంగతి మారెల్ కీ, మర్సిదాకీ తెలియపరిచాను. ఇద్దరూ కంగారుగా వచ్చారు. మారెల్ వైద్యుని కూడా తీసుకొచ్చాడు. వైద్యుడు జ్వరమని తేల్చాడు. ఆహారం ఆట్టే ఇవ్వకూడదన్నాడు. నేనక్కడే ఉన్నాను. ఈ మాట విని అతను నవ్విన చిరునవ్వు నేనెన్నడూ మరిచిపోలేను. ఆపైన ద్వారం తెరిచే ఉంచేవాడు. ఆహారం తీసుకోకుండా మానడానికి మంచి సాకు దొరికిందిప్పుడతనికి."

ఫాదరీ గాఢనిశ్వాసం విడిచాడు. అది అణుచుకున్న మూలుగులాగుంది.

"తరవాత మర్సిదావచ్చింది. అతని స్థితి బొత్తిగా మారిపోయినట్లు కనిపెట్టింది. వెంటనే తన ఇంటికి తీసుకుపోతానని

చెప్పింది. మొరెల్ కూడా అదే మంచిదన్నాడు. బలవంతానైనా సరే తీసుకుపోవాలని ఇద్దరూ ప్రయత్నించారు. కాని ఒప్పుకోక అతను పెట్టిన కేకలూ పెడబొబ్బలూ విని భయపడి ఊరుకున్నారు. మర్సిదా అతనివద్దనే ఉండిపోయింది. మొరెల్ కిటికీవంక కను సంజ్ఞచేసి వెళ్లిపోయాడు. కిటికీలో అతను ఒక పర్సులో ధనం ఉంచివెళ్ళాడు. కాని వృద్ధుడు ఆహారం తీసుకోడానికి నిరాకరించాడు. తొమ్మిది రోజులు ఆహారం, నీళ్లు ముట్టకుండా గడిపాడు. తనకీ దుర్దశ తెచ్చిపెట్టినవాళ్లని నిందిస్తూ, చివరికి ప్రాణాలు విడిచాడు. ఆఖరిమాటగా మర్సిదాతో 'అమ్మాయీ, నువ్వు కాని ఎడ్మండ్ని చూడ్డం సంభవించినట్లయితే, నేను అతన్ని ఆశీర్వదిస్తూ మరణించానని చెప్పు' అన్నాడు."

ఫాదరీ లేచి సావడిలో రెండుసార్లు అటూ ఇటూ పచారు చేశాడు. వొణుకుతున్న చేతులతో ఎండిపోయిన పెదవులు తడువుకున్నాడు. "మీ ఉద్దేశంలో, ఆయన చనిపోవడం కేవలం..."

"ఆకలివల్ల నేనండి. ఆకలివల్ల నే" అన్నాడు కాడరూస్. "నేను క్రైస్తవుణ్ని. క్రీస్తుదేవుడిమీద ప్రమాణంచేసి చెప్తున్నాను."

ఫాదరీ గ్లాసు అందుకుని ఒక్క గుక్కలో అంతా తాగేశాడు. "ఘోరం!" అన్నాడు.

"ఇంతా అంతా ఘోరంకాదండి. అది కేవలం అతని కర్మం అనుకోడానికి కూడా వీల్లేదు. ఈ ఘోరానికి కారకులు మనుష్యులే."

"సరే చెప్పండి, ఆ మనుష్యుల్ని గురించి" అన్నాడు ఫాదరీ. "కాని ఇది మరిచిపోవద్దు మీరు ఒక్కటీ దాచకుండా సర్వం చెప్తానని మాటిచ్చారు. నిర్బంధంలోకొడుకూ, ఆకలితో తండ్రీ చచ్చిపోడానికి కారకులైన ఈ మనుష్యు లెవరు?"

"అతనిపట్ల అసూయవహించినవాళ్ళిద్దరు దీనికంతకీ కారకులు. ఒకరికి ప్రేమ వ్యవహారంలో, మరొకరికి ఉద్యోగవిషయంలో అసూయ కలిగింది. వాళ్లు ఫెర్నాండో, డాంగ్లర్."

"వాళ్లు ఈ అసూయ నెలా కక్కారు?"

"ఎడ్మండ్ బోనపార్టిస్టు ఏజంటని పోలీసులికి తెలియ పరిచారు."

"తెలియపరిచింది ఇద్దరిలోనూ ఎవరు? అసలుదోషి ఎవరు?"

"ఇద్దరూ దోషులే. పెళ్లి జరగవలసింది రేపనగా, సాయం కాలం రిజర్వ్ హోటల్లో కూర్చుని ఆ ఉత్తరాన్ని డాంగ్లర్ ఎడమచేత్తో వ్రాశాడు. ఫెర్నాండో దానిని అధికారులికి పంపాడు."

"కాని అప్పుడు మీరుకూడా అక్కడే ఉన్నారు కదా?" అన్నాడు ఫాదరీ కొంచెం విసుగుదలతో. "సంగతులన్నీ మీకు వివరంగా తెలిసేఉండాలి కదా!"

కాడెరూస్ గతుక్కుమన్నాడు. "నిజమేనండి. నేనక్కడే ఉన్నాను."

"అయితే ఈ పాపకార్యాన్ని మీరు అడ్డుకోలేకపోయారా? అంటే, వాళ్లకుట్రలో మీరుకూడా చేరే ఉన్నారన్నమాటా?"

"అయ్యో! నన్ను ఆపూట చెడతాగబెట్టేశారు. నాకు సగం చైతన్యం ఉడిగిపోయింది. అంతా చూస్తూనే ఉన్నాను. కాని ఏదో తెరలోనించి చూస్తున్నట్లుగా ఉండప్పుడు. ఆస్థితిలో ఎంత వీలుంటుందో అంతా వాళ్ళకి చెప్పిచూశాను. కాని అదంతా ఊరికే వేళాకోళానికే నన్నారు వాళ్లు."

"కాని మర్నాడు వాళ్లు నిజంగానే తంత్రంపన్ని నెరవేర్చారని మీకు తెలిసిపోయుండాలి. అయినా సరే అతను అరెస్టయినప్పుడు, అక్కడే ఉండికూడా మీ రేమీ చెప్పనేలేదు."

"అదీ నిజమేనండి. నాకు అంతా చెప్పెయ్యాలనే ఉంది. కాని డాంగ్లర్ అడ్డుకున్నాడు. 'అతనే దోషి అయినట్లయితే, ఎల్బాద్వీపంనించి అతను ఆ ఉత్తరాన్నే తీసుకువచ్చినట్లయితే, అది పోలీసులికి దొరుకుతుంది. దొరికినప్పుడు అతనిపక్షాన మాట్లాడిన వాళ్లకికూడా శిక్ష పడుతుంది' అని నన్ను భయపెట్టాడు. అప్పుడు రాజకీయాల పేరుచెప్తే చాలు భయంతో వొణికిపోయేవాడిని. అందుచేత నోరుమూసుకుని ఊరుకున్నాను. అది పిరికితనమేనని ఒప్పుకుంటాను. కాని నేను ఏ పాపం చెయ్యలేదు."

"సరే అర్థమయింది. అదంతా జరుగుతోంటే మీరు చూస్తూ ఊరుకున్నారు! అంతే!"

"అవునండి. దానివల్ల, ఆ తరవాత నేను పశ్చాత్తాపంతో దుఃఖించని రోజు లేదు. నేను చేసిన ఈ ఒక్క చిన్న పాపానికీ నన్ను క్షమించి కాపాడవలసిందని ఎప్పుడూ భగవంతుని ప్రార్థిస్తూ నే ఉన్నాను. నేను ఇప్పు డనుభవిస్తున్న కష్టాలన్నిటికీ అదే కారణ మనికూడా అనుకుంటూ ఉంటాను. ఆ ఒక్క క్షణం స్వార్థంతో చేసిన ఆ పాపానికి ఇప్పు డనుభవిస్తున్నాను. అందుకే నా భార్యతో ఎప్పుడూ ఇదంతా భగవన్నిర్ణయం అంటూ ఉంటాను.

"మీరు దాచకుండా అంతా చెప్పారు. అల్లా చేసినదోషం తెలుసుకుని పశ్చాత్తాపపడుతున్నా రంటే మీరు క్షమార్హులన్న మాట."

"నా దురదృష్టవశంవల్ల ఎడ్మండ్ మాత్రం నన్ను క్షమించ కుండానే చచ్చిపోయాడు."

"కాని ఇదంతా అతనికి తెలియదులెండి..."

"అప్పుడు తెలియకపోతేనేం? ఇప్పుడు తెలుసును. చచ్చి పోయిన వాళ్ల ఆత్మలకు సర్వం తెలుస్తుందంటారుగా."

ఫాదరీ కొంతసేపు గదిలో పచారుచేసివచ్చి మళ్లీ కుర్చీలో కూర్చున్నాడు.

"మీ రిప్పటికి రెండు మూడుసార్లు మారెల్ అంటూ చెప్పారు. ఆయ నెవరు?"

"ఆయన ఫరావోనౌక యజమాని. ఆయన ఓడలోనే డాంటే కెప్టెన్ పనిచేశాడు.

"ఆయన ఈవిషయంలో ఏం చేశాడు?"

"నిజాయితీఅయినవాడు, భీతిలేనివాడు, జాలికలవాడు, ఏం చెయ్యగలడో అదే చేశాడు. అనేకసార్లు డాంటేని విడుదలచేయించ డానికి ప్రయత్నించాడు. చక్రవర్తి తిరిగి సింహాసన మెక్కినప్పుడు అర్జీలు పెట్టాడు. ప్రార్థించాడు. ఉద్యోగుల్ని బెదిరించాడు. దీనికి

ఫలితం ఏమిటంటే, నెపోలియన్ మళ్ళీ సింహాసనభ్రష్టుడు కాగానే అతన్ని నానాతిప్పలూ పెట్టారు. డాంటే తండ్రిని చూడ్డానికి పది పన్నెండుసార్లు వచ్చి ఉంటాడు. తన వెంట తీసుకుపడతా నన్నాడు. అతని ఋణాలు తీర్చడానికీ, అంత్యక్రియలు జరపడానికీ ధనం అతనే ఇచ్చాడు. వృద్ధుడు చనిపోయేసరికి ఎవ్వరికీ ఒక్క రాగిడబ్బు బాకీలేదు. అంతా తీరిపోయింది. మోరెల్ వృద్ధునికిచ్చిన పర్సు ఇంకా నా దగ్గిరుంది. ఎర్రని ఊలుతో అల్లింది ఆపర్సు."

"మోరెల్ ఇంకా జీవించి ఉన్నారా? నిజంగా ఆయన ఉత్తముడై ఉంటాడు. ఆయనకి ధనం, ఐశ్వర్యం ఉన్నాయా?"

కాడరూస్ విరసంగా నవ్వాడు: "ఆ! నా కెంత ఐశ్వర్యం ఉందో ఇప్పుడతనికీ అంతే ఉంది. పూర్తిగా పేదవాడై పోయినాడు. అంతేకాదు. ఇప్పుడు పరాభవం జరగడానిక్కూడా సిద్ధంగా ఉంది. పాతికేళ్లు కష్టపడి మార్సెల్స్ నగరంలో పేరు ప్రతిష్ఠలు సంపాదించుకున్న మోరెల్ సర్వనాశనమైనాడు. రెండేళ్లలో అయిదు ఓడలు పోయినాయి. మూడుసార్లు దివాలా తీశాడు. ఇప్పుడింక ఆయనకి మిగిలింది డాంటే పనిచేసిన ఈ ఫరావో నౌక ఒక్కటే. దీనిమీదే ఆశలన్నీ పెట్టుకుని బతుకుతున్నాడు. అదిప్పుడు భారతదేశంనుంచి నీలిమందు తీసుకుని రావలసిఉంది. మిగతావాటి లాగే ఈ ఓడ కూడా పోయిందంటే అతనిపని అఖరన్నమాటే."

"పాపం" అన్నాడు ఫాదరీ. "ఆయనకి భార్య, పిల్లలు ఉన్నారా?"

"ఉన్నారు. ఆయన భార్య ఉత్తమఇల్లాలు. కష్టాలన్నిటినీ ఓరిమితో సహించింది. కూతురొకామె ఉంది. ఆమె పెళ్లాడబోతున్న యువకుడితో, అతని మిత్రులు మోరెల్ స్థితి చూసి, ఈ పెళ్లి వద్దంటున్నారు. కొడుకొకడున్నాడు. అతను సైన్యంలో లెఫ్టినెంట్. పాపం ఆ ముసలివాని కష్టాలు రోజురోజుకీ ఎక్కువౌతున్నాయి. తనపైన ఆధారపడేవాళ్లు లేకపోతే, అతనెప్పుడో చేతులారా ప్రాణాలు తీసేసుకునేవాడే."

"పాపం! ఎంత దుస్థితి!" అన్నాడు ఫాదరీ.

"మంచితనానికి భగవంతుడిచ్చే ప్రతిఫలం ఇదేనండి. నామాటే చూడండి. నేను మీ దగ్గరొప్పుకున్న ఈ ఒక్క టీతప్ప, ఈ జన్మలో, ఇంతవరకూ ఏపాపంచేసి ఎరగనండి. అయినా దుర్భర దారిద్ర్యం అనుభవిస్తున్నాను. నాభార్య అన్నాళ్ళ జ్వరంతో తీసుకుని తీసుకుని రేపోమాపో చచ్చిపోతుంది. నేనామె కేమీ చెయ్యలేకపోయినానుకదా! డాంటే తండ్రి మాదిరిగానే నేనూ ఆకలితో మాడి చచ్చిపోవలసినవాడినే. ఫెర్నాండో, డాంగ్లర్ సుఖైశ్వర్యాలలో మునిగి తేలుతున్నారు."

"నిజంగా?"

"నిజంగానే. వాళ్ళపనే బాగుంది. నీతైనవాళ్ళపనే ఎప్పుడూ పాడుగా ఉంది."

"అందరిలోకీ దుర్మార్గుడు డాంగ్లర్. ఏం చేస్తున్నా డిప్పుడు?"

"అతను అప్పుడే మార్సేల్స్ నగరం విడిచిపెట్టి వెళ్ళి పోయాడు. అతను చేసిన దుర్మార్గం తెలియక మారెల్ అతనికి సిఫార్సు చెయ్యగా, ఒక స్పానిష్ బాంకర్ వద్ద గుమాస్తా ఉద్యోగం దొరికింది. యుద్ధకాలంలో ఫ్రెంచి సైన్యపు సామగ్రి సరఫరా శాఖలో ఉద్యోగం సంపాదించి అపారంగా ధనం ఆర్జించాడు. తరవాత వ్యాపారంలో జూదమాడి సంపాదించినదాన్ని మూడింతలు చేసుకున్నాడు. స్పానిష్ బాంకర్ కూతుర్ని పెళ్ళిచేసుకున్నాడు. ఆమె చనిపోయిన తరవాత రాజోద్యోగి కూతురొకామెను పెళ్ళిచేసుకున్నాడు. ఆమె వితంతువు. రెండో మామగారు అధికారి. పరపతి కలవాడు. తరవాత లక్షలుగడించి బారన్ అయినాడు (బారన్ అంటే, ఇంగ్లండ్‌లో లార్డ్సు మాదిరిగానే సామంతప్రభువుల ప్రతిపత్తి కలవారు.) ఇప్పుడు బారన్ డాంగ్లర్ మాంట్‌బ్లాంక్ వీధిలో ఒక పెద్ద భవనంలో నివసిస్తున్నాడు. ఆయన కిప్పుడు, పది గుర్రాలున్నాయి. నౌకర్లు చాకర్లు ఉన్నారు. సకలైశ్వర్యాలూ అనుభవిస్తున్నాడు. ఇప్పుడాయన కెన్ని లక్షలున్నాయో తెలియదు."

"ఓహో!" అన్నాడు ఫాదరీ, అదోక వింతస్వరంతో. "అయితే ఆయన చక్కగా ఆనందిస్తున్నాడన్నమాట!"

"ఆనందించడమా? అదేమో నాకు తెలియదు. ఎవరు చెప్ప గలరు? సుఖం కాని కష్టం కాని నాలుగు గోడలమధ్యనూ దాగే రహస్యాలు. గోడలకివినడానికి చెవులుంటాయికాని, చెప్పడానికి నాలుకలుండవు. అపారధనమే సౌఖ్యం తెచ్చిపెట్టగలిగితే, తప్ప కుండా సుఖపడుతున్నాడనే చెప్పాలి.

"ఫెర్నాండో?"

"ఫెర్నాండో కూడా బాగుపడ్డాడు. చక్రవర్తి రెండో సారి రాగానే అతన్ని సైన్యంలోకి పిలిచారు. లినీ యుద్ధంలో అతనున్నాడు. యుద్ధం జరిగినరాత్రి అతను సైన్యాధిపతి శిబిరంవద్ద పహారాకి నియోగించబడ్డాడు. శిబిరంలో అప్పుడు శత్రుపక్షంతో రాయబారాలు జరుగుతున్నాయి. ఆ రాత్రే ఆ సైన్యాధిపతి తిరగబడి, ఇంగ్లీషువారితో చేరడానికి ఏర్పాటు జరిగింది. అతను ఫెర్నాండోని తన కూడా రమ్మ న్నాడు. ఫెర్నాండో తన పహారాని విడిచిపెట్టేసి సైన్యాధి పతితో చేరి శత్రువులతో కలిసిపోయాడు. నెపోలియన్ ఓడి పోకుండా ఉన్నట్లయితే, అటువంటి పని చేసినందుకు ఫెర్నాండోకి ఉరిశిక్షపడవలసింది. కాని నెపోలియన్ ఓడిపోయాడు కాబట్టి తరవాత ప్రభుత్వంలో అతనికి స్తోమతు చిక్కింది. సబ్ లెఫ్టినెంట్ హోదాలో ఫ్రాన్స్‌కి తిరిగి వచ్చాడు. సైన్యాధిపతి ప్రాపకంవల్ల స్పానిష్ యుద్ధకాలంలో 1823లో కెప్టెన్ అయినాడు. అప్పటికి డాంగ్లర్ వ్యాపార జూదంలో ఉన్నాడు. ఫెర్నాండో స్పానిష్ దేశస్థుడు. అందువల్ల మాడ్రిడ్‌లో పరిస్థితు లెలా ఉన్నాయో కనిపెట్టడానికి అతను పంపబడ్డాడు. అక్కడ అతను డాంగ్లర్‌ని కలుసుకుని మాట్లా డాడు. ఆ దేశంలో రాజరికపక్షవాదులు తోడ్పడతా రని తన సైన్యాధిపతికి తెలియపరిచాడు. తరవాత యుద్ధాన్ని అతనే నిర్వ హించాడు. కొన్నివర్గాల సహాయంతో, తనకు తెలిసిన ఆ దేశంలో సులువుగా విజయాలు సాధించాడు. అతన్ని కల్నల్ చేసి, లీజన్ ఆఫ్ ఆనర్ పతకమిచ్చి, కౌంట్‌హోదా నిచ్చి సన్మానిం చింది ఫ్రెంచిప్రభుత్వం."

"ఆహా! విధివైపరీత్యం!" అన్నాడు ఫాదరీ.

"అవునండి. ఇంకా ఉంది. వినండి చెప్తాను. స్పెయిన్‌తో యుద్ధం ఆగిపోగానే, ఇంక యూరప్‌లో శాంతి ఏర్పడే సూచనలు కనిపించాయి. ఫెర్నాండోకి ఇంక చెయ్యడానికేమీ కనపడలేదు. ఒక్క చోటమాత్రం ఇంకా శాంతి ఏర్పడలేదు. గ్రీస్ దేశం, టర్కీ చక్రవర్తిపైన తిరగబడింది. స్వాతంత్ర్యంకోసం అప్పుడే యుద్ధం ప్రారంభించింది. గ్రీస్ తరఫున యుద్ధం చెయ్యడానికి అనుమతి పొంది ఫెర్నాండో వెళ్లాడు. అప్పుడతని పేరు కౌంట్ ఆఫ్ మార్సెర్ఫ్. అలీపాషా సైన్యంలో లెఫ్టినెంట్ జనరల్ హోదాతో చేరాడు. అలీపాషా చచ్చిపోయాడు. చచ్చిపోతూ ఫెర్నాండోకి అపారమైన ధన మిచ్చాడు. ఆ ధనంతో ఫెర్నాండో ఫ్రాన్స్‌కి తిరిగి వచ్చాడు. ఇక్కడ అతనికి లెఫ్టినెంట్ జనరల్ సైనికపదవి ఖాయమయింది."

"అంటే ఇప్పుడతను..."

"అంటే ఇప్పుడతను హెల్డర్ వీధిలో ఒక పెద్ద భవనంలో నివసిస్తున్న భాగ్యశాలి."

ఫాదరీ ఏదో చెప్పబోయి ఆగాడు. తరవాత కొంత ప్రయత్నంమీద ఇలా అన్నాడు: "మర్సిడామాటేమిటి? ఆమెకి కూడా ఐశ్వర్యం ఉందా?"

కాడరూస్ చెప్పాడు: "ఈనాడు పారిస్‌లో మర్సిడా వంటి అద్భుతమైన స్త్రీ మరొకామె లేదు. ఎడ్మండ్ వెళ్ళిపోయినప్పుడు మొదట ఆమె మతిపోయినట్లుండేది. విల్‌ఫర్ట్‌ని ఆమె ప్రార్థించడం సంగతి ఇదివరకే చెప్పాను. డాంటెస్ తండ్రిపట్ల ఆమె చూపిన భక్తి శ్రద్ధల్ని గురించి కూడా చెప్పాను. ఈకష్టాలలో ఉండగా ఆమెకు మరొకటి వచ్చిపడింది. ఫెర్నాండో ఆమెను విడిచి వెళ్ళిపోవలసి వచ్చింది. అతను చేసిన అక్రమం ఆమెకి తెలియదు. తనకి సోదరునివంటి వాడని భావించింది. అతను వెళ్లిపోగానే ఆమె పూర్తిగా ఒంటరైపోయింది. మూడుమాసాలు దుఃఖిస్తూ గడిపింది. ఎడ్మండ్‌ని గురించి కాని, ఫెర్నాండోని గురించి కాని ఆమె కేమీ తెలియరాలేదు. నిరాశతో ప్రాణాలు

కపింటి ఉన్న వృద్ధు డొక్కడే ఆమెకు తోడైనాడు. మార్సెల్స్ నించి కాటలన్స్ గ్రామానికి వెళ్ళే దారిలో రెండు రోడ్లు కలిసే చోట కూర్చుని నిత్యం గడిపేది. ఒకనాటి సాయంకాలం ఆమె అలా కూర్చుని, ప్రాణాలు విసిగి నిస్పృహతో ఇంటికి చేరుకున్న సమయానికి, ఫెర్నాండో ఉన్నాడక్కడ. అత నప్పుడు లెప్టినెంట్ హోదాలో ఉన్నాడు. ఆమెకి పోయిన ప్రాణం లేచి వచ్చినట్లయింది. ఆమెకి ఫెర్నాండోపట్ల ఎన్నడూ విరుద్ధభావం లేదు. కాని ప్రేమించలేదు. అంతే. ఆమె హృదయం మరొకనికి అర్పితమయింది. అతను మాయమై పోయాడు. బహుశా చచ్చిపోయి ఉంటాడు. ఈభావం కలగ్గానే ఆమెకి దుఃఖం పొంగివచ్చింది. ఇతరు లీమాట అంటే వినడానికి ఆమె సహించలేక పోయేది. కాని అప్పుడిప్పుడే ఆమెకి తోచసాగింది. అదీ కాక వృద్ధుడు నిత్యం ఆమెతో 'మన ఎడ్మండ్ చచ్చిపోయే వుంటాడు. లేకపోతే, ఈపాటికి మనదగ్గిరికి తిరిగి రాడా?' అంటూఉండేవాడు. ఆవృద్ధుడే బతికిఉంటే, ఆమె ఇంకెవరినీ పెళ్లి చేసుకునేది కాదేమో. ఫెర్నాండోకి ఇది అర్థమయింది. అందుకనే వృద్ధుడు చనిపోయాడని తెలుసుకున్న తరవాతనే తిరిగివచ్చాడు. అప్పుడతనొక పెద్దసైనికోద్యోగి. మొదటిసారి ఆమెను చూసినప్పుడు ఆమెను ప్రేమించినమాట ఎత్తలేదు. రెండోసారి చెప్పాడు. ఎడ్మండ్ కోసం పరితపిస్తున్న ఆమె ఆరుమాసాలు గడువుకోరింది."

ఫాదరి పరితాపంతో చిరునవ్వు నవ్వి అన్నాడు: "అంటే పద్దెనిమిది మాసాలు నిరీక్షించినన్నమాట! ఇంతకంటె ప్రియులకు కావలసిన ప్రేమబంధం ఏంకావాలి?"

"ఆరుమాసాల తరవాత ఎకోలే చర్చిలో వివాహం జరిగింది"

"అంటే, ఎడ్మండ్ని పెళ్లిచేసుకోడానికి ఏర్పాటయిన చర్చిలోనే నన్నమాట. పెళ్లికొడుకులు మారారు, అంతే!"

"అక్కడే మర్సిదా పెళ్లి జరిగింది. యథాలాపంగా చూసే వారికి ఆమె శాంతంగా ఉన్నట్లు కనపడినమాట నిజమేకాని రిజర్వ్ హోటల్ ప్రక్కనించి నడుస్తుండగా ఆమె స్పృహ తప్పి పడిపోయింది. ఇక్కడే ఎడ్మండ్తో ఆమె ప్రధానపు విందు పద్దెని

మిది మాసాలకు ముందు జరిగింది. అప్పటికికూడా ఆమె ప్రేమ డాంటేపైనే ఉంది. ఫెర్నాండోకి ఆనందంగానే ఉంది. కాని ఎప్పటికప్పుడు డాంటే తిరిగివస్తాడనే భయంతో కలవరపడుతూనే ఉన్నాడు. ఆ చోటు విడిచిపెట్టి వెళ్లిపోవాలనీ, తన భార్య నక్కడినించి దూరంగా తీసుకుపోవాలనీ తొందరలో ఉన్నాడు. పెళ్లైన వారంరోజుల్లో ఇద్దరూ వెళ్లిపోయారు"

"ఆ తరవాత మీ రెప్పుడైనా మళ్లీ మర్సిడాను చూశారా?"

"చూశాను. యుద్ధకాలంలో పెర్పినాన్ అనే ఊళ్లో ఆమె ఉండగా చూశాను. ఫెర్నాండో యుద్ధానికి వెడుతూ ఆమెను అక్కడ దిగబెట్టాడు. అప్పు డామె కొడుక్కి విద్య చెప్తోంది."

"కొడుక్కా?"

"అవును. ఆమె కొడుకు పేరు ఆల్బర్ట్."

"కొడుక్కి విద్య చెప్పడం అంటే, ఆమె విద్యావంతురాలన్న మాట. ఎడ్మండ్ చెప్పినదాన్ని బట్టి, ఆమె పల్లెకారికూతురనీ, అందమైనదైనా చదువు, నాగరికతా లేనిదనీ అనుకున్నానే?"

"డాంటికి తన ప్రియురాలినిగురించి తెలిసినదింతేనా? అందాన్ని బట్టే తెలివితేటల్ని బట్టే రాణులు కాగలిగితే, మర్సిడా మహారాణి కాగలిగేది. ఐశ్వర్యం అధికమైనకొద్దీ ఆమె తెలివి, గాంభీర్యం అధికమైనాయి. ఆమె చిత్రలేఖనం, సంగీతం, మొద లైన వన్నీ అభ్యసించింది. మనలో మన మాట. అసలు సంగతి ఏమిటంటే, ఆమె లోని దుఃఖాన్ని మరిచిపోయి మనస్సు మళ్లించు కోడంకోసం ఇవన్నీ అభ్యసించేదని నా నమ్మకం. ఇప్పు డింక ఐశ్వర్యం గౌరవం ఆమెకి ఉపశాంతి నిచ్చాయనేది నిస్సందేహం. భాగ్యవంతురాలు, కౌంటెస్ అయినాసరే ఆమె ఇంకా సుఖంగా లేదని నా నమ్మకం.

"మీ రెందుకలా అనుకున్నారు?"

"నన్ను దారిద్ర్యం చుట్టుకున్నప్పుడు నా పాతమిత్రు లెవ రైనా సహాయపడతారని ఆశపడ్డాను. డాంగ్లర్ ఇంటికి వెడితే అతను నన్ను చూడనైనా లేదు. ఫెర్నాండో ఇంటికి వెళ్లాను. అతను నౌకరుద్వారా నాకు నూరు ఫ్రాంకులు పంపాడు. నేను వెళ్లి

పోతుండగా మర్సిడా నన్ను చూసింది. పాతిక బంగారునాణే లున్న పర్సు ఒకటి నా కాళ్ల ముందు పడింది. తలెత్తి చూడగానే మర్సిడా కిటికీతలుపులు మూసివేసుకుంది."

"విల్‌ఫర్ట్ ఏమైనారు?"

"డాంటే అరెస్టయిన కొన్ని రోజులికి సెంట్‌మిరాన్ కూతుర్ని పెళ్లిచేసుకున్నాడనీ, మార్సెల్స్‌నించి వెళ్లిపోయినాడనీ విన్నాను. అతన్నికూడా అదృష్టదేవత ఆశీర్వదించే ఉంటుంది. డాంగ్లర్ మాదిరిగానే ధనం సంపాదించిఉంటాడు. ఫెర్నాండో మాదిరిగానే పరపతి సంపాదించుకుని ఉంటాడు. నేనొక్కణ్నే మనుష్యులవల్లా భగవంతుడివల్లాకూడా వంచితుణ్నై, దారిద్ర్యంలో పడి నీచంగా కొట్టుమిట్టాడుతున్నాను."

"లేదు." అన్నాడు ఫాదరీ. "మీరు మోసపోతున్నారు. భగవంతుడు వంచించినట్లు కనపడుతుంది, న్యాయం జరగడానికి కొద్దిగా జాప్యమైనప్పుడు. కాని భగవంతు డెన్నడూ మరిచిపోడు. ఆ క్షణం ఎప్పుడో రాకపోదు. దీనికి తార్కాణం ఇదుగో." ఈ మాటలు చెప్తూ ఫాదరీ జేబులోనించి వజ్రాన్ని తీసి కాడరూస్ చేతికిచ్చాడు: "ఇదిగో దీన్ని తీసుకోండి. ఇది మీదే."

"ఏమిటి? నాదా?" అన్నాడు కాడరూస్ బిగ్గరగా. "మీరు పరిహాసం చేస్తున్నారు!"

"లేదు. ఈ వజ్రాన్ని అతని మిత్రుల కివ్వవలసింది. కాని ఎడ్మండ్‌కి ఒక్కడే మిత్రుడున్నాడని తెలుస్తోంది. అందువల్ల పంపకం అనేది ఉండదు. ఈ వజ్రం తీసుకుని అమ్ముకోండి. దీని విలువ ఏభైవేల ఫ్రాంకులు. దీనితో మీ దారిద్ర్యం తీరిపోతుం దనుకుంటాను."

"అయ్యా!" అన్నాడు కాడరూస్. "దరిద్రుడికష్టాలుచూసిగాని, సుఖాలు చూసిగాని, అవహేళన చెయ్యడంన్యాయం కాదు."

"కష్టాలు, సుఖాలు అంటే ఎటువంటివో నాకుచక్కగా తెలుసును. ఇతరుల సుఖదుఃఖాల్ని చూసి పరిహసించను. ఇది తీసుకోండి. తీసుకుని దీనికి ప్రతిగా వృద్ధునిగది కిటికీలో మార్సెల్ వొదిలిన పర్సు ఇవ్వండి. అదింకా మీదగ్గరే ఉందని మీరు చెప్పారు."

కాడరూస్ లోపలికి వెళ్ళివచ్చి పొడుగాటి పెద్ద పర్సు ఒకటి ఇచ్చాడు. గిల్టు ఉంగరాలతో ఎర్రని ఊలుతో తయారు చెయ్యబడిన పర్సుని ఫాదరీ తీసుకున్నాడు. వజ్రాన్ని కాడరూస్‌కి ఇచ్చాడు.

"నిజంగా మీరు దేవదూతలు!" అన్నాడు కాడరూస్. "ఎడ్మండ్ దీన్ని మీ చేతి కిచ్చాడని ఎవరికీ తెలియదు కదా? మీరే తీసుకుని ఎవ్వరితోనూ చెప్పకుండా ఉంటే ఎవరికి తెలుస్తుంది? ఏమౌతుంది?"

ఫాదరీ లేచి టోపీ అందుకున్నాడు. "మీరు చెప్పినదంతా నిజమేనని నేను నమ్మవచ్చునా?"

"ఇటు వినండి" అన్నాడు కాడరూస్. "ఇదిగో ఈమూలనే క్రీస్తు సిలువ ఉంది. ఆ పెట్టెమీద బైబిల్ ఉంది. అది తియ్యండి. నేను వీటిపైన చెయ్యుంచి ప్రమాణంచేసి చెప్తాను. జరిగిందేదో అదే చెప్పాను. నిజానిజాలు అన్నీ భగవంతుని సమక్షంలోనే నిర్ణయమౌతాయి."

"మంచిది." అన్నాడు ఫాదరీ. కాడరూస్ నిజమే చెప్పాడని ఇప్పుడతనికి విశ్వాసం కలిగింది "మంచిది. ఈ వజ్రం మీకు అదృష్టం తెచ్చిపెడుతుంది. ఒకరికొకరు హానిచేసుకునే మానవులకి దూరంగా వెళ్ళిపోతున్నాను. సెలవు."

ఫాదరీ తలుపు తెరిచి బైటికి వెళ్ళాడు. గుర్రమెక్కి వచ్చిన దారినే ఎడమదిక్కుగా వెళ్ళిపోయాడు. కాడరూస్ తిరిగి ఇంట్లోకి వెళ్ళగానే అక్కడ కారొడెల్ ఉంది. ఆమె ముఖం బొత్తిగా పాలిపోయి ఉంది. ఆమె శరీరం కంపించిపోతోంది.

"నే నిప్పుడు విన్నదంతా నిజమేనా? నిజంగానే అతను వజ్రాన్ని పూర్తిగా మనకే ఇచ్చేశాడా?" అని ప్రశ్నించింది.

"ఇదిగో, ఇంతకంటె నిజమైన దేముంటుంది?" అంటూ వజ్రాన్ని చూపించాడు.

"ఏమో ఇది విలువలేని తళుకురాయి కాకూడదా?"

కాడెరూస్ తెల్లబోయాడు: "ఇతను నాకు తళుకురాయి నెందుకివ్వాలి?"

"వజ్రమెహమా ! నీ రహస్యాల్ని లాగడానికి"

ఈమాటతో కాడెరూస్ నిశ్చేష్టుడైనాడు.

"ఆ! ఆ!" అన్నాడు. గభాల్న తన టోపీ అందుకుని, "ఇప్పుడే కనుక్కుని వస్తాను. ఇప్పుడు బుకేర్‌లో సంత జరుగుతూ ఉంటుంది. పారిస్‌నించి నగలవర్తకులు వస్తారక్కడికి. దీన్ని వాళ్లకి చూపిస్తాను. నువ్వు ఇల్లు చూస్తూ ఉండు. నేను రెండుగంటల్లో తిరిగి వస్తాను."

కాడెరూస్ పరుగుమీద మెట్లు దిగాడు. ఫాదరీ వెళ్లిన దిక్కుగా కాక, కుడివైపుకు వెళ్లిపోయాడు.

"ఏభైవేల ఫ్రాంకులు" అని గొణిగింది రాడెల్. "నిజంగా ఇది భాగ్యమే. అయినా అంత చెప్పుకోదగిన భాగ్యం కాదు."

# 28

ఇది జరిగిన మరునాడు ముప్ఫైఏళ్ల వయస్సుకల బ్రిటిష్ దేశస్థుడొకడు మార్సేల్స్ మేయర్‌ని దర్శించాడు. అతను నీలికోటు, తెల్లపంట్లాము తొడుక్కున్నాడు. వేషభూషణాలు చూస్తే భాగ్యవంతుడని తెలుస్తుంది.

మేయర్‌తో అతనిలా చెప్పాడు. "నేను రోమ్‌నగరానికి చెందిన థామ్సన్ ఎండ్ ఫ్రెంచ్ కంపెనీలో గుమాస్తాని. వ్యాపార రీత్యా పదేళ్లనించి మాకు మారెల్ ఎండ్ సన్ కంపెనీతో సంబంధముంది. మా వ్యాపార సంబంధం దాదాపు లక్ష ఫ్రాంకుల వరకూ ఉంటుంది. ఇప్పుడీ కంపెనీ దివాలా తీస్తోందని విన్నందువల్ల మాకు భయం కలిగింది. అందువల్ల పనిగట్టుకుని మీవల్ల ఈ కంపెనీ గురించిన సమాచారం తెలుసుకోవాలని వచ్చాను."

మేయర్ అతనివంక ఎగాదిగా చూసి ఇలా చెప్పాడు. "పాపం మారెల్ నాలుగైదేళ్లుగా దుస్థితిలోపడ్డారన్న సంగతి

నాకు తెలుసును. నేను కూడా ఆయనకి పదివేల ఫ్రాంకులవరకూ ఋణమిచ్చినప్పటికీ, ఆయన వ్యాపారంతో నా కెలాటి సంబంధం లేదు. అందువల్ల ఆ కంపెనీ ఆర్థిక స్థితిని గురించి తెలపడం నా పనిగాదు. నేను మేయర్ని, మారెల్ని గురించి నన్ను అడగండి. నా హోదాలో నేను చెప్తాను. ఆయన నిజాయితీ అయిన మనిషి. ఇంతవరకూ వ్యాపారంలో ఆయన నీతి తప్పడం కాని, మాట తిరగడం కాని నే నెరగను. నేను చెప్పగలిగేది అంతవరకే. పైన ఇంకా తెలుసుకోవాలనుకుంటే కారాగారాల ఇన్స్పెక్టర్ బోవిల్ని అడగండి. మారెల్ వ్యాపారంలో అతనికి రెండులక్షల ఫ్రాంకుల పెట్టుబడి ఉంది. భయపడవలసిందేదైనా ఉంటే, నాకంటె అతనికే ఎక్కువ తెలుస్తుంది. అతను నోవాలీ వీథిలో ఉంటున్నాడు.

మేయర్ సంకోచాన్ని గ్రహించి, బ్రిటిష్ దేశస్థుడు వెంటనే నోవాలీవీధికి వెళ్లి బోవిల్ని కలుసుకున్నాడు. అతన్ని చూసి బ్రిటిష్ దేశస్థుడు చకితుడైనాడు. అతన్ని చూడ్డం ఇదే మొదటిసారి కాదని తోస్తుంది. కాని బోవిల్ జొత్తిగా పరధ్యానంలో ఉన్నాడు. దేన్నిగురించో పిచ్చిగా ఆలోచిస్తున్నాడు. ఇతర విషయాల్ని గురించి యోచించడానికిగాని, గత విషయాల్ని జ్ఞప్తికి తెచ్చుకోడానికిగాని అతనిమనస్సు స్థిమితంగా లేదు. మేయర్ని అడిగినట్లుగానే బ్రిటిష్ దేశస్థుడు బోవిల్నికూడా అడిగాడు.

బోవిల్ నిస్పృహచెంది ఇలా చెప్పాడు: "ఏం చెప్పమంటారు? మీరు భయపడుతున్నదంతా నిజం. నేను సర్వనాశనమైపోయాను. మారెల్ కంపెనీలో రెండులక్షల ఫ్రాంకులు పెట్టుబడి పెట్టాను. ఇంకొక పదిహేనురోజుల్లో పెళ్లికావలసిన నా కూతురికి అది కట్నమివ్వవలసిన సొమ్ము. ఇందులో ఒకలక్ష ఈనెల పదిహేనో తేదీనీ, మిగతాది వచ్చేనెల పదిహేనో తేదీనీ నాకు చెల్లించాలని ఏర్పాటయింది. సరిగ్గా వాయిదాలు దాటకుండా చెల్లించాలని మారెల్కి తెలియపరిచాను. ఇప్పుడే ఆయన వచ్చివెళ్లాడు. ఫరావో నౌక ఈ పదిహేనో తేదీకి రేవు చేరకపోయినట్లయితే ఋణం తీర్చలేనని చెప్తున్నాడు."

"ఋణం చెల్లించలేరని మీరు భయపడుతున్నారా?"

"అసలు ధనమంతా నీళ్లపా లయిందనే అనుకుంటున్నాను."

"అయితే మీ పెట్టుబడి వాటాలు నేను కొనడానికి సిద్ధంగా ఉన్నాను."

"మీరా? అంటే మినహాయింపు ఎక్కువకట్టి తీసుకుంటారా?"

"లేదు. సరిగ్గా రెండు లక్షలకే కొంటాం. మా కంపెనీ ఆలా వ్యాపారం చెయ్యదండి" అన్నాడు బ్రిటిష్ దేశస్థుడు నవ్వుతూ. జేబులోనుంచి బాంక్ నోట్లకట్టలు తీశాడు. దాదాపు నాలుగులక్ష లుంటుంది కట్టల్లో.

బోవిల్ ఇలా అన్నాడు: "అయ్యా! నేను ముందుగానే మీకు చెపుతున్నాను. బహుశా ఈ పెట్టుబడి ధనంలో తిరిగి మీకు నూటికి ఆరువంతులైనా (అంటే దాదాపు రూపాయికి అణా కూడా) రాదు."

"అదంతా నాకు తెలియదు. మా కంపెనీయే చూసుకుంటుంది. థామ్సన్ ఎండ్ ఫ్రెంచ్ కంపెనీ తరఫున వారేది చెయ్యమంటే అది చెయ్యడమే నా పని. నేను సిద్ధంగా ఉన్నాను, డబ్బు లెక్క పెట్టి ఇచ్చెయ్యడానికి. నాకు కావలసిందల్లా కమిషన్ మాత్రమే."

"తప్పకుండా. అందులో తప్పేముంది?" అన్నాడు బోవిల్. "మేం మామూలుగా ఇచ్చేది నూటికి ఒకటిన్నర. మీకు నూటికి మూడు—అయిదు కావాలా? మీ కేం కావాలో చెప్పండి ఇచ్చేస్తాను."

"నేనూ మాకంపెనీ మాదిరిగానే వ్యవహరిస్తాను. మా వ్యాపారం ఇల్లా ఉండేదు. నేను కోరేది వేరు. మీరు కారాగారాల తనిఖీ ఆఫీసరను కుంటాను. మీదగ్గిరే రిజిస్టర్లు అన్నీ ఉంటాయి కదా? నాకు రోమ్‌లో విద్య గరపిన వారిపేరు ఫెరయా. ఆయన అకస్మాత్తుగా అంతర్థానమైనాడు. తరవాత నాకు తెలిసింది, ఆయన ఇఫ్‌కోటలో బందీగా ఉన్నాడని. నిర్బంధంలో ఉండగా ఆయనెలా మరణించారో నేను సమాచారం తెలుసుకోవాలి."

"నాకతను బాగా గుర్తే." అన్నాడు బోవిల్. "పిచ్చివాడు. ఎక్కడో పెద్ద ధన నిక్షేపం పాతర ఉన్నట్లు తనకి తెలుసుననుకునేవాడు. తన్ని విడిచిపెట్టినట్లయితే ప్రభుత్వానికి లక్షలకి లక్షలు ఇస్తాననేవాడు."

"పాపం! ఆయన నిజంగానే చచ్చిపోయాడా?"

"అవును చచ్చిపోయాడండి. ఆరు నెల్లవుతుంది. కిందటి ఫిబ్రవరిలో. నాకది స్పష్టంగా ఎందుకు జ్ఞాపకం ఉందంటే, అప్పుడొక చిత్రమైన సంఘటన కూడా జరిగిందండి. అతనిగదికి ఏభైగజాల దూరంలో ఒక బోనపార్టిస్ట్ ఏజంటు గది ఉండేది. 1815 లో నెపోలియన్ తిరిగి రావడానికి బాధ్యులైన ముఖ్యులలో ఈ ఏజంటు ఒకడు. ఇతన్ని నేను 1816 లోనో 1817 లోనో చూడ్డం సంభవించింది. అప్పుడతని గదికి వెళ్ళడానికి సిపాయిల్ని కూడా వెంటబెట్టుకోవలసి వచ్చింది. అతని ముఖాన్ని నేనెన్నడూ మరిచిపోలేను."

బ్రిటిష్ దేశస్థుడు చిరునవ్వు నవ్వాడు. "ఏభైగజాల దూరం ఉందనా మీరు చెప్తున్నారు?" అన్నాడు.

"అవునండి. ఏభైగజాలుంటుంది. అయితేం? ఈ దుండగుడు ఎల్లా సంపాదించాడో పరికరాలు సంపాదించి, రెండుగదులికీ మధ్య సొరంగం తవ్వాడు. ఆ సొరంగంద్వారా ఇద్దరూ కలుసుకునేవారు. అది తరవాత బయటపడింది."

"పారిపోవడం కోసం తవ్వింది కాబోలు సొరంగం!"

"అవునవును. అందుకే. కాని నిర్భాగ్యులు. ఈలోగానే ఫెరయాకి మూర్ఛ పట్టుకుని చచ్చిపోయాడు."

"దాంతో తప్పించుకునే కుట్ర భగ్నమైపోయిందన్నమాట!"

"చచ్చిపోయిన వాడికంతే, కాని ఆ దుండగుడికి కాదు. అసలు అతను చచ్చిపోవడమే దాంటేకి తప్పించుకోడానికి వీలిచ్చింది. ఇఫ్ కోటలో చచ్చిపోయిన వాళ్ళని శ్మశానంలో పాతిపెడతారనుకుని ఉంటాడు. అందువల్ల శవాన్ని తన గదిలోకి తీసుకెళ్ళి తన పడక మీద పడుకోబెట్టి, తను గోనెసంచిలో దూరాడు. శ్మశానానికి తీసుకు వెడతారు కదా అని కనిపెట్టుకున్నాడు."

"చాలాసాహసం అనాలి. ఎంతధైర్యం ఉండాలి దీనికి!"

"అబ్బో ధైర్యానికేం లోటు? చెప్పానుకదా చాలాదుండ గుడని! అయితే ప్రభుత్వానికి తనంతటతనే తన పీడవదిలిం చేశాడు. అక్కడ చచ్చిపోయిన వాళ్లని గోనెల్లోచుట్టి ఇనపగుళ్లు తగిలించి సముద్రంలో పారేస్తారు."

"అలా గా?"

"అవును. డాంటేకికూడా కాళ్లకి ఇనపగుండు కట్టి సము ద్రంలో పడేశారు."

"నిజంగా? అంతపని జరిగిందా?"

"జరక్క ఏం కాతుంది? గుట్టలమీదనించి గిరవాటు వేసిన ప్పుడు వాడు ఆశ్చర్యపడిఉంటాడు. అప్పుడువాడి ముఖంచూస్తే ఎలాగుండేదో!" అని బోవిల్ నవ్వుతున్నాడు.

ప్రతినిధి శేషుడు కూడా నవ్వాడు. "అవును ఊహించ వచ్చును. అంటే అతను సముద్రంలో మునిగి చచ్చిపోయాడన్న మాట? ఇఫ్‌కోట గవర్నర్‌కి పిచ్చివాడిబాధ, గుండెగుడి బాధ ఒకేసారి వొదిలిపోయాయన్న మాట."

"అవును, వొదిలిపోయాయి."

"అయితే దీన్నిగురించి సంజాయిషీ ఏమీ తయారు కాలేదా?"

"కాకేం! డాంటేకి బంధువు లెవరైనా ఉంటే అతను బతి కున్నాడో చచ్చిపోయాడో చెప్పమని వారు అడగవచ్చు. అందు వల్ల అతను చచ్చిపోయినట్లు సర్టిఫికెట్ తయారుచేశారు."

"అతని కేమైనా ఆస్తి అదీఉంటే వారసత్వం కూడా నిర్ణయ మైపోడానికి కాబోలు. అయితే అతను చచ్చిపోయాడని రూఢేనా?"

"ఆ రూఢే! సర్టిఫికెట్ సిద్ధంగా ఉంది. ఎవరడిగితే వాళ్ల కివ్వడానికి."

"సరే. మన రిజిస్టర్లమాట చెప్పండి."

"అవునవును. ఈ కథలో రిజిస్టర్లమాట మరిచిపోయాను. ఫెరయాని గురించిన సమాచారం కావాలికదూ? నాతో లోపలికి రండి. అక్కడ రిజిస్టర్ చూపిస్తాను."

బోవిల్ లేచి పక్కగదిలోకి వెళ్లాడు. బ్రిటిష్ దేశస్థుడు అతన్ని అనుసరించాడు. అతన్ని ఒక కుర్చీలో కూర్చోబెట్టి, ఒక రిజిస్టర్ అతనిముందు పడేసి సావధానంగా చూడమనిచెప్పి బోవిల్ ఇంటిలోకి వెళ్లిపోయాడు.

రిజిస్టర్లో ఫెరయా చచ్చిపోయినాడన్న సర్టిఫికెట్ సులువుగానే కనపడింది. బోవిల్ చెప్పినకథ అతనికి నచ్చినట్లుంది. గబగబా పేజీలు తిప్పి డాంటెకి సంబంధించిన కాగితాలు చూశాడు.

ఆ కాగితాల్లో అంతా వ్రాసిఉంది. నేరారోపణ, పరీక్ష, మారెల్ అర్జీ, దానిపైన విల్ఫర్ట్ సంతకం, అన్నీ కనపడ్డాయి. నేరారోపణ చేసిన కాగితాన్ని తీసి మడిచి జేబులో పెట్టుకున్నాడు. పరీక్ష వివరాలు చదివాడు. అందులో నయర్టైర్ పేరుమాత్రం ఎక్కడా కనపడలేదు. విల్ఫర్ట్ సలహా ప్రకారం 1815 ఏప్రిల్లో మారెల్ పెట్టుకున్న అర్జీ చదివాడు. సదుద్దేశంతోనే మారెల్ డాంటే నెపోలియన్కి చేసిన సేవను గురించి ఉత్ప్రేక్షించి వ్రాశాడు అర్జీలో. ఇదంతా నిజమేనని తన అభిప్రాయం తెలుపుతూ విల్ఫర్ట్ పక్కనే సంతకం పెట్టాడు.

ఇప్పుడీ వ్యవహారమంతా స్పష్టంగా తెలిసిపోయింది. ఈ అర్జీని విల్ఫర్ట్ దాచేసి, నెపోలియన్ మళ్ళీ పదవిభ్రష్టుడైన తరవాత ఉపయోగించాడన్నమాట.

మెల్లిగా పేజీలుతిప్పుతుంటే ఒకచోట తనపేరుప్రక్కనే ఈవాక్యాలు కనపడ్డాయి. "ఎడ్మండ్ డాంటే-బోనపార్టిస్ట్, దౌర్జన్యపరుడు. నెపోలియన్ ఎల్బానించి తిరిగి రావడానికి చాలా తోడ్పడ్డాడు. ఇతన్ని రహస్యనిర్బంధంలో ఉంచాలి. గట్టి పహరా పెట్టాలి."

ఈవాక్యాలకింద మరొకదస్తూరీలో "ఇంక ఇతనివిషయంలో చెయ్యదగిందేదీ లేదు" అని వ్రాసిఉంది.

దస్తూరీలు పోల్చి చూడగా పై వాక్యాలు విల్‌ఫర్ట్ వ్రాసినవేనని స్పష్టపడింది. కిందిమాటలు ఎవరో తనిఖీ ఆఫీసరు ఉపకారం చెయ్యడానికి ప్రయత్నించి, పైవాక్యాలు చదివి, భయపడి ఇలా వ్రాసి ఉంటాడు.

గదిలోకివచ్చి కూర్చున్న బోవిల్ పత్రిక చదవడంలో, బ్రిటిష్ దేశస్థుడు డాంగ్లర్ వ్రాసిన నేరారోపణ పత్రాన్ని తీసి దాచుకోడం గమనించలేదు. ఆ పత్రంమీద ఫిబ్రవరి 27, మార్సేల్స్ తపాలాముద్ర ఉంది. బోవిల్ ఇది చూసినప్పటికీ, ఈపత్రం ఏమంత అవసరమయింది కాదనుకుని, చూడనట్లు ఊరుకునేవాడే. దీనికంటె అతనికి రెండులక్షలఫ్రాంకులు ముఖ్యం.

రిజిస్టర్ మూసేసి బ్రిటిష్‌దేశస్థుడు లేచి నిలబడ్డాడు, "మీకు కృతజ్ఞుణ్ని. నా పనైపోయింది. ఇంక నేను నావాగ్దానాన్ని నిలబెట్టుకోవాలి. మీకు మారెల్ ఎంత ఋణం ఉన్నారో వ్రాసిఇచ్చి, ధనం ముట్టినట్లు నాకు రసీదివ్వండి. మీకు ధనం ఇచ్చేస్తాను." అన్నాడు.

బోవిల్ గబగబా రసీదు వ్రాసి, అదీ, ఋణపత్రం ఇచ్చేశాడు. బ్రిటిష్ దేశస్థుడు నోట్లు లెక్కపెట్టి ఇచ్చేశాడు.

# 29

మారెల్ కంపెనీ కార్యాలయాన్ని మంచిరోజుల్లో చూసినవారు ఇప్పుడు చూస్తే గుర్తుపట్టలేరు. వ్యాపారసంస్థలో ఉండవలసిన హడావిడీ, పనిరద్దీ ఇప్పుడక్కడ కనిపించవు. కార్యాలయం చిన్నబోయినట్లుంది. పాత ఉద్యోగులలో ఇద్దరు మాత్రం ఇప్పుడు మిగిలారు. ఒకడు ఇరవైనాలుగేళ్ల యువకుడు. అతనిపేరు ఇమాన్యుయల్ రేమండ్. మారెల్ కుమార్తెను ప్రేమించాడు. రెండో వ్యక్తి కాషియర్. వృద్ధుడు. ఒక కన్ను గుడ్డి. ఇతన్ని అందరూ కాక్లే అని పిలుస్తారు.

కాక్లే మొదటినించీ మారెల్ కంపెనీనే అంటిపెట్టుకుని ఉన్నాడు. అయితే అతని ఉద్యోగంలో చిత్రమైన మార్పు వచ్చింది. కాషియర్ దగ్గిరనించి దర్వాన్‌వరకూ అన్ని ఉద్యోగాలూ అతనే చేస్తున్నాడిప్పుడు. మారెల్ కంపెనీకి చెడ్డరోజులు

వచ్చినా అతనొక్కడే విడిచి వెళ్లిపోకుండా ఉన్నవాడు. ఈ కంపెనీ తప్పకుండా మళ్లీ వృద్ధిలోకి వచ్చి తీరుతుందని అతనికి గుడ్డినమ్మకం. కంపెనీపట్ల భక్తి ఎక్కువ.

మారెల్ కంపెనీలో కాక్లే ఇరవైఏళ్లనించి పనిచేస్తున్నాడు. కంపెనీస్థితి ఎలాగున్నప్పటికీ అతనికి జీతంమాత్రం నెలకి నిక్కచ్చిగా అందుతోంది. గడిచిన మాసానికి లెక్కలు తయారుచేసి ఉంచాడు.

లెక్కల్లో మారెల్ ఒక పొరపాటు చేసినట్లు కాక్లే కనిపెట్టాడు. డెబ్బైసెంట్లు తన కెక్కువ ఇచ్చాడు. అది తీసుకెళ్లి భక్తితో యజమానికిచ్చి పొరపాటు చూపించాడు. మారెల్ విషాదం ఉట్టిపడే చిరునవ్వుతో, డబ్బుని ఖాళీడ్రాయర్లో పడేసి, "నిజంగా నువ్వు నీతికి బంగారంతో సమానమోయ్!" అన్నాడు.

గతమాసం కష్టంమీద గడిచింది. కాని అప్పటినించీ రోజులు మరింత గడ్డుగా ఉన్నాయి. ఇకముందు చెల్లింపులకోసం ఉన్న ధనమంతా అడుగంటా గీకి ఇయ్యవలసివచ్చింది. తన దుస్థితి నగరంలో తెలిసిపోతుందనే భయంతో, రహస్యంగా బుకేర్ సంతకి వెళ్లి భార్యవీ కూతురివీ నగలు కొన్నింటిని అమ్మి డబ్బు తెచ్చాడు. ఈ డబ్బుతో ఇప్పటికి ఋగ్బు తప్పకోవచ్చు. కాని ఖజానాపెట్టె ఖాళీగా ఉంది.

థామ్సన్ ఎండ్ ఫ్రెంచ్ కంపెనీ గుమాస్తా వచ్చేసరికి పరిస్థితులిలా ఉన్నాయి. ఆ గుమాస్తాని కంపెనీకార్యాలయంలో ఇమాన్యూల్ పలకరించాడు. మాట్లాడవలసిన బాధ యజమానికి లేకుండా, తనే అతను వచ్చిన పనేమో కనుక్కోడానికి ప్రయత్నించాడు. కాని గుమాస్తా ఇతనితో ఏ విషయాన్నీ చెప్పడానికి ఒప్పుకోలేదు. మారెల్‌తో స్వయంగా మాట్లాడాలన్నాడు. ఇమాన్యూల్ దీర్ఘనిశ్వాసం విడిచి గుమాస్తాని కాక్లేకి ఒప్పగించాడు. వీరిద్దరికీ మేడమెట్లవద్ద పదిహేడేళ్ల చక్కని యువతి ఒకామె కనపడింది. ఆమె కొత్తపురుషుని భయంతో చూసింది. కాక్లే ఆమెని కనిపెట్టలేదు. కాని బ్రిటిష్ దేశస్థుడు గమనించాడు.

"మారెల్ గదిలో ఉన్నారా జూలీ?"అని అడిగాడు కాక్లే.

జూలీ జంకుతూ చెప్పింది: "అక్కడే ఉన్నారనుకుంటాను. అయినా ముందు మీరు వెళ్ళిచూసిరండి. అక్కడ ఆయన ఉన్నట్లయితే అప్పుడీయన్ని లోపలికి పిలుచుకువెళ్లవచ్చు."

"ముందు చెప్పి తరవాత నన్ను పిలుచుకువెళ్ళవలసిన అవసరం లేదండి. థామ్సన్ ఎండ్ ఫ్రెంచ్ కంపెనీ సుమాస్తా వచ్చాడని చెప్తే చాలు" అన్నాడు బ్రిటిష్ దేశస్థుడు.

యువతిముఖం పాలిపోయింది. గబగబా మెట్లు దిగి ఇమాన్యూల్ వద్దకు వెళ్లింది. ఈలోగా కాక్లే మేడమీద వరండాలో సుమాస్తాని కూర్చోబెట్టి ఒక గదిలోకి వెళ్లాడు. తరవాత ఇవతలికి వచ్చి సుమాస్తాని పిలిచాడు.

మారెల్ ఒక మేజావద్ద కూర్చుని చిత్తాలు తిరగవేస్తున్నాడు. పథ్నాలుగేళ్లలో అతనిలో చాలామార్పు వచ్చింది. ముఖం తెల్లగా పాలిపోయిఉంది. తల పూర్తిగా నెరిసిపోయింది. ముఖమంతటా ముడతలు పడ్డాయి. ఒకప్పుడు స్థైర్యాన్ని స్ఫురింపచేసే అతని ముఖంలో ఆందోళన, చాంచల్యం వ్యక్తమౌతున్నాయి. ఏవిషయంలోనూ ఏ నిర్ణయానికీ రాలేకపోతున్న స్థితి స్పష్టపడుతోంది.

కొత్త వ్యక్తిని చూడగానే అతని ఆందోళన అధికమయింది. "మీరు నాతో మాట్లాడవలసినపని ఉందన్నారా?"అని అడిగాడు.

"అవునండి. నేనెవరితరఫున వచ్చానో తమకి తెలుసునను కుంటాను."

"అవును. థామ్సన్ ఎండ్ ఫ్రెంచ్ కంపెనీ తరఫున వచ్చారని మా కాషియర్ చెప్పాడు."

"అవునండి. మా కంపెనీ ఈ మాసంలోనూ వచ్చేమాసంలోనూ మొత్తం నాలుగులక్షల ఫ్రాంకులు ఫ్రాన్సుదేశంలో చెల్లించాలి. మీ కంపెనీ ఎన్నడూ గడువుదాటకుండా ధనం చెల్లిస్తూ వస్తూఉంటుంది కాబట్టి, మీ సంతకంతో వచ్చిన బిల్లులు అన్నిటినీ మా కంపెనీ తీసుకుని ధనం ఇస్తూవచ్చింది. ఇప్పుడా బిల్లుల

తొలూకు ధనాన్ని మీవద్ద తీసుకుని ఈ దేశంలో మేం చెల్లించవల సినది చెల్లించడానికి నన్ను పంపారు."

మారెల్ తడబడుతూ, "మొత్తం ఎంతుంటుంది?" అన్నాడు.

బ్రిటిష్ దేశస్థుడు జేబులోనించి ఒక కాగితాలకట్టతీసిచూస్తూ ఇలా చెప్పాడు: "మొట్ట మొదట కారాగారాల తనిఖీఆఫీసరు బోవిల్ మావద్ద తీసుకున్న రెండులక్షల ఫ్రాంకుల బిల్లుంది. ఇది ఉందని మీరొప్పుకుంటారా?"

"తప్పకుండా ఒప్పుకుంటాను. అయిదేళ్ల కిందట అత నా ధనం నాకు నూటికి నాలుగున్నర వడ్డీకి ఇచ్చాడు."

"అది మీ రెప్పుడు చెల్లించాలి?"

"ఈ నెల పదిహేనో తేదీని సగం, వచ్చేనెల పదిహేనో తేదీని మిగతా సగం ఇవ్వాలి."

"ఇది సరిపోయిందండి. తరవాత మీ సంతకాలతో వచ్చి నది ముప్పై రెండున్నర వేల ఫ్రాంకులికి బిల్లు లున్నాయి. ఇవిగో."

"అవునండి. అవన్నీ నాకు గుర్తే. ఇంతేనా, ఇంకా ఉన్నాయా?"

"ఉన్నాయండి. ఇవి కాక రెండులక్షల ఎనభైఏడున్నర వేల ఫ్రాంకులికి సెక్యూరిటీ లున్నాయండి."

ఈ లెక్కల్ని బ్రిటిష్ దేశస్థుడు ఏకరువు పెడుతున్నప్పుడు మారెల్ పడిన మనోవ్యథను వర్ణించడం కష్టం.

"రెండులక్షల ఎనభైఏడున్నర వేలు" అని గొణిగాడు. మాటలు పెదవులమీద తేలిపోతున్నాయి.

"అవునండి" అన్నాడు బ్రిటిష్ దేశస్థుడు. "మీరీ బుణాలు చెల్లించలేని స్థితిలో ఉన్నారని మార్సేల్స్‌నగరంలో వదంతు లున్నాయని మీకు నేను చెప్పక తప్పదండి."

ఈ కరుకుమాటలు వినేసరికి మారెల్ ముఖం మరింత పాలి పోయింది. అతన్ని భీతి ఆవహించింది.

"అయ్యా! మారెల్ ఎండ్ సన్ కంపెనీ నేటివరకూ ఒక్క బిల్లు గడువుకి చెల్లించకుండా ఉన్నదిలేదు."

"అవునవును. అది మాకు తెలుసునండి. కాని ఇప్పుడీ బిల్లుల్ని మీరు గడువులోపల చెల్లించగలరా అని అడుగుతున్నాను."

మారెల్ వొణికిపోయాడు. కొత్త వ్యక్తిని శ్రద్ధగా పరిశీలించి ఇలా అన్నాడు: "చెల్లించగలను—నాఓడ క్షేమంగా రేవు చేరినట్లయితే. చేరుతుందనే ఆశపడుతున్నాను. కాని ఏ ప్రమాదం వల్లనైనా ఫరావోనాక రాకపోయినట్లయితే, బిల్లుల చెల్లింపు కట్టిపెట్టవలసి ఉంటుంది."

"ఈ చిక్కులో మీకు సహాయం చెయ్యగల మిత్రులెవరూ లేరా?"

మారెల్ చిరునవ్వు నవ్వాడు. కాని అది చిరునవ్వులా లేదు. ఇలా అన్నాడు: "ఇటువంటి విషయాల్లో మిత్రు లుండరు. వ్యాపారబాంధవ్యాలు మాత్రమే ఉంటాయి."

"నేను వస్తున్నప్పుడు రేవులోకి ఒక ఓడ వస్తుండగా చూశాను."

"తెలుసును."

"అది మీ ఓడ కాదా?"

"కాదు. అది బోర్డోనగరానికి చెందిన ఓడ. దానిపేరు లా గిరాండ్."

"ఆ ఓడనావికులు మీ ఓడనిగురించి సమాచారం చెప్ప లేరా?"

"నేను నిజం చెప్పేస్తున్నానండి. నా ఓడనిగురించి సమాచారం తెలియక ఎంత బాధపడుతున్నానో, తెలిస్తే అంతకంటె బాధపడవలసి వస్తుందని భయపడుతున్నాను. సమాచారం రానంతవరకూ కనీసం ఆశ అనేదైనా ఉంటుంది."

"అదేమిటి?" అన్నాడు బ్రిటిష్ దేశస్థుడు వెనక్కి తిరిగి. "ఆ రొదేమిటి?"

మెట్లదగ్గర పెద్దధ్వని, కలవరం వినవచ్చాయి. ఎవరో విలపిస్తూ అటూ ఇటూ పరుగులెడుతున్నారు.

ఇద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. మారెల్ శరీరం యావత్తూ కంపించిపోతోంది. కొత్తవ్యక్తి జాలిగా అతని వంక చూస్తున్నాడు. గదితలుపు తెరుచుకుంది. జూలీ కనపడింది.

ఆమె బుగ్గలుకన్నీళ్లతో తడిసిపోయాయి. ముఖం పాలిపోయింది. మారెల్ లేచి నిలబడ్డాడు.

"నాన్నా!" అంటూ వచ్చి తండ్రిచేతుల్లో వాలిపోయింది.

"నా నోటితో ఎలా చెప్పను?" అని వెక్కి వెక్కి ఏడ్చింది.

"అయితే, ఫరావో కూడా మునిగిపోయిందా?" అన్నాడు మారెల్ వొణికిపోతూ. కూతురు సమాధానం చెప్ప లేదు. అవునన్నట్లు తలూపింది.

"మరి నావికులు?" అని అడిగాడు మారెల్.

"అందరూ బతికారు" అంది కూతురు. "బోర్డోనౌక వాళ్ళ నందర్నీ రక్షించింది."

మారెల్ ఊర్ధ్వదృష్టితో చేతులెత్తి నమస్కరించాడు. ఏదో దివ్యశక్తివల్ల బాధని జయించినట్లు, సుఖదుఃఖాల కతీతమైన భావం ఒకటి అతని ముఖంలో వ్యక్తమౌతోంది. "ఈ బాధ లితరు లెవరికీ వద్దు భగవంతుడా! ఈ పరీక్షకి నన్నొక్కడినే నువ్వెంచు కున్నందుకు నేను కృతజ్ఞుణ్ని" అన్నాడు.

బ్రిటిష్ దేశస్థునికి కళ్లు చెమ్మగిలినాయి.

చిట్టచివరికి తేరుకుని మారెల్ బిగ్గరగా అన్నాడు: "మీరందరూ అక్కడ నిలబడ్డం ఎందుకు? ఇలా రండి."

ఇంతలో మారెల్ భార్య విలపిస్తూ ప్రవేశించింది. ఆమె వెనక ఇమాన్యూల్ వచ్చాడు. ఆ వెంట మొరటు తేరిన నావికులు వచ్చారు.

"ఎల్లా మునిగిపోయింది?" అన్నాడు మారెల్.

"ఇలా రా, పెనిలన్" అని ఒక నావికుని పిలిచాడు ఇమాన్యూల్. "ఏం జరిగిందో చెప్పు" అన్నాడు.

పెనిలన్ నోట్లో పొగాకు తమ్మి ఈ బుగ్గనించి ఆ బుగ్గకి తీసుకుని, ఒక అడుగు ముందుకు వచ్చి, ఒక్క కాలుమీదే ఒంటి బరువంతా మోపుతూ, రెండో కాలు కదుపు తుంటూ ఇలా చెప్పాడు:

"తుపాను అందుకునేసరికి బ్లాంక్ అగ్రానికీ, బోయడల్ అగ్రానికీ మధ్య ఉన్నామండి. వారంరోజులు గాలి నిశ్చే

పంగా ఉంది. ఆ తరవాత జోరెక్కింది. నేను చుక్కాని దగ్గి రున్నాను. కెప్టెన్ నాదగ్గిర కొచ్చి 'అమాలఆ మబ్బు లేమిటోయ్ పెనిలన్' అన్నాడు. 'ఏమి టేమిటి? అవి జోరుగా ఇటువైపే పనిగట్టుకుని వస్తున్నాయి' అన్నాను. 'నేనూ అదే అనుకుంటున్నాను' అన్నాడు కెప్టెన్. తెరపగ్గాలు వొదులు చెయ్యమని అక్కడనించే ఆయన కేక పెట్టాడు. వొదులు చెయ్య డానికి చాలసేపు పట్టింది. వొదులు చేశామో లేదో, రివ్వుమని కొడుతూవచ్చిపడింది హోరుగాలి. బోటు ఊగిపోవడం మొదలెట్టింది. 'అయితే తెరచాప మరీ ఎక్కువుందోయ్' అన్నాడు కెప్టెన్. 'అందరూ తలో చెయ్యివేసి తెరచాపలు దించండి' అని కేక పెట్టాడు. అయిదు నిమిషాల్లో పెద్ద చాప దించేశారు. ఇంకా పై చాపలూ, వెనకచాపలూ ఉన్నాయి. 'ఏమిటోయ్ బుర్ర ఊపు తున్నావ్ పెనిలన్?' అన్నాడు కెప్టెన్. 'ఏముంది? ఇది పెద్ద తుపానే. కాకపోతే నాపేరు పెనిలన్ కాదు' అన్నాను. నా మాట లింకా పూర్తి కానేలేదు, ముందుగా ఒక తెర గాలి కొట్టింది. కెరటాలు లేచిపోయినాయి. కెప్టెన్కి ఇదంతా తెలు సును. 'మీది తెరచాపల్లో రెండు దించండి' అని కేకపెట్టాడు. పక్క పొడుగు పగ్గాలు విప్పమన్నాడు. వెనక తెరచాపలు దించ మన్నాడు."

"అవ్వే, ఆ సముద్రంలో అది చాలదు" అన్నాడు బ్రిటిష్ దేశస్థుడు. "నేనైతే నాలుగు తెరచాపల్నీ దించిఉండేవాణ్ణి" అన్నాడు.

హఠాత్తుగా కొత్త వ్యక్తి ఇలా మాట్లాడేసరికి అందరూ తెల్ల బోయారు. అతని కంఠస్వరం స్థిరంగా ఉంది.

"మేము అంతకంటె ఎక్కువే చేశాం" అన్నాడు పెనిలన్. "పై తెరలన్నీ దించేసి, చుక్కాని గాలికి వాలుగాతిప్పాం. పదినిమిషాల్లో బోటు బాణంలాగ పరిగెత్తడం మొదలెట్టింది."

"బోటు చాలా పాతది. అది అలా వొదిలిపెట్టవలసింది కాదు" అన్నాడు బ్రిటిష్ దేశస్థుడు.

"సరిగ్గా అదే జరిగింది." అన్నాడు పెనిలన్. "ఒకచోట నీరెక్కడం మొదలుపెట్టింది. అది కప్పడానికి ప్రయత్నం చేశాం.

ఇంక మనం మునిగిపోతామనుకుంటాను పెనిలన్" అన్నాడు కెప్టెన్. 'చుక్కాని నాకిచ్చి, నువ్వు కిందితొట్టిలోకెళ్లు' అన్నాడు. చుక్కాని వొదిలేసి తొట్టిలోకెళ్లాను. అప్పుడే అక్కడ మూడడుగులలోతు నీరెక్కింది. పైకి పరిగెత్తి పంపులు తెమ్మని కేకలెట్టాను. కాని అప్పటికే అంతా మించిపోయింది. పంపుల్తో ఎంత తోడినా లాభం లేకపోయింది. తోడినదానికి రెట్టింపు నీరెక్కుతోంది."

"తరవాత ?" అన్నాడు బ్రిటిష్ దేశస్థుడు.

"నీళ్లు గంటకి రెండంగుళాల చొప్పన మట్టం ఎక్కుతోంది. చిట్టచివరికి కెప్టెన్ అన్నాడు. 'చాలింక రండి. మనం చెయ్యగలిగినంతా చేశాం. మారెల్ మనమీద మాట వెయ్యలేరు.' ఇంక చిన్నబోట్లు దించమన్నాడు."

పెనిలన్ ఈమారు మారెల్ వంక తిరిగి అన్నాడు "చూడండి. మాకు ఫరావో అంటే ప్రీతి లేకపోలేదు. నావికుడికి నౌకంటే ఎంత ప్రాణమైనప్పటికీ, తన ప్రాణంకంటె తీపికాదు. అందువల్ల చిటికలో చిన్నబోట్లు ఓడమీదనించి దిగాయి. పెద్ద పడవలోకి ఎనమండుగురం ఎక్కాం. కెప్టెన్ ఓడ దిగిరానంటాడు. కాని నేనే అతన్ని నడుము పట్టుకుని బలవంతాన పడవలోకి గెంటి, అఖర్ని నేనూ దూకాను. ఇంకొక్క క్షణం ఆలస్యమైతే, ప్రాణాలకి ముప్పువచ్చేదే. నేను దూకీ దూకగానే ఫెళఫెళమని చప్పుడయింది. కన్నుమూసి తెరిచేటంతలో తెరచాప కొయ్యలు విరిగిపోయాయి. తెరచాప లెగిరిపోయాయి. ఇంక మామాట ఆట్టే చెప్పవలసిందిలేదు. మూడురోజులు ఆహారం నీరు లేవు. తరవాత లా గిరాండ్ కనపడింది. సంజ్ఞచేశాం. వెంటనే అది మా దగ్గరకొచ్చి, అందర్నీ ఎక్కించుకుంది. అంతా సరిగ్గా నేను చెప్పినట్లుగానే జరిగింది. ఒక్కమాట పొల్లులేదు. నేను నావికుణ్ని. ప్రమాణంచేసి చెప్తున్నాను."

మారెల్ దీర్ఘనిశ్వాసం విడిచాడు. మెల్లిగా ఇలా అన్నాడు: "నాయనా మీరు ధైర్యవంతులు. మొదటినించీ నన్ను నా దురదృష్టమే వెన్నాడుతోంది. నా కర్మనే నేను దూషించుకోవాలి. మీ కింతెంత జీతాలు రావాలో చెప్పండి."

"మూడు మాసాల జీతం రావాలండి" అన్నాడు పెనిలన్.

"కాక్లే, మీ కందరికీ ఒక్కొక్కడికి రెండువందల ఫ్రాంకులు చొప్పున ఇయ్యి. నారోజులు బాగుంటే పైన రెండేసి వంద లివ్వవలసినవాణ్ని. కాని నా స్థితి బాగుండలేదు. నా దగ్గిరింక మిగిలిన ధనం నాది కాదు. నన్ను క్షమించండి."

పెనిలన్ జాలిగా నవ్వాడు. వెనక తన మిత్రులతో గుసగుసలాడి మళ్ళీ ముందు కొచ్చాడు: "మా వాళ్ళిప్పటికి ఏభై ఫ్రాంకు లిస్తే చాలునంటున్నారండి, మిగతాది తరవాత ఇవ్వచ్చునండి." అన్నాడు.

మారెల్ కి దుఃఖం పొంగివస్తున్నట్లుంది. దిగమింగి ఇలా అన్నాడు: "నాయనా! మీ మేలు నే నెన్నడూ మరిచిపోలేను. నిజంగా మీ అందరి హృదయాలూ బంగారం. ఫరవాలేదు. డబ్బు తీసుకోండి. మీ కింకెక్కడైనా ఉద్యోగం దొరికితే చేరండి."

ఈ ఆఖరిమాటతో నావికుల్లో గడబిడ బయలుదేరింది. అందరూ భీతితో ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. పెనిలన్ నిశ్చేష్టుడైనాడు. కాస్తంతలో తప్పింది కాని లేకపోతే పొగాకు తమ్మి గొంతుకలో అడ్డుపడేదే. "అంటే, మమ్మల్ని ఉద్యోగం నించి తొలగిస్తున్నారా? మేం చేసిన పని మీకు నచ్చలేదా?" అన్నాడు.

"లేదు లేదు" అన్నాడు మారెల్. "నచ్చకపోవడం కాదు. నేను మిమ్మల్ని తొలగించడం లేదు. కాని నే నేం చెయ్యగలను? నా కింక ఓడలు లేవు. నావికులింక నా కవసరం లేరు."

"ఏమిటి? మీ కింక ఓడలే లేవా? లేకపోతే కొత్తవి కట్టించేవరకూ మేం ఉండగలం లెండి."

"కాని కొత్తఓడలుకట్టించడానికి నాదగ్గిరధనంలేదు పెనిలన్. మీరు భక్తితోనూ ప్రేమవల్లనూ నా దగ్గిరే ఉంటా మంటున్నారు. కాని ప్రయోజనం లేదు."

"మీదగ్గిర ధనం లేకపోతే మా కెందు కిస్తారీ జీతాలు? ఫరావో అలంకారాలన్నీ పోయి ఒట్టి మోడుసముద్రంమీద తేలుతోంది. అలాగే మేమూ ఉంటాం."

"చాలు నాయనా చాలు." అన్నాడు మారెల్. అతనికి దుఃఖం ఆగడం లేదు. "మీరు వెళ్లండి. మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. ఎప్పటికైనా మంచిరోజులు వస్తాయేమో. ఇమాన్యూల్, నువ్వు వీళ్లని తీసుకెళ్లి నేను చెప్పినట్టు చెయ్యి" మారెల్ కొడుక్కి కూడా సంజ్ఞచేశాడు. వాళ్లందరూ వెళ్లిపోయారు.

మారెల్ భార్యతోనూ కుమార్తెతోనూ "నేనీ పెద్దమనిషితో మాట్లాడాలి. ఒక్క క్షణం వెళ్లండి" అన్నాడు.

స్త్రీలిద్దరూ బ్రిటిష్ దేశస్థుడక్కడున్నాడని అప్పుడు గాని కనిపెట్టనేలేదు. అతనివంక చూసి వెళ్లిపోయారు.

మారెల్ కుర్చీలో కూలబడిపోయాడు. "అంతా చూస్తూనే ఉన్నారు కదా? అంతా విన్నారు. ఇంక నేను చెప్పవలసిందేమీ లేదు."

"చూశానండి, మరొక ముప్పు వచ్చిపడింది మీకు. అందువల్లనే నేనొక చిన్న సహాయం చెయ్యాలనుకుంటున్నాను."

"అయ్యో"! అనుకున్నాడు మారెల్.

"ఉండండి. మీ కంపెనీలో నా పెట్టుబడికూడా ఉంది కామా?"

"ఏమున్నా లేకపోయినా, త్వరలో చెల్లించవలసిన బిల్లులు చాలా ఉన్నాయి మీ దగ్గర."

"మీకు మరికొంత గడువు కావాలా?"

"మరికొంత గడువే ఇస్తే, నా పరువూ, నా ప్రాణాన్నీ కాపాడినవారౌతారు."

"ఎంత గడువు కావాలి?"

మారెల్ కొంచెం తటపటాయించాడు. తరవాత "రెండు మాసాలు" అన్నాడు.

"సరే. మీకు మూడు మాసాలు గడువిస్తాను. సెప్టెంబర్ 5 వ తేదీవరకూ. ఆ రోజుని సరిగ్గా ఉదయం 11 గంటలకి— అంటే ఈ వేళకే—మీ దర్శనం చేసుకుంటాను."

"తప్పకుండా. ఆ గడువుకి నేను ధనమైనా ఇస్తాను. లేదా చచ్చిపోతాను." ఈ మాట లనేటప్పుడు అతని గొంతుక బిగుసుకు పోయింది.

కొత్త బిల్లులు వ్రాయబడినాయి. పాతవి చింపి ముక్కలు చేశారు. మూడు మాసాలలో ఓడయజమాని తన సంపదనంతా పోగుచేసి ధనం చెల్లించాలి.

మెట్లవద్ద బ్రిటిష్ దేశస్థునికి జూలీ ఎదురయింది. ఆమె మెట్లు దిగుతున్నట్లు కనపడింది. కాని నిజానికి అతనికోసం ఎదురు చూస్తోంది.

భక్తితో అతనికి నమస్కరించింది. ఆమెనోట మాట రాలేదు. బ్రిటిష్ దేశస్థుడు అతిమెల్లిగా ఆమెతో అన్నాడు. "మీకు 'సింద్‌బాద్' అనే సంతకంతో ఒక రోజుని ఉత్తరం వస్తుంది. ఆ ఉత్తరంలో ఉన్న ప్రకారం, అక్షరాలా చెయ్యండి. అది ఎంత వింతగా కనపడినాసరే మానవద్దు."

"అలాగేనండి" అంది జూలీ.

"మంచిది. నేను వడుతున్నాను. మీ రెప్పుడూ న్యాయం తప్పకుండా ఉంటే, భగవంతుడే తప్పక మేలుచేస్తాడనిమరవకండి. ఇమాన్యూల్‌ని పెళ్ళిచేసుకుని సుఖపడగలరు." ఈ మాటలు చెప్పి నాతనవ్యక్తి మెట్లుదిగి వెళ్ళిపోయాడు. కింద అతనికి పెనిలన్ కనపడ్డాడు. అతని రెండు చేతుల్లో నూరు ఫ్రాంకుల చొప్పున ఉన్నాయి. తీసుకు వెళ్ళిపోవడమా లేక ఇచ్చెయ్యడమా అని నిర్ధారించుకోలేకుండా ఉన్నట్లు కనపడ్డాడు. బ్రిటిష్ దేశస్థుడు అతనితో అన్నాడు : "నాతో ఒకసారి రండి. మీతో మాట్లాడవలసినపని ఉంది."

# 30

అనుకోకుండా థామ్సన్ ఎండ్ కంపెనీ ఏజంటు మూడు మాసాలు గడువివ్వడంతో, తన నింక శనిగ్రహం విడిచిపెట్టే శాడనీ, మళ్ళీ మంచిరోజులు వస్తాయనీ మారెల్ భావించాడు. దీన్నిగురించి ఆలోచించినకొద్దీ అతనిపట్ల ఏజంటుకి ఎందు కింత

ర

దయకలిగిందో బోధపడ్డంలేదు. బహుశా ఇందులో స్వాం-చింత ఉండవచ్చునని మాత్రమే అతనికి తోచింది. "మూడు లక్షల ఫ్రాంకు లివ్వవలసిన మనిషిని ఇప్పుడు నాశనంచేసి తెచ్చుకునే నష్టానికి బదులు, మూడు మాసాల తరవాత మూడు లక్షలూ తీసుకోడం మంచిది; అని ఏజంటు తల్చిఉంటా" డనుకున్నాడు.

అతని దురదృష్టవశాత్తూ, వ్యాపారబాంధవ్యం కలఇతరులు ఇంతవరకూ కృతఘ్నతవల్లకానీ, గుడ్డితనంవల్లకానీ ఈపాటి నమ్మిక చూపలేకపోయాడు. ఒకదాని తరవాత ఒకటిగా తగిలిన ఈ దెబ్బలకి అతను తట్టుకుని నిలవలేడని మార్సేల్స్‌లో వ్యాపారులనుకున్నారు. కాని నెల తిరిగేసరికి మారెల్ కంపెనీలో ఎప్పటి మాదిరిగానే గడువులోపల చెల్లింపులు సాగిపోతూఉండడంతో, అందరికీ అమితమైన ఆశ్చర్యం కలిగింది.

అయినా వ్యాపారులికి పూర్తి నమ్మకం కలగలేదు. నెల పూర్తయేసరికి అతని లెక్కల్లో పెద్దలోటు కనిపించి తీరుతుందనుకున్నారు.

ఆ నెల గడిచిపోయింది. మారెల్ తనకు గల ఆధారాలన్నిటినీ కూడదీసుకోడానికి బ్రహ్మాండమైన కృషి చేశాడు. ఇదివరలో అతని సంతకంతోవచ్చే ఏ బిల్లయినాసరే, ఏ తేదీదైనాసరే ఇట్టే మన్నించబడేది. ఇప్పుడతను తొంభైరోజులలోపుకే బిల్లు లిస్తున్నాడు. కాని ఇతని బిల్లులు వెళ్లేసరికి బాంకులు మూసేసిఉండేవి. అయితే చేతిలో కొద్దిగా డబ్బు తిరుగుతూఉండేది. దానితోనే జూలై నెలాఖరువరకూ గడిపాడు.

థామ్సన్ ఎండ్ ఫ్రెంచ్ కంపెనీ ఏజంటుమాత్రం ఆ తరవాత మళ్లీ మార్సేల్స్‌నగరంలో కనపడలేదు. ఫరావోనావికులు వేరే ఎక్కడో కుదురుకున్నట్లున్నారు. అందరూ ఒక్కసారే కనపడకుండా మాయమైనారు.

వ్యాపారాన్ని వృద్ధిపరచడానికి మారెల్ ఆగస్టుమాసంలో కృషి చేశాడు. ఆగస్టు 20 వ తేదీని అతను గుర్రాలబండి ఎక్కడం కొందరు చూశారు. ఈ నెలాఖరుకైనా ధనం లేక మారెల్ చెల్లింపులు కట్టిపెట్టక తప్పదనుకున్నారు. అటువంటి సమయంలో నగ

రంలో ఉండలేక, ముందే వెళ్ళిపోయినాడనుకున్నారు. వ్యాపార మంతా కాక్లేకీ, ఇమాన్యూల్ కీ విడిచిపెట్టాడని అందరూ భావించారు. కాని ఎవ్వరెన్ని భావించినా, ఆగస్టు 31 వ తేదీకి మారెల్ కంపెనీ సక్యంగానే వ్యాపారం చేస్తోంది. కాక్లే అతని కుర్చీలో ఎప్పటిమాదిరిగానే కూర్చున్నాడు. చేతి కిచ్చిన బిల్లుల్ని శ్రద్ధగా పరిశీలించి గడువుదాటకుండా డబ్బు చెల్లిస్తూనే ఉన్నాడు. ప్రజల కిదంతా ఏమిటో అర్థంకాలేదు. సెప్టెంబర్ ఆఖరుకైనా దివాలాతియ్యక తప్పదని మళ్ళీ అనుకున్నారు.

ఒకటో తేదీని మారెల్ పారిస్ నించి తిరిగివచ్చాడు. అతని కోసం అతని కుటుంబమంతా ఆతృతతో వేచిఉన్నారు. ఈ ప్రయాణంవల్ల ఉపకారం కలుగుతుందని ఆశతో ఉన్నారు.

తనవల్ల స్పానిష్ బాంకర్ కి సిఫార్సు పొంది ఉద్యోగం సంపాదించి, ఆ సహాయంవల్లనే ఇప్పుడు లక్షాధికారైన డాంగ్లర్ సహాయంచేస్తాడని మారెల్ కి తట్టింది. డాంగ్లర్ ని సహాయం అడగాలనే అభిప్రాయం మారెల్ కి చాలకాలంగా ఉంది. కాని ఏదో తెలియరాని సంకోచంవల్ల ఇంతవరకూ వెనకాడాడు. చిట్టచివరికి, ఇంక గత్యంతరం లేక సహాయం అర్థించాడు. అతని సందేహం రూఢయింది. తిరస్కారంవల్ల కలిగిన పరాభవంతో ఇప్పుడు తిరిగి వచ్చాడు. కాని ఒక్క పరుషమైన మాట కాని దూషణవాక్యం కాని అతని నోటివెంట రాలేదు. తన గదిలోకి వెళ్లి కూర్చుని కాక్లేని రమ్మని కబురు పంపాడు.

"ఇంక మన పని కూలిపోయినట్లే" అన్నారు స్త్రీ లిద్దరూ ఇమాన్యూల్ తో. ముగ్గురూ కొద్దిసేపు సంప్రదించారు. సైమ్ లో ఉన్న తన సోదరుని వెంటనే రావలసిందిగా జూలీ ఉత్తరం వ్రాయాలని నిర్ణయించుకున్నారు. ఇంత దెబ్బకి తట్టుకోవాలంటే కావలసిన వాళ్లందరూ దగ్గరుండడం అవసరమని స్త్రీలు భావించారు. అదీకాక మాక్సిమిలియన్ కి వయస్సు ఇరవై రెండేళ్లే అయినప్పటికీ, అతనిమాటంటే తండ్రికి మంచి గురి ఉంది. అతను సరళవర్తన గల యువకుడు. దృఢచిత్తుడు. అతని భవిష్యజ్జీవనం గురించిన ప్రశ్న వచ్చినప్పుడు తండ్రి అతన్నే ఎంచుకోవచ్చని స్వేచ్ఛ నిచ్చాడు. మాక్సిమిలియన్ సైన్యంలో చేరాలను

కున్నాడు. అందువల్ల కష్టపడి ఎకోల్ పాలిటెక్నిక్‌లో విద్య నభ్యసించాడు. తరవాత సబ్ లెఫ్టినెంట్‌గా సైన్యంలో చేరాడు. ఏడాదినించి ఈ హోదాలో ఉన్నాడు. త్వరలోనే లెఫ్టినెంట్ కాగల వీలుంది. సైన్యంలో అతను అతిశ్రద్ధగా నియమాలు పాటించే యువకుడని పేరు తెచ్చుకున్నాడు.

ఇప్పుడీ కష్టసమయంలో ఆగుకోవలసిందని అతన్ని తల్లీ చెల్లెలూ కోరారు. పరిస్థితి ఎంత క్లిష్టంగా ఉందో వాళ్ళకి తెలుసును. మారెల్ పిలవగా గదిలోకి వెళ్ళిన కాక్లే ఇంతలోనే రావడం వాళ్ళు చూశారు. అతని ముఖం పాలిపోయింది. మనిషి కంపించి పోతున్నాడు. తరవాత కాక్లే చితా ఆవర్జాలు, ఒక తోలుసంచి, ఖజానాపెట్టి తీసుకుని మళ్ళీ గదిలోకి వెళ్ళాడు.

మారెల్ పుస్తకాలు తిరగేశాడు. తోలుసంచీలో చూసుకున్నాడు. పెట్టెలో ధనం ఎంతుందో లెక్క చూశాడు. వచ్చేదీ ఉన్నదీ చూస్తే మొత్తం పధ్నాలుగు వేలుంది. చెల్లించవలసింది రెండులక్షల ఎనభైఏడున్నర వేలకి తేలింది.

భోజనంసమయంలో మారెల్ ప్రశాంతంగా ఉన్నాడు. కాని ఈ ప్రశాంతతే స్త్రీలిద్దరికీ భయకారణమయింది. రాత్రి పడింది. ఇద్దరూ అతన్ని గమనిస్తున్నారు. పలకరిస్తారనుకున్నారు. కాని పలకరించకుండానే తన గదిలోకి నిశ్శబ్దంగా వెళ్ళిపోయాడు. తలుపులు మూసుకున్నాడు.

మారెల్ భార్య జూలీని పడుకోమని పంపివేసింది. అర గంటగడిచాక కాలిజోళ్ళు తీసివేసి, రవంతైనా చప్పుడు కాకుండా నడిచివెళ్ళింది. గదితలుపు తాళపు రంధ్రంలోనుంచి చూసింది. కాని ఇంతలోనే తనముందు ఎవరో చప్పుడు కాకుండా వెళ్ళిపోతున్నట్లు కనిపెట్టింది. ఆమె ముందుకు వెళ్ళి చూసేసరికి జూలీ కనపడింది. "వ్రాసుకుంటున్నారు" అంది జూలీ గుసగుస మాటల్లో. ఇద్దరికీ ఒకేసారి ఒకేభావం తోచింది—అతను మరణశాసనం వ్రాస్తున్నాడని.

ఆ మరునాడు ఉదయంకూడా మారెల్ ప్రశాంతంగా ఉన్నట్లు కనిపించాడు. మామూలుగానే తన గదిలో కూర్చున్నాడు. ఆహారం తీసుకునే వేళకి మాత్రం గది కదిలివస్తున్నాడు.

ఆ రాత్రి భోజనంఅనంతరం కుమార్తెను పిలిచి ప్రక్కను కూర్చో బెట్టుకున్నాడు.

తండ్రి నిశ్చలంగా ఉన్నట్లు పైకి కనపడినా, గుండెలు బ్రద్ద లౌతున్నట్లు కొట్టుకుంటున్నాయని ఆమె తల్లికి చెప్పింది. ఇలాగే రెండురోజులు గడిచాయి. సెప్టెంబర్ నాలుగో తేదీ సాయం కాలం మారెల్ తన గది తాళంచెవి ఇవ్వాలని రూక్షస్వరంతో కూతుర్ని అడిగాడు. అతని స్వరం విని జూలీ ఉలిక్కిపడింది. ప్రతి రాత్రీ తాళంచెవి ఆమెకే ఒప్పగించేవాడు తండ్రి. ఆ రాత్రి తన చేతి కిమ్మని ఎందు కడిగాడు? చిన్నతనంలో ఆమెని దండించడానికి మాత్రమే అలా అడిగేవాడు. ఆమె అతనివంక చూసింది. "నా గదిలో మరిచిపోయాను." అని చెప్పి వెళ్ళి పోయింది. కాని తిన్నగా తన గదికి వెళ్ళడానికిబదులు జూలీ మేడ దిగి ఇమాన్యూల్ దగ్గర కెళ్ళింది. "ఆ తాళంచెవి మాత్రం ఆయన కివ్వవద్దు" అన్నాడు ఇమాన్యూల్. "రేపు పొద్దున్న ఒక్క క్షణం ఆయన్ని విడిచి పెట్టకు." అన్నాడు. ఎందుకని అతన్ని అడిగింది. కాని అత నంతకంటె చెప్పలేదు.

తెల్లవారుజామున మూడుగంటలవరకు మారెల్ తన గదిలో పచార్లు చేస్తున్నట్లు భార్య గమనిస్తూనే ఉంది. చివరికి పడకమీద గుభాలున పడి నిద్రపోయాడు. తల్లీ కూతుళ్ళిద్దరూ భయంతో రాత్రంతా ఒకరి నొకరు విడవకుండా గడిపారు. సాయంకాలంనించి మాక్సిమిలియన్ వస్తాడని నిరీక్షిస్తున్నారు.

ఉదయం ఎనిమిది గంటలకి మారెల్ మేడ దిగివచ్చాడు. రాత్రంతా మేలుకున్నట్లు అతని ముఖమే స్పష్టంగా చెపుతోంది. ముఖం పూర్తిగా వాడిపోయింది. ఆ పూట భార్యపట్ల మరీ దయతో ఉన్నాడు. కుమార్తెపట్ల మరింత ప్రేమ చూపాడు.

ఇమాన్యూల్ సలహాని జూలీ మరిచిపోలేదు. తండ్రి వీధిలోకి వెడుతున్నప్పుడు వెంట వెళ్ళడానికి ఆమె ప్రయత్నించింది. కాని బుజ్జగిస్తూ, ఆమెని వారించాడు. "మీ అమ్మతో ఉండు" అన్నాడు. ఇంత స్థిరభావంతో అతను కుమార్తెతో మాట్లాడ్డం ఇన్నాళ్ళకిదే మొదటిసారి. కాని ఆమెపట్ల అతని ప్రేమ రెండింతలు వ్యక్తమయింది. జూలీ పట్టుదల వహించలేకపోయింది.

మరుక్షణంలో హఠాత్తుగా తలుపులు తెరుచుకున్నాయి. ఆమె నెవరో పట్టుకున్నారు. ఆమె నుదుటిని ముద్దుపెట్టు కున్నారు. తలెత్తి చూసింది. "అన్నా!" అని బిగ్గరగా కేక వేసింది.

జూలీకేక విని తల్లి వచ్చింది. కుమారుని చేతుల్లో వాలి పోయింది. "జూలీ, వెళ్లి మీ నాన్నకి చెప్పు, మాక్సిమిలియన్ వచ్చాడని" అంది తల్లి. జూలీ రెండు అంగల్లో గది దాటి పోయింది. కాని ఆమెకి మేడమెట్లమీద ఒక వ్యక్తి ఎదురయి నాడు. అతని చేతిలో ఒక ఉత్తరం ఉంది. "జూలీ అంటే మీరేనా?" అన్నాడు. అతని మాటవరస చూస్తే ఇటాలియన్ దేశస్థుడనుకోవాలి.

"అవునండి" అంది జూలీ.

"ఈ ఉత్తరం చదవండి. మీ తండ్రి క్షేమం దీనిపైన ఆధార పడి ఉంది."

జూలీ తటాలున ఉత్తరం లాక్కుని విప్పిచూసింది. అందులో ఇలా ఉంది:

"వెంటనే మైలాన్ వీధిలో 15వ నంబరుఇంటికి వెళ్లు. మేడమీదిగది తాళంచెవి అడిగి దర్వాన్ వద్ద తీసుకో. ఆ గదిలో కిటికీలో ఒకమూల ఎర్రఊలుతో అల్లిన పర్సు ఒకటుంటుంది. అది తీసుకెళ్లి వెంటనే నీ తండ్రికియ్యి. అది ఇవాళ పదకొండు గంటలకి ముందే ఆయన చేతి కందడం అవసరం. మరొకమాట చెప్పకుండా నేచెప్పినది చేస్తానని నాకు మాటిచ్చావు. ఆ మాట జ్ఞాపకం ఉంచుకో—సింద్ బాద్."

జూలీ ఆనందంతో ఒక్క వెర్రికేక పెట్టింది. తలెత్తి చూసింది, కాని ఉత్తరం ఇచ్చిన వ్యక్తి అక్కడ లేడు. మళ్ళీ ఉత్తరంచూసింది. కింద మరికొన్ని వాక్యాలు కనిపించాయి.

"నువ్వు ఈపని స్వయంగా చెయ్యాలి. ఒంటరిగానే వెళ్లాలి. నీతోకూడా ఇంకొకరున్నా, లేక నీకు బదులు మ రెవరిని పంపినా, తన కేమీ తెలియదని దర్వాన్ చెపుతాడు."

దీనితో ఆమె ఉత్సాహం సగంపోయింది. ఇందులో కుట్ర ఏదైనా ఉందా? ప్రమాద మేమైనా ఉందా? ఆ వయస్సులో ఉన్న యువతులికి ఎటువంటి ప్రమాదాలు సంభవించగలవో ఆ

అమాయికకు తెలియదు. జూలీ కొంచెం సందేహించింది. సలహా తీసుకోవాలనుకుంది. కాని చిత్ర మేమిటంటే, ఆమె తన తల్లిని కాని, అన్నని కాని సలహా అడగలేదు. ఇమాన్యుయల్ ని అడిగింది.

"నువ్వు తప్పకుండా వెళ్ళాలి జూలీ, నేను నీతో కూడా వస్తాను" అన్నాడు ఇమాన్యుయల్.

"కాని నేను ఒంటరిగా వెళ్ళాలనుంది ఉత్తరంలో" అంది జూలీ.

"లోపలికి ఒంటరిగానే వెళ్ళవచ్చును. నేను వీధిమొగలో నీకోసం నిలబడిఉంటాను. నువ్వు తిరిగిరావడం ఆలస్యమైతే, అప్పుడు నేను లోపలికి వస్తాను."

"అయితే నేను తప్పకుండా వెళ్ళవలసిందేనా ?"

ఇమాన్యుయల్ క్షణంసేపు ఆలోచించాడు. కాని వెంటనే ఏదో ఒకటి చెప్పేయ్యాలి. ఇలా అన్నాడు."ఇటు విను. ఇవాళ తేదీ సెప్టెంబర్ 5 కాదూ ?"

"అవును"

"ఇవాళ పదకొండు గంటల్లోగా ఎవ్వరూ మీ తండ్రికి సహాయం చెయ్యలేకపోయినట్లయితే, దివాలాతీసినట్లు ప్రకటించాలి కాదూ ?"

"అవునవును. అయితే త్వరగా రా, వెళ్ళిపోదాం" అంది జూలీ.

ఇంతలోగా మారెల్ భార్య తమ కష్టాలన్నీ కుమారునికి వివరించిచెప్పింది. మాక్సిమిలియన్ ఆశ్చర్యపడ్డాడు. గబగబా తండ్రి గదికివెళ్ళి తలుపు తట్టాడు. తండ్రి అక్కడ లేడు. మెట్లెక్కి అప్పుడే వస్తున్నాడు. కాని కొడుకుని చూడలేదు. మారెల్ తన గదికి వెళ్ళేబదులు పడకగదికి వెళ్ళాడు. తిరిగి వెంటనే వస్తూ కొడుకుని చూశాడు. ఆశ్చర్యపడి గబగబా అడుగులేసుకుంటూ వచ్చాడు. ఇద్దరూ ఒకరినొకరు కౌగలించుకున్నారు. కాని మాక్సిమిలియన్ ఉలిక్కిపడి వెనక్కి తగ్గాడు. తడబడుతున్న మాటలతో "ఇదేమిటి నాన్నా ? పిస్తోళ్లు కోటులో దాచుకున్నారేమిటి ?" అన్నాడు.

కొడుకువంక నిదానంగా చూసి, "మాక్సిమిలియన్, నువ్వు పెద్దవాడవైనావు. ఇప్పుడు నువ్వు పురుషుడవ్. నీతైన వాడవు. అంతా చెపాను రా." అన్నాడు.

మారెల్ తన గది ప్రవేశించాడు. మాక్సిమిలియన్ అతన్ని అనుసరించాడు. తండ్రి కోటులోనించి పిస్తోళ్లు రెండూ తీసి మేజా మీద ఒక చివర పెట్టాడు. గది తలుపు లోగడియ వేసి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. తెరిచి ఉంచిన చిట్టాపుస్తకం కొడుక్కి వేలితో చూపాడు. ఈ పుస్తకంలో వాస్తవ పరిస్థితి లెక్కల్లో వ్రాసిఉంది. ఇంకొక అరగంటలో మారెల్ రెండులక్షుల ఎనభైఏడున్నరవేల ఫ్రాంకులు చెల్లించాలి. అతనివద్ద ఉన్నది పదిహేను వేల రెండు వందల ఏభైయేడు ఫ్రాంకులే ఉంది.

"అది మాకు" అన్నాడు మారెల్.

యువకుడు గబగబా చూసి విస్తుపోయాడు.

"ఈ కష్టం గట్టెక్కడానికి చెయ్యవలసినదంతా చేశారా?" అన్నాడు యువకుడు.

"చేశాను" అన్నాడు మారెల్.

"అంటే అరగంటలో ఇంక మన పరువంతా బుగ్గైపోయిన ట్టేనా?"

"అపఖ్యాతిని నెత్తురు కడిగివెయ్యగలదు," అన్నాడు మారెల్.

"అవును నాన్నా! నాకు అర్థమయింది." అన్నాడు మాక్సిమిలియన్. పిస్తోళ్లవంక చేతులుచాచి, "ఒకటి మీకు, ఇంకొకటి నాకు" అన్నాడు.

మారెల్ అతని చేతిని అడ్డగించాడు.

"నీ తల్లీ, చెల్లెలూ ఉన్నారు. వాళ్లనెవరు చూస్తారు?"

యువకుడొక్క క్షణం యోచించాడు. అతనికి నిస్పృహ వచ్చింది. కళ్ళు భారంగా వాలిపోయాయి. మెల్లిగా లేచి కోటుపై నున్న సైనికహోదా చిహ్నాలు తీశాడు. తండ్రివంక చెయ్యిచాపి "అలాగే కానివ్వండి, నాన్నా! మనశ్శాంతితో దేహం త్యజించండి. నేనే బ్రతుకుతాను" అన్నాడు.

మారెల్ ధ్యానపూర్వకంగా మోకాళ్లపైన వాలబోతున్న సమయంలో, మాక్సిమిలియన్ వృద్ధుణ్ని రెండు చేతులా లేవనెత్తి పరిష్వంగం చేసుకున్నాడు.

"నావల్ల దోషంలేదని నీకు తెలుసుకదా!" అన్నాడు మారెల్.

"తెలుసు నాన్నా! తెలుసు. ఎప్పుడూ మీరు ఉత్కృష్టమైన నీతినే అనుసరించారు."

"అది చాలు నాకు. అంతే. ఇంక అంతా అయిపోయినట్లే. నువ్వింక నీ తల్లి చెల్లెళ్ళ వద్దకు వెళ్ళు."

కుమారుడు మోకాళ్ళపై వొంగి తండ్రికి నమస్కరించాడు. "నాన్నా నన్ను ఆశీర్వదించండి" అన్నాడు. కుమారుని శిరస్సు రెండు చేతులా పట్టుకున్నాడు మారెల్. వంగి అతని తల ముద్దుపెట్టుకున్నాడు. "అవును నాయనా! నిన్నాశీర్వదిస్తున్నాను. మూడు తరాల నీతివంతులు నిన్నాశీర్వదిస్తున్నారు. నా నోటితో వారు ఆశీర్వచనాలు పలుకుతున్నారు. విను నాయనా! దురదృష్టంవల్ల కూలిపోయినదాన్ని భగవంతుడే తిరిగి నిలబెడతాడు. నేనిటువంటి చావు చచ్చిపోతున్నాను. ఎంతటి కఠినాత్ములకైనా జాలి కలగకపోదు. నాకు లభించని ఫలం నీకైనా దొరకవచ్చును. నువ్వు యువకుడవ్. పాటుపడి పనిచెయ్యి. ధైర్యంతో ప్రపంచంలోకి దూకు. పొదుపుగా నువ్వు, నీ తల్లి, చెల్లెలు గడపండి. ఇప్పుడు మిగిలిన ధనమే నీ చేతిలో పడిడి మీకు ఐశ్వర్యం లభిస్తుంది. ఆలోచించు. ఇక్కడే ఈ ఆఫీసులో నే నిలిచి 'నా తండ్రి చెయ్యలేకపోయినదానిని నేను చేశాను. నేను చెయ్యవలసిన అవసరం ఉందని తెలిసే నా తండ్రి చనిపోయాడు' అని నువ్వు చెప్పగల గాలి."

యువకుడు బాధతో మూలిగాడు. ఇంక గత్యంతరం లేదని అతనికి ధృవపడింది. హృదయంలో పొంగివస్తున్న దుఃఖాన్ని అతని ఆత్మవిశ్వాసం జయించింది.

"ఇంక నువ్వు వెళ్లిపో. నీ తల్లినీ నీ చెల్లెలినీ దూరంగా తీసుకుపో" అన్నాడు మారెల్.

"నాకింక చెప్పవలసినవేమీ లేవా నాన్నా?" అన్నాడు మాక్సిమిలియన్ దీనంగా. మాటలు నోటిని పెగుల్చుకుని వస్తున్నాయి.

"ఉంది నాయనా. ఒక పవిత్రకార్యం ఉంది."

"చెప్పండి."

"దాక్షిణ్యంవల్లకానీ స్వార్థంవల్లకానీ, థామ్సన్ ఎండ్ ఫ్రెంచ్ కంపెనీ ఒక్కటే నాపట్ల దయతో ఉంది. అది స్వార్థమో దాక్షిణ్యమో, ఇతరుల హృదయాలు కనిపెట్టేపని నాది కాదు. ఆ కంపెనీ ఏజంటు ఇక్కడి కిప్పుడే వస్తాడు. రెండు లక్షల ఎనభైఏడున్నర వేల ఫ్రాంకులికి బిల్లు ఇస్తాడు. నాకు అత నిచ్చిన మూడు మాసాల గడువు ఈ పూటతో తీరిపోయింది. ముందుగా ఈ బిల్లు చెల్లించి, ఆ ఏజంటుని ఆదరించు నాయనా"

"అలాగే చేస్తాను నాన్నా."

"ఇంక నన్ను ఒంటరిగా విడిచిపెట్టివెళ్ళిపో. నే నొంట రిగా ఉండాలి. నా మరణశాసనం నా డ్రాయర్‌లో ఉంటుంది."

యువకుడు ఇంకా కదలలేదు. అతనికి కదిలే సత్తువ పోయి నట్లుంది.

"ఇటు విను మాక్సిమిలియన్" అన్నాడు మారెల్. "నేనూ నీ మాదిరిగానే సైనికుడి ననుకో. నే నొక యుద్ధవ్యూహంలో ఒక రంగాన్ని యుద్ధం నడుపుతున్నా ననుకో. ఆ ప్రయత్నంలో నే నెలాగూ చచ్చిపోకతప్పదని నీకు తెలిసినపక్షంలో, ను వ్వే మంటావ్? 'వెళ్లు నాన్నా! ఆలస్యమైతే అపఖ్యాతి రాగలదు. అపఖ్యాతికంటె చావు మేలు'అని చెప్పవా?"

"అవును"అన్నాడు యువకుడు బిగ్గరగా. తండ్రిని గాఢ పరిష్వంగం చేసుకుని "వెళ్లునాన్నా!" అన్నాడు. తరవాత తండ్రిని విడిచి, ఒక్క ఉదుటున గది విడిచి వెళ్లిపోయాడు.

మారెల్ దృష్టి ద్వారంపైపే నిశ్చలంగా ఉంది. తరవాత చేగంట మోగించాడు. కాక్లే ప్రత్యక్షమైనాడు. అతను బొత్తిగా మారిపోయినాడు. ఈ మూడురోజుల అనుభవం అతని విశ్వాస బలాన్ని భగ్నపరిచింది. మారెల్ కంపెనీ ఇంక చెల్లింపులు

కట్టిపెడుతుందనే భావం అతన్ని కుంగదీసింది. అకస్మాత్తుగా ఇరవై యేళ్లు పైబడినట్లున్నాడు.

మారెల్ అతన్ని చూసి "కాక్లే" అని పిలిచాడు. అతని మాట లిలా ఉన్నాయని వర్ణించ తరంకాదు.

"కాక్లే, నువ్వు వరండాలోనే ఉండు. థామ్సన్ ఎండ్ ఫ్రెంచ్ కంపెనీ ఏజంటుని మూడుమాసాలకిందట చూశావు. నీకు జ్ఞాపకం ఉందనుకుంటాను. అతను రాగానే నాకు వెంటనే తెలియపరుచు."

కాక్లే సమాధానం చెప్పలేదు. శిరస్సు వంచుకున్నాడు. మెల్లిగా వెళ్లి వరండాలో బెంచిమీద కూర్చున్నాడు.

మారెల్ కుర్చీలో కూలిపోయాడు. అతనికళ్లు గడియారం మీదికి మళ్లాయి. ఇంక ఏడునిమిషాల వ్యవధిమాత్రం ఉంది. నిమిషాల ముల్లు అతి వేగంతో తిరుగుతున్నట్లుంది.

ఇప్పు డీవ్యక్తి మనస్సులో ఎటువంటి ఆలోచనలు తిరుగుతున్నాయో చెప్పడం కష్టం. వయస్సా ఏట్టే మీరలేదు. కాని అతి చిత్రమైన హేతుబుద్ధివల్ల, తాను జీవితంలో పరమార్థమనుకున్న సర్వాన్నీ, సంసార సుఖానురాగాల్నీ విడిచి, సర్వ బంధాలూ తెంచుకొనిపోడానికి సమకట్టాడు. మనోవ్యథవల్ల వసివాడినా, అతని ముఖంలో వైరాగ్యజనితమైన ఒక నిశ్చలవిశ్రాంతి భావం వ్యక్తమౌతోంది. దుఃఖాశ్రువులతో నిండినా, అతని నేత్రాలు ఊర్ధ్వ ముఖంగా భగవంతునివంక తిరిగినాయి.

గడియారం ముల్లు నిమిషాలపై దూకుతోంది. పిస్తోళ్లు గుండ్లతో నింపబడ్డాయి. ఒక చెయ్యి చాచి ఒక పిస్తోలు తీశాడు. తన ప్రియతనయపేరు ఉచ్చరించాడు. ఆ ఘోరమారణాయుధాన్ని చటుక్కున వొదిలేశాడు. కలం తీసి కాగితంపైన రెండు వాక్యాలు గీకాడు. తన కుమార్తెవీడ్కోలు పొందలే దనుకున్నాడు. గడియారంవంక చూశాడు. ఇంక లెక్కించడానికి నిమిషాలు లేవు; సెకండ్లుమాత్రం ఉన్నాయి. పిస్తోలు తీసుకున్నాడు. కిందిపెదవి జారింది. దృష్టిని నిమిషాల ముల్లుపైన నిగిడ్చాడు. మీటమీద వేలు మోపుతూ ఆగిపోయాడు.

నుదుటిమీద మృత్యువుశీతలహస్తం సోకినట్లయింది. మరణ వేదన గుండెను పిండివేస్తోంది. మెట్లవద్ద తలుపు తెరిచిన చప్పుడయింది. తరవాత తన గదితలుపు తెరచిన చప్పుడయింది. గడియారం పదకొండు గంటలు కొడుతోంది. మారెల్ దృష్టి మరల్చలేదు. ఏజంటు వచ్చినట్లు కాక్లే చెపుతాడనుకున్నాడు. నోరు తెరిచి పిస్తోలు నోటిలోకి గురిపెట్టుకున్నాడు. హఠాత్తుగా కుమార్తె పిలుపు వినవచ్చింది. మారెల్ ముఖం తిప్పి చూశాడు. జూలీ కనపడింది. అతని చేతిలో పిస్తోలు జారిపడింది.

"నాన్నా! నాన్నా!" అని అరిచింది జూలీ. "మనం బతికిపోయాం" అంది. ఆమెకి ఆనందంతో ఊపిరాడ్డంలేదు. తండ్రి ఒడిలో వాలిపోయింది. ఆమె చేతిలో ఎర్ర ఊలుతో అల్లిన పర్సు ఒకటుంది. మారెల్ ఉలిక్కిపడ్డాడు. పర్సు అందుకున్నాడు. ఒకప్పుడది తనదే నని అతనికి లీలగా తోచింది. పర్సు తెరిచాడు. ఒక అరలో రెండులక్షల ఎనభైఏడున్నర వేల ఫ్రాంకుల బిల్లుంది. ఆ ధనం చెల్లించబడినట్లు దానిపైన సంతకం ఉంది. రెండో అరలో ఒక పెద్ద వజ్రం ఉంది. దానిపక్కనే చిన్న కాగితంపైన ఇలా వ్రాసివుంది "ఇది జూలీ కట్నం."

గడియారం గంటలు కొట్టడం పూర్తయింది. అవి అతని గుండెలో మారుమోగుతున్నాయి.

"అమ్మా. ఇది నీ కెక్కడ దొరికింది?" అన్నాడు మారెల్.

"మైలాన్‌వీధిలో ఒక మేడమీద గదిలో, కిటికీలో ఉంది."

ఇంతలో మెట్లవద్దనించి మారెల్‌ను ఎవరో పేరుపెట్టి పిలిచారు.

జూలీ తటాలున లేచి నిలబడింది. "ఆయనే! ఆయన గొంతుకే" అంది. వెంటనే ఇమాన్యూల్ ప్రవేశించాడు. అతని ముఖంలో ఆనందం తాండవిస్తోంది. "ఫరావో వచ్చింది! ఫరావో!" అన్నాడు బిగ్గరగా.

"ఏమిటన్నావ్? ఫరావో ఏమిటి? నీకు పిచ్చెత్తిందా ఇమాన్యూల్? అది పోయిందని నీకు తెలుసుగా?" అన్నాడు మారెల్.

"లేదండి! అది ఫరావో నౌకే! రేవు చేరుతోంది!"

మారెల్ కుర్చీల్లో వెనక్కి వాలిపోయాడు. అతనికి సత్తువ పోయింది. ఈ అద్భుతసంఘటనలవల్ల అతని బుద్ధి భ్రమిస్తోంది.

ఇప్పుడు కొడుకు వచ్చాడు.

"నాన్నా! ఫరావో పోయిందన్నా రెందుకు నాన్నా? ఇప్పు ఇది రేవులోకి వస్తోందే?"

"నాయనా! అదే నిజమైతే, అదంతా ఈశ్వరుని అద్భుత లీల కాని మరొకటి కాదు! అది అసంభవం! అసంభవం!" అన్నాడు మారెల్.

కాక్లే వచ్చాడు: "ఇదేమిటండి? ఫరావో అంటున్నా రేమిటి?"

"రండి రండి" అన్నాడు మారెల్. "వెళ్ళి అదేమిటో మాద్దాం. అదే అబద్ధమైతే, ఇంక భగవంతుడే మనల్ని కాపాడాలి."

అందరూ గబగబా మెట్లు దిగి వెళ్ళారు. కింద మారెల్ భార్య ఎదురయింది. ఆమె ఇంతవరకూ భర్తని చూడ్డానికి సాహసించలేకపోయింది. త్వరలోనే అందరూ కానిబయర్ తీరం చేరారు. రేవుదగ్గిర అనేకమంది జనం గుమిగూడారు. మారెల్ రాగానే తప్పుకుని దారి ఇచ్చారు. అందరూ 'ఫరావో వచ్చింది, ఫరావో వచ్చింది' అంటున్నారు. రేవుసమీపంలోనే ఆ నౌక కనపడింది. ఓడ ముందుభాగంలో తెల్లని పెద్ద అక్షరాల్లో, "ఫరావో, మారెల్ ఎండ్ సన్, మార్సెల్స్" అని వ్రాసి ఉంది. చూసినవాళ్లు వాళ్ల కళ్లని వాళ్లే నమ్మలేకుండాఉన్నారు. అయినా అదే ఓడ, భారతదేశం నించి నీలిమందు వేసుకుని వచ్చింది. లంగరు వెయ్యబడింది. డెక్ మీద కెప్టెన్ ఉన్నాడు. చుక్కానివద్ద పెనిలన్ ఉన్నాడు. మారెల్ని చూసి నెయ్యి ఆడించాడు. ఇంక తనకళ్లని నమ్మకపోవడం ఎలాగ? మారెల్ ఒక్కడే కాదు, పదివేలమంది ఆ నౌకని ప్రత్యక్షంగా చూస్తున్నారు!

మారెల్ కుమారుని కౌగలించుకున్నాడు. చుట్టూ అందరూ ఆనందంతో కోలాహలం చేస్తున్నారు. వారిమధ్య ఒకవ్యక్తి పహరా బంక్ చాటున నిలబడి ఈదృశ్యాన్ని తిలకిస్తున్నాడు. అతని ముఖం

సగం నల్లనిగడ్డంలో కప్పబడిఉంది. అతని నేత్రాలలో జాలి, ప్రేమ ఉట్టిపడుతున్నాయి. "మీరు చేసిన సత్కార్యాలకి, మీ సచ్ఛరిత్రకి భగవంతుడే మిమ్మల్ని ఆశీర్వదించగలడు" అని ఆ వ్యక్తి గొణిగాడు. తరవాత అతను గబగబా జెట్టీ ఎక్కి, "జకోపో! జకోపో!" అని పిలిచాడు. వెంటనే జెట్టీదగ్గర కొక తెడ్డుపడవ వచ్చింది. అది ఎక్కి అతను అంత దూరంలో ఉన్న ఒక చక్కని కొత్త బోటువద్దకు వెళ్ళాడు. ఒక్క ఉదుటున బోటులోకి లంఘించాడు. ఆనందం పట్టలేక చుట్టూ నలుగురితో గొడవగా మాట్లాడుతున్న మారెల్ వంక మరొకసారి చూశాడు. తననీవిధంగా రక్షించిన వారెవరో తెలియక మారెల్ మాటిమాటికీ ఆకాశంవంక చేతులెత్తి నమస్కరించడం చూశాడు.

బోటుపైన నిలబడి అపరిచితవ్యక్తి అప్పుడిలా అనుకున్నాడు! "ఇంక చాలు. ఇంతటితో దయాదాక్షిణ్యాలకీ, కృతజ్ఞతకీ స్వస్తిచెప్పు. మార్దవహృదయానికి సహజమైన సున్నిత భావాల నింక మాను. ఉత్తములకుపకృతి చెయ్యడాని కింతవరకూ దేవదూతవలె ప్రవర్తించాను. దుర్మార్గుల్ని శిక్షించడానికి ఇంక దుర్విధిపక్షాన సంచరించాలి."

## 31

**1838** సంవత్సరారంభంలో యువకులిద్దరు ఫ్లారెన్స నగరాన్ని (ఇటలీ) సందర్శిస్తున్నారు. వారిద్దరూ పారిస్‌లో ఉన్నత వంశాలకు చెందినవారు. ఒకడు కౌంట్ మార్సెర్ఫ (ఫెర్నాండో) కుమారుడు ఆల్బర్ట్. రెండో వాడు బారన్ ఫ్రాంజ్ డి ఇపినే. రోమ్ ఉత్సవాలకు వెళ్ళాలని ఇద్దరూ అనుకున్నారు. అయితే ఆ ఉత్సవాలు చూడాలంటే మాటలు కాదు. అందువల్ల సదుపాయమైన కొన్ని గదులు సిద్ధంగా ఉంచవలసిందని లండ్రా హొటల్ యజమాని పస్త్రీనీకి ఉత్తరం వ్రాశారు. ఉత్సవాలలోగా కులాసాగా గడపాలనే కోరికతో ఫ్రాంజ్‌ని ఫ్లారెన్స్‌లోనే ఉండనిచ్చి, ఆల్బర్ట్ నేపుల్స్ నగరం వెళ్ళాడు. ఫ్లారెన్స్‌లో ధనాఢ్యులైన కొందరితో కొన్ని రోజులు గడిపి, ఫ్రాంజ్ ఎల్బాద్వీపం చూడ్డానికి బయలుదేరాడు.

ఒకనాటి సాయంకాలం ఫ్రాంజ్ లెగ్‌హారన్ రేవులో ఒక బోటు అద్దికి తీసుకుని, ఎల్బాద్వీపానికి పోనిమ్మని నావికులికి ఆజ్ఞ ఇచ్చాడు. బోటు సాగరవిహంగంలాగ సముద్రంమీదికి బయలు దేరింది. మరునాడు ఉదయం అది ఫెరాజో రేవు (ఎల్బాద్వీపం) చేరింది. చరిత్రప్రసిద్ధుడైన మహావీరుడు నెపోలియన్ ఈ ద్వీపంలో ఎక్కడెక్కడ నివసించాడో, అన్నిచోట్లూ ఫ్రాంజ్ దర్శించాడు. రెండుగంటల అనంతరం పియనోజావద్ద దిగి తుపాకి తీసుకుని పక్షుల్ని కొడుతూ కొంతసేపు గడిపాడు. ఇక్కడ చాలా పక్షు లుంటాయని చెప్పగా విన్నాడు. కాని తీరా వేటకి వెడితే ఆట్టే కనపడలేదు. ఏవో కొన్ని చిన్నపిట్టల్ని కొట్టి విసుగెత్తి తిరిగి బోటెక్కాడు. కొట్టింది కొద్దయినా ఎక్కువ అలసట పడిపోవడం వేటగాళ్లకి అలవాటు. అలాగే అతనూ అలసిపోయి వచ్చాడు. అతని విసుగుదల చూసి బోటు కెప్టెన్ ఇలా అన్నాడు: "తమకి కావా లంటే వేటకి బలే చోటొకటుందండి."

"ఎక్కడో?"

"అదుగో అటు చూశారా?" అన్నాడు కెప్టెన్ వేలితో దక్షిణదిక్కుగా చూపుతూ. అక్కడ నీలిసముద్రంలోనుంచి కోణాకారంగా లేచి నిలబడినట్లున్న గుట్టలు కనపడ్డాయి.

"అవును. అదే ద్వీపం?" అన్నాడు ఫ్రాంజ్.

"అది మాంట్ క్రిస్టో ద్వీపం."

"కాని ఆ ద్వీపంలో వేటకి వెళ్లడానికి నాకు అనుమతి లేదే?"

"తమకి అనుమతి అవసరం లేదండి. అది నిర్జనమైన ద్వీపం."

"ఆ ద్వీపం ఎవరిది?"

"టస్కనీ రాజ్యానికి చెందినది."

"వేటాడ్డానికి ఏముంటాయి?"

"వేలకివేలు కొండగొర్రె లున్నాయి."

"మరి రాత్రికి నిద్ర?"

"అక్కడ గుహల్లోనైనాసరే, లేదా బోటుడెక్ మీదనైనా సరే పడుకోవచ్చును."

తన మిత్రుణ్ని కలుసుకోడానికి ఇంకా వ్యవధి చాలా ఉన్నందువల్ల, ఫ్రాంజ్ వెంటనే ఒప్పుకున్నాడు. రోమ్ నగరంలో బస గురించి కూడా అతని కిప్పుడు బెంగలేదు.

అతను ఒప్పుకోగానే నావికులు అందరూ ఒకచోట చేరి గుసగుస లారంభించారు.

"ఏం? ఏదైనా చిక్కుందా?" అని అడిగాడు ఫ్రాంజ్.

"లేదండి." అన్నాడు కెప్టెన్. "కాని ముందుగానే తమకి చెప్పాలి, ఆ ద్వీపంలో దుండగులభయం ఉంటుందండి."

"అదేమిటి?"

"మాంట్ క్రిస్టో ద్వీపం నిర్జనమైనదే అయినప్పటికీ, అప్పుడప్పుడు సముద్రపు దొంగలూ, అక్రమ వ్యాపారులూ అక్కడ దిగుతూ ఉంటారు. వాళ్లు కార్సికానించీ, సార్డినియానించీ, ఆఫ్రికానించీ వస్తారు. అందువల్ల మీ రీ ద్వీపంలో దిగినట్లు తెలిసిందంటే, మా బోటు లెగ్ హారన్ చేరగానే అక్కడ వారం రోజులు క్వారంటిన్‌లో ఉంచుతారు."

"అంటే చాల రోజులు ఆలస్య మౌతుందన్నమాట."

"తమరు మాంట్ క్రిస్టో ద్వీపంలో దిగినట్లు తెలిస్తే అంతేనండి."

"నామట్టుకు నేను తెలియనివ్వను" అన్నాడు ఫ్రాంజ్.

"మేమూ చెప్పం" అన్నారు నావికులు.

"అలాగైతే సరే. మాంట్ క్రిస్టో ద్వీపానికి పోదాం."

కెప్టెన్ నావికులకు ఆజ్ఞ ఇచ్చాడు. బోటు ఆ ద్వీపం దిక్కుగా బయలుదేరింది. ఫ్రాంజ్ కెప్టెన్‌తో సంభాషణ సాగించాడు. కెప్టెన్‌తో ఇలా అన్నాడు. "గేతానో, ఈ ద్వీపంలో సముద్రపు దొంగలు చేరుతూఉంటారని కాదూ అన్నావ్? ఆల్జియర్స్‌ని జయించి, అక్కడ రాజుతరపున మన (ఫ్రెంచి) పరిపాలన స్థాపించినతరవాత, సముద్రపుదొంగల బాధ పూర్తిగా పోయిందనుకున్నానే?"

"లేదండి. రోమ్‌నగరద్వారాలవద్ద ఈనాటికీ గజదొంగలున్నారుకదా! అలాగే సముద్రపుదొంగలూ ఇంకా తిరుగు

తున్నారు. ఆరుమాసాల కిందట రోమ్‌నగరందగ్గర ఫ్రెంచి రాయబారిని దోచుకున్న సంగతి మీరు వినలేదా ?"

"అవునవును."

"మీరు లెగ్‌హారన్‌లో ఉండిఉంటే, ఎప్పుడూ కొన్ని ఓడల్ని గురించి చెప్పుకోడం వినిఉంటారు. ఏదో ఒక సరుకు బోటుగురించో, లేక ఒక చిన్న ఇంగ్లీషుబోటుగురించో అక్కడ నిత్యం చెప్పుకుంటూఉంటారు. ఇంగ్లీషుబోటు బాస్టియా, ఫెరాజో, సివిటావెక్కియా రేవుల్లో తిరుగుతూ ఉంటుంది. సరుకులబోట్లు అనుకున్నరోజుకి రావు. అనుకోనప్పుడు వస్తాయి. కొన్ని ఓడలు ఎక్కడో కొండలకి కొట్టుకుని మునిగిపోయుంటాయనుకుంటారు. కాని అవి నిజంగా అలా మునిగిపోవు. ఆరేడుగురు నావికులు నడిపే చురుకైన బోటొకటుంది. అది వాటికి ఎదురౌతూఉంటుంది. ఎదురైన ఆ ఓడల్ని దోచుకుంటుంది. చీకటిరాత్రుల్లో అడవులదగ్గర బళ్ళని దారిదొంగలు కొట్టినట్లే."

"అయితే వాళ్లందరూ సముద్రపు దొంగల్ని శిక్షించాలని ఫ్రెంచి ప్రభుత్వాన్నిగాని, సార్డినియన్, టస్కనీప్రభుత్వాల్నిగాని అడగలేదా ?"

"లేదు. ఎందువల్లనంటే ముందుగా ఆ ఓడల్లో దోచుకునేదంతా దోచుకున్నతరవాత, ఓడల్లోవాళ్లనందర్నీ కట్టిపడేసి, ఒక్కొక్కడికి ఇనపగుళ్లు లగిలించి, ఓడలకి రంధ్రాలు పొడుస్తారు. ఓడల్ని మునిగిపోనిచ్చి దొంగలు తమ బోటులో పారిపోతారు. ఇంక ఆ ఓడ ఎన్నడూ రేవు చేరవు. ఫిర్యాదు చెయ్యడాని కెవరూ మిగలరు."

గేతానో ఈ సమాచారం ముందే చెప్పిఉంటే, ఆ ద్వీపానికి వెళ్లడానికి ఫ్రాంజ్ వెనకాడేవాడే. కాని తీరా నిశ్చయించుకున్నతరవాత ఇప్పుడు మానుకోడం అతనికి పిరికితనమని పించింది. సామాన్యంగా కోరి ముప్పు తెచ్చుకునే తరహా కాదు అతనిది. అయినా ముప్పువచ్చినప్పుడు జంకడు.

"అబ్బే! నేననేకసార్లు సిసిలీ, కెలాబ్రియాల మధ్య తిరిగాను. ద్వీప సమూహం మధ్య రెండు మాసాలు తిరిగాను. నాకు మచ్చుకేనా ఒక్క దోపిడిదొంగ కనబడలేదు."

"మిమ్మల్ని వేటకి వెళ్ళకుండా చెయ్యాలని నేను చెప్పడం లేదండి. మీ రడిగినదానికి సమాధానం చెప్పాను. అంతేనండి."

"అవున్లే. నువ్వు సమాచారం చెప్పావు. మంచిదే, వీలై నంతవరకూ చక్కగా కాలక్షేపం చెయ్యాలనుంది. ఆ ద్వీపానికి తప్పకుండా వెడదాం."

బోటు అతివేగంగా ప్రయాణం చేస్తోంది. గాలి వీలుగా వీస్తోంది. గంటకి ఆ రేడు మైళ్ళ వేగంతో బోటు నడుస్తోంది. సమీపిస్తున్న కొద్దీ ద్వీపం సముద్రంలోనుంచి పైపైకి లేస్తున్నట్లు కనపడుతోంది. ఒకదానిపై ఒకటి పేర్చినట్లు కొండల శిఖరాలు కనపడుతున్నాయి. మస్యమస్య పొదలూ, చెట్లూ పచ్చగా కనపడు తున్నాయి.

ద్వీపానికి పదిహేను మైళ్ళలో ఉండగా, సూర్యుడు కార్సికా పర్వతాల వెనక అస్తమిస్తున్నాడు. అరగంటలో చీకటి కమ్ముకువచ్చింది.

నావికులకు ఆ ప్రాంతమంతా కొట్టినపిండే. టస్కనీద్వీప సమూహంలో ఎక్కడే కొండ ఉందో వారికి తెలుసును. లేక పోతే అంత చీకటిలో ఫ్రాంజ్ ఆందోళన పడవలసిందే.

మరొక గంట ప్రయాణంచేసిన తరవాత ఎడమవైపున రెండు ఫర్లాంగులదూరంలో అకస్మాత్తుగా నల్లని ఆకారం ఒకటి ఫ్రాంజ్ కళ్ళపడింది. ఉన్నట్టుండి ఒక వెలుగు తళుక్కుమంది. అది ఉల్కం కాదని ఫ్రాంజ్ కి తెలుసును. ఆపక్క నేల మబ్బులా గుంది.

"ఆ వెలు గేమిటి?" అన్నాడు ఫ్రాంజ్.

"ఉష్! మాట్లాడకండి. అది చలిమంట" అన్నాడు కెప్టెన్ మెల్లిగా.

"ద్వీపంలో జనం ఎవ్వరూ ఉండరని చెప్పావ్?"

"అక్రమవ్యాపారు లిక్కడ దిగుతూ ఉంటారనికూడా చెప్పానండి."

"దోపిడిదొంగల మాట?"

"ఆ భయంవల్లనే ద్వీపానికి పక్కగా బోటు పోనిస్తున్నా నండి. ఇప్పుడా మంట మన వెనకఉంది."

"అయితే నా కొకటి తట్టుతోంది. ఈ మంట భయ పడవలసింది కాదు. ఫరవాలేదనుకోవచ్చునుకుంటాను. బైటపడ్డా నికి భయపడేవారైతే మంటవెయ్యరు."

"అలా కాదండి" అన్నాడు కెప్టెన్ గేతానో. "ద్వీపం ఉనికిని తమరు సరిగ్గా చూసినట్లయితే, ఈ మంట తీరానికికాని, పియనోజాలోకాని కనపడదండి. సముద్రంలోనుంచి చూస్తేనే కనపడుతుంది."

"అంటే ఇప్పుడిక్కడ దుండగులున్నారని నీ ఉద్దేశమా?"

"అదేదో కనుక్కోవాలండి."

ఇలా చెప్పి గేతానో నావికులవద్దకు వెళ్లి సంప్రదించాడు. అయిదునిమిషాలతరవాత బోటు మెల్లిగా వెనక్కి తిరిగింది. ముందు వచ్చినదారినే వెనక్కి కొంత దూరం వెళ్లేసరికి మంట కన పడకుండా గుట్టలచాటున మాయమయింది. తరవాత చుక్కాని తిప్పి బోటు ద్వీపందగ్గిరికి నడిపారు. ఏభై అడుగుల్లో ఉండగా తెరచాప దించారు. బోటు ఆగింది. అంతా మౌనంగా ఉన్నారు. బాధ్యతంతా గేతానో తనపైన వేసుకున్నాడు.

ఫ్రాంజ్ తన తుపాకుల్ని శ్రద్ధగా పరిశీలించాడు. తుపాకులు నింపి ఏం జరుగుతుందోనని నిరీక్షిస్తున్నాడు. కెప్టెన్ ఈలోగా కోటూ, చొక్కా విప్పి, నడుముదగ్గర పంట్లాం గట్టిగా బిగించాడు. ఎవ్వరూ ఒక్కమాట పలకరాదని వేలితో సంజ్ఞచేస్తూ సముద్రంలోకి దుమికాడు. అట్టే శబ్దం కానివ్వకుండా తీరానికి ఈదుకువెళ్లాడు. అరగంటలో అలాగే నిశ్శబ్దంగా బోటుకి తిరిగి వచ్చాడు.

"వాళ్లు అక్రమవ్యాపారులు, స్పానిష్ జాతి. వాళ్లలో ఇద్దరు కార్సికన్ దొంగలున్నారు." అని చెప్పాడు.

"దొంగలకి వీళ్లతో ఏం పని?"

సైతాన్లో అదొకతరహా ఉదారభావం ఉట్టిపడేలాగు "మనుష్యులైనతరవాత ఒకళ్లకొకళ్లు సహాయపడాలి కాదండి!" అన్నాడు.

"ఓహో!" అన్నాడు ఫ్రాంజ్. "అయితే నువ్వుకూడా వాళ్ళల్లో ఒకడివే నన్నమాట?"

కెప్టెన్ విరసంగా నవ్వి అన్నాడు. "ఏం చేస్తాం తమరే చెప్పండి. అదీ ఇదీ కూడా చేస్తేగాని మాకు పొట్ట గడవదండి."

"అయితే ఇప్పుడు ఈ ద్వీపంలో ఉన్నవాళ్లని నీకు తెలుసన్నమాట?"

"ఏదో తెలుసులెండి. మాకూ రకరకాల సంకేతాలుంటాయండి."

"అయితే ఇక్కడ దిగితే ఇప్పుడు భయం లేదంటావా?"

"లేదండి. అక్రమవ్యాపారం చేసేవాళ్ళు దొంగలు కారండి."

"మరి ఆ యిద్దరు కార్సికన్ దొంగల మాటేమిటి?" అన్నాడు ఫ్రాంజ్; ముప్పేదో ముందే పూర్తిగా తేల్చుకోడం ఎందుకైనా మంచిదని.

"మీరు చెప్పేది మరీ బాగుందండి! వాళ్లు దొంగలైనారంటే వాళ్ళదా తప్పు? అది అధికారుల తప్పు!"

"ఎలాగేమిటి?"

"ఏదో ఒక్కణ్ణి మాటుబెట్టారని వాళ్ళని వెంటాడి ప్రాణాలు తోడుతున్నారు అధికారులు—అక్కడికి పగతీర్చుకునే హక్కు కార్సికన్లకి లేనట్లు!"

"మాటుపెట్టడం అంటే? చంపడం అనా?"

"అంటే శత్రువుని చంపడం. హత్యకీ దీనికీ చాలా తేడా ఉందండి."

"అక్కడెంతమందుంటారు?"

"వాళ్లు నలుగురు, దొంగలిద్దరు, మొత్తం ఆరుగురు."

"సరే, మనంకూడా ఆరుగురం ఉన్నాం. వాళ్లేమైనా మన దగ్గిర ఒకాట ఆడబోతే, మనందరం కలిసి వాళ్ళ ఆట కట్టించవచ్చు. ఏమంటావ్ ? నడు, ద్వీపంలో దిగుదాం"

"అయితే సరే, అందరూ నిశ్శబ్దంగా ఉండండి" అన్నాడు గేతానో.

ఫ్రాంజ్ దృష్టికి పరిస్థితి మరీ ప్రమాదంగా కనపడలేదు, బొత్తిగాచిక్కు లేదనడానికి వీల్లేకపోయినా. రాత్రి వేళ కటికి చీకటిలో సముద్రమధ్యంలో, పరిచయంలేని నావికుల మధ్య ఉన్నాడు. అతనిపట్ల వారికి భక్తి ఉండవలసిన అవసరంలేదు. అతనిదగ్గర కొన్ని వేల ఫ్రాంకు లున్నాయని వారికి తెలుసును. ఈ నావికులుతప్ప అతనికి తోడు లేరు. ఈ ద్వీపంలో దిగుతున్నాడు. దీనికి మతానికి సంబంధించిన పేరున్నమాట నిజమే. కాని దొంగలు తిరిగే ఈచోటు అట్టే సుఖంగా ఉండబోదని అతనికి తెలుసును.

ఇది కేవలం అతిని ఊహే కావచ్చు. అయినా ప్రమాదాన్ని కనిపెడుతూ, నావికులపైన ఒక కన్నుంచి, పిస్తోలు విడిచిపెట్టకుండా జాగ్రత్త పడ్డాడు. నావికులు మళ్లీ తెరలెత్తి బోటు నడిపారు. కటికిచీకటిలో కూడా ఆ కొండలు నీడల్లా కనపడుతూనే ఉన్నాయి. తీరంవెంట కొద్దిదూరం పోగానే ఒక కొండ కొన దాటిన తరవాత, మళ్లీ మంట కనపడింది. ఇప్పుడది మరింత వెలుగు వ్యాపింప చేస్తోంది. చుట్టూ అయిదారుగురు మనుష్యులు కూర్చున్నారు. మంటవెలుగు సముద్రపు నీటిమీద కొంత మేర పడుతోంది. బోటు ఆ వెలుగులోకి ప్రవేశించింది. అప్పుడు గేతానో, ఇతర నావికులూ కలిసి పల్లెపదం ఒకటి అందుకుని పాడ్డం మొదలుపెట్టారు.

పాట మొదలు పెట్టినవెంటనే మంటచుట్టూ ఉన్న మనుష్యులు లేచారు. గబగబా ఒడ్డుచివరికి వచ్చి బోటువంక చూశారు. బోటు ఎంత పెద్దదో, ఎందుకు వస్తోందో ఊహించడానికి ప్రయత్నిస్తున్నట్లున్నారు.

కొంతసేపటికి అందరూ ఫరవాలేదని తృప్తిపడ్డట్టున్నారు. ఒక్కడుతప్ప మిగతా అందరూ మళ్ళీ మంటదగ్గరకు వెళ్ళి కూర్చు న్నారు. మంటలమీద ఒక కొండెగొర్రె కాలుతోంది.

బోటు ఒడ్డుకి ఇరవైఅడుగుల్లోకి వచ్చేసరికి ఒడ్డుపై నున్న వ్యక్తి తుపాకి ఎత్తి ఆకాశంలోకి పేల్చాడు. తరవాత కేక పెట్టాడు.

ఫ్రాంజ్ తుపాకి, పిస్తోలు గుప్పిళ్లలో గట్టిగా పట్టుకున్నాడు. గేతానో ఒడ్డుపైనున్న మనిషితో సార్డినియన్‌భాషలో రెండు మాటలు మాట్లాడాడు. అది తననిగురించేనని ఫ్రాంజ్‌కి తెలు సును. కాని ఏమి చెప్పాడో తెలియలేదు.

గేతానో ఫ్రాంజ్‌వంక తిరిగి "తమ పేరు వాళ్లకి చెప్ప వచ్చునా, లేక చెప్పవద్దంటారా?" అని అడిగాడు.

"నా పేరు చెప్తేమాత్రం వాళ్ల కేం తెలుస్తుంది? కాలక్షేపం కోసం వచ్చిన ఫ్రెంచిదేశస్థుణ్ని అని చెప్పు."

గేతానో గట్టిగా చెప్పాడు. ఒడ్డుమీద నిలబడిన వ్యక్తి మంట దగ్గిరున్న వాళ్లలో ఒకణ్ని పిలిచి ఏదో ఆజ్ఞ ఇచ్చాడు. అత నది విని చీకటిలో ఎక్కడికో మాయమైనాడు. తరవాత కొంతసేపటికి మరొక దిక్కునించి వచ్చి, ఒడ్డుపైనున్న వ్యక్తికి సంకేత మిచ్చాడు. అతను బోటువంక తిరిగి "రావచ్చును" అని చెప్పాడు.

బోటు ఒడ్డు సమీపించింది. గేతానో ఒడ్డుకి దూకాడు. నావికు లొకరి తరవాత ఒకరు దూకారు. ఫ్రాంజ్ ఆఖరున ఒడ్డె క్కాడు.

బోటు ఒడ్డుకి కట్టేశారు. బసకోసం ఆ ప్రాంతం పరిశీలిం చడం ప్రారంభించి కొంద రొకవైపుకి వెళ్లేసరికి, మంటదగ్గిర కూర్చు న్నవారిలో ఒకడు లేచి "ఆ! ఆ! అటు వెళ్లకూడదు గేతానో" అన్నాడు.

గేతానో మాట్లాడకుండా వెనక్కి వచ్చాడు. ఇద్దరు నావికులు మంటలో కాగడాలు వెలిగించి తెచ్చారు. కాగడాల వెలుగులో నావికులందరూ కలిసి ఆ చోటు వెదికారు. ముప్పై అడుగుల దూరంలో కొన్ని గుట్టలమధ్య చదునైన నేల కనబడింది. అక్కడ మనుష్యులు కూర్చోడానికి వీలుగా మట్టిదిమ్మ లున్నాయి.

ఫ్రాంజ్ కాగడాతో ఆ చోటంతా చూశాడు. ఒకచోట నిప్పుఆర్పిన పుల్లలు, బూడిద కనపడ్డాయి. ఇంతకుముందు దెవరో ఈ జాగా వాడారని ఫ్రాంజ్ అనుకున్నాడు. చీకటిరాత్రులు ఇక్కడ రహస్యంగా గడపడం కొందరికి మామూలే ననుకున్నాడు.

ద్వీపంలో అడుగు పెట్టగానే అతని సందేహాలన్నీ పటాపంచలైనాయి. ఆకలివల్ల సంకోచాలు పోయినాయి. ఆకలి వేస్తున్నట్లు కెప్టెన్‌కి చెప్పాడు. "అదెంత పని?" అన్నాడు గేతానో. "బోటులో రొట్టి, సారాయి, ఆరుపిట్టలు ఉన్నాయి. పిట్టల్ని కాల్చుకోడానికి మంటమాత్రం వేసుకోవాలి."

"ఇంకొకమాట" అన్నాడు గేతానో. "మీరు గొర్రెమాంసం మీద కోరికుంటే, మనవి రెండుపిట్టలిచ్చి, కొంచెం వాళ్లదగ్గర తీసుకోవచ్చునండి."

"అవును అలా చెయ్యి" అన్నాడు ఫ్రాంజ్. "నువ్వు ఎటువంటివాళ్ళనైనా ఇట్టే మచ్చిక చెయ్యగలవు."

కాలుతున్న మాంసం ఘుమఘుమ వాసన వేస్తోంది. ఫ్రాంజ్ తమకంతో వాసన పీలుస్తూ వేచిఉన్నాడు. గేతానో తిరిగివచ్చేటప్పుడు అతను పరధ్యానంగా ఉన్నట్లు కనపడ్డాడు. అతన్ని చూసి ఫ్రాంజ్ ఇలా అన్నాడు: "ఏమయిందోయ్? కాయా, పండా? ఇవ్వనన్నారా?"

"అబ్బే, అది కాదండి. మీరు ఫ్రెంచి దేశస్థులని చెప్పగానే వాళ్ల నాయకుడు మిమ్మల్ని భోజనానికి తన బసకి తీసుకురమ్మన్నాడట. కాని ఈ ఆహ్వానంలో చిత్రమైన ఒక షరతు పెట్టాడండి."

"ఏమిటది?"

"మీ కళ్లకి గంతలుకట్టి తీసుకువెళతారుటండి. ఆయన స్వయంగా చెప్పేవరకూ మీరది విప్పకూడదుట".

గేతానోముఖాన్ని శ్రద్ధగా పరికించాడు ఫ్రాంజ్. దీని అంతరార్థం ఏమిటో తెలుసుకోవాలని ప్రయత్నించాడు.

అది గమనించి, జవాబుగా గేతానో ఇలా అన్నాడు: "నాకు తెలుసునండి. ఇది జాగ్రత్తగా ఆలోచించి నిశ్చయానికి రావలసిన విషయం."

"నువ్వే అయితే ఈపరిస్థితిలో ఏంచేస్తావు?" అని అడిగాడు ఫ్రాంజ్.

"నాకు నష్టమేముందండి? నేనైతే వెడతాను."

"అతని నివాసంలో చూడదగిన వేమైనా ఉంటాయా?"

"అతను భూగర్భగృహంలో నివసిస్తాడని చెప్తారు. ఆ గృహానికి ఏ మహారాజాంతఃపురం కూడా పోలదంటారు."

"అయితే అది అభూతకల్పనన్నమాట."

"అభూతకల్పన కాదండి. అది నిజం. సెంట్ ఫెర్డినాండ్ ఓడ పైలట్ కామా ఒకసారి వెళ్లి చూశాడండి. అతను ఆశ్చర్యంలో మునిగిపోయాడు. తిరిగి వచ్చి అటువంటి అద్భుతైశ్వర్యాన్ని పుక్కిటికథల్లో తప్ప ఎరగనన్నాడు."

"అయితే వెళ్లమనే నీ ఉద్దేశమా?"

"అది తమ ఇష్టం. నే నెలాటి సలహా ఇవ్వలేను."

ఫ్రాంజ్ కొంతసేపు ఆలోచించాడు. ఇంతటి ఐశ్వర్యవంతుడికి తనమీద కుట్ర పన్నవలసిన అవసరం ఉండదనుకున్నాడు. తన దగ్గిరున్నది కొన్ని వేల ఫ్రాంకులే. భోజనంమాట తల్చుకుని ఫ్రాంజ్ ఒప్పుకున్నాడు. గేతానో వెళ్లి ఈ కబురు చెప్పాడు. ఈలోగా ఫ్రాంజ్ ఒక నావికుని పిలిచాడు. దగ్గరలో ఒక్క బోటుకూడా కనపడ్డంలేదు. వీళ్లందరూ ఇక్కడికెలా వచ్చి ఉంటారని ప్రశ్నించాడు.

"అదే ముందండి?" అన్నాడు నావికుడు. "వాళ్ళ బోటు నాకు తెలుసునండి. అది చాలా అందంగా ఉంటుంది. ఇంగ్లీషు దేశస్థుల యాట్ పోలిక నుంటుంది. అది ఎలాటి గాలిలోనైనా సరే ప్రయాణం చెయ్యగలదు."

"అదెక్కడ నిర్మించారో?"

"నాకు తెలియదండి. కాని జినోవాలో నిర్మించి ఉంటారనుకుంటాను."

"కాని అక్రమవ్యాపారం చేసేవాళ్ల నాయకుడు అటువంటి బోటు నిర్మించాలని జినోవా నిర్మాతలకి ఆజ్ఞ ఎలా ఇవ్వగలడు?"

"ఈ బోటుయజమాని అక్రమవ్యాపారుల నాయకుడని నేను చెప్పలేదే?"

"మరెవరతను?"

"పెద్ద భాగ్యవంతుడండి. కేవలం వినోదంకోసం ప్రయాణాలు చేస్తాడు."

"అతని పేరు?"

"అతన్ని పేరడిగితే సింద్‌బాద్ అని చెప్తాడు."

"మీకోసం ఆయన వేచివున్నారండి" అన్నారొకరు ఫ్రాంజ్ వెనకనించి. గొంతుకనుబట్టి ఒడ్డుపై నిలబడిన పహరా వాడివని ఫ్రాంజ్ కనిపెట్టాడు. అతనివెనక మరిద్దరున్నారు.

ఫ్రాంజ్ వెనక్కి తిరిగి మాట్లాడకుండా చేరుమాలు తీసి అందించాడు. వాళ్లుకూడా మాట్లాడకుండా అది అతని కళ్లకి కట్టారు. చూపుకి ఎక్కడా సందులేకుండా అతిజాగ్రత్తగా కట్టారు. ఇంత జాగ్రత్తచూస్తే, ఇతనే అన్యాయిత్వం చేసిపోతాడో నని వాళ్లు అనుమానించినట్లున్నారు. కళ్ళకి కట్టిన గుడ్డని విప్పనని అతనిచేత ప్రమాణం చేయించారు. తరవాత ఇద్దరు అతని చేతులు రెండూ పట్టుకుని నడిపించుకు వెళ్లారు. ముందు పహరా నడిచాడు.

కొద్దిఅడుగులు వేసినతరవాత ఫ్రాంజ్‌కి కాలిన మాంసం వాసన దట్టంగా తగిలింది. మంటపక్కగా నడుస్తున్నట్లు అతను గ్రహించాడు. ఏభై అడుగులు వెళ్లినతరవాత మొదట వెళ్ళవద్దని వాళ్లు వారించినదారిని ఇప్పుడువెడుతున్నట్లు ఊహించాడు. కొంత సేపైనతరవాత వాతావరణం మారిపోయినట్లు అతనికి తోచింది. ఒక గుహప్రవేశించినట్లు అతనూహించాడు. తరవాత మెత్తని తివాసీలమీద నడుస్తున్నట్లు గ్రహించాడు. హఠాత్తుగా అతని చేతులు రెండూ విడిచిపెట్టబడ్డాయి. క్షణంసేపు అంతా నిశ్శబ్దంగా ఉంది. తరవాత విదేశీ ఉచ్చారణలో ఫ్రెంచిభాషలో ఒకరన్న మాటలు వినపడ్డాయి. "నమస్కారం. కళ్ళకికట్టుకున్న రుమాలు తియ్యండి."

వెంటనే రుమాలు తీసేశాడు ఫ్రాంజ్. దాదాపు నలభైయేళ్ల పురుషుడతని సమక్షంలో ఉన్నాడు. అతను ట్యూనిస్ దుస్తులు ధరించాడు. బంగారు నగిషీకల నల్లనికోటు ధరించాడు. ముఖం పాలిపోయిన తెలుపురంగులో ఉన్నప్పటికీ, ఒక వింత అందం గోచరిస్తుంది. కన్నులు కాంతివంతంగా చురుగ్గా ఉన్నాయి. లోతులు చూడగల వనిపిస్తుంది. వాలు నుదుటితోపాటు తిన్ననైన ముక్కు గ్రీక్ విశిష్టతను శోభింపచేస్తుంది. పళ్లు తెల్లగా ముత్యాలవలె ఉన్నాయి. నల్లని చిన్నమీసా లున్నాయి. అన్నిటిలోకీ అతని పాలిపోయిన ముఖం వింతగా కనపడింది. గోరీలో పాతిపెట్టబడినవాడు మళ్ళీ బతికి కొంత కాలానికి పైకి వచ్చినట్టల్లే ఉంది అతని ముఖం. మరీ పొడగరి కాకపోయినా ఎత్తైన మనిషేనని చెప్పవచ్చు. దక్షిణప్రాంతవాసుల మాదిరిగా కాళ్లు, చేతులు పొట్టివి. కాని అన్నిటికంటె, పరిసరాలను చూసి ఫ్రాంజ్ అబ్బురపడ్డాడు. గేతానో చెప్పినది భ్రమా కల్పిత మనుకున్నాడు కాని ఇప్పుడిది అంతకంటె అద్భుతంగా కనపడింది. అంతటా టర్కీ ష్లినెన్ పరచబడి ఉంది. గోడలపైన బంగారు నగిషీపని ఉంది. ఒకపక్క చక్కని సోఫా, దానిపక్క గోడను వేలాడదీసి రత్నాలు తాపిన పిడులతో అరబ్బీఆయుధా లున్నాయి. పైకప్పునుంచి వెనీషియన్ గాజుదీపాలు వేలాడు తున్నాయి. దీపాలలో రంగురంగులగాజు బుడ్లున్నాయి. నేలంతటా చక్కని టర్కీ ష్తివాసీ పరిచిఉంది. ద్వారాలకు పట్టుతెర లున్నాయి. గదులు దీపకాంతులతో ఉజ్వలంగా ప్రకాశిస్తున్నాయి. ఫ్రాంజ్‌ని ఇదంతా చూడనిస్తూ, నూతన వ్యక్తి జాగ్రత్తగా అతన్ని పరికించాడు. చివరికిలా అన్నాడు: "క్షమించాలి, మిమ్మల్ని తీసుకురావడంలో పెట్టిన ఇబ్బందికి క్షమించా లని వేడుకుంటున్నాను. ఈ ద్వీపం సామాన్యంగా నిర్జనంగా ఉంటుంది. నా రహస్యనివాసం తెలిసిపోయినట్లయితే నేను వెళ్లి తిరిగి వచ్చేలోగా జనంవచ్చి పాడుచెయ్యవచ్చు. అది నేను సహించలేను."

"బాగా చెప్పారు! మీరు క్షమార్పణ కోరవలసిన అవసరం లేదు. ఏదో కథలో జరిగినట్టు, ఇటువంటి అద్భుత గృహాలకి వెళ్లేవాళ్లు కళ్లకి గంతలుకట్టుకునే వెడతారు.' అది నాకు తెలుసును. మీరు

చేసినదానిలో తప్పేమీ లేదని ఇక్కడ ఈ అద్భుతాలు చూస్తేనే తెలుస్తోంది. ఇదంతా చూస్తుంటే అరేబియన్ నైట్స్ కథల్ని తల దన్నినట్లుంది."

సరిగ్గా అప్పుడే పనక ద్వారం తెర తొలగింది. తెల్లని దుస్తులు ధరించిన నల్లని ఒక నీగ్రో వచ్చి యజమానికి సలాం పెట్టి లోపలి గదిలోకి రావచ్చునని సంజ్ఞచేశాడు.

నూతన వ్యక్తి ఇలా అన్నాడు: "ఒకరిపేరొకరికి తెలియకుండా గంటలకొద్దీ లోకాభిరామాయణం మాట్లాడుకోవడం కష్టం. మీరు కూడా అలా అనుకుంటున్నారో లేదో నాకు తెలియదు. కాని ఆతిథ్యమిస్తున్నాను కదా అని మీ పేరు, ఊరు అడగడం నా కిష్టంలేదు. మిమ్మల్ని నేను ఎలా పిలవాలో మాత్రం చెప్పండి. నన్నైతే, తెలిసినవాళ్లు సింద్‌బాద్ అని పిలుస్తారు."

"నా సంగతి మనవిచేస్తాను. మంత్రపుదీపం మినహాగా అరేబియన్ నైట్స్ కథలో అల్లాఉద్దీన్ మాదిరిగా ఉన్నాను నేను. అందువల్ల నన్ను అల్లాఉద్దీన్ అనెందుకు పిలవకూడదు?"

"సరే అలాగే పిలుస్తాను. భోజనం సిద్ధంగా ఉంది. దయచెయ్యండి."

ఫ్రెంచి యువకుడు ఒక అద్భుతదృశ్యం గడిచి, మరొక అద్భుతదృశ్యం చూశాడు. రెండో సావడిలో పెద్దమేజా ఆహార పదార్థాలతో నిండిఉంది. ఫ్రాంజ్ చుట్టూ చూశాడు. పొడుగైన ఈ సావడిఅంతా చలువరాతితో నిర్మించబడింది. గోడలపైన చక్కని శిల్పాలు చెక్కబడినాయి. గది నాలుగుమూలలా రెండేసి శిలాప్రతిమ లున్నాయి. ప్రతిమల శిరస్సులపైన ఫలాలతోనిండిన పళ్లెరా లున్నాయి. దూరదేశాలనుంచికూడా తెచ్చిన రకరకాల ఫలాలు కనపడ్డాయి. మేజాపైన పళ్ళెరాలలో మధుర, మాంసాది భక్షణా లనేకం అమర్చిఉన్నాయి.

ఫ్రాంజ్ కలకంటున్న అనుమానంతో కన్నులు నులుముకుని చూశాడు. నీగ్రో ఒక్కడే ఆహారవస్తువులు చకచకా అమర్చుతున్నాడు. అతని చాకచక్యాన్ని ఫ్రాంజ్ మెచ్చుకున్నాడు. అపరిచిత వ్యక్తి భోజనాని కుపక్రమిస్తూ ఇలా అన్నాడు: "అవును

పాపం అతనికి నేనంటే భక్తి ఎక్కువ. శక్తివంచనలేకుండా సేవ చేస్తాడు. అతని ప్రాణాన్ని నేను కాపాడినమాట ఎప్పుడూ మరిచి పోడు."

"అతని ప్రాణాన్ని ఎలా కాపాడారో చెప్పడానికి మీకు అభ్యంతర ముంటుందా ?"

"లేదు లేదు. అదేమంత పెద్దవిషయం కాదు. ట్యూనిస్ రాజు జనానా అంతఃపురందగ్గిర తచ్చాడుతుండగా ఇతన్ని పట్టు కున్నారుట. అటువంటిచోట, అందులోనూ నీ గ్రో అయినవాడు తిరగడం అంటే, అది సామాన్య నేరం కాదు. అందువల్ల మొదటిరోజుని అతని నాలుక, రెండో రోజుని చేతులు, మూడోరోజుని తల తెగెయ్యమని రాజు ఆజ్ఞ ఇచ్చాడుట. నాకు సేవ చెయ్యడానికి మూగవాడొకడు కావాలని ఎప్పుడూ అనుకునేవాడిని. అందువల్ల అతని నాలుక కోసేవరకూ ఊరుకుని, ఆ తరవాత నా రెండు బారుల తుపాకీ రాజు కిచ్చి, అతన్ని నా కిమ్మని అడిగాను. ఆ తుపాకీమీద రాజు అంతకు ముందే కన్నే శాడు. కాని అతన్ని ఎలాగైనా హతమార్చాలని పట్టుదలతో ఉన్నాడేమో, ముందు ఒప్పుకోలేదు. అప్పుడు తుపాకితోపాటు ఇంగ్లీషు వేటకత్తికూడా ఒకటిచ్చాను. అది చాలా మంచికత్తి దాంతో ఒక్క దెబ్బకొట్టేసరికి రాజు కత్తి ముక్కముక్క లయింది. అప్పుడొప్పుకున్నాడు నా మాటకి. అయితే అతను మళ్ళీ ట్యూనిస్ దేశం తిరిగి చూడ కూడదని ఆంక్ష పెట్టాడు."

ఫ్రాంజ్ కొంతసేపు ఆలోచించాడు. ఈ అపరిచిత వ్యక్తి రవ్వంత కూడా దాక్షిణ్యం చూపకుండా, కొంత హాస్యధోరణిలో చెప్పిన ఈకథ విని, అతనికి ఆశ్చర్యం కలిగింది. చిట్టచివరికి విషయం మార్చి ఇలా అన్నాడు : "అయితే మీరు పెట్టుకున్న పేరు సార్ధక పరిచి, నిత్యం సముద్రప్రయాణాలు చేస్తున్నారన్నమాట."

"అవును. నేను సాధించగలనని కలలోకూడా అనుకోలేని తుణంలో ఒక ప్రతిజ్ఞతీసుకున్నాను. దాన్ని ఇప్పుడు పాలిస్తున్నాను. ఇదొక్కటే కాదు. మరికొన్ని విషయాల్లోకూడా ప్రతిజ్ఞ తీసు కున్నాను. అవికూడా పాలించగలననే ఆశ పడుతున్నాను."

ఎంత ప్రశాంతంగా ఈ మాటలు మాట్లాడుతున్నా, అతని కళ్లలోమాత్రం చిత్రమైన క్రౌర్యం ఉట్టిపడుతోంది.

"మీరు చాలా కష్టాలు పడ్డట్టున్నారు" అన్నాడు ఫ్రాంజ్.

సింద్‌బాద్ ఉలిక్కిపడ్డాడు. ఫ్రాంజ్ వంక నిదానంగా చూసి, "ఎల్లా అనుకున్నారు?" అన్నాడు.

"మీ కంఠస్వరాన్ని బట్టి" అన్నాడు ఫ్రాంజ్. "మీ ముఖం లోని భావం, పాలిపోయిన మీ ముఖవర్ణం, మీ చిత్రమైన ఈ జీవనం, వీటినిబట్టి చెప్పవచ్చును."

"నిజంగా? అబ్బే! నాకేంగోటు? నేను స్వర్గసుఖాలు అనుభవిస్తున్నాను. పాదుషాలాగున్నాను. సృష్టికర్త నాకు అన్ని వరాలూ ఇచ్చినట్లున్నాడు. నాకే చోటు నచ్చితే అక్కడుండ గలను. నచ్చకపోతే వెళ్లిపోగలను. నాకున్న స్వేచ్ఛ మరెవరికీ లేదు. విహంగాలకే ఉంటుంది. నాకూ విహంగాలమాదిరిగా నే రెక్కలున్నాయి. నా చుట్టూఉండేవాళ్లందరూ నా చేసంజ్ఞలు గమనించి ఆజ్ఞలు పాలిస్తారు. నే ననుభవిస్తున్న జీవితాన్ని మీ రొక్కసారి చవిచూసినట్లయితే ఇంక విడిచిపెట్టరు. ఎన్నడూ మళ్లీ ప్రపంచంలో నలుగురిమధ్యా ఉండాలన్కోరు—ఇతరత్రా ఏవో గొప్ప ఆశ లుంటే తప్ప."

"ఏం? ఎందు కుండకూడదు? మాటవరసకి చెప్తున్నాను. పగ తీర్చుకోవలసివస్తే ఇవన్నీ వొదిలెయ్యవచ్చును." అన్నాడు ఫ్రాంజ్.

"అసలు పగ తీసుకోడం అనే దెందు కుంటుంది?"

"దానికికంటే, మిమ్మల్ని చూస్తే, సమాజం పీడించగా పగ తీసుకోఎందు చూస్తున్న మనిషిలా కనిపిస్తున్నారు."

సింద్‌బాద్ నవ్వాడు. అతని నవ్వు వింతగా ఉంది. "అబ్బే! మీరు పొరబడుతున్నారు. నిజానికి నేను దానశీలుణ్ని. ఎప్పుడో ఒకరోజు పారిస్ వెళ్లి దానధర్మాలు చెయ్యడంలో ఆపర్ట్‌తో పోటీ చెయ్యగలనుకూడా."

"ఆ సమయానికి నేను పారిస్‌లో తప్పకుండా ఉంటాను. ఇక్కడ మీరు చూపుతున్న ఆదరానికి, అప్పుడు ఋణం తీర్చుకుంటాను."

"మీ ఆహ్వానాన్ని ఎప్పుడో తప్పకుండా స్వీకరిస్తాను. కాని దురదృష్టవశాత్తు, ఇప్పుడు పారిస్ రావాలంటే మారుపేరు పెట్టుకోవలసివస్తుంది."

భోజనం ముగిసింది. కాని అపరిచితవ్యక్తి ఒక్క వస్తువునైనా మూచూడలేదు. ఫ్రాంజ్ పుష్టిగా తిని లేచాడు.

ఆలీ (నీగ్రో) పండ్ల పళ్లేరాలు రెండు తెచ్చి మేజాపైన పెట్టాడు. రెండింటిమధ్యనూ చిన్న వెండి భరిణి ఒకటి ఉంచాడు. ఆలీ భరిణి ఎంత పదిలంగా తెచ్చిపెట్టాడో చూసేసరికి ఫ్రాంజ్‌కి కుతూహలం కలిగింది. భరిణి మూత తీసి చూశాడు. అందులో ఆకుపచ్చని చిక్కని లేహ్యం కనపడింది. అదేమిటో అతని ఊహకి అందలేదు. మూత వేసేశాడు. అపరిచితవ్యక్తి వంక చూశాడు. అతను నవ్వుతున్నాడు.

"మీరూహించలేకుండా ఉన్నారుకాదూ ?"

"అవును"

"ఇదొక దివ్యమైన మధుర ఖాద్యం. దీన్నే గ్రీక్ దేవతలలో ముఖ్యుడైన జూపిటర్‌కి, హిబి తినబెట్టింది."

"కాని ఈ దేవతల ఖాద్యం మనుష్యుల చేతుల్లో పడగానే పేరు మార్చుకోలేదా ? దీన్ని చూస్తే అట్టే తినబుద్ధి కావడంలేదు కాని, స్పష్టంగా చెప్పండి, దీన్ని ఏమంటారు ?"

"అబ్బే అలా కాదు." అన్నాడు సింద్‌బాద్. "మీరు వ్యవహారనీతి తెలిసినవారైతే, కాంచనం మీ ఆరాధ్యదేవతైతే, దీన్ని రుచి చూడండి. రుచి చూసి, గుజరాత్, గోల్కొండ, పెరూ బంగారుగనుల్ని మీ కళ్ళముందు సాక్షాత్కరింపచేసుకోండి. మీరు భావాలకు ఉర్రూతలూగే విశిష్టవ్యక్తులేనా? మీరు కవులేనా? అయితే, ఇది తప్పకుండా రుచిచూడండి. రుచి చూడగానే మిమ్మల్ని ఈ వాస్తవజగత్తుకి బంధించిఉంచిన బంధాలు తెగిపోతాయి. మీకు ఆశలున్నాయా? ప్రాపంచికోన్నతి మీకు కావాలా? ఇది రుచిచూడండి. విశ్వానికంతకీ అధిపతులౌతారు. మారుమూల సరిహద్దులమధ్య ఒదిగిన ఫ్రాన్స్, స్పెయిన్, ఇంగ్లండ్ రాజ్యాలరాజుల మాదిరి కూడా కాదు. ప్రపం

దాని కంతకీ సార్వభౌములౌతారు. సృష్టికంతటికీ కర్తలౌతారు. ఇది చాలదా ?— ఈ కాస్త రుచిమాడ్డానికి ? మాడండి."

ఈమాట లంటూ సింద్‌బాద్ భరిణి మూత తెరిచి, ఒక చెంచానిండా ఆ లేహ్యం తీసి, మెల్లిగా చప్పరించాడు. తల వెనక్కి వాల్చి, కన్నులు మూసుకున్నాడు.

"ఇది గంజాయితో చేసింది కాదూ ?" అన్నాడు ఫ్రాంజ్.

"అదేనండి."

"కాని మీరు పొగిడినదంతా స్వయంగా అనుభవించి కాని నమ్మలేను."

"తప్పకుండా, కాని ఒక్కసారి రుచిమాసేసి తేల్చివయ్యకండి. ఏదైనాసరే క్రమంగా అలవాటుచేసుకుని తరవాత నిర్ధారణకి రావాలి. ఈ దివ్యమధురపదార్థాన్ని సులువుగా నెత్తురోర్చదు. అసలు మన ప్రకృతి ఆనందాన్ని సహించదు. ఎప్పుడూ బాధనే అంటిపెట్టుకుంటుంది."

దీనికి సమాధానంగా నన్నట్టు ఫ్రాంజ్ ఒక చెంచా లేహ్యం తీసుకుని చప్పరించాడు.

"అబ్బ !" అన్నాడు, హితవు లేనట్లు. అది మింగి "అబ్బ ! ఇదెక్కడి ఖాద్యం? చూస్తే మీరు చెప్పినంత మధురంగా లేదే!" అన్నాడు.

"ఎందువల్లనంటే, దీని రుచి తెలుసుకోడానికి అవసరమైన రసస్ఫూర్తి మీకింకా సిద్ధించలేదు. మీరే చెప్పండి. మొట్టమొదటిసారిగా రుచి చూసినప్పుడు మీకు టీకాని, ధూమపానం కాని హితవయిందా ? రోమన్లు మాంసాన్ని వండేటప్పుడు ఇంగువ వాడతారు. చీనాదేశస్థులు పిచ్చుకగూళ్లు తింటారు. అవి వాళ్లకెలా రుచిస్తాయో మీకెలా అర్థమాతుంది ? అలాగే గంజాయి కూడా. వారం రోజులు దీన్ని రోజూ పుచ్చుకోండి. ఇప్పుడు చేదుగా, నాలుకపై పెట్టుకోడానికికూడా హితవు కాని ఈ లేహ్యాన్ని పోలిన అద్భుత ఖాద్యం ప్రపంచంలో మరొకటి లేదని మీరే అంటారు. అది సరే లెండి. పక్క గదిలో కూర్చుందాం రండి."

ఇద్దరూ లేచారు. రెండో గదిలో అంత ఆడంబరం, అలం కారం లేకపోయినా చక్కగా అమర్చి ఉంది. ఈ గది సుంద్రంగా ఉంది. చుట్టూ పెద్ద సోఫా ఒకటి అమర్చిఉంది. సోఫాలో నూ, గోడలపైనా, నేలపైనా ఉన్నిగుడ్డలు పరిచిఉన్నాయి.

ఇద్దరూ సోఫాలో చేరగిలపడ్డారు. సమీపంలో పొగాకు పీల్చే గొట్టాలు నింపబడిఉన్నాయి. ఇద్దరూ చెరొకటీ తీసు కున్నారు. ఆలీ వచ్చి నిప్పు ముట్టించి వెళ్లిపోయాడు.

"మీరు కాఫీ ఎలా తీసుకుంటారు? ఫ్రెంచితరహా లోనా? టర్కిష్ తరహాలోనా?" అని అడిగాడు సింద్ బాద్.

"టర్కిష్ తరహా చూస్తాను."

"అదే బాగుంది. అంటే ప్రాచ్యదేశాలవారి పద్ధతులంటే మీకు నచ్చుతాయన్న మాట. అసలు జీవితంలో ఆనందించడం అంటే ప్రాచ్యదేశాలవాళ్లకే తెలుసును. నేను పారిస్‌లో వ్యవ హారాలన్నీ పరిష్కరించుకోగానే, ఆ దేశాలకే వెళ్లిపోతాను. అప్పుడు మీరు నన్ను చూడాలనుకుంటే, కైరో, బాగ్దాద్, ఇస్పహాన్ నగరాలు వెతకవలసిఉంటుంది."

"ఓ! నేను నిజం చెప్తున్నాను. దానంత సులువైనపని అదే కాని మరొకటి లేదు. నాకిప్పుడు రెక్కలొచ్చి ఆకాశంలో విహ రిస్తున్నట్లుంది. ఈ రెక్కల్తో ఎగిరి ఇరవైనాలుగ్గంటల్లో ప్రపం చాన్ని చుట్టిరాగల ననిపిస్తోంది."

"ఆ! అయితే గంజాయి ఇప్పుడు పనిచేస్తోందన్నమాట. బాగుంది. బయలుదేరండి, రెక్కలు విప్పి ఆకాశవీధుల్లో విహ రించండి."

ఇలా అని ఆ అపరిచితవ్యక్తి అరబ్బీభాషలో ఆలీకి ఏదో చెప్పాడు. ఆలీ సలాంపెట్టి కొద్దిదూరంలోకి వెళ్లి నిలిచాడు.

ఫ్రాంజ్‌కి లోలోపల అద్భుత పరివర్తనం అనుభవ మౌతోంది. శరీరం తేలికైపోతున్నట్లుంది. మెదడులో జాజ్వల్య మానమైనదృశ్యాలు మెదల నారంభించాయి. జ్ఞానేంద్రియాలు రెం డింతలు చురుగ్గా పనిచెయ్య నారంభించాయి. దిఙ్మండలం విరిసి విశా

లంగా విచ్చుకుంటున్నట్లుంది. కాని ఈ ఆకాశం వేరు. స్పృహ తప్పిపోతున్న సమయంలో కనపడిన భయోత్పాతమైన దృశ్యం కాదిది. ఇది పల్చని నీలితెరలాఉంది. సముద్రంలోని నీలివర్ణాన్నీ సూర్యుని కాంతినీ తెచ్చి కలబోసినట్లుంది. మెల్లని వాయువులు అపూర్వసుగంధాలను మోసితెస్తున్నాయి. నావికుల గీతాలు స్పష్టంగా, బిగ్గరగా వినపడుతున్నాయి. ఈ గీతాలు మాయ అని భావించడానికి వీలులేదు. క్రమంగా అతని దృష్టికి మాంట్ క్రిస్టో ద్వీప స్వరూపం గోచరించింది. అది ఈ మారు తరంగాల తాకిడికి కోపించిన రౌద్రాకారం కాదు. ఎడారిమధ్యలో ఉద్యానవనం లాగ ఉంది. నౌక ద్వీపాన్ని సమీపిస్తోంది. గీతం మరింత బిగ్గరగా వినపడుతోంది. కైలాసంవలె ఉన్న ద్వీపం సమీపిస్తున్న కొద్దీ, సుస్పష్టమైన గీతం వెనుక అవ్యక్తమైన రాగాలాపన వినపడింది. హృదయాన్ని ఆకర్షించే దివ్యసంగీతం వినవచ్చింది.

నౌక చల్లగా, మెల్లిగా తీరం చేరి దానంతట అదే నిలిచి పోయింది. దివ్య సంగీతం ఆలకిస్తూ అతను గుహాప్రవేశం చాడు. కొన్ని మెట్లు దిగాడు. అద్భుత సుషుప్తికి ముందు ఏవేవి చూశాడో, అవన్నీ మళ్లీ కనపడ్డాయి. సింద్‌బాద్ కనపడ్డాడు. ఆలీ ఉన్నాడు. తరవాత అంతా కన్నుల ముందు ఒక్కసారిగా చెరిగి పోయింది. ఆపైన ఒక సావడిలో శిలాప్రతిమల మధ్యనున్నట్లు అతనికి తోచింది. ఆ శిల్పమూర్తులు ఇప్పుడు అద్భుతంగా ఉన్నాయి. ఒంటి వొంపులలో కవిత్వం ఉంది. కన్నులలో మంత్రశక్తి ఉంది. నవ్వులలో విశృంఖలత కనపడింది. శిరోజాలు కెరటాలవలె లేచి కవ్విస్తున్నాయి. ఆ మూర్తులలో అప్సరఃకాంతలు, త్రిలోక సుందరులు ఉన్నారు. పరులచూపులకు వరవని స్వేచ్ఛతో, అందాలు రూపింపచేసుకునే ముగ్గురు ప్రౌఢల మధ్య, నీరెండ బంగారుకిరణంవలె, యౌవనం అప్పుడే మొలకెత్తగా ఒక కన్య సిగ్గులు విరజిమ్ముకుంటోంది. చలువరాతిబొమ్మల స్వైరవిన్యాసాల మధ్య, ఈ మధురదృశ్యం అతన్ని పరవశుని చేసింది.

తరవాత ప్రౌఢలు ముగ్గురూ తనని చూసి ఆకర్షింపబడినట్లు తోచింది. రెండవ నిద్రలో శయనిస్తున్న అతని తల్పంవద్దకు ముగ్గురూ వచ్చారు. వారి పాదాలు అంబరాలలో దాగిఉన్నాయి. శంఖసన్నిభాలయిన కంఠాలను అప్పుడప్పుడు దీర్ఘ శిరోజాలు

స్పృశిస్తున్నాయి. పూర్వం ఈ ఆకర్షణకు దేవతలు వీగి పోయారు. విరాగులు మాత్రం చలించలేదు.

శిలాప్రతిమలకు చైతన్యంతోపాటు వాణి సిద్ధించింది. హృదయాలకు నెత్తుటి పెచ్చుదనం వచ్చింది. గంజాయిప్రభావంలో ఫ్రాంజ్‌కి మొట్టమొదటిసారిగా మధురరసభావన కలిగింది. అతని ఒళ్లు పరవశమైపోతోంది. పరవశంలో దుర్భర వేదన ఇమిడిఉంది. ప్రౌఢసుందరుల అధరాలు తాకినంతలో అతని అధరాలు వేడిమిలో వేగిపోయాయి. అధరాలు అధరాల నంటినంతలోనే, సర్పాల చలిపడగలు సోకినట్లయింది. తెలియరాని ఈ ప్రేమని విదల్చుకోడానికి అతను చేతులతో ఎంత గెంటివేసినా, ఈ మాయా స్వప్నానుభవం అతని ఇంద్రియాలను లోబరుచుకుంటోంది. స్వప్నంతో పెనగులాడి పెనగులాడి చివరికి నిస్సహాయుడై నిద్రలో ఒరిగిపోయాడు.

# 32

ఫ్రాంజ్‌కి మెలకువ రాగానే, చుట్టూ చూసి, ఇంకా కలలోని దృశ్యాలే చూస్తున్నట్లు భ్రమించాడు. సూర్యరశ్మి చొరనేరని సమాధిగృహంలో ఉన్నట్లు భావించాడు. ఒక చెయ్యి చాచాడు. ఒక రాయి తగిలింది. లేచి తిన్నగా కూర్చున్నాడు. మెత్తని గడ్డిపైన పరున్నట్లు తెలిసింది.

కలంతా మాయమయింది. మెలకువ వచ్చిరాగానే, శిలా ప్రతిమలు అంతర్ధానమైనాయి.

పగటివెలుగు కనపడుతున్నవైపు రెండడుగులు వేశాడు. కలలోని కల్లోలం అంతా పోయి, వాస్తవప్రపంచ ప్రశాంత వాతావరణంలో పడ్డాడు. అతనొక గుహలో ఉన్నాడు. సగం తెరిచినద్వారంగుండా నీలాకాశం, నీలిసముద్రం కనపడ్డాయి. ఆకాశంలోనూ, సముద్రంపైనా సూర్యుని ప్రభాతకిరణాలు వ్యాపించాయి. సముద్రతీరాన నావికులు నవ్వుతూ పేలుతూ కూర్చుని గడుపుతున్నారు. ఒడ్డుకి పదిగజాల దూరంలో బోటు నీటిపై తేలుతోంది.

కొంతసేపు శుభ్రవాయువులు పీల్చి ఆనందించాడు. తరంగాల అవ్యక్తఘోష ఆలకించాడు. చుట్టూ దృశ్యాన్ని క్షణకాలం తిలకించి, గ్రహింపుకి తెచ్చుకున్నాడు. అద్భుత స్వప్నాన్నీ, ప్రకృతి అపూర్వ సౌందర్యాన్నీ క్షణంకాలం మరిచి, వాస్తవంగా తాను చూస్తున్న దేమిటని పరిశీలించాడు. క్రమంగా అతనికి బోధపడింది. కలలో కన్నదెంత బూటకమో తెలిసి వచ్చింది. తరవాత అతని కా కలలోని సంగతులు జ్ఞప్తికి రాసాగినాయి.

ద్వీపానికి రావడం, అక్కడి అక్రమవ్యాపారుల నాయకునితో పరిచయం, భూగర్భాంతర మందిరం, మృష్టాన్నం, గంజాయితో చేసిన లేహ్యం అన్నీ జ్ఞప్తికి వచ్చాయి.

ఇప్పుడీ పగటివెలుగులో వాస్తవపరిసరాలమధ్య ఉన్నందువల్ల, ఇవన్నీ ఏడాదికిందటి విషయాలైనట్లు తోచింది. కాని కలలోని విషయాలన్నీ వాస్తవంగా జరిగినట్లున్నందువల్ల, అవి అతని హృదయంలో గాఢంగా ముద్రితాలైనాయి. మాటిమాటికీ రాత్రి కలలో కనపడిన నీడలు కళ్లముందు కదులుతున్నట్లుంది. ఇది మినహా అతని మనస్సు ప్రశాంతంగా ఉంది. అలసట తీరినట్లు శరీరంలో కొత్తఉత్సాహం, చురుకు కనపడ్డాయి. పరిసరాలను మరింత తమకంతో చూడగలుగుతున్నాడు.

నావికు లున్న చోటికి చకచకా నడిచివెళ్లాడు. అతన్ని చూసీచూడగానే అందరూలేచి నిలిచారు. కెప్టెన్ గేతానో ముందుకు వచ్చాడు. "స్వయంగా తమకు వీడ్కోలు ఇవ్వలేకపోయినందుకు క్షమించవలసిందని సింద్‌బాద్ తమతో చెప్పమని ఆజ్ఞ ఇచ్చారు. అత్యవసరకార్యంవల్ల ఆయన మలాకా వెళ్లిపోతున్నారు."

"అయితే, అదంతా నిజమేనా గేతానో? నన్ని ద్వీపంలో ఆహ్వానించిన ఆ వ్యక్తి నిజంగా ఉన్నాడా? రాజమర్యాదలతో నన్నాదరించి నేను నిద్రలో ఉండగా మాయమైన అతను నిజమైన వ్యక్తేనా?"

"నిజంగానే ఉన్నారు. అదుగో—ఆవెడుతున్న బోటులో ఉన్నారు. మీ అద్దాలు (దూరదర్శినీయంత్రం) తీసి చూసినట్లైతే, ఆ బోటుమీద కనపడవచ్చును."

ఫ్రాంజ్ అద్దాలు తీశాడు. గేతానో చెప్పింది నిజమే. బోటులో ఒక చివర నిలబడి ఆ అపరిచితవ్యక్తి తనవంకనే, అటువంటి టెలిస్కోప్‌తోనే చూస్తున్నాడు. రాత్రి ఏ దుస్తులు ధరించి కనపడ్డాడో, ఇప్పుడూ ఆ దుస్తులే ధరించి ఉన్నాడు. వీడ్కోలుసూచనగా చేరుమాలు తీసి ఆడించాడు.

మరుచటి క్షణంలోనే బోటులో ఒక చివర సన్నటి పొగ లేచింది. అది మెల్లిగా లేచి బోటుపక్కగా తేలిపోయింది. తరవాత అస్పష్టంగా తుపాకిమోత వినపడింది.

"అదిగో విన్నారా? అది మీకు వీడ్కోలుసంకేతం." అన్నాడు గేతానో. "ఇంక ఇప్పుడేం చెయ్యమని తమ ఆజ్ఞ?"

"ముందుగా ఒక కాగడా వెలిగించి నా కియ్యి."

"ఓ! తెలిసింది. ఆ అద్భుతమందిరం వెతకడానికి కాదూ? తప్పకుండా ఇస్తామండి. నేనూ ఒకప్పుడిలాగే అనుకున్నాను. నాలుగైదుసార్లు వెతికాను. కాని విసుగెత్తి చివరికి మానేశాను," అన్నాడు. అని ఒక నావికుని పిలిచి కాగడా తెమ్మని ఆజ్ఞ ఇచ్చాడు.

కాగడా తేగానే ఫ్రాంజ్ అది చేత పుచ్చుకుని వచ్చిన ద్వారంవైపు వెళ్లాడు. అతని వెనుక గేతానో అనుసరించాడు.

అతను పడుకున్న మెత్తని గడ్డిపడక కనపడింది. ఆ గుహంతటినీ కాగడా సహాయంతో వెతికాడు. గోడలు తడిమిచూశాడు. ఏమీ కనపడలేదు. అక్కడక్కడ పొగమూరిన మసిమాత్రం కనపడింది. తనకి ముందు అనేకమంది కాగడాలతో వెతికిఉంటారని గ్రహించాడు.

అయినాసరే, అక్కడంతటా, అంగుళం మేరకూడా విడిచిపెట్టకుండా పరిశీలించాడు. నల్లని కటికరాయి తప్ప మరేదీ కనపడలేదు. కనపడిన ప్రతి నెరదలోనూ వేటకత్తి చొనిపి రాయి తియ్యడానికి ప్రయత్నించాడు. ఎక్కడ కొస్త రాయికొన లేచినా గట్టిగా పట్టించక విడిచిపెట్టలేదు. కాని అంతా నిరర్థకమయింది. రెండు గంటలసేపు వెతికి నిరాశచెందాడు. తరవాత ఆ యత్నం మానుకున్నాడు.

ఫ్రాంజ్ వచ్చినపని నిప్పుడు గేతానో గుర్తుకి తెచ్చాడు. కొండగొర్రెల్ని వేటాడాలి. ఫ్రాంజ్ ఆ విషయమే పూర్తిగామరిచి పోయాడు. ఇప్పుడు తుపాకి తీసుకుని ద్వీపంఅంతటా తిరగ నారంభించాడు. ఒక పెద్దగొర్రెని, రెండు పిల్లల్ని కొట్టితెచ్చాడు. కాని ఈవేట అతని కంత తృప్తి కలిగించలేదు.

అదీకాక అతనికి అనేక ఇతరవిషయాలు జ్ఞప్తికి వచ్చాయి. గుహ అతన్ని ంకా బలంగా ఆకర్షిస్తూనే ఉంది. ఒకసారి విఫలమైనా రెండోసారి వెతకడానికి వెళ్లాడు. గొర్రెల్ని వండమని గేతానోకి ఒప్పచెప్పి పంపివేశాడు. రెండోసారి చాలసేపు వెతికాడు. తిరిగి వచ్చేసరికి మాంసం వండి సిద్ధపరచబడింది.

గడిచిన రాత్రి ఆహ్వానం రాక ముందు ఎక్కడ కూర్చున్నాడో ఇప్పుడక్కడికి చేరాడు ఫ్రాంజ్. ఇంకా అపరిచితుని బోటు కార్సికావైపు కనపడుతూనే ఉంది. కెప్టెన్‌ని పిలిచాడు: "సింద్‌బాద్ మలాకా వెళుతున్నట్లు చెప్పావ్? కాని ఆ బోటు మాడు, వెఖియావైపు వెడుతోందే?"

"ఆయనబలగంలో ఇద్దరు కార్సికన్ దొంగలున్నారని కూడా చెప్పానండి తమతో. వాళ్ళని అక్కడ దింపేస్తాడు. దేవుడయ్యేది, దెయ్యమయ్యేది ఆయన జంకడండి. పేదవాళ్లకి సహాయం చెయ్యడానికైతే నూరుమైళ్ళు దారితప్పి వెళ్ళవలసినా వెడతాడండి."

"ఇటువంటి సహాయాలు చేస్తే, అధికారుల చేతిలో పడితే?"

"అధికారులంటే ఆయనకి భయ మెందుకు? వాళ్లని చూసి నవ్వుతాడు. అతన్ని వెంటాడనివ్వండి, చూదాం? అతని బోటు మామూలురకం కాదు. పక్షిలా ఎగిరిపోగలదు. అసలదీ అక్కర లేదు. తీరం ఎక్కితే చాలు, అతని కందరూ మిత్రులే."

ఇంక మాంట్‌క్రిస్టోద్వీపంలో ఉండవలసినపని లేదనుకున్నాడు ఫ్రాంజ్. రహస్యమందిరం కనుక్కునే ఆశ పూర్తిగా అంతరించింది. భోజనంచేసి బోటు సిద్ధపరచమని కెప్టెన్‌కి ఆజ్ఞ ఇచ్చాడు.

అరగంటలో ఫ్రాంజ్ బోటెక్కాడు. ఆఖరుసారి దూరాన ఉన్న బోటు చూశాడు. వెఖియోకేవులోకి అది అంతర్ధానం కాబోతోంది.

ఫ్రాంజ్ ఆజ్ఞ అందుకుని నావికులు లంగరెత్తారు. అవలి బోటుతోపాటు, అతనికి రాత్రి స్మృతులుకూడా మాయమైనాయి. రాత్రివిందు, సింద్ బాద్, గంజాయిలేహ్యం, శిలాప్రతిమలు అన్నీ కలమాదిరిగా మరుపులో పడిపోయినాయి.

ఆరోజూ, రాత్రీ బోటు ప్రయాణంచేసింది. మరునాటి ఉద యానికి మాంట్ క్రిస్టో ద్వీపం కనపడకుండా దూరమైపోయింది.

ఫ్రాంజ్ మళ్లీ తీరంపైన అడుగుపెట్టిన తరవాత అంతా మరిచిపోయాడు. ఫ్లారెన్స్‌లో మిగిలిన కార్యాలు నెర వేర్చుకున్నాడు. తరవాత తన మిత్రుని కలుసుకోడానికి రోమ్ నగరానికి ప్రయాణమైనాడు.

శనివారం సాయంకాలానికి ఇటలీ చేరాడు. ముందే బస ఏర్పాటయింది. అక్కడికి వెళ్లడమే తరవాయి. అయితే అక్కడికి వెళ్లడం మాటలు కాదు. వీధులనిండా జనసమ్మర్దం అత్యధికంగా ఉంది. అప్పటికే రోమ్‌నగరంలో ఉత్సవాల రద్దీ కనపడుతోంది. ప్రతి సంవత్సరం ఈ నగరంలో నాలుగు పెద్ద ఉత్సవాలు జరుగు తాయి. క్షణక్షణానికీ వృద్ధివుతున్న రద్దీలో ఎలాగో ఒకలాగ దారిచేసుకుని ఫ్రాంజ్ హోటల్ చేరాడు. చేరి వాకబు చెయ్యగానే లండ్రా హోటల్లో ఖాళీలేదని తెలిసింది. అప్పుడు తన పేరు, విలాసంకల కార్డు ఒకటి యజమానికి పంపాడు. అల్బర్ట్‌ని రావల సిందని కబురుపంపాడు. ఈమారిది పనిచేసింది. యజమాని స్వయంగా పరుగెత్తుకుంటూ వచ్చాడు. నిలబెట్టినందుకు క్షమార్పణ కోరి, స్వయంగా అల్బర్ట్ వద్దకు తీసుకు వెళ్లాడు. ఏర్పాటయిన బసలో రెండు చిన్నగదులు, ఒక లోగది ఉన్నాయి. గదులలోనుంచి వీధిలోకి చూడవచ్చును. ఈ వీలు అన్నిగదులికీ లేదని యజమాని పదేపదే చెప్పుకున్నాడు. ఆ అంతస్థులో మిగతా గదులన్నిటినీ ధనాఢ్యుడైన ఒక వ్యక్తి అద్దికి తీసుకున్నాడు. అతను సిసిలీకో మాల్టాకో చెందినవాడన్నారు.

"బాగానే ఉందండి. అయితే మాకు ముందుగా భోజనం ఏర్పాటు కావాలి. రేపటికి, ఆ పైరోజులికీ మాకొక బండి కావాలి." అన్నాడు ఫ్రాంజ్ హోటల్ యజమానితో.

"భోజనమైతే వెంటనే వస్తుందండి" అన్నాడు హోటల్ యజమాని. "బండిమాట మేం చెయ్యదగినంతా ప్రయత్నం చేస్తామండి. కాని ఇప్పుడు బంగారపురాసి పోసినా దొరకదని నా భయం."

"పోనివ్వండి. నా బండికి గుర్రాలు మాసి పెడితే చాలు. అది ఎంత బాధైనా, ఏదీ లేనిదానికంటె మేలు."

"గుర్రాలసలు లేవండి. ఈ పదిహేను రోజుల కోసం అన్నిటినీ ముందే అద్దెకిచ్చేశారు. ఇప్పుడొక్కటీ మిగల్లేదు."

"ఇంక ఇప్పుడేం చెప్పేది?" అన్నాడు ఫ్రాంజ్.

"ఒకటి మన చేతుల్లో లేదని తెలిసిపోయినప్పుడు, నే నింక దాన్ని గురించి ఆలోచించను. మిగతా విషయాలు చూసుకుంటాము. భోజనం సిద్ధంగా ఉందా?" అన్నాడు ఆల్బర్ట్.

"సిద్ధంగా ఉందండి."

"సరే ముందు భోజనం కానివ్వాలి పద" అన్నాడు ఆల్బర్ట్.

"మరి బండీ, గుర్రాల మాటో?" అన్నాడు ఫ్రాంజ్.

"ఇప్పుడు బెంగపెట్టుకోకు" అన్నాడు ఆల్బర్ట్. "ఆ సమయానికి అదే వస్తుంది. తేల్చుకోవలసిందల్లా ఏమిటంటే, వాటికెంత చెల్లించగలం, అని."

ధనం వెచ్చిస్తే సమకూడనిదుండదనే విశ్వాసంతో ఆల్బర్ట్ భోజనానికి బయలుదేరాడు. రాత్రి నిశ్చింతగా నిద్రపోయాడు. ఆరు గుర్రాల బండిలో ఉత్సవాలు చూస్తూ రోమ్‌నగరం అంతా తిరుగుతున్నట్లు కలలుకన్నాడు.

## 33

మరునాటి ఉదయం ఫ్రాంజ్ ముందుగా మేలుకున్నాడు. పరిచారకునికోసం గంటమోగించగా హోటల్ యజమానే స్వయంగా వచ్చాడు: "అయ్యా! నిన్న నేను చెప్పినట్లే

సరిగ్గా జరిగిందండి". అన్నాడు విజయగర్వంతో. "మీరు మరీ ఆల స్యంగా వచ్చి ఫురమాయించారు. నగరం మొత్తంమీద ఒక్క బగ్గీకూడా లేదు. అంటే ఉత్సవం ఆఖరు మూడురోజులికీ బగ్గీ ఉండదండి."

"అసలు అవసరమైనది ఆ మూడురోజులికే."

"ఏమయింది?" అంటూ ఆల్బర్ట్ వచ్చాడు. "బగ్గీ దొరకనే లేదా?"

"అంతే. నువ్వనుకున్నదే" అన్నాడు ఫ్రాంజ్.

"బలే! నాశమెరగని నగర మంటారు. బలే గొప్ప నగరం!" అన్నాడు ఆల్బర్ట్.

హోటల్ యజమాని చెప్పాడు: "అంటే ఆదివారంనించి మంగళవారం సాయంకాలంవరకూ బగ్గీలు లేవు. ఇవ్వాళనించి ఆది వారందాకా కావాలంటే నూరు బగ్గీలుకూడా వస్తాయి."

"పోనీలే. అదీ కొంత మెరుగే" అన్నాడు ఆల్బర్ట్. "ఇవాళ గురువారం. ఆదివారంనాటి మాట కదా? ఈలోగా ఏం జరుగు తుందో ఎవరికి తెలుసు? చూద్దాంలే."

"ఏం జరుగుతుంది? పదిపన్నెండు వేలమంది యాత్రికులు వచ్చిపడతారు. అప్పుడసలే ఊపిరాడదు. పోనీ కిటికీ ఒకటి వీలుంటుందా?" అన్నాడు ఫ్రాంజ్, యజమానివైపు తిరిగి.

"ఎక్కడండి?"

"కార్సోవైపు వీధిలోకి చూడ్డానికి."

"ఆ కిటికీలా?" అన్నాడు యజమాని పస్త్రీని. "లాభం లేదండి. బొత్తిగా వీల్లేదు. ఆ పక్క భవనంలో అయిదో అంత స్తులో ఒక్కటిమాత్రం ఉందండి. దాన్ని ఒక రష్యన్ రాజకుమా రుడికి రోజుకి ఇరవై బంగారునాణేలకి అద్దెకిచ్చేశాం."

యువకు లిద్దరూ తెల్లబోయి ఒకరి ముఖం ఒకరు చూసు కున్నారు.

ఫ్రాంజ్ ఆల్బర్ట్‌తో ఇలా అన్నాడు: "సరే. ఇంక ఇప్పుడేం చేస్తాం? ఉత్సవాలకి ఈ మాటుకి వెనిస్‌నగరంలో గడుపుదాం. ఇక్కడ బగ్గీలు దొరక్కపోతే, అక్కడ వీధిబోట్ల యినా దొరక్కపోవు."

"అలా కాదు. ఏమయితే అయింది, ఇక్కడే చూడాలి. ఉత్సవాలు చూడ్డానికే రోమ్‌నగరం వచ్చాను. స్తంభాలెక్కైనా సరే, ఇక్కడే చూడాలి."

"పోనీ ఆదివారంవరకూ బగ్గీమాట్లాడిపెట్టమంటారా?" అన్నాడు యజమాని.

"మంచిమాటే అడిగారు!" అన్నాడు ఆల్బర్ట్. "బగ్గీ లేకపోతే, స్లీపరు గుమాస్తాల్లాగ రోడ్లవెంబడి పరుగులెత్తుతామనుకున్నారా?"

"అయితే ఇప్పుడే మాట్లాడితాను. ఇప్పుడే తీసుకురమ్మంటారా?"

"గంటలో రమ్మనండి."

గంటలో బగ్గీవచ్చి హోటల్ముందు నిలిచింది. అసలది పూర్వాశ్రమంలో ఏ గడ్డిబండో తెలియదు కాని, ఉత్సవాలకోసం మార్చి, అలంకరించబడింది. ఎలాఉంటేనేం? ఆఖరిమూడురోజులికీ కనీసం ఇదైనా వస్తే బాగుండు ననుకున్నారు యువకు లిద్దరూ.

ఫ్రాంజ్, ఆల్బర్ట్‌లు ఇద్దరూ బగ్గీనెక్కి కూర్చున్నారు. నౌకరు వెనకబల్ల పైకెక్కాడు. "ఎక్కడికి పోనివ్వమంటారు?" అని అడిగాడు.

"ముందుగా సెంట్‌పీటర్స్ చర్చికి, తరవాత కలోసియమ్‌కి" అన్నాడు ఆల్బర్ట్. కాని సెంట్‌పిటర్స్ చర్చిని చూడ్డానికైతే ఒక రోజు, పరీక్షగా చూడ్డానికైతే ఒకమాసం పట్టుతుందని ఆల్బర్ట్‌కి తెలియదు. ఆ రోజంతా చర్చిలోనే గడిచిపోయింది. ఉన్నట్టుండి అకస్మాత్తుగా పొద్దువాలినట్లు కనపడింది. ఫ్రాంజ్ జేబుగడియారం తీసి చూశాడు. అప్పుడే నాలుగున్నరయింది. ఇద్దరూ హోటల్‌కి తిరిగి వెళ్లారు. బగ్గీని మళ్ళీ రాత్రి ఎనిమిదిగంటలకి రావాలని ఫ్రాంజ్ చెప్పాడు. కలోసియమ్‌ని ఆల్బర్‌కి వెన్నెలలో చూపించాలని ఫ్రాంజ్ కోరిక. ఇద్దరూ భోజనానికి కూర్చున్నారు. భోజనం ఒక మోస్తరుగా ఉంది. అది పూర్తికాగానే యజమాని ఇద్దరివద్దకూ వచ్చాడు. భోజనం ఎట్లా ఉందని కనుక్కోడానికి వచ్చాడనుకున్నాడు ఫ్రాంజ్. అనుకుని, పొగడ్డం ప్రారంభించే

టంతలోనే యజమాని అందుకున్నాడు : "మీరు చాలా బాగు న్నందుకు సంతోషమే. కాని ఇందుకోసం రాలేదు నేను. ఎని మిది గంటలకి బగ్గీ తీసుకురమ్మని మీరు చెప్పారట కాదూ కలోసియమ్ వెళ్లాలనుకుంటున్నారట నిజమేనా ?"

"అవును."

"నగర ప్రాకారంచుట్టు తిరిగి వెళ్లాలనుకున్నారా?"

"అవును."

"కాని అలా వెళ్లలేరండి."

"వెళ్లలేమా ?"

"లేరండి, ఆ దారి చాలా ప్రమాదమైనదండి. అక్కడ పేరు పడిన పెద్ద గజదొంగ లూగీ వాంపా ఉంటాడు."

"కాని ఆ దారిని వెళ్లి గియవానీ పక్కనించి తిరిగి రావా లనుకున్నా నే?"

"లాభం లేదండి. వెళ్లడం ఆ దారిని బాగానే వెళతారు కాని, తిరిగి ఈ దారిని రావడం ఒట్టిదండి."

"అదేమిటి ?"

"రాత్రిపడితేచాలు, ప్రాకారానికి ఏభై అడుగులుదాటి ఎవ్వరూ వెళ్లలేరు. వెడితే చిక్కుకున్నారన్నమాటే."

ఆల్బర్ట్, ఫ్రాంజ్‌తో అన్నాడు : "బలే. మంచి తరుణం దొరికిందోయ్ మనకి. ఇప్పుడు మన మంటే ఏమిటో తెలియ చేద్దాం. బగ్గీనిండా మందు, గుళ్లు నింపి తుపాకులు, పిస్తోళ్లు దాచిపెడదాం. మనల్ని పట్టుకోడానికి లూగీ వాంపా వస్తాడు. మనమే వాణ్ని పట్టుకుందాం. పట్టుకుని తీసుకొచ్చి పోప్‌కి బహుమతిగా ఒప్పగిద్దాం. ఇంత సహాయం చేసినందుకు మనకి ప్రతిఫలం ఇస్తానంటాడు పోప్. అప్పుడు మనం ఒక బగ్గీ రెండు గుర్రాలూ ఇప్పిస్తే చాలునంటాం. ఆ బగ్గీలో తిరిగి ఉత్సవం అంతా చూస్తాం. రోమన్లు మనల్ని సింహాసనం ఎక్కించినంత పనిచేస్తారు. లోకరక్షకులని మనకి బిరుదు లిస్తారు."

ఆల్బర్ట్ ఈ ఉపాయం చెప్తున్నప్పుడు పత్రిని ముఖపైఖరి వర్ణించ డం కష్టం. ఇలా అన్నాడు: "ఆ దొంగ లొచ్చినప్పుడు మీ రేమీ చెయ్యలేరు. డజనుమంది చీకటి చాటునుంచి అకస్మాత్తుగా వచ్చి పైనపడితే, మీరేం చెయ్యగలరు ?"

"అవును. బాగా చెప్పారు" అన్నాడు ఆల్బర్ట్. "ఏముంది? నన్ను చంపుతారు."

ఫ్రాంజ్ అన్నాడు: "మహా సులువుగా చెప్పావ్! నీ జవాబు అమోఘంగా ఉంది. అయితే, ప్రాణాలకి ఇలా ముప్పు తెచ్చుకోడం శుద్ధ అవివేకం." తరవాత పస్త్రీనీవంక తిరిగి, "చూడండి. ప్రమాదం కోరి తెచ్చుకోవాలనే రకంకాదు నేను. అసలు లూగీ వాంపా అంటే ఎవరు? అప్పుల్లో గొర్లుకాసుకునే వాడా? లేక పెద్దనవాబులా ఉంటాడా? యువకుడా? పెద్దవాడా? పొట్టిగా ఉంటాడా? పొడుగ్గా ఉంటాడా? ఎలా ఉంటాడో వివరంగా చెప్పండి. తటస్థపడితే గుర్తుపట్టాలి."

"వాణ్ణిగురించి నాకంటె బాగా తెలిసినవా డెవడూ లేడండి. అతని చిన్నతనం నాకు బాగా తెలుసు. ఒకనాడు నేను అతనిచేతుల్లో చిక్కాను. కాని నన్ను గుర్తుపట్టి విడిచి పెట్టేశాడు. విడిచిపెట్టినందుకు డబ్బు తీసుకోలేదు సరికదా, నాకు జేబు గడియారం ఒకటి బహుమతిచ్చి, తన చరిత్రంతా చెప్పాడు."

"ఏదీ గడియారం చూపించండి" అన్నాడు ఆల్బర్ట్.

పస్త్రీనీ జేబులోనించి ఒక గడియారం తీశాడు. దానిపైన నిర్మాత పేరు, ఒక రాజచిహ్నం ఉన్నాయి.

"బలే బాగుంది" అన్నాడు ఆల్బర్ట్. "సరిగ్గా ఇటువంటిదే నాదగ్గిరా ఒకటుంది. ఇదిగో. ఇది మూడువేల ఫ్రాంకులికి కొన్నాను" అంటూ తన గడియారం తీశాడు.

"సరే, అతని చరిత్ర చెప్పండి" అన్నాడు ఫ్రాంజ్. "అతన్ని చిన్నతనంలో ఎరుగుదు నన్నారు. అతనిప్పుడు యువకు డేనా?"

"యువకు డంటా రేమిటి? అతని కిప్పుడు ఇరవై రెండేళ్లే! పెద్దపేరే తెచ్చుకుంటాడు లెండి."

"పొట్టిగా ఉంటాడా? పొడుగ్గా ఉంటాడా?"

"మధ్యరకం అనచ్చు." ఆల్బర్ట్ వంకచూసి, "మీ అంత పొడుగుంటాడు. ఒక కౌంట్‌కి చెందిన ఎస్టేట్‌లో అతను గొర్ల కాపరిగా ఉండేవాడు. అయిదేళ్లప్పుడు అక్కడ చేరాడు. చిన్నతనంలోనే అతనిలో అసాధారణమైన ప్రజ్ఞ కనపడింది.

ఏడేళ్లప్పుడు ఒక ఫాదరీవద్దకువెళ్లి చదవడం నేర్పమని అడిగాడు. గొడ్లుకాసుకోడంలో అతనికొట్టే తీరికుండేదికాదు. చదువు కోడం కష్టంగా ఉండేది. ఫాదరీమాత్రం శ్రద్ధతీసుకునేవాడు. రోజూ ప్రార్థనలు చెప్పేచోటనించి తిరిగి వచ్చేటప్పుడతన్ని కూడా రమ్మనేవాడు. దారిలో చిన్నచిన్న పాఠాలు చెప్పేవాడు. ప్రతిరోజూ ఉదయం తొమ్మిది గంటలవేళ రోడ్డు పక్క ఒక రాతిమీద కూర్చునేవారు. మూడుమాసాల్లో అతనికి చదవడం వచ్చింది. మరో మూడు మాసాల్లో వ్రాయడం నేర్చుకున్నాడు. అతని చురుకుతనం, తెలివితేటలు, చూసి ఫాదరీ ఈ సంగతి కౌంట్‌తో చెప్పాడు. కౌంట్ అతన్ని పిలిచి చదివించి వ్రాయించి చూశాడు. తన నౌకర్లతోపాటు అతనిక్కూడా బస, భోజనం ఏర్పాటుచేసి జీతం ఇచ్చేవాడు. ఈ డబ్బుతో లూగీ పుస్తకాలు, కలాలు కొనేవాడు. దేన్ని చూసినా దాని ప్రతిచిత్రం వ్రాయడానికి ప్రయత్నించేవాడు. వీలున్నచోటెల్ల తన కత్తితో బొమ్మలు చెక్కేవాడు.

"థెరిసా అనే ఒక చిన్నమ్మాయి కూడా గొడ్లు కాస్తూ ఉండేది. ఇద్దరూ స్నేహంగా ఉండేవారు. అప్పుడే ఇద్దరి సహజ లక్షణాలూ కనపడేవి. ఒంటరిగా ఉన్నప్పుడు వాంపా చిత్రలేఖనం, శిల్పం సాగించేవాడు. కాని తరుచు అతన్ని ఉండుండి ఉద్రేకం, కోపం, మాత్సర్యం ఆవహించేవి. ఈ తత్వంవల్ల అతని కొట్టే మందిస్నేహితులు లేక పోయారు. ఇతన్ని లొంగ తియ్యగలిగింది థెరిసా ఒక్కత్తే. ఆడదానిచేతిలో కాక మగవాడిచేతిలో నైతే, ఆమొక్కని విరగ్గొట్టవచ్చునే గాని వొంచడం సాధ్యం కాదు. థెరిసా అతన్ని వొంచగలిగింది. కాని థెరిసా గుణం మంచిది కాదు. మగవాళ్లని లోబరుచుకోడంలో గట్టిది. చలాకీగా తిరిగేది. వాంపా నెలకి సంపాదించుకునే రెండుస్పానిష్ డాలర్లు, చిత్రాలు అమ్మి తెచ్చే డబ్బూ, ఆమె లోలకులకీ, హారాలకీ, బంగారు పిన్నులకీ ఖర్చు పెట్టేసేవాడు. థెరిసా సహజంగా అందగత్తె. అతను కొనిచ్చిన ఆభరణాలు అలంకరించుకుంటే అప్సరస లాగుండేది.

"ఒకనాడు తన పశువులమీదికి ఒక తోడేలు వచ్చిందని వాంపా ఒక నౌకరుతో చెప్పాడు. వాడు అతని కొక తుపాకి

ఇచ్చాడు. వాంపా చాలరోజులుగా దీనికోసమే చూస్తున్నాడు. అది మొదలు నిత్యం గురి నేర్చుకుంటూ గడిపేవాడు. మందు, గుళ్లు కొనివాడేవాడు. అది చూసి థెరిసా మొదట భయపడింది. కాని అతని గురిచూసేసరికి ఆమెకీ ఉత్సాహం ఎక్కువయింది. అతను చెప్పినచోట గురితప్పకుండా కొట్టగలిగే నేర్పు సంపాదించాడు.

"ఒకనాడు అడవిలో ఒక మూలనించి తోడేలొకటి వచ్చింది. అది పదగుజులు ముందుకువచ్చిందో లేదో, వాంపా గురిచూసి తుపాకితో కాల్చి చంపాడు. వాంపా గంతులు వేసుకుంటూ పల్లితో వెళ్ళి భుజంమీద వేసుకుని ఎస్టేట్‌కితీసుకువెళ్లాడు. లూగీకి మంచి పేరువచ్చింది. ప్రజ్ఞ కలవాడి చుట్టూ పదిమంది భళాభళీ అనే వాళ్లు చేరడం లోకంలో సామాన్యమే. అతని నేర్పు, సాహసం, బలం గురించి అందరూ చెప్పుకుని అతన్ని పొగుడుతూ ఉండేవారు. చుట్టూ ముప్పైమైళ్లదూరంలో అతని పేరు ఎరగనివాళ్ళు లేరు. థెరిసా దగ్గర ప్రేమ ప్రసంగం ఎత్తే ధైర్యం ఎవరికీ లేదు. ఆమెకి వాంపా ప్రియుడని అందరికీ తెలుసును. అయితే ఆ ఇద్దరూ ప్రేమించుకున్నట్లు ఎప్పుడూ అనుకోనైనా లేదు. ఒకళ్లనొకళ్లు విడిచి ఉండలేక పోయేవారు.

"ఆరోజుల్లో లెపినీ పర్వతాల్లో పెద్ద దొంగల గుంపొకటి చేరినట్లు చెప్పుకునేవారు. అసలు రోమ్ నగర పరిసరాల్లో దొంగల బాధ ఎన్నడూ పోలేదు. ఆ దొంగలకి అప్పుడప్పుడు నాయకుడు లేకుండా పోవడం కద్దు. నాయకుడైనవాడు దొరికితే దొంగల గుంపులి కెన్నడూ లోటులేదు.

"నేపుల్స్‌లో యుద్ధం సాగించి, తరిమితే పారిపోయి వచ్చిన కకుమేటో ఇక్కడ చేరి అందర్నీ కూడ గట్టాడు. ఆ రోజుల్లో ఆ చుట్టుపట్ల నగరాల్లో అనేకమంది యువకులు మాయమై పోయేవారు. ఇలా మాయమవడం మొట్టమొదట అంతగా ఎవర్నీ బాధించలేదు. వాళ్లు వచ్చి కకుమేటో దండులో చేరేవారు. ఆతరవాత అతని పేరు లోకమంతా మోగిపోయింది. అతన్ని గురించి కథలు కథలుగా చెప్పుకునేవారు. అతని క్రౌర్యం, నిర్దాక్షిణ్యం, సాహసం విని అందరూ హడలిపోయేవారు.

"లూగీ, థెరిసా నిత్యం ఈ కథలే చెప్పుకునేవారు. థెరిసా ఈ కథలు విని గజగజలాడిపోయేది. కాని వాంపా నవ్వుతూ, తన గురికి పేరు తెచ్చిపెట్టిన తుపాకీని దువ్వుతూ, ఆమెకి ధైర్యం చెప్పే వాడు. అప్పటికీ ఆమెకి భయంపోకపోతే, ఏ కొమ్మమీదనో ఉన్న కాకిని చూపించి గురిచూసి కొట్టేవాడు. కాకి చచ్చి పడిపోయేది. తనకి గురి ఉన్నంతవరకూ ఆమె భయపడనక్కరలేదని చెప్పే వాడు. అలా రోజులు గడిచిపోయేవి. ఇద్దరూ చివరికి పెళ్లిచేసుకో డానికి నిర్ణయించుకున్నారు. అప్పటికి వాంపాకి ఇరవైయేళ్లు, థెరిసాకి పందొమ్మిదేళ్లు ఉన్నాయి. ఒకనాడు వాళ్లిద్దరూ కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ ఉండగా రెండుమూడుసార్లు తుపాకి చప్పుడు వినపడింది. అకస్మాత్తుగా ఒక మనిషి అడవివైపునించి పరుగెత్తు కుంటూ వాళ్లదగ్గరకు వచ్చాడు. 'నన్ను వెంటాడుతున్నారు. నన్ను దాచండి. రక్షించండి' అంటూ అరిచాడు. వీడు దొంగ అని వాళ్ళిద్దరికీ తెలుసును. రోమన్లలో దొంగలకీ, రైతులికీ చిత్రమైన దోస్తీ ఉంది. ఒకరికొకరు ఎప్పుడూ సహాయపడతారు. వాంపా మారు మాట చెప్పకుండా తన గుహ ద్వారందగ్గర రాయి ఒత్తిగించి, లోపల దాక్కోమని దొంగని పంపాడు. మళ్లీ రాతితో ద్వారం మూసేసి థెరిసావద్దకువెళ్లి పక్కని కూర్చున్నాడు. ఇంత లోనే అడవిలోనుంచి నలుగురు పోలీసులు గుర్రాలమైన వచ్చారు. వారి చేతుల్లో పెద్ద తుపాకులున్నాయి. ముగ్గురు పారిపోయిన వాడికోసం వెతుకుతునట్టున్నారు. నాలుగోవాడు మరొక దొంగని మెడపట్టుకుని లాక్కొస్తున్నాడు. కూర్చున్న ఇద్దరినీ చూసి పై ముగ్గురూ వచ్చి అడిగారు. వాంపా ఎవరినీ చూడలే దన్నాడు. 'అరే! వాడు దొంగలందరికీ నాయకుడు. వాడే పారిపోయాడే' అన్నాడు ఒకడు.

" 'ఎవరు? కకుమేట్రో మాటేనా?' అన్నారు వాంపా, థెరిసా లిద్దరూ ఒక్కసారిగా.

" 'అవును' అన్నాడతను. 'వాణ్ని పట్టుకుంటే వెయ్యి రోమన్ క్రౌన్లు బహుమతి. నువ్వు పట్టుకుని ఉన్నట్లయితే నీకు అయిదువందలు, నాకు అయిదువందలు వచ్చేవి.' ఇద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. అడిగినవానికి ఆశ కలిగింది.

అయిదువందల క్రౌన్లు అంటే మూడువేల ఫ్రాంకులు. కొత్తగా పెళ్ళిచేసుకునే దంపతులికి అది మహాద్భాగ్య మన్నమాట.

"వాంపా అన్నాడు 'నిజమే. చిక్కే మరి. కాని పాపం నేను చూడలేదు వాణ్ని.'

"నలుగురూ ఆచోటంతా వెతికి వెతికి విసుగెత్తి చివరికి వెళ్ళిపోయారు. అప్పుడు వాంపా రాయితీసి కకుమేటోని విడిచి పెట్టాడు. అతను వీళ్లు మాట్లాడినదంతా రాతివెనకనించి విన్నాడు. తనను విడిచిపెట్టకూడదని ఇదరూ పట్టుదలతో ఉండడం కని పెట్టాడు. తన జేబులోనించి ఒక పర్సుతీసి వాళ్ల కిచ్చాడు. పర్సు నిండా బంగారునాణే లున్నాయి. వాంపా నిరాకరించాడు. థెరిసాకిమాత్రం కన్నులుమిరుమిట్లు గొలిపాయి. ఇంత బంగారంతో ఎంత చక్కని గౌన్లు కొనుక్కోవచ్చునో, ఎన్ని నగలు చేయించు కోవచ్చునో ఊహించుకుని మురిసిపోయింది.

"కకుమేటో జిత్తులమారి కూడా. అసలు దొంగ కావలసిన వాడు కాడు. తొచుపామై పుట్టవలసినవాడు. థెరిసా అందం చూసేసరికి అతనికి భ్రమపుట్టింది. ఆమె పొందుకోసం ఎంత సాహ సానికైనా వెనుదియ్యరాదనుకున్నాడు. అడవిలోకి వెళ్ళిపోతూ పదేపదే వెనక్కి తిరిగి ఆమెవంక చూస్తూ నడిచాడు. చాలరోజులు గడిచిపోయాయి. వాళ్లిద్దరికీ కకుమేటో మళ్లీ కనపడలేదు.

"అప్పటికి ఉత్సవాలు దగ్గరపడ్డాయి. వాంపా ఎవరిదగ్గర చాకిరీ చేస్తున్నాడో, ఆ కౌంట్ బ్రహ్మాండమైనవిందొకటి ఏర్పాటు చేసి, రోమ్‌నగరంలో పేరుగల వాళ్లందర్నీ ఆహ్వానించాడు. థెరి సాకి ఈ విందు చూడాలని కోరిక కలిగింది. లూగీ పరిచారకుల్లో ఒకడి సహాయం అడిగాడు. విందుసమయంలో ఇద్దర్నీ నౌకర్లతో జతచెయ్యడానికి అత నొప్పుకున్నాడు. ఈవిందుని తన కూతురు కార్మెల్ కోసమే కౌంట్ ఏర్పాటుచేశాడు. అతనికి కూతురంటే తగని ప్రీతి. ఆమె సరిగ్గా థెరిసా ఈడుదే. అందచందాల్లో ఇద్దరూ సమానంగా ఉంటారు. విందురోజు సాయంకాలం థెరిసా తన కున్న దుస్తులన్నిటిలోకీ అందమైనది ఏరి తొడిగింది. చక్కని హారాలు వేసుకుంది. రోమన్ రైతులు ఉత్సవాల్లో ధరించే దుస్తుల్నే వాంపా తొడిగాడు. ఇద్దరూ కలిసి పరిచారకులమధ్య తిరుగు తున్నారు.

"కార్మెలా కూడా అద్భుతంగా అలంకరించుకుంది. ఆమె టోపీకి ముత్యాలు కుట్టిఉన్నాయి. తలలో వజ్రాలు తాపిన బంగారు పిన్నులు గుచ్చుకుంది. నడుముకు టర్కిష్ పట్టురుమాలు కట్టింది. ఇద్దరు చెలికత్తెల్ని కూడా తగినట్లు అలంకరించింది. యువతీ యువకులమధ్య స్వేచ్ఛ అంటే, ఇటలీలో ఉన్నంత మరే దేశంలోనూ ఉండదు. కార్మెలా నలుగురు రాజబంధువులైన యువకుల్ని వెంటబెట్టుకుంది.

"నలుగురేసి యువతులు, యువకులు చేరి నృత్యం చెయ్యాలని కార్మెల్ కోరిక. అయితే తన జట్టులో ఒక యువతి లోటయింది. కార్మెలా చుట్టూ చూసింది. కాని తనమాదిరిగా దుస్తులు ధరించిన యువతి కనపడలేదు. అప్పుడామె తండ్రి థెరిసావంక వేలితో చూపాడు. థెరిసా లూగీ చెయ్యిపట్టుకుని తిరుగుతోంది.

"'ఆ అమ్మాయిని తీసుకురానా నాన్నా?' అని కార్మెలా అడిగింది.

"'ఏం ఎందుకు తీసుకు రాకూడదు? ఇది ఉత్సవాలసమయమన్నమాట మరిచిపోయావా?' అన్నాడు తండ్రి.

"కార్మెలా తన ప్రక్కనున్న ఒక యువకునితో రహస్యంగా చెప్పి థెరిసావంక చూపింది. యువకుడు సమ్మతి చూపి ఆమెవద్దకు వెళ్ళాడు. థెరిసాని నృత్యానికి ఆహ్వానించాడు. థెరిసా ఇది వినేసరికి ఆనందంతో పరవశమైపోయింది. ముఖం ఎర్రబడింది. లూగీ ముఖంలోకి చూసింది. ఆమె కోరికను లూగీ కాదనలేకపోయాడు. మెల్లిగా ఆమెచెయ్యి విడిచిపెట్టాడు. థెరిసా ఆయువకుని అనుసరించింది. వేగంగా కొట్టుకుంటున్న గుండెలతో భాగ్యవంతుల మధ్యకు థెరిసా వెళ్లింది. నృత్యకళపట్ల అభిమానం కలవారందరికీ ఆ నృత్యం నేత్రపర్వంగా ఉంది. కార్మెలాకీ ఆమెకీ చాల వ్యత్యాసం ఉంది. థెరిసా చలాకీగా ఉంటుంది. ఆ పట్టు దుస్తులు, నగలు, వజ్రాలు చూసేసరికి ఆమెకి తల తిరిగినట్లయింది.

"లూగీ ఇదంతా చూస్తున్నాడు. ఇదివరలో ఎన్నడూ తెలియని చిత్రమైన భావోద్రేకం అతినికి అనుభవమయింది. గుండెల్లో నొప్పివలె బయలుదేరి అది శరీరమంతటినీ కంపింపచేసింది.

థెరిసా ఒక యువకుని చేతుల్లో ఒదిగి నృత్యంచేస్తుండగా, ఆమె కదలి కల్నీ అతిశ్రద్ధగా పరిశీలించాడు. ఆమె ఆయువకుని ఆలింగ నంలో పరవశమైపోతున్నప్పుడు, లూగీకి మూర్ఛ వచ్చినట్లయింది. వాళ్లిద్దరూ మాట్లాడుతున్నప్పుడు లూగీకి ప్రపంచమంతా గిరగిర తిరిగిపోతున్న ట్లనిపించింది. అతనిలో అనేక ఆలోచనలు చెల రేగాయి. హత్య అనేభావం అతని చెవుల్లో గుసగుస లాడి నట్లుంది. తన ఒళ్లు, తన మనస్సు తనవశం తప్పిపోతున్నాయని భయపడి ఒక చెట్టుకొమ్మ నానుకుని నిలబడ్డాడు. ఒక చెయ్యి కత్తి పిడిని బిగబట్టింది. మాటిమాటికీ కత్తి ఒరలోనుంచి పైకి వస్తోంది. లూగీ అసూయతో అంధుడైపోయాడు. థెరిసా దురాశ అతనికి తెలుసును. ఆమె కోర్కెలు కూడా ఎటువంటివో అతనికి తెలుసును. ఆమె చంచల ప్రవృత్తి తెలుసును. తన చేతులనుంచి ఆమె జారిపోతుందని భయపడ్డాడు.

"మొదట జంకుతూ, భయపడుతూ వచ్చిన థెరిసా క్రమంగా స్థైర్యం కోలుకుంది. థెరిసా అందగత్తెమాత్రమే కాదు. ఆమె నడకలోనూ, ప్రతి భంగిమలోనూ సొగసుంది. ఒయ్యారం ఉట్టిపడుతుంది. అవి తెచ్చి పెట్టుకున్నవి కావు. అవి తెచ్చి పెట్టుకున్న సొగసుకంటె, ఆకర్షణీయమైన సహజవిన్యా సాలు. నృత్యంలో అందరిచూపులూ ఆమెపైనే ఉన్నాయి. అందరూ ఆమెనే స్తుతించారు. కార్మెలా భోగభాగ్యాలపట్ల థెరి సాకి అసూయ కలిగినమాట నిజమే. కాని థెరిసా అందచందాలపట్ల కార్మెలాకి అసూయ బయలుదేరింది. నృత్యం అనంతరం ఆ యువ కుడే ఆమెను చెయ్యిపట్టుకుని తిరిగి లూగీవద్దకు నడిపించుకు వెళ్లాడు. నృత్యం చేస్తున్నప్పుడు రెండుమూడుసార్లు థెరిసా లూగీ వంక చూసింది. అతనిముఖం పాలిపోయినట్లు, అతను ఉద్రేకానికి లోనైనట్లు ఆమె గమనించింది. ఒకసారి ఒరలోనుంచి పైకి వచ్చిన అతని కత్తికూడా ఆమె కళ్లలో తీక్షణంగా మెరిసింది. అందువల్ల ఆమె భయపడుతూ, వొణుకుతూ మళ్లీ ప్రియుని చెయ్యి అందుకుంది. నృత్యం అద్భుతంగాఉందని అతిథులంతా అన్నారు. మరొకసారి నృత్యం చెయ్యాలని కార్మెలాను అర్థించారు. అది ఆమెకితప్ప అందరికీ ఇష్టమే. ఆమె తండ్రి ఆమెను బ్రతిమాలాడు. ఆ యువకుడే మళ్లీ థెరిసాకోసం వెతికాడు. కాని ఆమె కనపడ

లేదు. అది లూగీకికూడా ఇష్టంలేదు. అందువల్ల కొంత ఆమెను ఒప్పించీ, కొంత బలవంతం పైనా ఆమె వక్కడనుంచి తీసుకుపో యాడు. థెరిసాకి ఇష్టం లేకపోయినా అతనిముఖం చూసి, అతనిలో ఏదో విచిత్రమైన మార్పున్నట్లు గ్రహించి వెళ్లిపోడానికి ఒప్పుకుంది. అప్పు డతని కంఠస్వరంకూడా కంపిస్తోంది. ఆమెలోకూడా ఏదో తెలియని చిత్రమైన భావం తోచింది. తనవల్ల ఏదో తప్పైందనీ, లూగీ నిరసించడంలో తప్పు లేదనీ ఆమెకి తోచింది. కాని లూగీ సాయంకాలంవరకూ ఒక్క మాటకూడా పలకలేదు. ఆమె కిది ఆశ్చర్యమయింది. రాత్రిపడగానే అతిథు లందరూ సావడిలో చేరారు. థెరిసాని ఆమె ఇంటికద్ద దిగబెట్టి లూగీ ఇలా అన్నాడు: 'థెరిసా, కార్మెలాతో కలిసి నృత్యం చేసినప్పుడు నువ్వు మన స్సులో ఏమనుకున్నావ్?'

"దాపరికంలేని సహజధోరణిలో ఆమె ఇలా చెప్పింది. 'ఆమె దుస్తుల్ని ధరించడానికి సగం జీవితం ధారపొయ్యి వచ్చు ననుకున్నాను.'

" 'ఆ యువకు డేమన్నాడు నీతో?'

" 'అదే నిజంగా కోరుకుంటే, నా నోట ఒక్కమాట చాలు న్నాడు.'

" 'అవును. అత నన్నది నిజం. నిజంగా నువ్వు అంతగా కోరుకుంటున్నావా?'

" 'అవును'

" 'అయితే అది నీకు లభిస్తుంది' అన్నాడు లూగీ.

"థెరిసా ఆశ్చర్యపడింది. అతని ముఖంలోకి చూసింది. అతని గంభీరభావం ఆమెకు భయం కలిగించింది. ఆమె నోరు కట్టుపడిపోయింది. లూగీ వెళ్లిపోతుండగా అతన్ని తదేకంగా చూసింది. అతను చీకటిలో మాయమై పోగానే ఆమె లోపలికి వెళ్లి పోయింది.

"ఆరాత్రి కార్మెలా తండ్రి, కౌంట్ సెంట్ ఫెలిక్స్ ఇంట్లో ఒక దుర్ఘటన జరిగింది. నౌకర్ల అశ్రద్ధవల్ల కొవ్వొత్తులు ఒక గదిలో దీపాలుఆర్పబడ లేదు. కార్మెలా గది ప్రక్కనే ఇంటికి నిప్పంటు కుంది. మంటలుచూసి కార్మెలా పడకలోనుంచి ఒక్క ఉదుటున

లేచింది. ఒక దుప్పటి చుట్టబెట్టుకుని పారిపోడానికి ప్రయత్నించింది. కాని ద్వారంలో మంటలు లేస్తున్నాయి. గదిలోకివచ్చి సహాయం కోసం కేకలు పెట్టింది. అప్పుడు హఠాత్తుగా ఇరవై అడుగుల ఎత్తు నున్న కిటికీ తెరుచుకుంది. అందులోనుంచి ఒక గైతుమాకి వచ్చాడు. ఆమెనెత్తి ఒక చేతితో పొదివి పట్టుకుని, తీసుకుపోయి మంటలమధ్య నుంచిరక్షించాడు. ఆమెకు స్మృతివచ్చేసరికి తండ్రి ప్రక్కనున్నాడు. నౌకర్లు చుట్టూచేరి పరిచర్యలు చేస్తున్నారు. భవనం ఒక పెంతా కాలిపోయింది. కాని కొర్కెలా రక్షించ బడినందువల్ల ఎవరూ లక్ష్యపెట్టలేదు. ఆమె నెవరు రక్షించారో అతనికోసం చుట్టూ వెతికారు. కాని అతను కనపడలేదు. ఎవ్వరూ అతన్ని చూడ లేదు. భయంలో కొర్కెలా కూడా అతన్ని గుర్తుపట్టలేదు.

"ఆమరునాడు లూగీ ఘెరిసాలు మాగాలుచోటికివచ్చి కూర్చున్నారు. లూగీముందు వచ్చాడు. అతని ఉత్సాహానికి మేర లేకుండా ఉంది. ముందు సాయంకాలం జరిగినదంతా అతను మరిచిపోయినట్టున్నాడు. ఆమెను చెయ్యిపుచ్చుకుని గుహవద్దకు నడిపించుకు వెళ్లాడు. అక్కడ ఆగి ఇలా అన్నాడు: 'ఘెరిసా, నిన్న సాయంకాలం నువ్వన్నమాట జ్ఞాపకం ఉందా? కొర్కెలా ధరించిన దుస్తులకోసం జీవితం అంతా ధార పోస్తానన్నావు?'

"'అవును జ్ఞాపకం ఉంది. కాని అదొక పిచ్చిలో అన్నా నంతే' అంది ఘెరిసా. కాని ఆమె ఆశ్చర్యపడింది అతన్ని చూసి.

"'తరవాత నేను నీకు మాటిచ్చాను, నీకు లభిస్తుందని' అన్నాడు లూగీ.

"'నిజమే,' అంది ఘెరిసా మరింత ఆశ్చర్యపడి. కాని 'సంతోషపెట్టడానికి ఊరికే అన్నావా మాట' అంది.

"'లేదు' అన్నాడు లూగీ. 'నీకు నిజంగా నేఇస్తానన్నాను. గుహలోకి వెళ్లి అది తొడుక్కుని రా' అన్నాడు. అతని ముఖంలో గర్వం ఉట్టిపడుతోంది. రాయి తొలగించి గుహలోకి దారిచేశాడు. గుహలో రెండు కొవ్వొత్తి దీపాలున్నాయి. ఎదురుగా పెద్ద అద్దం ఒకటుంది. లూగీ స్వయంగా తయారుచేసిన

ఒక మోటు మేజామీద ముత్యాలహారం, వజ్రాలు తాపిన బంగారు పిన్నులు, పక్కనే పట్టుదుస్తులు ఉన్నాయి.

"ఖెరిసా సంతోషంతో ఒక పెద్ద కేక పెట్టింది. అదేలా తీసుకువచ్చాడో కూడా అడక్కుండా లోపలికి పరుగెత్తింది. గబగబా అదుస్తులు ధరించింది.

"ఇంతలో అతనికి గుర్రాల గిట్టల చప్పుళ్లు వినవచ్చాయి. గుహాద్వారం మూసివేసి ఒక గుట్ట నెక్కి చూశాడు. దగ్గరలోనే ఒక రౌతు ఒక చోట నిలబడి దారి ఏదన్నట్లు యోచిస్తున్నాడు. లూగీని చూడగానే అతడు గుర్రాన్ని అదల్చి సమీపించాడు. టివోలీ వెడుతూ అతను దారితప్పాడు. లూగీ అతనికి దారి చెప్పాడు. కాని ఆదారి రెండుఫర్లాంగుల తరవాత మూడు దిక్కులుగా చీలినందువల్ల, అంతవరకూ వచ్చి చూపించమని అతను లూగీని కోరాడు. ఇద్దరూ కలిసి అంతదూరం వెళ్లాక లూగీ దారి చూపించాడు. అప్పుడా రౌతు మహారాజ ఠీవితో చెయ్యిచాపి 'ఇదిగో ఇది తీసుకో' అని చిల్లరి కొంత ఇవ్వచూపాడు. లూగీ అది చూసి, 'నేను సహాయం చేస్తాను కాని డబ్బు తీసుకోను' అన్నాడు.

"'సరే పోనీ ఈ బహుమతి తీసుకో. ఇవి బంగారు పిన్నులు. నీ భార్య కియ్యి' అన్నాడు రౌతు.

"'అయితే మీరీ చురకత్తి తీసుకోండి. ఇటువంటిది మీకు సామాన్యంగా దొరకదు' అని లూగీ కత్తి ఒకటి తీసి రౌతు కిచ్చాడు. రౌతు అది తీసుకుని 'అయితే నేనే నీకు ఋణపడుతున్నాను. దీని విలువ బంగారు పిన్నులకంటె చాలా హెచ్చు' అన్నాడు.

"'వర్తకుడికైతే అది కావచ్చును. కాని ఇది నేను స్వయంగా తయారుచేశాను.' అన్నాడు లూగీ.

"'నీ పేరేమిటి?' అన్నాడు రౌతు.

"'లూగీ వాంపా' అన్నాడు గర్వంతో. 'మీ పేరు?' అని తిరిగి ప్రశ్న వేశాడు.

"'నన్ను సింద్‌బాద్ అంటారు' అన్నాడు రౌతు."

ఈ మాటవినేసరికి ఫ్రాంజ్ ఉలిక్కిపడ్డాడు. వెంటనే అనేక విషయాలు అతనికి జ్ఞప్తికి వచ్చాయి. "సరే చెప్పవు పాంపి" అన్నాడు.

"వాంపా పిస్తోలు జేబులో పెట్టుకుని మెల్లిగా నడిచి వెళ్లాడు. గుహ నూరడుగు లుండగా అతనికి కేకలు వినపడ్డాయి. తరవాత అతన్ని పేరుపెట్టి పిలిచినట్లు వినపడింది. కేకలు గుహ వైపునుంచే వినవస్తున్నాయి. తుపాకి ఎత్తి వాంపా పరుగెత్తాడు. గుహదగ్గర గుట్టెక్కి చూస్తూ చూశాడు. అవతలివైపునుంచి కేకలు వస్తున్నాయి. ఎవరో ఒక వ్యక్తి థెరిసాను ఎత్తుకు పోతున్నట్లు చూశాడు. పరుగెత్తి పట్టుకోడం కష్ట మనుకున్నాడు వాంపా. తుపాకినెత్తి గురిచూశాడు. క్షణం సేపు పరికించి మీట నొక్కాడు. పారిపోతున్న వ్యక్తి ఠక్కున ఆగిపోయాడు. అతని మోకాళ్లు వొంగిపోయాయి. థెరిసా చేతుల్లో ఉండగానే నేలమీదికి ఒరిగిపోయాడు. థెరిసా వెంటనే లేచి నిలబడింది. దుండగుడు గిలగిల్లాడుతున్నాడు. థెరిసా వాంపా వైపుకు పరుగెత్త నారంభించింది. కాని పది అడుగులు వచ్చేసరికి ఆమె కాళ్లు స్వాధీనం తప్పి, కింద పడిపోయింది. వాంపా ఆమెవద్దకు పరుగెత్తుకు వెళ్లాడు. తుపాకి గుండు ఆమెకికూడా తగిలిందని భయపడ్డాడు కాని ఆమెకి గాయం తగలలేదు. భయంవల్ల కాళ్లలో సత్తువపోయింది. ఆమెను బుజ్జగించి లూగీ దుండగునివంక చూశాడు. అతని కప్పుడే ప్రాణంపోయింది. దగ్గరకువెళ్లి చూసేసరికి అతను కకుమేటో అని గుర్తుపట్టాడు. వాంపా రక్షించిన రోజు నుంచీ అతనికి థెరిసాపైన వాంఛ కలిగింది. ఏమైనాసరే ఆమెను పొందాలని ప్రతిజ్ఞ తీసుకున్నాడు. ఆనాటినుంచీ ఇద్దరినీ కకుమేటో కనిపెట్టి చూస్తున్నాడు. ఆమె ఒంటరిగా ఉన్న అదను చూసి ఇప్పుడెత్తుకుపోడానికి ప్రయత్నించాడు. కాని వాంపా గురిచూసి అతన్ని కొట్టాడు. వాంపా థెరిసా వంక తిరిగి 'ఓ! ఆ దుస్తు లప్పుడే వేసుకున్నావా? చక్కగా ఉంది. ఇప్పుడింక నేను నాదుస్తులు వేసుకోవాలి' అన్నాడు.

"కార్నెలా ఆ సాయంకాలం ధరించిన దుస్తుల్ని, నగల్ని ఇప్పుడు థెరిసా ధరించింది. కకుమేటో శవాన్నెత్తి వాంపా గుహ లోకి తీసుకెళ్లాడు. థెరిసా గుహద్వారంవద్ద రాతిమీద కూర్చుంది.

పావుగంటలో వాంపా గుహలోనుంచి వచ్చాడు. సాటిన్ కోటు, సిల్కు పంట్లాం, బంగారు జొత్తాములతో అతని రూపు మారిపో యింది. రెండు గడియారాలు జేబులలోనుండి వేలాడుతున్నాయి. బెల్ట్‌నంటి ఒక కత్తి వేలాడుతోంది. థెరిసా అతన్ని చూసి ఆశ్చర్య చకితురాలయింది. వాంపా కనుమేల్లో దుస్తుల్ని తీసుకున్నాడు. సగర్వంగా నవ్వి ఆమెతో అన్నాడు: 'నేనింక ఏ వృత్తిలో ఉన్నా సరే నాతో వస్తావా?'

"'తప్పకుండా' అంది థెరిసా ఉత్సాహంతో.

"'ఎక్కడికి వడితే అక్కడికి వస్తావా?'

"'నిప్పులో దూకమన్నా సరే' అంది థెరిసా.

"'అయితే రా' అని ఆమె చెయ్యి అందుకున్నాడు. 'మనం ఇంక క్షణం జాప్యం చెయ్యకూడదు.'

"ఎక్కడికి తీసుకు వడుతున్నాడనైనా అడక్కుండా ఆమె అతన్ననుసరించింది. ఇద్దరూ అడవిలోకి వెళ్లారు. గంట న్నరసేపు అడవిలో నడిచారు. అక్కడ ఎండిపోయిన ఏటి దారి కనపడింది. పరిసరాలు చూసి భయపడి థెరిసా అతన్నాను కుని నడిచింది. కొద్ది దూరం వెళ్లిన తరవాత హఠాత్తుగా ఒక మనిషి ఎదురైనాడు. 'ఆగండి. ఒక్కడుగు ముందుకి వేస్తే ప్రాణాలు పోతాయి జాగ్రత్త' అన్నాడు ఆ మనిషి.

"వాంపా నిర్లక్ష్యంతో చెయ్యి విదల్చి, 'ఇదేమిటి? తోడేళ్లు తోడేళ్లనే తింటాయా ఎక్కడైనా' అన్నాడు. థెరిసా భయానికి మితిలేదు. అతన్ని అంటి పెట్టుకుని నిలబడింది.

"'ఎవరు మీరు?' అని అడిగాడు పహరా.

"'నేను లూగీ వాంపా. కౌంట్ సెంట్ ఫెలిప్ ఎస్టేట్‌లో రైతుని. రక్కొ బయాంకొలో మీ మిత్రులితో నేను మాట్లా డాలి.'

"'అయితే నా కూడా రా' అన్నాడు పహరా. 'లేదా దారి తెలిస్తే నువ్వొక్కడ వేనన్లు.

"వాంపా నిర్లక్ష్య భావంతో నవ్వి, థెరిసాను వెంటబెట్టు కుని నడిచాడు. పది నిమిషాల తరవాత ఒక చోట పహరా ఆ

మన్నాడు. తను కూడా ఆగి, కాకి అరిచినట్లు గూడుసాగ్గు అరిచాడు. మళ్లీ అదేమాదిరి అగుపు జవాబుగా వినవచ్చింది.

"'మీరు వెళ్లండి' అన్నాడు పహారా. ఇద్దరూ ముందుకి వెళ్లారు. చెట్ల గుబురులలోనుంచి తుపాకులు, కత్తులు చూసి థెరిసా వొణికిపోతోంది. నిర్మాణం జాగాకు చేరగానే అక్కడ ఇరవైమంది దొంగలు కనపడ్డారు.

"'ఇతను మీతో మాట్లాడాలిట' అన్నాడు పహారా.

"'ఏమంటాడు?' ఒకడు అడిగాడు. నాయకుడు దక్కడ లేనందువల్ల అతని బదులు నాయకత్వం వహించినట్లున్నాడతను.

"'నాకీ గొడ్లకాపరితనం అంటే విసుగుపుట్టేసింది' అన్నాడు వాంపా.

"'అవును. అర్థమయింది. అంటే మాలో చేరాలనుకుంటున్నావన్నమాట.'

"'రా రా' అన్నారు కొందరు దొంగలు, వాంపాని గుర్తుపట్టి.

"'వస్తాను. కాని మీతో చేరడమే కాదు. నాకు అంతకంటె ఎక్కువే కావాలి'

"'అదేమిటో?'

"'నేను మీకు నాయకుడిగా ఉంటాను.'

"దొంగలు పకలబడి నవ్వారు.

"'అంత పదవి కావాలనుకోడానికి నువ్వేం గొప్పపని చేశావ్?' అన్నాడు కడు.

"'మీ నాయకుడు కకుమేతోను చంపేశాను. ఇప్పుడు నేనతని దుస్తులే వేసుకున్నాను. కౌంట్ సెంట్ ఫెలిక్ ఇంటికి నిప్పంటించాను అతని ఇంట్లో నా థెరిసాకోసం పెళ్లి దుస్తులు, నగలు దోచాను.'

"గంటలో లూగీవాంపా దొంగల నాయకుడైనాడు."

కథంతా విని ఫ్రాంజ్, ఆల్బర్ట్ వైపు తిరిగి, "ఏమిటోయ్? లూగీ వాంపాని గురించి నీ ఉద్దేశమేమిటి?" అని అడిగాడు.

"అదంతా ఒట్టిది, అభూత కల్పన. అసలటువంటి వాడు లేడంటాను" అన్నాడు ఆల్బర్ట్.

ఫ్రాంజ్ హోటల్ యజమాని వైపు తిరిగి "ఇప్పటికి అతను రోమ్‌నగర ప్రాకారాల వద్ద తిరుగుతున్నాడంటారా?" అని అడిగాడు.

"తప్పకుండా తిరుగుతున్నాడు: పైగా అతనికున్న సాహసం ఎవరికీ లేదు."

"పోలీసులు పట్టుకోలేక పోయారా?"

"అందులో ఆశ్చర్య మేముంది? మైదానాల్లో పసుల కాపరకి అతనంటే అభిమానం. పల్లెవారితో అతనికి స్నేహం. తీర ప్రాంతంలో అక్రమ వ్యాపారం సాగించేవారితో అతనికి వ్యవహారా లున్నాయి. అతనికోసం కొండల్లో వెతికితే, తీరంవద్ద ఉంటాడు. తీరంవద్ద వెతికితే, సముద్రంలో ఉంటాడు. అతన్ని వెంటాడితే,మాంట్ క్రిస్టో ద్వీపంలోనో, ఎల్ గిగ్లియో ద్వీపంలోనో దాక్కుంటాడు. అక్కడ వెతికితే మరొకచో టుంటాడు."

"ప్రయాణీకులపట్ల అత నెలా ప్రవర్తిస్తాడు?"

"అది నగరానికి అతనుండే దూరాన్ని బట్టి ఉంటుంది. చిక్కినవాళ్లని విడిచిపెట్టడానికి డబ్బడిగి, వ్యవధి ఇస్తాడు. అది దూరాన్ని బట్టే ఉంటుంది. గడువు దాటగానే సరిగ్గా ఒక గంట చూస్తాడు. డబ్బు రాకపోయిందంటే చేతికి చిక్కినవాణ్ని బుర్ర బద్దలు కొట్టేస్తాడు. లేదా కత్తితో పొడిచి చంపేస్తాడు."

అప్పుడు గడియారం తొమ్మిదిగంటలు కొట్టింది. ఒక నౌకరువచ్చి "బగ్గీ సిద్ధంగా ఉందండి" అని చెప్పాడు.

"అయితే పదం. కలోసియమ్‌కి వెడదాం" అన్నాడు ఫ్రాంజ్.

"ఏమిటి? అనుకున్న దారినే వెడతారా?" అని అడిగాడు యజమాని.

"లేదు, లేదు. నగర వీధుల్లోనించే వెడతాం" అన్నాడు ఫ్రాంజ్.

ఆల్బర్ట్ చుట్ట వెలిగించి అన్నాడు: "అయిందీ! నిజంగా నాకు చాలా ధైర్యం ఉందనుకున్నానే!"

# 34

ఫ్రాంజ్ పట్టించిన దారిలో శిథిలాలు కనపడలేదు. చూడ దలచిన బ్రహ్మాండమైన శిథిల భవనం హఠాత్తుగా కళ్ల బడి ఆశ్చర్యం కలగాలని అతని ఊహ. అంతే కాదు. ఈ దారినైతే ప్రయాణం చాలసేపు పట్టుతుంది. నిన్న కథనిగురించి యోచించడానికి ఫ్రాంజ్ కి కావలసినంత వ్యవధి లభించింది. ఈ కథలో మాంట్ క్రిస్టో ద్వీపంలో తన కాతిథ్యం ఇచ్చిన వింత వ్యక్తికూడా ఉన్నాడు. బండిలో ఒకమూల చేతులు కట్టుకుని కూర్చుని కథకి సంబంధించిన అనేక విషయాలు యోచించ నారంభించాడు. కథలోని అంశాలననుసరించి అతనికి అనేక సందేహాలు కలిగాయి. కాని ఎంత యోచించినా వాటికి సమాధానం దొరక లేదు. తన వింత మిత్రుడు సింద్ బాద్ సంగతి పదేపదే తలపుకువస్తోంది. అతనికీ, ఈదొంగలకీ సంబంధంఏమిటి? నావికులకీ, దొంగలకీ సంబంధం ఏమిటి? వాంపా ఓడల్లో తిరుగు తాడనీ, మాంట్ క్రిస్టో ద్వీపంలో దాక్కుంటాడనీ హోటల్ యజమాని చెప్పాడు. ఆ ద్వీపంలో కార్సికన్ దొంగ లిద్దరి సంగతి ఫ్రాంజ్ కి జ్ఞప్తికి వచ్చింది. వాళ్లని దిగబెట్టడంకోసం సింద్ బాద్ బోటు పనిబడి పోర్టోకి వెళ్లింది. ఇవన్నీ చూస్తే, దానకర్త డనిపించు కోగలిగే ఆ వ్యక్తికి అనేక దేశాలలో పలుకుబడి ఉందన్న మాట.

ఫ్రాంజ్ ఈ ఆలోచనలలోనుంచి హఠాత్తుగా మేలు కున్నాడు. కలోసియమ్ కళ్లబడగానే ఆలోచలన్నీ పటాపంచలై నాయి. బ్రహ్మాండమైన ప్రాకారాల మధ్య కానలలోనుంచి వెన్నెల పాయలై ప్రవహిస్తున్నట్లుంది. దూరంనుంచి చూసేవారికి కానలలోని వెన్నెల మృతుల నిర్జీవ నేత్రాలవలె కనపడుతున్నాయి. బండి తలుపులు తెరుచుకోగానే యువకు లిద్దరూ బయటికి దూకారు. అకస్మాత్తుగా భూమిలోనుంచి లేచివచ్చినట్లు, తలుపు వద్ద ఒక వ్యక్తి నిలబడిఉండడం చూసి ఇద్దరూ ఉలికిపడ్డారు.

రోమ్ నగరంలో శిథిలాలను చూపుతూ చరిత్రాంశాలు తెలియచెప్పేవారి కెన్నడూ లోటులేదు. అసలు వాళ్లని వొది లించుకోడం యాత్రీకులకు దుర్ఘటం. అడుగడుక్కీ ఒకొక్కడు

కాసుకుని కూచుంటారు. వీళ్ల బాధ వొదిలించుకోడానికి యువకులు ప్రయత్నించలేదు. వాళ్లనితప్ప ఇతరులెవ్వరినీ కాగడాలతో లోపలికి ప్రవేశించనివ్వరు. అందువల్ల వాళ్లనెలాగూ వెంట తీసుకువెళ్లక తప్పదు. ఈ శిథిలాలెటువంటివో చూసి గ్రహించవలసిందే కాని మాటల్లో వర్ణించి చెప్పడం కష్టం. ముఖ్యంగా వెన్నెలలో అవెలా కనపడతాయో తెలియచెప్పడం అసాధ్యం. ఈ బ్రహ్మాండమైన శిథిలాలు వెన్నెలలో రెండింతలు పెద్దవైనట్లు కనపడతాయి. ఫ్రాంజ్ ఈ అద్భుతదృశ్యాలు చూసి పరవశుడైపోయాడు. ఆల్బర్ట్‌ని మార్గదర్శకులకు విడిచిపెట్టి, ఫ్రాంజ్ ఒక్కడూ ఒక దారి ననుసరించాడు. కొంతదూరం వెళ్లాక అతనికి శిథిలమై సగం మిగిలిఉన్న సోపానాలు కనపడ్డాయి. అయిదారు మెట్లెక్కి అక్కడ కూర్చుని ఏకాంతంగా పరిసరాలను పరిశీలించ నారంభించాడు. ప్రక్కనే పెద్ద ఆర్చి ఒకటుంది. ఆర్చిగుండా శిథిలాలు వెన్నెలలో వింతగా కనపడుతున్నాయి.

నీడపట్టున దాగి ఫ్రాంజ్ ప్రశాంతంగా యోచిస్తున్నాడు. మార్గదర్శకుల ననుసరించి నడుస్తున్న ఆల్బర్ట్ అతని కింకా కనపడుతూనే ఉన్నాడు. దూరాన రెండు కాగడాల వెలుగులో తిరుగుతున్న ఆ ముగ్గురూ కొరివిదయ్యాలవలె ఉన్నారనుకున్నాడు. నీడల్ని పరికిస్తూ తన ఉనికిని మరిచిపోయిన ఫ్రాంజ్‌కి హఠాత్తుగా వింత సవ్వడి వినవచ్చింది. అతను కూర్చున్న చోటికి కొద్దిదూరంలో అటువంటి మెట్లే ఉన్నాయి. ఆ మెట్లపైన చిన్నరాళ్లు రెండు దొర్లుతున్నట్లు గలగల శబ్దం అస్పష్టంగా వినపడింది. ఆధారం సడలి రాళ్లు దొర్లిపడిపోవడం అక్కడొక వింతకాదు. కాని ఆ రాళ్లు ఇప్పుడు అడుగుల ఒత్తిడివల్ల స్థానభ్రష్టమైనట్లు అతనికి తోచింది. అడుగుల సవ్వడి పైకి వినరానివ్వకుండా ఎవరో జాగ్రత్తగా మెట్లు దిగుతున్నట్లు అతనికి అనిపించింది. ఆ అడుగులు అతనివైపుకే వస్తున్నట్లున్నాయి. ఇంతలోనే అతని ఊహ భ్రమ కాదని తెలిసింది. వెన్నెల పడుతున్న కిందిమెట్లపైన ఒకవ్యక్తి కనపడ్డాడు.

మార్గదర్శకుల బడబడలు భరించలేక ఎవరో తనవలెనే ఏకాంతం కోరి అక్కడికి వచ్చారని ఫ్రాంజ్ మొదట అనుకున్నాడు. అందువల్ల అకస్మాత్తుగా అక్కడొక వ్యక్తి ప్రత్యక్షు

కావటంలో ఆశ్చర్యపడవలసింది లేదు. కాని ఆ వ్యక్తి ముందు కడుగు వేస్తూ చాలా జాగ్రత్తగా పరిశీలించి, ఆగి, అప్రమత్తతతో ఆలకించటం మానేసరికి ఫ్రాంజ్‌కి అనుమానం కలిగింది. అతి నెవరికోసమో నిరీక్షిస్తున్నట్లు ఊహించాడు. వెంటనే, అనుకోకుండా ఫ్రాంజ్ మెట్లవద్ద ఒక స్తంభంచాటుకి జారి దాగాడు. అక్కడికి పదడుగులదూరంలో మిద్దెలో రంధ్రంలోనుంచి వెన్నెల తెల్లని పట్టువల వేసినట్లు వేలాడుతోంది. ఆ వ్యక్తి వెలుగుకు కొద్దిగా దాపుకు వెళ్లి నిలబడినందువల్ల ముఖం గుర్తుపట్టడానికి వీలు లేకుండా ఉంది. దుస్తులు కొంత స్పష్టంగా తెలుస్తున్నాయి. ముఖంపైన ఆచ్ఛాదనం ఒకటుంది. కాళ్లపైన వెన్నెల పడుతున్నందువల్ల నల్లని పట్టుపంట్లాం స్పష్టంగా కనపడుతోంది.

ఫ్రాంజ్ ఒక్కవిషయంమాత్రం నిర్ధారణ చేసుకున్నాడు. ఆ వ్యక్తి సామాన్యుడు కాడు. భాగ్యవంతుడు. కొంతసేపటికి ఆ వ్యక్తి తొందరపడుతున్నట్లు కనపడ్డాడు. మిద్దెపైనుంచి సన్నని సవ్వడి వినవచ్చింది. వెంటనే వెన్నెలజాలులో నీడ పడింది. మిద్దెపైనుండి తొంగిచూస్తున్న మరొకవ్యక్తి కంటపడ్డాడు. దూరాన నిలబడిన మొదటి వ్యక్తిని రెండోవ్యక్తి చూసి, చెట్లకొమ్మల సహాయంతో ఊగి కిందికి దిగాడు. రెండో వ్యక్తి మొదటి వ్యక్తితో రోమక్ మాండలికభాషలో ఇలా అన్నాడు: "ప్రభువుగారికి నమస్కారం. ఆలస్యమైనందుకు క్షమించండి. కాని ఆట్టే ఆలస్యం కాలేదనుకుంటాను. ఇప్పుడే పదిగంటలు కొట్టిందండి."

"ఆలస్యం మాటకేంలే" అన్నాడు మొదటివ్యక్తి, టస్కనీ మాండలికభాషలో. "నేను సమయానికి ముందే వచ్చాను. నే నిక్కడ నీకోసం వేచిఉన్నానంటే, అది నీవల్ల తప్పుకాదు."

"అది నిజమేనండి. నేను తిన్నగా సెంట్ ఏంజెలో భవనం నించి వస్తున్నానండి. బెప్పోతో మాట్లాడి రావడానికి చాలా ఇబ్బందయిపోయిందండి"

"బెప్పో ఎవరు?"

"అతనా? అతనికి జైల్లో ఉద్యోగం. పోప్ భవనంలో ఏంజరుగుతూఉంటుందో నాకు సమాచారం చెప్పడానికి గాను అతనికి సాలీనా ధనం ఇస్తూఉంటాను. ఎప్పు డేం జరుగుతుందో తెలియదుకదా. ఎప్పుడో ఒకప్పుడు పెపినోమాదిరిగా నే నన్నూ

ఉచ్చులో పట్టేస్తారు. అప్పుడు ఉచ్చుతాళ్లు కొరికెయ్యడానికి ఎలుకలు కావలసివస్తాయి.

"సరే. ఇప్పుడు నువ్వేం కనిపెట్టావ్ ?"

"ఎల్లుండి రెండుగంటలకి ఇద్దర్ని ఉరితీస్తారండి. రోమ్ నగరంలో ఉత్సవాలకు ముందెప్పుడూ ఇదొక పండుగ జరుపుతూ ఉంటారు. ఇద్దరిలో ఒకడు తనను రక్షించి, పెంచి, పెద్దచేసిన ఫాదరీని హత్యచేసిన దురంతకుడు. వాణ్ని నెత్తురోడ్చి చంపుతారు. రెండోవాడు పెపినో. పాపం అతన్ని తల తెగ వేస్తారట."

"అసలు విషయమేమిటంటే, పోప్ పరిపాలిత ప్రాంతంలోనే కాకుండా, పక్క అనేక రాజ్యాల్లో నిన్ను గురించి విపరీతమైన భయం పుట్టించావు. అందువల్ల దొరికినవాడికి దారుణమైన శిక్ష విధించి మచ్చుచూపిస్తున్నారన్నమాట."

"కాని పెపినో నా గుంపులోకూడా లేడే! వాడుచేసిన పాపమల్లా ఏమిటంటే, మాకు కావలసిన ఆహారాదివస్తువు లిచ్చాడు. అంతే."

"అంటే క్రియకి మీ దొంగలకి వాణ్ని తోడు చేశావన్న మాట. కాని నువ్వు శిక్షలో తేడా గమనించాలి. నిన్ను పట్టుకున్నట్లయితే ఒక్క దెబ్బతో నిన్ను బుర్ర బద్దలు కొట్టి చంపుతారు. వాడికితల తెగవయ్యాడంమటుకే శిక్ష విధించారు. ఉత్సవాలకి వచ్చేవాళ్లకి ఇదొక వినోదం సమకూర్చాలని అధికారుల తలపు."

"అయితే నేనేం తలపెట్టానో వాళ్లకి తెలియదులెండి. పాపం అతన్ని విడిచిపెట్టించడానికి ఏంచెయ్యవలసివచ్చినా సరే వెనుదియ్యకూడదని నిశ్చయించుకున్నాను. నాకు సహాయంచేసి నందువల్లనే అతనీ ఉచ్చులోచిక్కుకున్నాడు."

"ఇప్పుడేం చెయ్య దలుచుకున్నావ్ ?"

"ఉరితీసేచోట ఇరవైమందిని ఏర్పాటుచేశాను. వాళ్లా చోటంతా చుట్టుముట్టి, పెపనోని వేదికమీదికి తీసుకురాగానే, నేను చేసంజ్ఞచెయ్యడం చూసి మీద పడతారు. పోలీసుల్ని తరిమేసి పెపినోని ఎత్తుకుపోతారు."

"అది ప్రమాదమైనది. ఒనగూడుతుందో లేదో నిర్ణయం లేదు. ఇంతకంటె నా ఉపాయం మేలని నా ఉద్దేశం."

"తమ ఉపాయం ఏమిటి?"

"రెండు వేల స్పానిష్ డాలర్లు ఇస్తాను. సంవత్సరంపాటు శిక్ష వాయిదా వెయ్యడానికి గడువు సాధిస్తాను. ఈలోగా ఇంకొక వెయ్యిస్పానిష్ డాలర్లు పడేస్తే, జైల్లోనుంచి వాణ్ని తప్పించ వచ్చును."

"తప్పకుండా ఇలా సాధించగలరని తమకి నమ్మకమేనా?"

మొదటి వ్యక్తి హఠాత్తుగా ఫ్రెంచిభాషలో అన్నాడు. "బాగా అడిగావ్! నేనొక్కణ్ణే బంగారంవల్ల సాధించేదాన్ని, నీగుంపు గుంపుఅంతా ఏకమై కత్తులూ తుపాకులూ తెచ్చుకుని కూడా సాధించలేరు. నువ్వింక భయపడక ఈవిషయం నా చేతుల్లో విడిచిపెట్టు."

"మావాళ్లు అక్కడ సిద్ధంగా ఉన్నా ఫరవాలేదండి. మీ ఉపాయం నెరవేరకపోతే, ఆఖరిక్షణంలో నా ఆయుధం ప్రయోగిస్తాను. ఉరితీసేది ఎల్లుండి అన్నమాట మరిచిపోకండి. ఒక్కరోజే గడువుంది."

"అయితే మాత్రమేమి? రోజుకి ఇరవైనాలుగు గంటలున్నాయి. గంటకి అరవై నిమిషాలు, నిమిషానికి అరవై సెకండ్లు ఉన్నాయి. ఎనభైఆరువేల నాలుగువందల సెకండ్లలో ఎన్ని జరగడానికి వీలులేదు?"

"తమ యత్నం ఫలించిందో లేదో నాకెలా తెలుస్తుంది?"

"అదేమంత కష్టంకాదు. నేను రాస్పోలీహోటల్లో క్రింది మూడు కిటికీలూ అద్దెకి తీసుకున్నాను. పెపినోని రక్షించగలిగినట్లయితే, చివరిరెండు కిటికీలకీ పసుపుపచ్చని తెరలు, మధ్య కిటికీకి తెల్లని తెర వేలాడతీయిస్తాను. తెల్లని తెరమధ్య ఎర్రని సిలువ చిహ్నం ఉంటుంది."

"శిక్ష తప్పించిన ఉత్తరువుని అధికారులకి ఎవరివల్ల పంపిస్తారు?"

"మీవాళ్లలో ఒకడికి ఫాదరీవేషం వేసి పంపు. ఆజ్ఞాపత్రం వాడిచేతికిస్తాను. వాడందిస్తాడు. ఈలోగా మన ఉపాయాన్ని గురించి పెపినోకి తెలియపరుచు. లేకపోతే భయంవల్ల ఈలోగానే వాడు చచ్చిపోగలడు. మన ప్రయత్నం, ధనం వృధాకాగలవు".

"ప్రభువుగారికి నాదొక్కటే మనవి. పెపినోని విడుదల చేయించండి ఆపైన మీరు ఏది చెయ్యమంటే అది చెయ్యడానికి విధేయుడనై ఉంటాను. నావాళ్లుకూడా మీకు సేవ చేస్తారు."

"మాట ఇచ్చేటప్పుడు జాగ్రత్తగా ఉండాలి. ఎందువల్లనంటే త్వరలోనే ఆ మాట నిలబెట్టుకోవలసిన తరుణం రావచ్చునుమా!"

"నేను ఏ రకంగానైనా మాట తప్పిపోయేవాడిని కానని తమకే ముందుముందు తెలిసివస్తుంది. ఈ విశాలప్రపంచంలో మీరు ఏ మూలనుండి కబురు పంపినాసరే రెక్కలపై మీదగ్గరకు వచ్చి వాల గలను. మీరు చెప్పింది తక్షణం చేసి తీరతాను. అక్షరాలా..."

"ఆగాగు. నాకేదో చప్పుడు వినపడుతోంది. మనమిద్దరం కలిసివుండగా ఎవ్వరూ చూడకూడదు. మార్గదర్శకులంటూ తిరిగే వాళ్లంతా గూఢచారులు. వాళ్లు నిన్ను గుర్తుపట్టగలరు. నీ స్నేహం నాకెంత కోరుకోతగినదైనా కావచ్చుకాని, మన స్నేహం సంగతి పైకి పొక్కినట్లయితే నా పరువు పోతుంది."

"సరే అయితే. మీరు రక్షించలేకపోతే ఏం చేస్తారు?"

"మూడు కిటికీలకీ పసుపుపచ్చని తెరలు వేలాడదీయిస్తాను."

"అప్పుడేం చెయ్యమంటారు?"

"అప్పుడు నీ కత్తులు, తుపాకులు ప్రయోగించు. నీ ప్రతిభ నేను స్వయంగా చూస్తాను."

"సరే. సెలవిప్పించండి."

ఇలా చెప్తూ రెండో వ్యక్తి మెట్లచాటున అంతర్ధానమైనాడు. మొదటివ్యక్తి ఆచ్ఛాదనాన్ని మరింత ముఖంమీదకి లాక్కుని ఫ్రాంజ్ నిలబడినవైపుకు వచ్చి పక్కగా మెట్లు దిగి వెళ్లిపోయాడు. మరుక్షణంలోనే తనను పేరుపెట్టి ఆల్బర్ట్ పిలవడం ఫ్రాంజ్ విన్నాడు. ఆ పిలుపు ఆ శిథిలాల ఎత్తుగోడలమధ్య ప్రతిధ్వనించింది. కాని ఫ్రాంజ్ అప్పుడే పలకలేదు. వ్యక్తులిద్దరూ దూరమైనారని నమ్మకం తోచినప్పుడు కాని పలకలేదు.

ఫ్రాంజ్ హోటల్‌కి తిరిగి వెడుతూ నూతన వ్యక్తుల్ని గురించి ఆలోచించడం మొదలుపెట్టాడు. అకస్మాత్తుగా తటస్థపడిన ఆ యిద్దరిలోనూ ఒకడు అపరిచితుడు. మరొకడు మాత్రం పూర్తిగా అపరిచితుడు కాడు. నీడలో అతని ముఖాన్ని గుర్తు

పట్ట లేకపోయినప్పటికీ, అతనికంఠస్వరం మాత్రం సుపరిచితమే. ఆ కంఠాన్ని ఒక్కసారే విన్నాడు. అయినప్పటికీ ఆవ్యక్తితో అనుభవం మరువరాని దయింది. కొంత వ్యంగ్యధోరణిలోనూ, కొంత కఠినంగానూ మాట్లాడిన అతని కంఠస్వరాన్ని ఫ్రాంజ్ ఎన్నడూ మరిచిపోలేదు. మాంట్ క్రిస్టో ద్వీపంలో మొదటిసారి ఆ గంభీరకంఠధ్వని విన్నాడు. రెండవసారి కలోసియమ్ వద్ద విన్నాడు. దీనివల్లనే కలోసియమ్ గంభీరదృశ్యాన్ని ఫ్రాంజ్ చూసి ఆనందించలేకపోయాడు. ఆలోచించినకొద్దీ ఆ వ్యక్తి మరెవరో కారనీ, సింద్‌బాద్ అనే వింత పేరుపెట్టుకున్న వ్యక్తేననీ ఫ్రాంజ్ అభిప్రాయం ధృవపడుతోంది.

ఎంత విదల్చుకున్నా ఫ్రాంజ్‌ని ఈ ఆలోచనలు విడిచిపెట్ట లేదు. ఎంత యత్నించినా ఆరాత్రి నిద్రపట్టలేదు. రాత్రంతా కలవరంగా ఉంది. చివరికి తెల్లవారుజామున అతనికి నిద్రపట్టింది. ఉదయం లేచేసరికి ఆలస్యమయింది. ఫ్రెంచి జాతీయుల కనుగుణంగా అల్బర్ట్ ముందుగా లేచి సాయంకాలం కాలక్షేపంకోసం ఏర్పాట్లు చేసుకుంటున్నాడు. అర్జెంటినో నాటకప్రదర్శనాలయానికి వెళ్లడానికి ఏర్పాటు చేశాడు. ఫ్రాంజ్ లేఖలు వ్రాసుకుంటూ గడిపాడు. అల్బర్ ఆరోజంతా బగ్గీలో తిరుగుతూ గడిపాడు.

మరునాడే రోమ్ ఉత్సవాలు ప్రారంభమాతాయి. అందువల్ల అప్పుడే వేవి దూడాలో, ఎక్కడెక్కడికి వెళ్లాలో అల్బర్ట్ ఆలోచించాడు. సాయంకాలం నాటకప్రదర్శనానికి వెళ్లడానికిగాను అతనికి అలంకరించుకోడానికి గంటసేపు పట్టింది. మరునాటి ఉత్సవాలపైనే మనస్సులగ్నమై ఉన్నందువల్ల నాటకం గురించి అంతగా ఆట్టేమంది పట్టించుకోలేదు. నటీనటులువచ్చారు; వెళ్లారు; కాని ఎవరూ వారి యోగ్యతల్ని గురించి అంతగా యోచించలేదు. మొదటి అంకం ముగిసింది. అల్బర్ట్ చుట్టూ ప్రేక్షకుల్ని చూశాడు. అంతవరకూ ఖాళీగా ఉన్న ఒక బాక్స్ తలుపు తెరుచుకుంది. ఒక స్త్రీ ప్రవేశించింది. అల్బర్ట్‌కి ఆమెతో పారిస్‌లో పరిచయం ఉంది. కాని ఆమె పారిస్‌లోనే ఉందనుకున్నాడు. ఫ్రాంజ్ వంకతిరిగి చూశాడు. ఆమెను చూడ

గానే ఫ్రాంజ్ ఉలిక్కిపడ్డం గమనించాడు. ఆల్బర్ట్ ఇలా అన్నాడు: "ఆమెను నువ్వెరుగుదువా ?"

"అవును. ఆమెనిగురించి నీఉద్దేశమేమిటి ?"

"చాల చక్కనిది. చూడు ఆమెచాయ; ఆమె శిరోజాలు ఎంత అందంగా ఉన్నాయో! ఆమె ఎవరు? ఫ్రెంచి దేశస్థురాలా?"

"కాదు. వెనిస్‌నగరవాసి."

"ఆమె పేరు ?"

"కౌంటెస్ జి—"

"ఓ! ఆమెపేరు విన్నాను" అన్నాడు ఆల్బర్ట్. "ఆమె సౌందర్యం ఎంత విశేషమైనదో, ఆమె తెలివి, హాస్యధోరణి అంత విశేషమైనవంటారు. విల్‌ఫర్ట్ ఇంటివిందులో ఆవిడతో నాకు పరిచయం కావలసిందే, కాని."

"నేను పరిచయం చెయ్యనా ?"

"నిజంగా ? నన్ను ఆవిడ బాక్సుకి తీసుకువెళ్లి ఎరుకపరిచే టంత పరిచయం ఆమెతో నీకుందా ?"

"ఆమెతో చనువుగా మాట్లాడే అదృష్టం నాకు నాలుగైదు సార్లు లభించింది. అయినా అది చాలు, ఆమెతో చనువుగా మాట్లాడ్డానికి."

సరిగ్గా ఈ సమయంలోనే ఆమె ఫ్రాంజ్ వంక చూసింది. గౌరవపురస్సరంగా ఆమెకు అక్కడనుంచే అభివాదం చేశాడు. "అరె! ఆవిడతో నీకు చాలా పరిచయం ఉన్నట్లుందే!" అన్నాడు ఆల్బర్ట్.

ఆల్బర్ట్ లేచి నిలబడ్డాడు. జేబులో దువ్వెన తీసి దువ్వుకున్నాడు. సిద్ధంగా ఉన్నట్లు ఫ్రాంజ్ వంక తిరిగి సూచించాడు. ఫ్రాంజ్ ప్రశ్నార్థకంగా కౌంటెస్ వంక చూశాడు. ఆమెముఖంలో చిరునవ్వు విరిసింది. వెంటనే ఫ్రాంజ్ ఆల్బర్ట్‌ను వెంటబెట్టుకుని బయలుదేరాడు. కౌంటెస్ కూర్చున్న బాక్సువద్దకు వెళ్లి ఫ్రాంజ్ తలుపు తట్టాడు. వెంటనే తలుపు తెరుచుకుంది. ఇటాలియన్ల ఆచారంప్రకారం, కౌంటెస్ ప్రక్కను కూర్చున్న యువకుడు లేచి, వచ్చినవారికి స్థానమిచ్చాడు. మరొకరు వస్తే వీరూ అలాగే లేచి వెళ్లిపోవడం ఆచారనియమం.

అద్భుత ప్రజ్ఞా విశేషాలుకల యువకునిగా ఆల్బర్ట్‌ని ఫ్రాంజ్ ఆమెకు పరిచయపరిచాడు. ఆమె వినయంతో ఆల్బర్ట్‌ని సత్కరించి ప్రక్క కుర్చీలో కూర్చోమని సూచించింది. ఫ్రాంజ్ ఆమె వెనుక కూర్చున్నాడు. ఆల్బర్ట్ త్వరలోనే ఆమెతో పారిస్ ఉన్నత వంశీకుల సమాజాన్ని గురించిన ప్రసంగంలో మునిగిపోయాడు. ఫ్రాంజ్ ప్రేక్షకులవంక చూస్తున్నాడు. దూరంలో, ఎదురుగా, మరొక బాక్స్‌లో అతనికి అద్భుత సౌందర్యరాసి అయిన ఒక యువతి కనపడింది. ఆమె గ్రీక్ జాతీయుల దుస్తులు ధరించింది. ఆమెవనుక చీకటిలో ఒక పురుషుడు కూర్చుని ఉన్నాడు. అతనెవరో ఫ్రాంజ్ గుర్తుపట్టలేక పోయాడు. ఆమెమాత్రం ఆల్బేనియా దేశానికి చెందినదని అతను ఊహించాడు. కుతూహలం అణుచుకోలేక ఫ్రాంజ్ ఆమెను కౌంటెస్‌కు చూపి, ఎవరని ప్రశ్నించాడు.

"ఆమె ఈ ఉత్సవాలకోసం వచ్చిందని మాత్రమే నాకు తెలుసును" అని కౌంటెస్ జవాబిచ్చింది. "ఈ నాటకప్రదర్శనాలయంలో మొదటిరోజున కూడా ఆమెనక్కడే చూశాను. ఆరోజు మొదలు ఆమె ఏనాడూ ఇక్కడికి రావడం మానలేదు. తరుచు ఆ వెనక నున్న పురుషునితో కలిసి వస్తుంది. అప్పుడప్పుడు ఒక పరిచారకుని వెంటబెట్టుకుని ఒంటరిగా వస్తుంది."

"ఆమె అందాన్ని చూశారా?"

"అద్భుతంగా ఉంది. దేవతాస్త్రీలంటే సరిగ్గా ఇలాగే ఉంటారనుకుంటూ ఉంటాను."

కౌంటెస్, ఫ్రాంజ్ చిరునవ్వులు నవ్వుకున్నారు. తరవాత మళ్ళీ ఆమె ఆల్బర్ట్‌తో ప్రసంగానికి ఉపక్రమించింది. ఫ్రాంజ్ తిరిగి ప్రేక్షకులను పరిశీలించ నారంభించాడు. ఇంతలోనే తెర లేచింది. రెండవ అంకం ప్రారంభమయింది. ఫ్రాంజ్ నాటకాన్ని శ్రద్ధగా చూశాడు. కొంతసేపైనతరవాత అతను తిరిగి ప్రేక్షకులవంక దృష్టి సారించాడు. హఠాత్తుగా అతని దృష్టి ఎదురుగా నున్న బాక్స్‌వద్ద ఆగిపోయింది. ఆల్బేనియన్ యువతి ప్రక్క పురుషుడు నీడలోనుంచి ముందుకు జరిగాడు. ఈ మారతని ముఖం స్పష్టంగా కనపడుతోంది. మాంట్ క్రిస్టో ద్వీపంలో తన కాతిథ్యమిచ్చిన వ్యక్తిని అక్కడ చూసి ఫ్రాంజ్ నిశ్చేష్టుడైనాడు. ఈ

వ్యక్తినే కలోసియమ్‌వద్ద చూసినట్లు ఫ్రాంజ్‌కి ఇప్పుడు ధృవపడింది. తన కౌతిథ్యమిచ్చిన ఆ వింతవ్యక్తిగోష్ఠిలో ఉన్నాడన్నమాట! ఫ్రాంజ్ వంక చూసి కౌంటెస్ ఆశ్చర్యపడింది. తరవాత ఆమె ఫకాలున నవ్వింది. ఏమిజరిగిందని ప్రశ్నించింది. ఆమె నవ్వుని లక్ష్యపెట్టకుండా, ఫ్రాంజ్ ఇలా అన్నాడు. "ఇప్పుడే ఆ ఆల్బేనియన్ సుందరినిగురించి మిమ్మల్ని అడిగాను. ఆమె భర్తని గురించి మీకేమైనా తెలిస్తే చెప్పండి."

"నాకు తెలియదు. అయితే ఒకటిమాత్రం చెప్పగలను. ఇప్పుడే గోరీ తవ్వి పైకి తీసిన మనిషిమాదిరిగా ఉన్నాడు. పాలిపోయిన ఆ ముఖాన్ని చూస్తే, బతికివచ్చిన శవం అనుకుంటారు కాని మామూలుమనిషి అనుకోరు. అబ్బ! ఎంత పాలిపోయింది ఆ ముఖం!"

"అతనిముఖం ఎప్పుడూ అలాగే ఉంటుంది."

"అయితే అతన్ని మీకు తెలుసునా?" అంది కౌంటెస్. "అతనిసంగతేమిటో చెప్పండయితే. దయ్యమనుకోవాలా? అతను చచ్చి మళ్ళీ వచ్చాడనుకోవాలా?"

"నేనతన్ని ఇదివరలో చూశాననుకుంటాను. అతను కూడా నన్ను గుర్తుపట్టగలడనుకుంటాను."

కౌంటెస్ భుజాలెగరవేసింది. "అవును. అంతే పాపం. ఆమనిషిని ఒకసారి చూసినవాళ్లెవరూ ఈజన్మలో మరిచిపోలేరు."

కౌంటెస్, అతనివంక మరోకమారు చూసింది. ఫ్రాంజ్ అడిగాడు. "అతన్నిగురించి మీఉద్దేశ మేమిటి?"

"లార్డ్ బైరన్ మళ్ళీ బతికివచ్చినట్లున్నాడు." అంది. ఫ్రాంజ్ చిరునవ్వు నవ్వాడు. చచ్చిపోయినవాళ్లు బతికివస్తారని విశ్వసించాలంటే ఈ వ్యక్తిని ఒక్కమారు చూస్తే చాలు ననుకున్నాడు ఫ్రాంజ్.

"అతి సెవరో, ఏమిటో ఇప్పుడు కనిపెట్టాలి" అంటూ ఫ్రాంజ్ లేచాడు.

"వొద్దు వొద్దు" అంది కౌంటెస్. "మీరు నావెంట ఉండాలి. నన్ను మీరే మాయింటివద్ద విడిచిపెట్టాలి. మీరు వెళ్లడానికి వీల్లేదు."

"ఏమి? భయపడుతున్నారా?" అన్నాడు ఫ్రాంజ్ మెల్లిగా.

"ఏమిటో చెప్తాను వినండి" అంది కౌంటెస్. "నిజంగా దయ్యాలుంటాయని బైరన్ నమ్మేవాడు. తను స్వయంగా చూసి నట్టు నాతో అన్నాడు. దయ్యాలెలా ఉంటాయో వర్ణించికూడా చెప్పాడు. సరిగ్గా ఆ వర్ణనకి సరిపడేటట్టున్నాడు ఆ వ్యక్తి. ఆ నల్లని జుట్టు, పెద్ద పెద్ద కళ్లు, అంగుళంలోనూ చింతే నలుసేదో ఉన్నట్టు ఆ కళ్లలోని తళతళ, తెల్లగా పాలిపోయిన ఆ ముఖం, బైరన్ వర్ణించిన దయ్యంపోలికలన్నీ అతనిలో ఉన్నాయి. అంతే కాదు. అతని పక్కనున్న ఆ యువతిని చూడండి. మిగతా స్త్రీల పోలిక ఆమెలో లేదు. ఆమె పరజాతి స్త్రీ. ఆమె ఎవరో, ఎక్కడ నించి వచ్చిందో ఎవరికీ తెలియదు. బహుశా ఇద్దరూ ఒకే జాతి వాళ్లై ఉండాలి—అదేమి ఘోరమైన జాతో కాని! బహుశా మంత్రతంత్రాలు నేర్చినవాళ్లు కావచ్చును. మీ రతనివద్దకు వెళ్ల వద్దు. కనీసం ఈరాత్రికి మానెయ్యండి. ఇంకా చూడాలని ఉంటే రేపు వెళ్లండి. ఈరాత్రికిమాత్రం వద్దు ఇక్కడే ఉండిపోవాలి."

రేపటివరకూ ఆగలేకున్నాడు ఫ్రాంజ్. "నామాట వినండి" అన్నది కౌంటెస్. "పట్టుదలపట్టకండి. నే నింటికి వెళ్లిపో తున్నాను. ఇవాళ రాత్రి మాయింట్లో విందు జరుగుతుంది. ఎలాగూ నాటకం ముగిసేవరకూ నే నుండను. నేనై అడిగినప్పుడుకూడా, ఇంటివరకూ రాకపోవడం మీకు న్యాయంకాదు."

ఫ్రాంజ్ కి ఒప్పుకోక గత్యంతరం లేకపోయింది. మెల్లిగా టోపీ అందుకున్నాడు. కౌంటెస్ కి చెయ్యి అందిచ్చాడు. ఆమె చెయ్యి వొణుకుతోంది. ఆమె చూపిన కలవరపాటు నటన కాదని ఫ్రాంజ్ కి తెలిసింది. ఆమె యింటివద్దకు చేరగానే, అక్కడ విందు ఏర్పాట్లుగాని, అతిథులు గాని కనపడలేదు. ఆమె అబద్ధం చెప్పినట్లు తేలింది. అంతేకాకుండా, ఆమె ముందే వచ్చినందుకు ఇంటిలోని వారంతా ఆశ్చర్యపడ్డారు. "నేను మిమ్మల్ని ఈ విధంగా మోసంచేసినందుకు క్షమించాలి. నిజంగా అఘోరమైన వ్యక్తిని చూడగానే నాకు కంపం పుట్టుకొచ్చింది. అక్కడనుంచి పారిపోయి ఒంటరిగా కొంతిసేపు గడిపితేకాని నాకు మనస్సు కుదుటబడదు. అయితే మీరు నా కొక్క మాటివ్వండి."

"ఆ వ్యక్తిని గురించి కనుక్కునేవిషయం మినహా, మీ రేది చెయ్యమన్నా సిద్ధమే. అత నెవరో, ఎక్కడనించి వస్తున్నాడో, ఎక్కడికి నడుస్తూఉంటాడో తెలుసుకోవలసిన అగత్యం నాకుంది. కాని మీ రడగదలిచిన దేమిటి?"

"వెంటనే మీ హోటల్ కి వెళ్ళిపోయి అతన్ని వెంటాడించే యత్నం మానుకోండి. మనుష్యులమధ్య సాన్నిధ్యం ఒకొక్కప్పుడు చిత్రంగా పరిణమిస్తూ ఉంటుంది. కాని నా పైన దయుంచి, అతనికీ, నాకూ పరిచయం మాత్రం చెయ్యకండి. రేపైతే మీ చిత్తం వచ్చినట్లు అతన్ని వెంటాడించండి. కాని అతన్ని ఎన్నడూ నా సమీపానికి తీసుకురావద్దు. భయంతో చచ్చిపోతాను సుమా! మీరు వెళ్ళండి. రాత్రినిద్రలో ఇదంతా మరిచిపొండి. నా మాట మాత్రం మీకు చెప్పగలను. ఈ రాత్రికి నాకింక నిద్రపట్టదు." ఇలా చెప్తూ కౌంటెస్ లోపలికి వెళ్ళిపోయింది. ఇదంతా హేళన కంటున్నదో, నిజంగానే ఆమె భయపడుతున్నదో ఫ్రాంజ్ కి అర్థం కాలేదు.

ఫ్రాంజ్ తన హోటల్ కి తిరిగి వెళ్ళేసరికి ఆల్బర్ట్ అక్కడున్నాడు. ఫ్రాంజ్ ని చూడగానే ఒక్క ఉదుటున లేచి ఆల్బర్ట్ ఇలా అన్నాడు: "అరె నువ్వేనా? నిజంగా! రేపటివరకూ మళ్ళీ కనపడ వనుకున్నానే?"

"నయం! ఇప్పుడేనా చెప్తున్నాను విను. ఇటాలియన్ యువతుల్ని గురించి నీకు చిత్రమైన అభిప్రాయా లున్నట్లున్నాయి. ప్రణయ వ్యవహారాల్లో ఇప్పటికి నీ కైన అనుభవాన్ని బట్టి ఆట్టే ఆశలు పెట్టుకో వనుకున్నాను."

"నిజంగానే! ఈ ఆడవాళ్ళని చూస్తే దయ్యాలకికూడా గాభరాపుడుతుంది. అరె! అలా చెయ్యి అందిస్తారు; మెత్తగా చెయ్యి నొక్కుతారు; ఇంటికికూడా తీసుకువడతారు. ఫ్రెంచి యువతు లీ మాదిరిగా ప్రవర్తిస్తే రెండురోజుల్లో అందరి నోళ్లలోనూ పడిపోతారు."

"ఇటాలియన్ యువతులు అంతచనువుగా ఎదుకుంటారంటే, వారి సమాజజీవనంలో దాపరికం తక్కువ. ఆమాట అలా ఉంచి, కౌంటెస్ కలవరపడినట్టు నువ్వుగమనించే ఉంటావు,"

"ఏం? ఎందుకు? గ్రీక్ యువతి ప్రక్కకూర్చున్న ఆ పెద్ద మనిషిని చూసినందుకా? నాటకం ఆఖరైన తరవాతవరండాలో అతన్ని చూశాను. అసలు మీకు అతను దయ్యమనీ, భూతమనీ ఎందుకుతోచిందో నాకు అర్థం కాలేదు. మీరు చెప్పే ఈ దయ్యం మంచి పుష్టికలపురుషుడే. చక్కని దుస్తులు ధరించాడు. పారిస్‌లో కుట్టించి ఉంటారు. ముఖం పాలిపోయినమాట నిజమే కాని, అది ఉత్తమవంశీకుల లక్షణమని నీకు తెలియదూ?" ఫ్రాంజ్ చిరునవ్వునవ్వాడు. ఆల్బర్ట్ ముఖం కూడా కొద్దిగా పాలిపోయినట్లుంటుంది. అది గొప్పలక్షణమని అతను చెప్పుకోవడం ఫ్రాంజ్‌కి జ్ఞాపకమే. అత నిలా అన్నాడు:

"అదీ మంచిదే. నే నలాగే అనుకున్నాను. కౌంటెస్ అనవసరంగా భయపడుతుందనే అనుకున్నాను. అతను మాట్లాడుతుండగా విన్నావా?"

"విన్నాను కాని అది రోమన్ మాండలికభాషలో మాట్లాడాడు. నాకు అర్థం కాలేదు. అక్కడక్కడ గ్రీక్ పదాలుకూడా దొర్లించాడు."

"ఓ! రోమన్ మాండలిక భాష మాట్లాడాడా?" అన్నాడు ఫ్రాంజ్ మెల్లిగా, గొణుగుతున్నట్లు. "అయితే అత నే, సందేహం లేదు."

"ఏమి టన్నావు?"

"ఏంలేదు. అది సరేకాని నేను వచ్చేటప్పటికి దేన్ని గురించి ఆలోచిస్తున్నావు?"

"ఇంక దేన్ని గురించి? బగ్గీ దొరకలేదు."

"అవును. మనం చెయ్యవలసిన యత్నమంతా చేశాం."

"అవునా, ఇప్పు డీచిక్కులో నాకు ఒక అద్భుతమైన ఉపాయం తోచింది. మనం రెండెడ్లబండి ఒకటి ఎందుకు తెప్పించకూడదు! అదైతే తప్పకుండా దొరుకుతుందను కుంటాను."

"దొరకవచ్చు."

"అయితే ఎడ్లు దొరుకుతాయా అని?"

"బండి దొరుకుతే అవీ దొరకవచ్చు."

"ఇంకేం కావాలి? ఒక మామూలు బండి, రెండు ఎద్దులు ఉన్నాయంటే మనపని సానుకూలపడినట్లే. బండిని చక్కగా అలంకరించవచ్చు. మనం రైతుల వేషాలు వేసుకున్నామంటే అద్భుతంగా ఉంటుంది.. కౌంటెస్ కూడా రైతుస్త్రీ వేషం వేసుకునివస్తే అక్కడి కథ సరిపోతుంది."

"ఈమాటు నీవు మంచి ఉపాయమే తట్టించావని ఒప్పుకుంటాను."

"మంచి ఉపాయం అంటావేమిటి? మన శక్తికి అనువైన ఉపాయం కూడా. మన ఉత్సవాలు చూసి తెలుసుకున్నారు. హు! రోమన్లు మనల్ని నలిపేసినందుకు వాళ్ళ ఉత్సవాల్లో మనకి పాలు లేకుండా చేయాలనుకున్నారు. ఈ దరిద్రపు నగరంలో బండే లేదన్నారు. కాని మన సంగతి వాళ్ళకేం తెలుసును? మనకి ఒకటి

"అయితే నీ ఉపాయం ఇంకెవరికైనా చెప్పావా?

"హోటల్ యజమానికి మాత్రమే చెప్పాను. అదైతే సులువుగా ఏర్పాటు చెయ్యగలనన్నాడు. ఒక్కటేమాత్రం నాకు విచారంగా ఉంది. ఎద్దుల కొమ్ములికి బంగారుపూత పూయించమంటే వ్యవధి చాలదన్నాడు."

ఇంతలో తలుపు తెరుచుకుంది. హోటల్ యజమాని పాస్ట్రినీ తొంగి చూశాడు. వెంటనే ఆల్బర్ట్ అడిగాడు. "ఏమయింది? బండీ, ఎద్దులూ దొరికాయా?"

పాస్ట్రినీ దర్జాగా లోపలికి వచ్చి "అంతకంటె మేలైనదే తెచ్చాననండి. సరిగ్గా ఈ అంతస్తులోనే కౌంట్ ఆఫ్ మాంటె క్రిస్టో కూడా ఉంటున్నారన్న సంగతి తమకు తెలిసేఉంటుంది. మీరు చిక్కుల్లోపడ్డారని తెలిసి వారి బగ్గీలో మీ ఇద్దరికీ చోటిస్తారనీ, రాస్పోలీవద్ద హోటల్లో కిటికీలవద్దకూడా చోటిస్తారనీ చెప్పారు."

అప్రతిభులైయువకులిద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు

"అయితే జొత్తిగా పరిచయంలేని ఒక వ్యక్తి ఇవ్వజూపితే అంగీకరించవచ్చునంటారా? మీ ఉద్దేశమేమిటి? ఈ కౌంట్

ఆఫ్ మాంట్ క్రిస్టో ఎలాంటి మనిషో మీకు తెలుసునా?" అని అడిగాడు ఫ్రాంజ్.

హోటల్ యజమాని చెప్పాడు: "ఆయన మాల్టాకి చెందినవాడో, సిసిలీకి చెందినవాడో తెలియదు కాని, గొప్పవాడేనండి. ఆయనకి అపారమైన భాగ్యం ఉంది. అద్భుతమైన వ్యక్తి."

ఆల్బర్ట్ వంక తిరిగి ఫ్రాంజ్ మెల్లిగా ఇలా అన్నాడు: "నిజంగా ఆ వ్యక్తి ఇతని పొగడ్తలకి తగినవాడైతే, ఈ విధంగా అమర్యాదగా ఇతనిద్వారా మనల్ని ఆహ్వానిస్తాడని నేననుకోను. మనకి ఉత్తరమైనా వ్రాయాలి. లేదా మరొకరు ఎవరివల్లనైనా కబురు......"

ఇంతలో ఎవరో తలుపు కొట్టారు. లోపలికి రమ్మని ఫ్రాంజ్ చెప్పాడు. మహా గొప్ప పరిచారకునివలె అలంకరించుకున్న ఒకడు లోనికి వచ్చాడు. రెండు కార్డులు పస్త్రీనీకి ఇచ్చి, "వీనిని వైకౌంట్ ఆల్బర్ట్ మార్సెర్ఫ్ కి, బారన్ ఫ్రాంజ్ డి ఎపినేకి ఇవ్వవలసిందని కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో పంపారు. వీరిద్దరినీ ఎప్పుడు దర్శించడానికి వీలవుతుందో కూడా కనుక్కోమన్నారు." అన్నాడు.

ఫ్రాంజ్ సమాధానమిచ్చాడు: "మా అంతట మేమే వచ్చి ఆయన్ని దర్శిస్తామని చెప్పు." పరిచారకుడు వెళ్లిపోయాడు.

"అది. మర్యాదఅంటే అలా ఉండాలి" అన్నాడు ఆల్బర్ట్. "పస్త్రీనీ, మీరు చెప్పింది అక్షరాలా నిజం. ఈ కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో ఉన్నతవంశస్థుడే. ప్రపంచజ్ఞానం కలవాడు."

"అయితే వారి ఆహ్వానాన్ని మీరు అంగీకరిస్తున్నారా"? అన్నాడు పస్త్రీనీ.

"ఆ. తప్పకుండా" అన్నాడు ఆల్బర్ట్. అయితేం, రెండెడ్ల బండీ, మైసు వేషాలూ లేనందుకు విచారిస్తున్నాను. అవే ఉంటే బలేగా ఉండేది. ఆ కిటికీలదగ్గర చోటిస్తానన్నాడు కాని లేకపోతే నేను నిరాకరించేవాడినే. ఏమంటావ్ ఫ్రాంజ్?"

"అవును. కిటికీలమూలంగానే నేనూ ఒప్పుకున్నాను." కాని నిజం ఏమిటంటే రాస్పోలీవద్ద కిటికీలమాట చెవిని పడగానే, ఆ రాత్రి కలోసియమ్వద్ద రహస్యసంభాషణ ఫ్రాంజ్ కి జ్ఞప్తికి

వచ్చింది. నాటకప్రదర్శనాలయంలో చూసినది ఈ వ్యక్తినే అయితే, అతనెవరో తెలుసుకోడానికి సులువౌతుంది. ఆ రాత్రి ఫ్రాంజ్ కి స్వప్నాలు వచ్చి నిద్ర కలతయింది. ఆ స్వప్నాలలో మాంట్ క్రిస్టో ద్వీపంలో ఘట్టం, కలోసియమ్‌వద్ద ఘట్టం మాటిమాటికీ కనపడుతూనే ఉన్నాయి. కలలనుంచి మెలకువ వచ్చినప్పుడెల్ల మరునాడేమి జరుగుతుందనే ఆలోచనలు ముసిరి వచ్చేవి. ఉదయం ఎనిమిదిగంటలకు లేచి ఫ్రాంజ్ అలంకరించుకున్నాడు. ఆల్బర్ట్ ఇంకా నిద్రనుంచి మేలుకోలేదు. ఫ్రాంజ్ హోటల్ యజమానికి కబురు పంపాడు.

"ఇవాళ ఎవరినో ఉరితీస్తారు కదూ ?" అని అడిగాడు.

"అవునండి. కాని అది చూడ్డానికి కిటికీ కావాలంటే ఇప్పుడు లేదండి. అన్నీ అద్దెకిచ్చేశాం."

"అక్కర్లే అందుకు కాదు. నాకు చూడాలని కోరికుంటే ఎవరినో ఒకరిని అడగగలను. ఇప్పటికి చూడాలనుకోవడంలేదు. చూసే దల్చుకునేపక్షంలో ముందుగా సమాచారం తెలుసుకోడానికి మిమ్మల్ని అడుగుతున్నాను. అంతే, ఎంతమందికి మరణశిక్ష విధించారో వాళ్ల పేర్లేమిటో, ఎటువంటి శిక్షలు విధించారో చెప్పండి."

"ఇప్పుడే సమాచారపత్రంకూడా నాకు అందిందండి."

"అంటే?"

"అంటే ఉరితీసే ముందురోజు సాయంకాలమే వాళ్ల పేర్లు, వాళ్లు చేసిన నేరాలు, ఎలా ఉరితీస్తారు, మొదలైన సమాచారమంతా వ్రాసిన కాగితాలను బల్లచెక్కలపై అంటించి, వాటిని ప్రతి వీధిమలుపులోనూ వేలాడతీస్తారు. మతంపట్ల విశ్వాసం కలవారందరూ శిక్షితుల పాపవిమోచనకోసం భగవంతుని ప్రార్థించగలరనే ఉద్దేశంతో ఈవిధంగా మరణశిక్షలనుగురించి ప్రచారంచేస్తారు."

ఫ్రాంజ్ నమ్మలేని ధోరణిలో "అంటే మీరుకూడా శిక్షితులకోసం భగవంతుని ప్రార్థించాలనే ఉద్దేశంతో ఆ సమాచారం మాకుపంపారా?" అన్నాడు.

"అబ్బెబ్బే! అది కాదండి. ఎవరి విషయాల్నిగురించి కాని విచారించే తీరిక నాకు లేదండి. నా వ్యవహారాలలోనే నాకు

ఊపిరి తిరగడంది. ఆ కాగితాన్ని అంటించేవాడు నా హోటల్లో అతిథులకోసం సమాచారపత్రాన్ని తెచ్చివ్వాలని ఏర్పాటు చేశానండి."

"ఒక్కసారి చూడనిస్తారా?"

"అదుగో అక్కడే ఒక కాగితం అంటించారు చూడండి. ఆ బల్లచెక్క తెస్తానుండండి" అంటూ పస్త్రీని కాగితం అంటించిన బల్లచెక్క తెచ్చి ఇచ్చాడు. ఫ్రాంజ్ అది అందుకుని ఇలా పైకి చదివాడు :

"ఇందుమూలంగా అందరికీ తెలియపరిచే దేమంటే: ఉత్సవాల మొదటిరోజున, అనగా ఫిబ్రవరి 23, బుధవారంనాడు పాపోలో వీధి మొగలో, ఆంద్రీ రండోలా, పెపినో అనే ఇద్దరిని ప్రభుత్వ న్యాయాధికారుల ఆజ్ఞ ననుసరించి ఉరితీస్తారు. వీరిలో మొదటి వ్యక్తి తనను పెంచి పెద్దచేసిన ఫాదరీని హత్యచేశాడు. రెండో వ్యక్తి గజదొంగ, దుండగుడు అయిన లూగీ వాంపాకు సహాయపడ్డాడు. మొదటి నేరస్థుని నెత్తిగోడ్చి మరణశిక్షను అమలు జరుపుతారు. రెండో నేరస్థుని తల తెగవేస్తారు. నిర్భాగ్యులైన ఈ ఇద్దరు మనుష్యులకూ పశ్చాత్తాపం కలిగించవలసిందని ప్రజలందరూ భగవంతుని ప్రార్థించవలసిందని ఇందుమూలంగా విజ్ఞప్తి చెయ్యబడింది."

ఫ్రాంజ్ కలోసియమ్‌వద్ద సరిగ్గా ఈ సమాచారమే విన్నాడు. తేడా రవంతైనా లేదు. శిక్షితుల పేర్లు, శిక్షావిధానం, అంతా అదే. కలోసియమ్‌వద్ద కనపడిన ఆ రెండో వ్యక్తి తప్పకుండా లూగీ వాంపా అయే ఉండాలి. సందేహం లేదు. ముఖం కప్పుకున్న ఆ మొదటి వ్యక్తి సింద్‌బాద్. అంటే సింద్‌బాద్ పెఖియూ రేవులోనూ, ట్యూనిస్‌లోనూ దొంగలపట్ల చూపిన ఔదార్యం రోమ్ నగరంలో కూడా చూపుతున్నాడన్నమాట!

పొద్దెక్కుతోంది. ఇంక ఆల్బర్ట్‌ని లేపాలని ఫ్రాంజ్ అనుకున్నాడు. అనుకున్నంతలోనే ఆల్బర్ట్ సిద్ధంగా వచ్చాడు. ఉత్సవాలనుగురించి అతని ఉత్సాహానికి మేర లేకుండా ఉంది.

ఫ్రాంజ్ హోటల్ యజమానితో ఇలా అన్నాడు: "మే మిద్దరం సిద్ధంగా ఉన్నాం కాబట్టి మే మింక కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టోని చూడవచ్చుకదా?"

"తప్పకుండా. ఆయ నెప్పుడూ చీకటితోనే మేలుకుంటారు."

పరిచారి యువకు లిద్దరికీ దారిచూపుతూ ముందు నడిచాడు. కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో బస పక్కనే ఉంది. తలుపు తట్టగానే తెరుచుకుంది. "లోపలికి దయచేయండి" అన్నాడొక పరిచారకుడు.

ముగ్గురూ రెండుగదులు గడిచి వెళ్లారు. రెండుగదులూ విలువైన సామగ్రితో అలంకరించబడి ఉన్నాయి. మూడోగదిలో టర్కిష్ తివాసీలు పరిచిఉన్నాయి. మెత్తని సోఫాలలో ముగ్గురూ కూర్చున్నారు. గోడలపైన అమూల్యమైన వర్ణచిత్రటాలు వేలాడుతున్నాయి. ద్వారా లన్నిటిలోనూ పట్టుతెరలు వేలాడుతున్నాయి. పరిచారకుడు సోఫాలు చూపి, "తమ రిక్కడ విశ్రమించినట్లయితే, తమ రాకను గురించి మా యజమానికి విన్నవిస్తాను." అన్నాడు. అంటూ ఒక తెర ఒత్తిగించి లోపలికి వెళ్లిపోయాడు. తెరవెనక తలుపు తెరవగానే "ఘజల్" సంగీతం యువకులచెవిని పడింది. వెంటనే తలుపు మూసుకున్నందువల్ల ఇట్టే అంతర్ధానమైపోయింది. తలుపు తెరిచి మూసుకున్న వ్యవధిలో ఒక్క జడి వానవలె సంగీతం కర్ణపాతమై ఇంతలోనే మాయమైపోయింది. చుట్టూ ఉన్న అలంకారాలను చూసి యువకు లిద్దరూ ఆశ్చర్యంతో ఒకరి ముఖం వంక ఒకరు చూసుకున్నారు.

ఫ్రాంజ్ అన్నాడు: "ఇదంతా చూశావా? ఏమంటావు?"

"మన పొరుగువ్యక్తి ఎవరో సామాన్యుడు కాడు. రహస్యంగా సంచారంచేస్తున్న మహారాజైనా అయ్యుండాలి. లేదా, స్పానిష్ ద్రవ్యబలం కూలిపోయినప్పుడు అదృష్టం పట్టిఉండాలతనికి."

"ఇష్" అన్నాడు ఫ్రాంజ్. "ఎవరో ఏమిటో తెలుసుకుందాం ఉండు. అదుగో వస్తున్నాడు." ఫ్రాంజ్ మాట లింకా ముగియకముందే తలుపు తెరిచిన చప్పుడయింది. తెర ఒత్తిగిలింది.

ఈ భాగ్యాలకెల్ల యజమానిఅయిన వ్యక్తి యువకు లిద్దరి ముందుకీ వచ్చి నిలిచాడు. ఆల్బర్ట్ తటాలున లేచి అతన్ని సమీపించాడు. ఫ్రాంజ్ పిడుగుదెబ్బతిన్నవానివలె కుర్చీకి అంటిపెట్టుకుని ఉండి పోయాడు. కలోసియమ్‌వద్ద ముఖాన ఆచ్ఛాదనంతో కనపడిన వ్యక్తి. అర్జెంటినో నాటకప్రదర్శనాలయంలో కనపడిన వ్యక్తి, మాంటె క్రిస్టో ద్వీపంలో తన కాతిథ్యమిచ్చిన వ్యక్తి ఇతనే!

## 35

కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో ఇలా అన్నాడు: "క్షమించాలి. ఉదయాన్నే మీకు నిద్రాభంగం కలిగించడానికి సంకోచించాను. మిమ్మల్నే ఇక్కడికి రప్పించినందుకు క్షమించాలి."

"మీ సహాయానికి మేము కృతజ్ఞులం" అన్నాడు ఆల్బర్ట్. "చాలా చిక్కుల్లోపడిన మమ్మల్ని రక్షించారు. మార్గాంతరం లేక, చిత్రమైన ఒక బండి తయారుచేయాలని ఆలోచిస్తున్న సమయంలో మీ కబురు అందింది."

యువకు లిద్దరినీ కూర్చోవలసిందని సంజ్ఞచేస్తూ కౌంట్ క్రిస్టో ఇలా అన్నాడు. "పస్త్రీనీ ఒట్టి మందమతి. లేకపోతే ఇంతకుముందే మీకు సహాయం చేసి ఉండేవాడిని. నాకు తెలిసీ తెలియగానే మీకు కబురుపంపాను." యువకు లిద్దరూ కృతజ్ఞతాసూచకంగా అభివాదం చేశారు. ఒక్కమాట పలకలేదు. గుర్తుపట్టిన చిహ్నాలు మాంట్ క్రిస్టో ధోరణిలో కనిపించనందువల్ల, గతాన్ని గురించి ప్రస్తావించడం ఉచితమానో కాదో తెలియక ఫ్రాంజ్ ఊరుకున్నాడు. నాటకప్రదర్శనాలయంలో చూసినది ఇతన్నేనని గాఢంగా తెలిసినప్పటికీ, కలోసియమ్‌వద్ద చూసినది ఇతన్ని అవునో కాదో అనే సంకోచం అతన్ని విడనాడలేదు. అందువల్ల ప్రసంగం మరింత స్పష్టపడే వరకూ ఆ ప్రసక్తి తేకూడదని ఫ్రాంజ్ నిశ్చయించుకుని ఇలా అన్నాడు: "మీ బగ్గీలోనూ, రాస్పోలీ కిటికీలవద్దనూ మాకు చోటిచ్చారు. పాపోలోవద్ద కిటికీ ఒకటి ఇప్పించగలరా?"

మాంట్ క్రిస్టో నిర్లక్ష్యభావంతో అన్నాడు: "ఓ! అదా! అక్కడ ఇవాళ ఎవరినో ఉరితీస్తారు కాదూ?"

"అవునండి" అన్నాడు ఫ్రాంజ్. అతను దారికి వస్తున్నట్లు గమనించాడు.

"ఉండండి. ఆ విషయమై ఏర్పాటుచెయ్యమని మా గుమా స్తాకి నిన్న చెప్పినట్లున్నాను. బహుశా అది కూడా వీలు కావచ్చు." మాంట్ క్రిస్టో చెయ్యిచాచి ప్రక్కనే ఉన్న గంటను మూడు మార్లు మోగించాడు. "కాలం వ్యర్థపుచ్చకుండా సులువుగా కర్త వ్యాలు నెరవేర్చడానికి ఉపాయాల్ని గురించి మీ రెప్పుడైనా ఆలోచించారా? నేను ఆలోచించి అటువంటి ఏర్పాట్లు చేశాను. ఈ గంట ఒకసారి మోగిస్తే పరిచారకుడు వస్తాడు. రెండుసార్లు మోగిస్తే హొటల్ యజమాని వస్తాడు. మూడుసార్లు మోగిస్తే గుమాస్తా వస్తాడు. ఒక్క నిమిషంకాని, ఒక్క మాటకాని వ్యర్థ పుచ్చడం నాకు ఇష్టం ఉండదు. ఇదుగో వస్తున్నాడు."

నలభైఅయిదు, ఏభైఏళ్ళ వ్యక్తి ఒకడు ప్రవేశించాడు. ద్వీపంలో తన కళ్లకి గంతలుకట్టి, గుహలోకి తీసుకువెళ్లిన వ్యక్తి అతనేనని ఫ్రాంజ్ గుర్తుపట్టాడు. కాని గుర్తుపట్టినట్లు పైకి తెలియ నీయలేదు. మాంట్ క్రిస్టో అన్నాడు: "బర్తుక్సియో! పాపాలో వద్ద కిటికీలు ఏర్పాటుచెయ్యమని నిన్న చెప్పాను. చేశావా?"

"చేశానండి. కాని మనం చాలా ఆలస్యంగా యత్నం చేసి నందువల్ల.—"

"ఏమయితేనేం? కావాలని చెప్పలేదా?"

"అవునండి చెప్పాను. ఏర్పాటయింది కూడా. లబోనీఫ్ రాజకుమారుడికోసం తీసుకోబడినదాన్ని ఏర్పాటుచేశాను. కాని దానికి నూరు......"

"సరే. అదంతా ఇప్పుడెందుకులే. కిటికీ దొరికింది. అది చాలు. బగ్గీ పిలిపించు."

బర్తుక్సియో వెళ్లిపోబోతుండగా మాంట్ క్రిస్టో మళ్లీ పిలి చాడు: "అన్నట్టు మరిచిపోయాను. ఉరిశిక్షల్ని గురించిన సమా చారపత్రం తీసుకురమ్మని పస్ట్రినీతో చెప్పు" అన్నాడు.

"అవసరం లేదండి. అది నేను చూశాను. నకలు నా దగ్గి రుంది" అన్నాడు ఫ్రాంజ్.

"సరే అయితే. బర్టుక్సియో, నువ్వు వెళ్ళిపోవచ్చు. భోజనం సిద్ధం కాగానే ముగ్గురికి వడ్డించి మమ్మల్ని పిలు."

ఫ్రాంజ్ వద్ద నకలు తీసుకుని మాంట్ క్రిస్టో పైకి చదివాడు. చదివినతరవాత ఇలా అన్నాడు: "అవును. మొదట ఇలాగే ఏర్పాటయింది. కాని నిన్న ఇందులో మార్పు చేసి ఉండాలి."

"నిజంగానా?" అన్నాడు ఫ్రాంజ్.

"అవును. నిన్న సాయంకాలం నేను కార్డినల్ రాస్పిగ్లియోజీ నివాసానికి వెళ్ళాను. ఈ యిద్దరిలో ఒకడిని క్షమించడానికి నిర్ణయమైనట్లు అక్కడ విన్నాను."

"ఎవరికి? ఆండ్రీకా?"

"కాదు" అన్నాడు మాంట్ క్రిస్టో నిర్లక్ష్యభావంతో. "రెండోవాడికి. వాడి పేరేమిటి?" అంటూ పత్రంలో చూసి, "పెపినోకి. అంటే తల తెగవేసే ఘట్టం మనం చూడలేమన్నమాట. అయితే నెత్తురోడ్చి ప్రాణాలు తియ్యడం చూడవచ్చులెండి. అది చిత్రంగా ఉంటుంది. చూడవలసిందే. ఇందులో దెబ్బసరితప్పడం అనేది ఉండదు. పదిదెబ్బలు కొట్టాలనే శంక లేదు. యూరప్‌లో మరణశిక్షలమాట చెప్పుకోనక్కరలేదు. వీటితో పోలిస్తే అవి క్రౌర్యం బొత్తిగా ఎరగనివని చెప్పాలి."

"చూడగా మీరు ఏయే దేశాల్లో ఏ పద్ధతుల్లో మనుష్యుల్ని హింసిస్తారో ప్రపంచమంతటా చూసినట్లున్నారే!" అన్నాడు ఫ్రాంజ్.

"నేను చూడనివి తక్కువే"

"ఈ భయంకరదృశ్యాల్ని చూడ్డం మీకు వినోదమా?"

"మొదట ఘోరంగానే ఉండేది. తరవాత అంత లక్ష్యపెట్టేవాడిని కాదు. ఇప్పుడు అదొక కుతూహలం."

"కుతూహలమా? చాలా ఘోరం!"

"ఎందుకు? జీవితంలో నిత్యం మనకు బాధపెట్టేది ఏమిటి? మృత్యువు. అందువల్ల అదెలా సంభవిస్తుందో, ఏవిధంగా దేహంలో నుంచి ప్రాణం ఎగిరిపోతుందో గమనించడానికి కుతూహలం

ఉండదా? ఆయా దేశాల ప్రజలతత్వాలనుబట్టి, ఆచారాలనుబట్టి ఎన్నెన్ని పద్ధతులు వ్యాపించాయో కనిపెట్టడంలో కుతూహలం లేదా? ఎంతమందిని చనిపోతుండగా చూస్తే, చనిపోవడం సులువౌతుంది? నా అభిప్రాయంలో, మృత్యువనేది యాతనామయమే కావచ్చును, కాని అది ప్రాయశ్చిత్తంమాత్రం కాదు."

"అంటే నాకు బోధపడలేదు."

"వినండి" అన్నాడు మాంట్ క్రిస్టో. అతనిముఖంలో ఇప్పుడు ద్వేషం ప్రజ్వలిస్తోంది. "ఒక మనిషి ఎన్నడూ కనీ వినీ ఎరుగనంతటి క్రూరంగా మీ తండ్రినిగాని, తల్లినిగాని, ప్రియురాలినిగాని హింసించి ప్రాణాలు తీశాడనుకోండి. అప్పుడా మనిషిని నానాగాలుగా కత్తికి ఎరవేసిగాని, ఉరితీసిగాని, పూర్తిగా శిక్షించినట్లు తృప్తిపడగలరా? అనేక సంవత్సరాల యాతనామయ జీవితానికి రెండు క్షణాల కత్తివేటుబాధ ప్రాయశ్చిత్తం కాగలదా?"

"అది తెలుసును" అన్నాడు ఫ్రాంజ్. "పరిమితమైన న్యాయం మానవులకుతృప్తి నివ్వలేనిమాట నిజమే. నెత్తుటికి బదులుగా నెత్తురోడ్చవచ్చును. కాని అసాధ్యమైన శిక్ష విధించాలని కోరితే, మృత్యువుమాత్రం ఏమి చెయ్యగలదు?"

"ఇంకొక వృత్తాంతం చెప్తాను. సమాజంలో హత్యకి మృత్యువే శిక్ష. కాని సమాజానికి తెలియకుండా, గుప్తంగా ఘోరయాతనల ననుభవింపచేసేవారు లేరా? అలాంటివారికి శత్రువు మృతితో పగతీరిపోతుందా? రంపపుకోతలు, చక్రాలపై ఎముకలు విరగ్గొట్టడం, కళ్లు పీకివెయ్యడం, వాతలు పెట్టడం మొదలైన హింసలు కూడా చాలని ఘోరపాపాలు చేసేవారు లేరా?"

"ఉన్నారు. అటువంటివాళ్లని శిక్షించడంకోసమే ద్వంద్వయుద్ధాల ఆచారం పెట్టారు."

"ద్వంద్వయుద్ధమా? పగకోసమే అయితే, అది పూలశయ్యవంటిది. ఒకడు ప్రియురాలిని హరిస్తాడు, లేదా భార్యను లోబరుచుకుంటాడు, లేదా పుత్రికమానం హరిస్తాడు. దేవుడు పుట్టించినవాళ్లందరికీ సుఖసంతోషాలిచ్చినట్లే మీకూ ఇచ్చినప్పటికీ, ఈ కిరాతకునివల్ల మీ జీవితం యావత్తూ నరకప్రాయమై పోతుంది. అటువంటివాడిని తుపాకితో కాల్చి, లేక కత్తితో పొడిచి పగతీర్చు

కున్నట్లు తృప్తిపడగలరా? అది సరికాదు. ద్వంద్వయుద్ధంలో విజయంపొందినవాడిని, వాడి పాప న్ని కడిగివేసి సమాజం సన్మానించి ఆదరిస్తుంది. అది ఎన్నడూ సరిగాదు. నేనే పగదీర్చుకో వలసివస్తే, ఈ పద్ధతికి సమ్మతించను."

"అంటే, మీరు ద్వంద్వయుద్ధం చెయ్యరా?" అని ఆశ్చర్యంతో అడిగాడు ఆల్బర్ట్.

"ఎందుకు చెయ్యను? ఏదో చిన్నదెబ్బ తగిలినా, అవమానం జరిగినా ద్వంద్వయుద్ధం చేస్తాను. అదికాక, నా గురికి తిరుగులేదని నాకు తెలుసును. ప్రమాదానికి వెనుదీసేవాడినికాను. నా ప్రతికక్షి చనిపోవడము నేది తథ్యం. కాని గుప్తంగా, ఆజన్మాంతం అనుభవించే బాధలకు గురిచేసేవారిపై పగ తీర్చుకో వలసివస్తే, శత్రువుని వీలైనంతవరకు అన్ని బాధలకీ గురిచేస్తాను. ఇటువంటి విషయాల్లో ప్రాచ్యదేశస్థుల దగ్గర మనం నేర్చుకోవలసింది ఎంతైనా ఉంది."

ఫ్రాంజ్ ఇలా అన్నాడు "కాని న్యాయం నిర్ణయించేదీ, శిక్ష విధించేదీ మీరే అయేపరిస్థితిలో, ఎప్పుడో ఒకప్పుడు పోలీసుల చేతుల్లో పడక తప్పకపోవచ్చును. ద్వేషం గుడ్డిది. క్రోధం తెన్నెరగకుండా పరుగుతీస్తుంది. కసితీర్చుకో యత్నించేవారికి చేటు తప్పదు."

"కావచ్చు, మూర్ఖుడైనవాడూ, అనుభవం లేనివాడూ అయితే, అదే కావచ్చు. కాని ధనవంతుడు, నిపుణుడైవానికి ఫరవాలేదు. అంతకీ ప్రమాదం వచ్చినట్లయితే మొదట చెప్పిన స్వల్ప శిక్షతో తీరిపోతుంది. పగ సాధించగలుగుతున్నప్పుడు, ఇటువంటి అల్పశిక్షల నెవరు లక్ష్యపెడతారు? నిజంగా పెపినోకి తల తెగవేసే శిక్ష ఇప్పుడు మానుకున్నారంటే నాకు విచారంగా ఉంది. ఇటువంటి శిక్షలలో పసలేదనే సంగతి మీకు సులువుగా బోధపడేది. ఒక్క వేటుతో ప్రాణం పోతుంది. అంతే. కాని ఈ ఉత్సవాలకు వచ్చిన మనకి ఇటువంటి ప్రసంగం ఉచితం కాదు. అసలీ ప్రసంగం ఎలా వచ్చింది? ఆ! అవును. నా కిటికీదగ్గర మీరు చోటడిగారు, మీరు రావచ్చును. ముందు భోజనానికి వెడదాం."

రుచ్యమైన భోజ్యపదార్థాలను చూసేసరికి ఆల్బర్ట్ కి ప్రాణం లేచివచ్చినట్లయింది. ప్రపంచంలోకెల్ల ఇటాలియన్ల ఆహారం బహుచెడ్డదంటారు. ఆల్బర్ట్ ప్రాణం విసిగి ఉన్నాడు. ఫ్రెంచివారికి రుచించే భోజనం ఇప్పుడు కనపడగానే అత్యంత ఆహ్లాదంతో ఉపక్రమించాడు. మాంట్ క్రిస్టో అన్నీ మూచూసి విడిచిపెట్టాడు. అతిథుల్ని ఆదరించడానికి ఇది చాలునని భావించినట్లున్నాడు. వారు వెళ్లిపోయినతరవాత ప్రత్యేక భోజ్యపదార్థాలను భుజించడానికి నిరీక్షిస్తున్నట్లు కూర్చున్నాడు. దీనితో ఇతన్ని చూసి కౌంటెస్ జి—బెదిరిపోయిన సంగతి ఫ్రాంజ్ కి జ్ఞప్తికి వచ్చింది. తప్పకుండా ఆనాడు ఆ బాక్స్ లో కూర్చున్న వ్యక్తి దయ్యమై ఉండాలని ఆమె ఉద్దేశం. భోజనం ముగియగానే ఫ్రాంజ్ గడియారం తీసి చూశాడు.

"ఏమిటి?" అని ప్రశ్నించాడు మాంట్ క్రిస్టో.

"మమ్మల్ని క్షమించాలి" అన్నాడు ఫ్రాంజ్. "మాకింకా చాలా పనుంది. వేషభూషణాలింకా మేము సిద్ధపరుచుకోవలసి ఉంది."

"ఆ విషయమై మీరు వేరే చూసుకోనక్కరలేదు. పొపోలో దగ్గిర నాకొక లోగదికూడా ఉన్నట్లుంది. మీకే రకాలు దుస్తులు కావాలో అన్నీ అక్కడికి తెప్పించుకోవచ్చును. మీరు వాటిని అక్కడే ధరించవచ్చును."

"మీ ఆదరణకీ, సహాయానికీ మేము కృతజ్ఞులం. మాకు బగ్గీలోనూ, రాస్పోలీ కిటికీలవద్దా చోటుచాలు. పొపోలోవైపు కిటికీ వద్దు."

"కాని చక్కని చోద్యం పోగొట్టుకుంటున్నారుసుమా!"

"అది మీరు స్వయంగా వర్ణిస్తే విని ఆనందిస్తాం. స్వయంగా చూసినట్లు తృప్తిచెందగలం. ఉరి తీస్తుండగా చూడాలని చాల మార్లు అనుకున్నాను. కాని సమయానికి ఎప్పుడూ వెనక్కి తగ్గుతూనే ఉన్నాను. నువ్వేమంటావ్ ఆల్బర్ట్?"

ఆల్బర్ ఇలా చెప్పాడు: "నేను ఒకసారి ఒకణ్ని ఉరి తియ్యడం పారిస్ లో చూశాను. కాని ఆ రోజున మద్యంవల్ల కొంత

మత్తుతో ఉండిపోయాను. ఆ రోజు నే కాలేజికి స్వస్తి చెప్పాను. అంతకుముందు రాత్రి ఒక హోటల్లో స్నేహితు లందరం కలిసి కులాసాగా గడిపాం."

ఫ్రాంజ్ వైపు తిరిగి మాంట్ క్రిస్టో అన్నాడు: "పారిస్‌లో ఉరిశిక్షలు చూడలేనంత మాత్రంచేత మరొకచో ఎక్కడా చూడ కూడదని నియమముందా? యాత్రలు చేస్తున్నారంటే సర్వం చూడాలి. రోమ్‌లో దోషుల్ని ఎలా ఉరిదీస్తారని ఎవరైనా ప్రశ్నిస్తే, తెలియదని సమాధానమిస్తే అందరూ ఏమనుకుంటారో ఊహించండి? స్పెయిన్‌దేశం వడితే ఎద్దులతో పోరాటం చూస్తారా, లేదా? ఇప్పుడు చూడబోయేది అటువంటిదే ననుకో రాదా? పూర్వపు రోమన్ల వినోదాలు, వ్యాయామాల్ని గురించి జ్ఞప్తికి తెచ్చుకోండి. ఒక్కొక్కసారి నూరువందల సింహాలు చచ్చిపోయేవిట. నూరుమంది మనుష్యులు చచ్చిపోయేవారు. లక్ష మందజనం చూసి ఆనందించి చప్పట్లుకొట్టేవారు. భాగ్యవంతులు తమకుమార్తెల్ని తీసుకువెళ్లి చూపేవారు. మతాధికారులు పోరాటం లోకి మనుష్యుల్ని దీవించి పంపుతూ, ఆ వెనుక నే 'నీ విప్పుడే చచ్చినవాళ్ళలో జతే' అనుకునేవారు."

"నువ్వు వస్తావా, ఆల్బర్ట్" అని అడిగాడు ఫ్రాంజ్.

"తప్పకుండా. మొదట నీ మాదిరిగానే సందేహించాను కాని ఈయన వాదం విన్నాక ఇంక సంకోచం మానుకున్నాను." అన్నాడు ఆల్బర్ట్.

"అయితే సరే వడదాం" అన్నాడు ఫ్రాంజ్. "అయితే పొపోలోకి రాస్పొలీమీదుగా వెళ్లాలి. అది దారేకదా కౌంట్?" అని మాంట్ క్రిస్టో వంక తిరిగి ప్రశ్నించాడు.

"కాలినడకనయితే అదేదారి, బగ్గీమీదయితే కాదు."

"అయితే నేను కాలినడకనే ఆ దారిని వస్తాను. నేను చూడవలసింది ఒకటుంది" అన్నాడు ఫ్రాంజ్.

మాంట్ క్రిస్టో అన్నాడు: "అయితే ఆ దారినే వెడదాం. మనం ముందు నడిచివెడదాం. తరవాత పొపోలోవద్దకి బగ్గీతీసుకు రమ్మని చెప్పుదాం. నేనుకూడా రాస్పొలీదారినే వెళ్లాలి. నే నిచ్చిన కొన్ని ఆజ్ఞలు నెరవేరాయో లేదో చూడాలి."

ఒక పరిచారకుడు వచ్చి మాంట్ క్రిస్టోతో ఇలా చెప్పాడు: "అయ్యా! మీకోసం ఎవరో వచ్చారు. ఆయన నల్లని కోటు, ఎర్రంచు టోపీ (ఇవి పశ్చాత్తాపుని చిహ్నాలు) ధరించాడు."

"ఓహో! అతనా? తెలుసును." అన్నాడు మాంట్ క్రిస్టో. యువకులిద్దరివంకకూ తిరిగి "మీరు పక్కగదిలో విశ్రమించండి. క్షణంలో ఈ పని ముగించుకుని వస్తాను" యువకులిద్దరూ లేచి పక్కగదిలోకి వెళ్లి కూర్చున్నారు.

ఫ్రాంజ్ అన్నాడు: "ఏమంటావ్, ఈయన్ని గురించి?"

"ఏమంటానా?" అన్నాడు ఆల్బర్ట్ ఆశ్చర్యపడుతూ. "వేరే ఏమంటాం? చాలా సరదా అయిన మనిషి. అతిథుల్ని చక్కగా ఆదరించగలడు. అనేక దేశాలు సంచారం చేశాడు. చాలా చదివినవాడు. ఎంత ఘోరాన్ని చూసినా చలించని మనిషి. ఆయన ఇచ్చిన చుట్టలు అద్భుతంగా ఉన్నాయి" అంటూ పొగ ఊదాడు.

"కాని నీవంక ఎంత శ్రద్ధతో చూస్తున్నాడో కనిపెట్టావా?" అన్నాడు ఫ్రాంజ్.

"నావంకా?"

"అవును."

"ఓ! అదా! అందులో ఆశ్చర్యపడవలసింది ఏముంది? నేను పారిస్ నగరం విడిచివచ్చి ఏడాది కావచ్చింది. నా దుస్తులు పాత ఫక్కీలో ఉన్నాయి. నేనేదో పల్లెటూరికం అనుకున్నట్టున్నాడు. నేనలాంటివాణ్ని కానని నువ్వు ఆయనతో చెప్పు."

ఫ్రాంజ్ చిరునవ్వు నవ్వాడు. ఇంతలోనే మాంట్ క్రిస్టో వచ్చాడు. "బగ్గీ ఆ దారిని నడుస్తుంది అది ఏర్పాటు చేశాను. మనం రాస్పోలీ దారిని కాలినడక పైన నడదాం. మరికొన్ని చుట్టలు తీసుకోండి ఆల్బర్ట్."

"తప్పకుండా. ఇటాలియన్ చుట్టలు బొత్తిగా పాడుగా ఉన్నాయి. మీరు పారిస్ వచ్చినప్పుడు బదులు తీర్చగలనులెండి."

"తప్పకుండా స్వీకరిస్తాను. నేనక్కడికి త్వరలోనే రాదల్చుకున్నాను. మీ ఆహ్వానాన్ని స్వీకరించగలను. ఇంక మనకి వ్యవధి ఆట్టేలేదు. అప్పుడే పన్నెండున్నర అయింది."

ముగ్గురూ నడిచి బయలుదేరారు. రాస్పోలీవద్ద ఫ్రాంజ్ తన దృష్టిని ఆఖరు భవనంలోని పై కిటికీలపైనే నిగిడ్చి నడుస్తున్నాడు. ఆ సంకేతాన్ని అతను మరిచిపోలేదు. నిర్లక్ష్యభావం నటిస్తూ, మాంటీక్రిస్టోవంక తిరిగి "వాటిలో మీ కిటికీ ఏది?" అని ప్రశ్నించాడు.

"ఆఖరు మూడూ."

ఫ్రాంజ్ జాగ్రత్తగా పరిశీలించాడు. మూడింటిలోనూ చివరి రెండు కిటికీలకూ పసుపుపచ్చని తెరలున్నాయి. మధ్యకిటికీకి, తెల్లని తెర ఉంది. తెల్లని తెరమధ్య ఎర్రని సిలువచిహ్నం ఉంది. కొలోసియమ్‌వద్ద ఆచ్ఛాదనం ధరించిన వ్యక్తి తనకి వాగ్దానం నిలుపుకున్నాడన్నమాట. ఇంక అతను కౌంట్ ఆఫ్ మాంటీక్రిస్టో తప్ప మరొకడు కాదని ఫ్రాంజ్ నిర్ధారించుకున్నాడు.

ముగ్గురూ పొపోలోవద్దకు చేరేసరికి అక్కడ అప్పటికే జనం గుమిగూడి ఉన్నారు. జనసమూహం శిరస్సులపైనుంచి ఒక ఉరికంబం, దానివెనుక ఒక రాతి స్తంభం కనపడుతున్నాయి. రాతి స్తంభంపైన సిలువ ఉంది. ఉరికంబం రెండు స్తంభాలకూ మధ్య పెద్దకత్తి ఒకటి వేలాడుతోంది. కూడలిలో బర్తుక్సినో ఎదురు వచ్చాడు. కిరి మూడు కిటికీలూ రాస్పోలీ భవనం రెండో అంతస్తులో ఉన్నాయి. ఆ భాగంలో రెండు గదులున్నాయి. ఒకటి పడకగది. మరొకటి అలంకరణకి అనువుగా ఉంది. రెండు కుర్చీల మీద రకరకాల నాటక దుస్తులు పేర్చబడి ఉన్నాయి. మాంటీక్రిస్టో వాటిని యువకులకు చూపి "ఎటువంటి దుస్తులు కావాలో నన్నెంచమన్నారు కాబట్టి, ఈ యేడాది వాడుకగా ప్రచారంలో ఉండే ఫక్కీలవి తెప్పించాను. అవే సరైనవని భావించాను" అన్నాడు.

ఫ్రాంజ్ ఈమాట సరిగా వినిపించుకోలేదు. అతని దృష్టి అంతా పొపోలో మైదానం పైనా, ఉరికంబం పైనా ఉంది. ఉరికంబాన్ని చూడ్డం అతనికి ఇదే మొదటిపర్యాయం. కత్తి అర్ధచంద్రాకారంగా ఉంది. ముందు వంపు మొనపైన పదునుంది. ఉయ్యాలలాగున్న ఒక బల్లచెక్కపైన ఇద్దరు వ్యక్తులు కూర్చుని

భోజనం చేస్తున్నారు. అక్కడే నేరస్థుని తీసుకువచ్చి కత్తి కెర చేస్తారు.

గడిచిన రాత్రంతా ఖైదీ లిద్దరివద్దా ఇద్దరిద్దరు ఫాదరీలుండి దైవప్రార్థనలు జరిపారు. బందిఖానానుంచి ఉరికంబంవరకూ ఆయుధపాణులైన సిపాయిలు రెండు బాగులు తీర్చినిలిచి ఉన్నారు. ఉరికంబాన్ని చుట్టి కొందరు నిలిచారు. మిగతా మేరంతా ప్రేక్షకులతో నిండిపోయింది. అనేకమంది స్త్రీలు బిడ్డలను భుజాలపై కూర్చుండబెట్టుకుని నిలిచి చూస్తున్నారు. మొగలోనున్న చర్చిలా రెండింటిలోనూ జనం నిండిపోయారు. ప్రతి గోడపైనా, ప్రతి కిటికీలోనూ, ప్రతివృక్షంపైనా ప్రేక్షకులే. మాంట్ క్రిస్టో చెప్పినది నిజం. జీవితంలో కెల్ల ఔత్సుక్యం కలిగించేది మృత్యువే. అయినా అటువంటి ఘట్టానికి నిశ్శబ్దత, గంభీర వాతావరణం వ్యాపించడానికి బదులు, నవ్వులు, కేకలు, హాస్య ప్రలాపాలు చెలరేగుతున్నాయి. ప్రజలదృష్టిలో ఉరికంబం వినోదమనీ, ఉత్సవాల కిది నాందివంటిదనీ స్పష్టపడుతోంది.

ఉన్నట్లుండి హఠాత్తుగా రణగొణధ్వని ఆగిపోయింది. వెనక చర్చి కవాటాలు తెరుచుకున్నాయి. ముందొకడు చేత కాగడాతో నడవగా, వెనక కొందరు ఫాదరీలు వచ్చారు. వారి వెనక మహాకాయుడైన ఒక వ్యక్తి వచ్చాడు. అతని ఒంటిపైన చిన్న చెడ్డీ తప్ప మరొక ఆచ్ఛాదనం లేదు. ఎడమప్రక్క పొడుగైన కత్తి ఒకటి వేలాడుతోంది. అతని కుడిచేతిలో బరువైన దండం ఒకటుంది. ఇతనే ఉరితీసేవ్యక్తి. ఇతని వెనుక నేరస్థు లిద్దరూ వచ్చారు. ముందు పెపినో, వెనక ఆంద్రీ రండోలా ఉన్నారు. ఇద్దరికీ ప్రక్క ఇద్దరేసి ఫాదరీ లున్నారు. ఖైదీ లిద్దరికీ కళ్లకు గంతలు లేవు. ఫాదరీలు పట్టుకున్న సిలువల్ని మాటిమాటికీ ఇద్దరూ ముద్దుపెట్టుకుంటున్నారు. ఇది చూడగానే ఫ్రాంజ్ కి వొణుకు ప్రారంభించింది. కాళ్లు పట్లు తప్పుతున్నట్లయింది. ఆల్బర్ట్ సగం కాలుస్తున్న చుట్ట పారవేశాడు. మాంట్ క్రిస్టో మాత్రం రవంతయినా చలించలేదు సరికదా అతనికి ఉత్సాహం ఇనుమడిస్తున్నట్లుంది. చెక్కిళ్లు కొద్దిగా ఎర్రబడినాయి. ఆహారాన్ని పసిపట్టిన అడవిమృగానికివలె అతని నాసికాపుటాలు ఉబుకుతున్నాయి. సగం తెరిచిన నోట సన్నని పళ

వరుస వక్క కోరలను జ్ఞప్తికి తెస్తున్నాయి. అయినప్పటికీ మొత్తా నికి ముఖమంతా చూస్తే మృదువైన చిన్నవవ్వు ద్యోతకమౌతోంది. నల్లని నేత్రాలు జాలి, దయ వలికున్నాయి. ఇంతటి చిత్రమైన ముఖభంగిమాన్ని ఫ్రాంజ్ ఎన్నడూ కంట చూడలేదు.

నేరస్థు లిద్దరూ ముందుకు నడిచారు. పెపినో ఇరవై నాలుగు లేక ఇరవై అయిదేళ్ల యువకుడు. చక్కనివాడు. నిర్భయంగా తలెత్తుకుని నడుస్తున్నాడు. ఆంద్రీ పొట్టిగా బొద్దుగా ఉన్నాడు. క్రౌర్యం ఉట్టిపడే అతని ముఖాన్ని చూసి వయస్సు అంచనా వయ్యాడం కష్టం. ముప్ఫై ఏళ్లుండవచ్చును. ఖైదులో అతనికి గడ్డం పెరిగింది. తల ప్రక్కగా ఒక భుజంవైపు వేలవేశాడు. కాళ్లు వొంగి గజగజలాడుతున్నాయి. తన ఒళ్లు తన స్వాధీనంలో లేకుండా కీలుయంత్రం మాదిరిగా నడుస్తున్నట్లున్నాడు.

ఫ్రాంజ్ మాంట్‌క్రిస్టోవంక తిరిగి అన్నాడు: "ఒక్కడినే ఉరితీస్తారని మీరు చెప్పినట్లున్నారు. మరి ఇక్కడిద్దరున్నారే!"

"అవును. కాని ఒక్కడే చచ్చిపోతాడు. ఇంకొకడి కింకా ఆయుర్దాయముంది."

"ఒకడిని క్షమించాలంటే, ఆజ్ఞాపత్రం రావడానికి కింక వ్యవధి లేదే!"

"అదుగో! అదే వస్తోంది." అన్నాడు మాంట్‌క్రిస్టో. అంత లోనే, పెపినో ఉరికంబాన్ని సమీపించేటంతలోనే, ఒక ఫాదరీ అందరినీ తప్పించుకుంటూ దారిచేసుకుని మహాకాయుని సమీపించాడు. చేతి ఒక పత్రాన్ని అందించాడు. అతను పత్రం తీసుకుని చదివి, ఒక చెయ్యి పైకెత్తి బిగ్గరగా ఇలా అన్నాడు: "భగవంతుడు కృపామయుడు. పోప్ దయాసముద్రుడు. ఒక ఖైదీకి క్షమాభిక్ష లభించింది."

"క్షమించారా?" అన్నారు జనమంతా గగ్గోలుగా.

ఆంద్రీ చటుక్కున తలెత్తి "ఎవరికి?" అని అరిచాడు.

"పెపినోకి!"

పత్రం సిపాయిల అధికారి కివ్వబడింది. అతను చదివి తిరిగి ఇచ్చేశాడు.

ఆంద్రీ బిగ్గరగా అన్నాడు: "పెపినోకా? వాడికి ఎందుకు క్షమించాలి? నన్నెందుకు క్షమించరు? చచ్చిపోతే ఇద్దరం కలిసే చావాలి. వాడుకూడా నాతో చచ్చిపోతానని నాకు మాటిచ్చాడు. నన్నొక్కడినే చంపడానికి వీల్లేదు. నేనొంటరిగా చచ్చిపోను. ఏమయినా సరే చచ్చిపోను." ఆంద్రీ కుంజుకుని తప్పించుకోడానికి ప్రయత్నించాడు. అతన్ని పట్టి ఆపిన వాళ్ళతో, ఉచ్చులో చిక్కిన జంతువులాగ పెనుగులాడాడు. మహాకాయుడు సంజ్ఞ చేశాడు. ఒకడు బల్లచెక్కపైనించి దూకి ఆంద్రీని పట్టుకున్నాడు!

"చూడండి! చూడండి" అన్నాడు మాంట్ క్రిస్టో. యువకులిద్దరినీ తట్టిచూపుతూ ఇలా అన్నాడు: "చూడండి. ఈ వింత చూశారా? వాడు మానవుడే. తన కర్మకి తలొగ్గక తప్పదని నిరాశ చేసుకుని ఉరికంబంవద్దకు చేరాడు. పిరికిపందలాగా ఉరిశిక్షకు సమ్మతించి వచ్చాడు. ఒక్కమాట ఎదురు చెప్పకుండా మరణించడానికి సమ్మతించాడు. అలా సమ్మతించడానికి వాడికి మనోధైర్యం ఎక్కడనించి వచ్చింది? వాడికి ఊరట ఎలా కలిగిందో తెలుసునా? తనతోపాటు మరొక మానవుడు మరణిస్తున్నాడు! తన ప్రారబ్ధంలో మరొకడు పాలుపంచుకుంటున్నాడు. తనకుముందు మరొకడు మరణిస్తున్నాడు. అదే వాడికి మనోబలమిచ్చింది! రెండుగొర్రెల్ని కసాయివాడివద్దకు తీసుకువెళ్ళండి. తరవాత ఒకగొర్రె చావనక్కరలేదని వాటికి తెలిసేలాగ చెప్పండి. రెండు గొర్రెలూ ఆనందంతో 'మే' 'మే' అని అరుస్తాయి. కాని మనిషో? భగవంతుడు స్వస్వరూపంలో సృష్టించి, సర్వప్రాణులనూ ప్రేమించాలని ఆదేశించి, ఈభూమికి పంపినమానవుడు! భావాలను వాక్కులలో ప్రకటించగల ప్రజ్ఞను పొందిన మానవుడు, తనతోటివాడు రక్షించబడినాడని వినగానే ఏమంటున్నాడు? ఛీ! మహాపాతకం! ప్రకృతిలోకెల్ల ఉత్కృష్ట ప్రాణికదా మానవుడు, ఆహా!" అంటూ మాంట్ క్రిస్టో పకపక పగలబడి నవ్వాడు. కాని ఈ నవ్వు వికృతంగా ఉంది. ఎంతటి ఘోరయాతనల ననుభవించకపోతే అలాంటి నవ్వు నవ్వగలడు!

ఆంద్రీ పెనుగులాట విడవలేదు. చూసేవారికది దుర్భరంగా ఉంది. ప్రేక్షకులందరికీ అతనిపై కోపం వచ్చింది. "చంపండి వాణ్ని! నరకండి" అనే కేకలు మిన్నుముట్టాయి.

ఫ్రాంజ్ వెనక్కి అడుగులు వేస్తున్నాడు. మాంట్‌క్రిస్టో అతన్ని పట్టుకుని కిటికీలో నుంచి ముందుకి గెంటి అన్నాడు: "ఏమిటిది! మీరు వాడిమీద జాలి కలుగుతోందా? 'పిచ్చికుక్క, పిచ్చికుక్క!' అని కేకలు వినపడినంతలోనే తుపాకితీసి కాల్చిపారేస్తారు దాన్ని. అది చేసిన పాపం ఏమిటి? మరొక కుక్క దాన్ని కరవడమేకదా? అయినప్పటికీ ఏ మనిషీ కరవని ఈ మనిషిని చూసి మీరు జాలిపడుతున్నారా? తనని పెంచి పెద్దచేసిన పితృతుల్యుని హత్యచేసిన వాడిని కనికరిస్తున్నారు. వాడిప్పుడు ఎవరినీ హత్యచెయ్యడానికి వీలులేనందువల్ల, తనతో బందిఖానాలో మగ్గిన తోటిమానవుని చంపుతుంటే చూడాలంటున్నాడు. వాడిని కనికరిస్తున్నారా? వద్దు. చూడండి. అటు చూడండి."

చూడమని చెప్పడం అనవసరమే. ఆ ఘోరదృశ్యం పైనుంచి ఫ్రాంజ్ తన దృష్టిని మరల్చుకోలేకపోయాడు. కాళ్లు గిలగిల కొట్టుకుంటూ, కొట్టుతూ తన్నుతూ కరుస్తూ అరుస్తున్న ఆండ్రీని ఇద్దరు పట్టుకుని ఉరికంబానికి ఈడ్చుకువెళ్లారు. అక్కడ వాడిని పడవేసి మోకాళ్లపై కూర్చోబెట్టారు. మహాకాయుడు చేతిలోనున్న దండం పైకెత్తి సహాయకులిద్దరినీ ఒత్తిగిలమని సంజ్ఞచేశాడు. ఆండ్రీ లేవడానికి ప్రయత్నించాడు. కాని లేచేటంతలోనే దండం అతని ఎడమ కణతపైన పడింది. బరువుగా పడిన దెబ్బచప్పుడు మందంగా వినవచ్చింది. ఆండ్రీ బోరగిలపడి, మెలికతిరిగి వెల్లకిలపడ్డాడు. మహాకాయుడు దండాన్ని కిందపడేసి, ఒరలోనుంచి కత్తిని ఛర్రున లాగాడు. ఒక్కపోటుతో కంఠంలో రంధ్రంచేసి లాగాడు. తరవాత వాడి పొట్టపై నెక్కి తొక్కాడు. రక్తం చరచర పొంగి వచ్చింది.

ఇంక ఫ్రాంజ్ నిలవలేకపోయాడు. స్మృతి తప్పుతున్నట్లయిందతనికి. వెనకనున్న కుర్చీలోకి ఒరిగిపోయాడు. ఆల్బర్ట్ కళ్లు మూసుకుని కిటికీ అంచున చేరగిలపడి నిలబడ్డాడు. మాంట్‌క్రిస్టో విజయసూచకంగా, పగ సాధించగలిగిన వీరునివలె ధీరభావంతో శిరస్సెత్తి నిలబడ్డాడు.

# 36

ఫ్రాంజ్ కి తెలివివచ్చేసరికి ముందు ఆల్బర్ట్ కన పడ్డాడు, తరవాత వీధిలోకి చూశాడు. అక్కడ ఉరికంబం, రక్తపాతం, అన్నీ మాయమైనాయి. జనం రణగొణధ్వని చేస్తున్నారు. సిటోరియో చర్చి గంట మోగుతోంది. పోప్ మరణించినప్పుడూ, రోమ్ ఉత్సవాలు ప్రారంభమైనప్పుడూ మాత్రమే ఈచర్చిగంట మోగిస్తారు.

"అదేమిటి ? ఏం జరిగింది ?" అని ప్రశ్నించాడు ఫ్రాంజ్.

"ఏముంది?" అన్నాడు మాంట్ క్రిస్టో. "ఉత్సవం ప్రారంభ మయింది."

"మరి పెపినో మాటేమయింది ?"

"పెపినోకి లోకజ్ఞానం ఉంది. అది అట్టేమంది కుండదు. నలుగురూ తమ సంగతి కనిపెట్టలేదని కొందరు రోషం తెచ్చు కుంటారు. ఎవ్వరూ కనిపెట్టని సమయం చూసి పెపినో జారి పోయాడు. ఫాదరీలకి వందనమైనా చెయ్యలేదు. త్వరగా దుస్తులు ధరించండి, అట్టే వ్యవధి లేదు." ఆల్బర్ట్ సాటిన్ పంట్లాం తొడు గుతున్నాడు.

ఫ్రాంజ్ అడిగాడు. "ఆల్బర్ట్ ! నిజం చెప్పు. ఉత్సవాల్లోకి వెళ్ళాలని నీ కింకా కోరికుందా ?"

"నిజంగా లేదనుకో. కాని కౌంట్ చెప్పినది నాకు పూర్తిగా నచ్చింది. ఇటువంటి దృశ్యం మొదటిసారి చూసినప్పుడు మాత్రమే కలత పడతాం. అంతే. తరవాత ఏమీ ఉండదు."

ఫ్రాంజ్ కూడా గబగబా కొత్త దుస్తులుధరించాడు. అందరూ కలిసి మెట్లు దిగి వెళ్ళేసరికి ద్వారంవద్ద బగ్గీ సిద్ధంగా ఉంది. అప్పటికే ఆచోటంతా మారిపోయింది. దారుణ మారణదృశ్యాన్ని చూడ్డానికి వచ్చిన జనం అదంతా మరిచిపోయిఆనందోత్సవంలో నిమగ్నులై పోయారు. వీధులన్నీ జనంతోనూ, బగ్గీలూ, రక రకాల బళ్లతోనూ కిటకిటలాడుతున్నాయి. అందరూ రకరకా

లవేషాలు ధరించారు. మిత్రులు,శత్రువులనే భేదం లేకుండా పర స్పరం పరిహాసాలాడుకుంటూ, కేకలు వేస్తూ, గంతులు వేస్తూ, అల్లరిగా తిరుగుతున్నారు. మిఠాయివస్తువులు, పువ్వుల గుత్తులు, బుక్కా మొదలైనవి ఒకరిపై ఒకరు విసురుకుంటున్నారు. పిన్నలూ పెద్దలూ కేరింతలు కొడుతూ చేస్తున్న అల్లరికి ఎవరికీ కోపంరాదు. క్రమక్రమంగా ఈ అల్లరిలోకి అందరూ, కొద్ది గొప్ప తేడాలు మరిచి, చొరబడుతున్నారు. అనేకదేశాలనుంచి వచ్చిన అనేక జాతీయులు కలిసిమెలిసి ఈ ఉత్సవంలో పాల్గొంటున్నారు. ఎద్దులు, గేదెలు, పులులు,సింహాలు కుక్కలరూపంలో అట్ట తిలలు తగిలించుకుని అందరూవీథులంట తిరుగు తున్నారు.

ఈ ఉత్సవ కల్లోలంలో రెండుసార్లు బగ్గీలో అటూ ఇటూ తిరిగినతరవాత మాంట్ క్రిస్టో రాస్పొలీభవనంలోని తన బసకి వెళ్లిపోయాడు. బగ్గీ యువకు లిద్దరికీ ఒప్పగించబడింది. ఉత్స వంలో తిరగడం విసుగుపుట్టినప్పుడు, రాస్పొలీభవనంలోని తన కిటికీలవద్ద కూర్చుని చూడవచ్చునని మాంట్ క్రిస్టో వారికి చెప్పాడు.

యువకు లిద్దరూ ఉత్సవకేళిలో ఒళ్లుమరిచి చాలసేపు తిరి గారు. ఒకచోట ఇటాలియన్ రైతులవేషాలు ధరించిన గుంపొకటి ఒక బండిలో కనపడింది. ఆల్బర్ట్ దాని ననుసరించడానికి ప్రయ త్నించాడుకాని అది సమూహంలో ఇట్టే మాయమయిపోయింది. బండిలోనివారంతా రకరకాల బురఖాలు తగిలించుకున్నారు.

ఫ్రాంజ్ తో ఆల్బర్ట్ ఇలా అన్నాడు: "అరెరె! నువ్వు చూడలేదు సుమా! ఆ బురఖాలు తగిలించుకున్నవాళ్లందరూ చక్కని ఇటాలియన్ యువతులై ఉంటారు!"

"పాపం! దురదృష్టవంతుడవ్. నువ్వు నీ బురఖా తీసెయ్య వలసింది సుమా! ఇంతవరకూ తీరని కోరిక ఇప్పుడైనా తీరేది కదా!"

"జరిగిన లోపం తీరకుండా ఉత్సవం అయిపోదులే. ఫరవా లేదు."

కాని ఆల్బర్ట్ ఆశలు అట్టే ఫలించలేదు. ఆ బండిరెండు మూడుసార్లు తటస్థపడి మాయమయింది. అది కనిపించిన ప్రతి

సారి ఆల్బర్ట్ బురఖా తీసివేశాడు. రెండోసారి తన దగ్గరున్న పూలగుత్తులన్నీ ఎత్తి ఆ బండిలోకి గిరవాటు వేశాడు. మూడోసారి ఊదాపువ్వులగుత్తొకటి ఆల్బర్ట్ వద్దకు వచ్చిపడింది. గుత్తిలో కొన్ని పూలు తీసి ఆల్బర్ట్ కోటుకు తగిలించుకున్నాడు.

ఫ్రాంజ్ అన్నాడు: "ఇంకేం? అన్వేషణ ఆరంభించు."

"నీవు పరిహాసంగానే ఉండవచ్చుగాని, నాకు అలా లేదు. పువ్వులగుత్తిని విడిచిపెట్టేది లేదింక."

అయితే పరిహాసధోరణి మారిపోడానికి ఆట్టేసేపు పట్టలేదు. ఆ బండి ఈమారు కనపడినప్పుడు అందులోనుంచి ఒకామె ఆల్బర్ట్ కోటు బొత్తాములో పూలను చూసి నవ్వి చప్పట్లు కొట్టింది.

ఫ్రాంజ్ అన్నాడు: "బలే! బలే! అంతా అనుకూలంగానే ఉందోయ్! నువ్వు ఒంటరిగా ఉంటే మంచిదేమో? నేను వెళ్ళిపోనా?"

"అక్కర్లేదు. ఆమె నిజంగానే అనుకూలంగా ఉన్నట్లయితే, మళ్ళీ కనపడి సంజ్ఞచేస్తుందిలే. రేపు ఆమే మనకోసం వెతుక్కుంటూ వస్తుంది. అప్పుడేం చెయ్యాలో చూడవచ్చులే."

ఆ రోజుకి మళ్ళీ ఆబండి కనపడలేదు. యువకు లిద్దరూ మరికొంతసేపు తిరిగి రాస్పొలీభవనానికి వెళ్ళిపోయారు. చిన్న చర్చిలో గంట మోగగానే ఉత్సవం సన్నగిలిపోయింది. బళ్లు వెళ్ళిపోయినాయి. జనం ఎవరి నివాసాలకు వారు వెళ్ళిపోయారు. ఆల్బర్ట్ హోటల్ యజమానితో చెప్పి, ఆరోజే ఇటాలియన్ రైతులకు అనువైన దుస్తులు తెప్పించుకున్నాడు. ఊదాపూలగుత్తిని జాగ్రత్తగా పదిలపరిచాడు.

మరునాడు ఉదయం యువకు లిద్దరూ రైతులవేషాలు ధరించారు. ఆల్బర్ట్ వాడిన ఊదాపూలను కోటుబొత్తాముకు తగిలించాడు. ఇద్దరూ బగ్గీలో ఎక్కి ఒకసారి చుట్టివచ్చినంతలోనే నిన్నటిబండి ఎదురయింది. మరొక ఊదాపూలగుత్తి వచ్చి ఆల్బర్ట్ వద్ద పడింది. కొత్తగుత్తిని కోటుకు తగిలించి వాడినగుత్తిని చేతి పట్టుకున్నాడు ఆల్బర్ట్. ఈమారు ఆ బండి కనపడగానే వాడిన గుత్తి ఎత్తి మృదువుగా చుంబించాడు. బండిలోనివా

రందరూ ఉల్లాసంతో కేరింతలు కొట్టారు. ఆ రోజుకూడా ఆనందోత్సాహాలతో గడిచిపోయింది. ఒక పర్యాయం ఆ బండిలో ఒక యువతి బురఖా తీసి ఆల్బర్ట్‌ను చూసింది. ఇద్దరూ నవ్వుకున్నారు. ఆమె ఉన్నతవంశస్థురాలని ఆల్బర్ట్ అనుకున్నాడు. మరుచటిరోజు ఆల్బర్ట్ ఒక్కడే బగ్గీలో వెళ్ళాడు. ఫ్రాంజ్ రాస్పొలీభవనంలో కిటికీదగ్గర కూర్చుని ఉత్సవం చూశాడు. ఇదే రీతిగా మరొకరోజు గడిచింది. ఆరోజు సాయంకాలం ఆల్బర్ట్ ఉత్సాహంతో పరుగెత్తివచ్చి చేత ఒక కాగితం పట్టుకుని "ఇదిగో! ఇది చూడు! చదువు" అన్నాడు. ఫ్రాంజ్ పత్రం తీసుకుని ఇలా చదివాడు:

"మంగళవారం సాయంత్రం ఏడుగంటలవేళకి, పాంటిఫెకీ వీధిమొగలో మీ బండి దిగి, అక్కడి చర్చి సోపానాలవద్ద నిరీక్షించేకర్షక యువతిని అనుసరించండి. మిమ్మల్ని గుర్తుపట్టడానికివీలుగా మీ కోటుకు వేలాడే ఎర్రరిబ్బనొకటి చివరముడి వెయ్యండి. అంతవరకూ మీకు నేను కనపడను."

"ఏమంటావ్?" అని అడిగాడు ఆల్బర్ట్.

"అదృష్టవంతుడవంటాను." అని పత్రాన్ని తిరిగి ఇచ్చేశాడు ఫ్రాంజ్.

"ఇప్పుడు నవ్వు. నీ ఇష్టం వచ్చినట్లు నవ్వు. ఇప్పుడు నిజంగానే నన్ను ప్రేమ ఆవహించింది."

"అరె! అయితే నన్ను ఒంటరిగా ఫ్లారెన్స్‌కి పంపుతావన్నమాట! ఇప్పుడే ఒంటరిగా విడిచిపెట్టేలాగున్నావే!"

"ఆమె అందానికి తోడు అనుకూలమైనదైతే అంతే. కనీసం ఆరువారాలైనా రోమ్‌నగరంలో తిష్ఠవెయ్యాలి. రోమ్‌నగరం అద్భుతంగా ఉంది. ఆహా! ఏమి భవనాలు! ఏమి నిర్మాణం!"

"అవునవును. ఇలాగే ఇంకా రెండుమూడు ప్రేమయాత్రలు సాగించావంటే, నీకు రోమన్‌భవననిర్మాణంలో పరిపూర్ణ పాండిత్యం అబ్బుతుందిలే."

ఇంతలో హోటల్ యజమాని వచ్చాడు. కౌంట్ ఆఫ్‌మాంట్ క్రిస్టో అత్యవసర కార్యంపైన ఈ రెండురోజుల్లోనూ సివిటా

వెళ్ళియూ వెళ్ళివచ్చినట్లు అతను చెప్పాడు. మాంట్ క్రిస్టో సంగతి ఎంత తరిచినా ఫ్రాంజ్ కి బోధపడ్డం లేదు. ద్వీపంలో తన నే చూసి నట్లు మాంట్ క్రిస్టో గుర్తించి ఉండాలి. కాని ఒక్కమారు కూడా అతనా ప్రసక్తిని తేలేదు. ఫ్రాంజ్ కూడా అతని ఆదర గౌరవాలను గమనించి ఆ ప్రసక్తి తీసుకురాలేకుండా ఉన్నాడు. క్రమంగా మాంట్ క్రిస్టో చిత్రముఖభంగిమకు ఫ్రాంజ్ అలవాటు పడ్డాడు. సౌకుమార్యమెరగని అతని వింత అందాన్ని గుర్తించాడు. బైరన్ వర్ణించిన వీరులను పోలిన అతని ముఖంలో, ఏదో చెప్పలేని ఒక భావం ముద్రితమైనట్లుంది. ఏ కఠోరభావమో అతని నుదుటిపైన గాఢరేఖ నొకదానిని ముద్రించింది. గుండెలను దూసి లోతుపాతులు కనిపెట్టగలవనిపిస్తాయి, నిప్పులు కక్కే అతని నేత్రాలు. నిరసన, చాంచల్యం, కోపం ప్రకటించే అతని పై పెదవి, పలికే ప్రతిమాటకూ తీవ్రశక్తి నిచ్చి, వినేవారిలో అదురు కలిగిస్తుంది. అతనికి యౌవనదశ దాటింది. కనీసం నలభైఏళ్ళుంటాయి. అయినప్పటికీ యువతులను వశపరుచుకునే శక్తి అతనికే ఉన్నదా అనిపిస్తుంది. అతన్ని ఒకసారి చూసినవారు దృష్టిని మరల్చుకో లేరు. అతని ముఖంలోని ఆకర్షణ తీవ్రమైనది. ఇటువంటి అసాధారణ వ్యక్తిమైత్రి లభించడం అదృష్టమని ఆల్బర్ట్ పొంగిపోతున్నాడు. కాని ఫ్రాంజ్ అంత ఉత్సాహంగా లేడు. అయినా ఇద్దరూ ఒకేవిధంగా ఆకర్షించబడ్డారు. మాంట్ క్రిస్టో పారిస్ వస్తానని చెప్పిన విషయాన్ని గురించి తరుచు యోచించే వాడు. అసాధారణప్రజ్ఞ, తీవ్రఆకర్షణ గల అతని ముఖం, అతని అపారభాగ్యసంపద పారిస్ ఉన్నతిసమాజంలో సంచలనం కలిగించక మానవనుకున్నాడు ఫ్రాంజ్. అయినా మాంట్ క్రిస్టో పారిస్ లో ఉండే సమయంలో అక్కడ తానుండకూడ దను కున్నాడు.

మంగళవారం వచ్చింది. అదే ఉత్సవాలకు ఆఖరిరోజు. చీకటిపడిన తరవాతకూడా గంటసేపటివరకూ జ్వాలాతోరణోత్సవం జరుగుతోంది. ఈ సందడిలో ఆల్బర్ట్ సరిగా ఏడుగంటల వేళకి చర్చివద్దకు వెళ్లి బగ్గీ దిగాడు. అక్కడకూడా జనసమ్మర్దం అధికంగానే ఉంది. ఫ్రాంజ్ బగ్గీలోనే కూర్చున్నాడు. కర్షక స్త్రీవేషం ధరించిన ఒక యువతి ఆల్బర్ట్ ని సమీపించి ఎర్ర రిబ్బను

ముడి తాకింది. ఇద్దరూ ఏవో మాట్లాడుకున్నారు. కాని ఫ్రాంజ్ కి వినపడలేదు. తరవాత ఇద్దరూ చెయ్యీ చెయ్యీ పట్టుకుని జనసమ్మర్దంలో కలిసి మాయమైనారు. ఇంతలోనే చర్చిగంట మోగింది. ఉత్సవాలు ఆఖరైనట్లు అది సూచన. వీధులన్నీ నిర్జనం కావడానికి ఆట్టే సేపు పట్టలేదు. జ్యోతితోరణంలో ప్రకాశించిన వీధులన్నీ ఒక్కసారిగా చీకటిలో మునిగిపోయాయి.

అకస్మాత్తుగా ఉత్సవదృశ్యాలు అదృశ్యమవగా, చీకటిలో, భారమైన భావపరంపరతో ఫ్రాంజ్ హోటల్ కి తిరిగివెళ్లాడు. ఈ మాదిరి అనుభవం అతనికి జన్మలో కలగలేదు. ఉన్నట్టుండి ఉత్సాహం, కల్లోలం మాయమై, గాఢనిస్తబ్ధత ఆవరించింది. నగరమంతా పెద్ద శ్మశానవాటికవలె అతనికి కనుపట్టింది. రాత్రి పదకొండు గంటలకుగాని చంద్రోదయం కాదు. ఆల్బర్ట్ రావడానికి ఆలస్యమౌతుందని చెప్పినందువల్ల, ఆ రాత్రి ఫ్రాంజ్ ఒక్కడే కూర్చుని భోజనం చేశాడు. రాత్రి పదకొండు గంటలకు బగ్గీ సిద్ధంగా ఉంచవలసిందని ఆజ్ఞ ఇచ్చాడు. ఆల్బర్ట్ రాగానే కబురు పంపవలసిందని హోటల్ యజమానితో చెప్పాడు. రాత్రి పదకొండు గంటలైనప్పటికీ ఆల్బర్ట్ తిరిగి రాలేదు.

# 37

ఆల్బర్ట్ అప్పటికీ తిరిగి రాకపోయేసరికి ఫ్రాంజ్ కలవరపడ్డాడు. రాత్రి కౌంటెస్ ఇంటివద్ద విందులో గడపాలనే ఉద్దేశంతో బయలుదేరాడు.

కౌంటెస్ తండ్రి రోమ్‌లోని భాగ్యవంతులలో ఒకడు. వారి భవనం నగరంలోకెల్ల అందమైనది. వారి ఇంటిలో విందులకు పేరుకలవారందరూ వస్తారు. ఫ్రాంజ్ అక్కడికి వెళ్ళగానే విన్న మొదటి ప్రశ్న అతని మిత్రుని గురించి.

"ఆల్బర్ట్ గియాకొమోచర్చివద్ద దిగి వెళ్లిపోయాడు" అని ఫ్రాంజ్ చెప్పాడు.

"ఎక్కడికి వెళ్లిఉంటాడు?"

"సరిగ్గా తెలియదు. కాని ఒక యువతిని కలుసుకోడాని కనుకుంటాను."

"అచ్ఛా" అన్నాడు కాంటెస్ తండ్రి. "రోమ్‌నగరవీధుల్లో తిరగడానికి, ఈ రాత్రివేళ మంచిది కాదు."

"అతన్ని వెళ్ళకుండా మీరు ఆపవలసింది. రోమ్ నగరం సంగతి అతనికంటె మీకు బాగా తెలుసు." అంది కాంటెస్.

"నిజమేకాని అతన్ని ఆపడం ఎవ్వరితరం కాదు. అదీకాక ఏమౌతుందతనికి ?"

"ఏమో ? ఎవరు చెప్పగలరు ? రాత్రి నగరం గుబులు గుబులుమంటూ ఉంటుంది. దగ్గరలోనే టైబర్ నదికూడా ఉంది."

"అతను తిరిగి రాగానే ఇక్కడ నాకు కబురు పంపవలసిందని హోటల్ యజమానికి చెప్పాను."

"అదుగో ! మీకోసం నౌకరొకడు వెతుక్కుంటూ వస్తున్నాడు."

నౌకరొకడు వచ్చి ఫ్రాంజ్‌తో ఇలా చెప్పాడు : "అల్బర్ట్ వద్దనుంచి మీ కొక ఉత్తరాన్ని ఎవరో తీసుకువచ్చినట్లు, మీ హోటల్ యజమాని మీతో చెప్పమన్నారు."

"ఆల్బర్ట్ ఉత్తరం పంపాడా ? వచ్చిన మనిషెవరు ? ఉత్తరం ఇక్కడికెందుకు తీసుకొచ్చి ఇవ్వలేదు ?"

"ఎందుకో చెప్పలేదండి. మీకోసం నేనిక్కడికి రావడం చూసి అతను వెళ్ళిపోయాడు."

"అలాగా ?" అంది కాంటెస్. "అయితే, మీరు క్షణం జాప్యం చెయ్యకుండా వెళ్ళండి. అతనే ముప్పులో చిక్కుకున్నాడో పాపం."

ఫ్రాంజ్ వెంటనే బయలుదేరాడు. హోటల్ సమీపంలోనే ఉంది. కాలినడకను పదినిమిషాల్లో అక్కడికి చేరాడు. హోటల్ వద్ద, వీధి మధ్యలో నిలబడిన ఒక వ్యక్తి కనపడ్డాడు. అతనే ఉత్తరం తెచ్చినవాడని ఫ్రాంజ్ నిర్ధారణ చేసుకున్నాడు. ఆ వ్యక్తి ఒంటినిండా పెద్ద పచ్చడం కప్పుకున్నాడు. అతన్ని సమీపించగానే, అతనే "తమపేరేనా బారన్......" అన్నాడు.

"అవును. నా పేరే బారన్ ఫ్రాంజ్ డి ఎపినే."

"అయితే ఈ ఉత్తరం తమకే వ్రాయబడింది."

"జవా బివ్వాలా?"

"ఉత్తరం చదివితే మీకే తెలుస్తుంది."

"నేను తిరిగి వచ్చేవరకూ మీ రిక్కడే ఉంటారా?"

"తప్పకుండా"

ఫ్రాంజ్ హోటల్లోకి వెళ్ళాడు. మెట్లవద్ద నే పస్ట్రినీ ఎదురైనాడు. "మీ రా మనిషిని కలుసుకున్నారా?" అని అడిగాడు.

"కలుసుకున్నాను. ఉత్తరం ఇచ్చాడు. దీపం ఒకసారి పంపించండి."

వెంటనే నౌకర్లు కొవ్వొత్తిదీపాలు తెచ్చారు. పస్ట్రినీ కల వర పడుతున్నట్లు వెలుగులో ఫ్రాంజ్ చూశాడు. ఫ్రాంజ్ ఉత్తరం విప్పి ఈవిధంగా చదివాడు:

"ప్రియమిత్రునికి; ఈ ఉత్తరం అందగానే నా మేజాలో ఉన్న హుండీ పత్రం తీసి, అది చాలకపోతే నీ పత్రంకూడాతీసి, మార్చి, నాలుగువేలు స్పానిష్ డాలర్లు తీసుకో. ఆ ధనాన్ని ఈ ఉత్తరం తెచ్చిన వ్యక్తికి ఒప్పగించు. ఈ ధనం నాకు వెంటనే కావాలి. ఒక్క క్షణం ఆలస్యం కాకూడదు. నీమీద నమ్మకంతో ఉన్నాను. ఇంతకంటె నే నింకేమీ చెప్పలేను—నీమిత్రుడు ఆల్బర్ట్ డి మార్సెర్ఫ్"

"గమనిక: ఇప్పుడు నాకు ఇటాలియన్ దోపిడి దొంగలున్నారని నమ్మకం కుదిరింది."

ఈవాక్యాల కింద ఆ ఉత్తరంలో కొత్త దస్తూరీలో ఇటాలియన్ భాషలో ఇలా వ్రాసిఉంది.

"రేపు ఉదయం ఆరుగంటలకి నాలుగువేలూ నాచేతిలో పడకపోతే, ఏడుగంటలకల్లా ఆల్బర్ట్ ప్రాణా లుండవు—లూగీ వాంపా."

అయితే ఆల్బర్ట్ ఇటాలియన్ దోపిడిదొంగలచేతుల్లో చిక్కా డన్నమాట! ఇప్పు డింక ఆలస్యం చెయ్యడానికి వీల్లేదు.

ఫ్రాంజ్ గబగబా వెళ్లి మేజా వెతికాడు. ఆల్బర్ట్‌కి చెందిన హుండీలో ఆరు వేలలో మూడు వేలప్పుడే ఖర్చయింది. ఇంక మూడు వేలే ఉంది. ఫ్రాంజ్ హుండీ పత్రం రోమ్‌నగరవాసుల కిచ్చినదికాదు; ఫ్లారెన్స్ నగరవాసుల కిచ్చినదది. అప్పు డతని చేతిలో ఏభై లూయీలుమాత్రం మిగిలింది. అంటే ఆల్బర్ట్‌కి ఇంకా ఎనిమిది వందల స్పానిష్ డాలర్లు కావాలి. మిగిలినది ఋణం దొరకవచ్చునని కొంత ధైర్యముంది. ఫ్రాంజ్ బయలుదేరాడు. ఇంతలో అతనికి మెరుపువలె ఒక ఆలోచన తట్టింది. కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో జ్ఞప్తికి వచ్చాడు. పత్త్రినీ వంక తిరిగి "మాంట్ క్రిస్టో ఉన్నారా ?" అన్నాడు.

"ఉన్నారు. ఆయనకూడా ఇప్పుడే వచ్చారు."

"అయితే నేను వెంటనే ఆయన్ని చూడగోరుతున్నానని తెలియపరచగలరా ?"

పత్త్రినీ వెళ్లి అయిదు నిమిషాల్లో తిరిగివచ్చాడు: "మీ కోసం మాంట్ క్రిస్టో నిరీక్షిస్తున్నారు" అని చెప్పాడు.

ఫ్రాంజ్ ఒక నౌకరుననుసరించి వెళ్లాడు. లోపల ఒక గదిలో మాంట్ క్రిస్టో కూర్చునిఉన్నాడు. చుట్టూ సోఫాలున్నాయి. అతను లేచి ముందుకువచ్చి ఫ్రాంజ్‌ని ఆహ్వానించాడు. "ఇటువంటివేళ వచ్చారు, విశేషమేమైనా ఉందా ? నాతో కలిసి భోజనంచేస్తారా ?" అన్నాడు.

"లేదు. ప్రమాదమైన ఒక విషయంగురించి మాట్లాడ్డానికి వచ్చాను."

"ప్రమాదమా ? ఏమి టది ?".

ఆల్బర్ట్ తనకు పంపిన ఉత్తరాన్ని తీసి ఫ్రాంజ్ మాంట్ క్రిస్టోచేతి కిచ్చాడు. "ఇది చదవండి" అన్నాడు.

మాంట్ క్రిస్టో చదివాడు.

"దీన్నిగురించి ఏమంటారు ?" అన్నాడు ఫ్రాంజ్.

"ఆల్బర్ట్ అడిగినంత ధనం మీవద్ద ఉందా ?"

"ఎనిమిదివందలు కొరతగా ఉంది."

మాంట్ క్రిస్టో లేచివెళ్ళి సమీపంలోఉన్న డ్రాయర్ తెరిచాడు. దాని నిండా బంగారు నాణేలున్నాయి. "నాలుగు వేలూ తీసుకోండి. పైనకూడా ఏమైనా కావలసివస్తే తీసుకోండి" అన్నాడు.

ఫ్రాంజ్ ఈమారు మాంట్ క్రిస్టోవంక స్థిరదృష్టి నిలిపి చూసి, ఇలా అన్నాడు; "అయితే లూగీవాంపాకి ధనం పంపక మార్గాంతరం లేదంటారా?"

"మీరే నిర్ణయించుకోండి. చివరి వాక్యాలలో ఆ మాట నిష్కర్షగా వ్రాయబడింది కదా!"

"మీరు కొంచెం జాగ్రత్తగా ఆలోచించినట్లయితే, తప్పకుండా మరొకమార్గం దొరక్కపోదు. మన మిద్దరం కలిసిలూగీ వాంపావద్దకు వెళ్ళి, ఆల్బర్ట్‌ని విడిచిపెట్టాలని మీ రడిగినట్లయితే, అతను నిరాకరించ డనుకుంటాను."

"ఆ దోపిడిదొంగ నా మాట ఎందుకు వింటా డనుకున్నారు?"

"అతనికి జన్మలో మరిచిపోలేని సహాయాన్ని మీరు చేశారుకదా! మీరు పెపినో ప్రాణాల్ని రక్షించారు!"

"ఓహో! ఆమాట మీ కెవరు చెప్పారు?"

"అదెందుకులెండి. అది నాకు తెలుసును."

మాంట్ క్రిస్టో నుదుట ముడతలు బిగిశాయి. కొద్దిసేపు మౌనంగా ఉండిపోయాడు. తరవాత ఇలా అన్నాడు "నేను లూగీ వాంపావద్దకు వెడితే మీరు కూడా వస్తారా?"

"మీకు అభ్యంతరం లేకపోతే తప్పకుండా వస్తాను."

"సరే అయితే. ఈ రాత్రి బాగుంది కూడా. రోమ్‌నగరానికవతల కొంత మేర నడవడం ఒంటికి మంచిది."

"నాతో కూడా ఆయుధాలేవైనా తీసుకురావాలా? ధనం కూడా తీసుకురానా?"

"వాటివల్ల ప్రయోజనం ఉండదు. మీకు ఉత్తరం తెచ్చిన మని షెక్కడ?"

"వీధిలో ఉన్నాడు. జవాబుకోసం కనిపెట్టుకుని ఉన్నాడు."

"అసలు మనం ఎక్కడికి వెళ్లాలో ముందుగా తెలుసుకోవాలి. అతన్నిక్కడికి పిలుస్తాను."

మాంట్ క్రిస్టో కిటికీవద్దకు వెళ్లాడు. వీధిలోకి చూసి, ఒక వింత తరహాలో ఈల వేశాడు. నిలువెల్లా ఆచ్ఛాదనం కప్పుకున్న వార్తాహరుడు చాటు నుంచి వచ్చి వీధిలో నిలిచాడు. తన పరిచారకుని పిలిచే ధోరణిలో మాంట్ క్రిస్టో కేక వేశాడు. వెంటనే ఆవ్యక్తి రాస్పాలీభవనం ప్రవేశించి మెట్లెక్కి వచ్చి మాంట్ క్రిస్టోముందు నిలిచాడు.

"ఓ! నువ్వా పెపినో!" అన్నాడు మాంట్ క్రిస్టో. జవాబు చెప్పడానికి బదులు పెపినో మోకాళ్లపై కూర్చొబడి మాంట్ క్రిస్టోచెయ్యి అందుకుని ముద్దులు కురిపించాడు.

"ఓహో! అయితే నీ ప్రాణాలు నేను రక్షించిన సంగతింకా నువ్వు మరిచిపోలేదన్నమాట. చిత్రంగానే ఉంది. అది జరిగి వారంరోజు లయిపోయింది."

"లేదండి. నేనెన్నడూ మరిచిపోలేనండి" అన్నాడు పెపినో. కృతజ్ఞతాభావంతో అతనికంఠస్వరం ఆర్ద్రమయింది.

"ఎన్నడూ! అబ్బో! అంటే చాలాకాల మన్నమాట! కాని అది నీ నమ్మకం మాత్రమే సుమా. సరే లే."

పెపినో లేచి నిలబడ్డాడు. సంకోచంతో ఫ్రాంజ్ వంక చూశాడు.

మాంట్ క్రిస్టో అన్నాడు: "ఫరవాలేదు. ఆయనముందు నువ్వు మాట్లాడవచ్చు. ఆయన నా మిత్రులలో ఒకడు."

"అయితే మీ రేది అడిగినా చెప్పగలను."

"ఆల్బర్ట్ మీ చేతిలో ఎలా చిక్కుకున్నాడు?"

"థెరిసా తిరిగిన బండి, వారి బగ్గీ, ఉత్సవాలలో చాలాసార్లు తటస్థ పడినాయండి.?"

"థెరిసా అంటే? మీ నాయకుని భార్య?"

"అవునండి. ఫ్రెంచి దేశస్థుడు ఆమెపైన పువ్వుల గుత్తి విసిరాడు. థెరిసా ఒక పువ్వులగుత్తి విసిరింది—మా నాయకుని

అనుమతితోనే ఆమె అలా విసిరింది. మా నాయకుడే మారు వేషంలో బండి తోలాడు."

"తరవాత?"

"తరవాత ఫ్రెంచియువకుడు బురఖా తీసేశాడు. నాయకుని అనుమతితో థెరిసా కూడా బురఖా తీసింది. ఏకాంతంగా కలుసుకోవాలని ఫ్రెంచియువకుడు ఆమెను ప్రార్థించాడు. థెరిసా అంగీకరించింది. కాని గిగూకోమో చర్చివద్ద అతన్ని కలుసుకున్నది థెరిసా కాదు, బెప్పో."

"బెప్పో ఎవరు?"

"పదిహేనేళ్ళ బాలుడు. ఇంకా అనేకమందిని వాడు పట్టించాడు."

"బెప్పో అతన్ని నగరం దాటించి తీసుకువెళ్ళాడా?" అని అడిగాడు మాంటె క్రిస్టో.

"అవునండి. అక్కడ ఒక బండి సిద్ధంగా ఉంది. బెప్పో ముందు అందులో ఎక్కాడు. ఫ్రెంచియువకుణ్ని ఆహ్వానించాడు. మారుమాట చెప్పకుండా అతనుకూడా బండెక్కి బెప్పో ప్రక్కనే కూర్చున్నాడు. రోమ్ నగరానికి మూడు మైళ్లలో ఉన్న ఒక భవనానికి వెళ్లాలని బెప్పో చెప్పాడు. మూడు మైళ్ళు కాదు, ఎక్కడికి రమ్మన్నా వస్తానన్నాడు ఫ్రెంచి యువకుడు. బండి రెండువందల గజాలు సాగిందో లేదో, అంతలోనే ఫ్రెంచి యువకుడు బెప్పోని ఆలింగనం చేసుకున్నాడు. వెంటనే బెప్పో రెండు పిస్తోళ్ళు తీసి కణతలపైన గురిపెట్టాడు. బండివాడు బండి ఆపి దిగివచ్చి పిస్తోలు చూపించాడు. సమీపంలో దాగిఉన్న నలుగురు మా మిత్రులు కూడా వచ్చారు. ఫ్రెంచి యువకుడు తప్పించుకోడానికి ప్రయత్నించాడు. బెప్పోని కంఠం నొక్కి చంపడానికి కూడా ప్రయత్నించాడు. కాని అయిదుగురు సాయుధుల చేతిలో లొంగక తప్పిందికాదు. బండిలోనుంచి అతన్ని బైటికి లాగి నది ఒడ్డువెంట నడిపించుకు వెళ్లారు. సెంట్ సెబాస్టియన్ భూగర్భాంతర శ్మశాన వాటికలలో లూగీ, థెరిసాలవద్దకు అతన్ని తీసుకువెళ్లారు."

మాంటె క్రిస్టో ఫ్రాంజ్ వంక తిరిగి "ఏమంటారు? ఇది నమ్మ దగినట్లుగానే ఉంది. మీ అభిప్రాయం ఏమిటి?"

"ఆల్బర్ట్‌కి కాక మరొకరికి ఈవిధంగా జరిగితే నవ్వలేక చచ్చిపోయేవాడినే"

"నేనిక్కడ లేకపోతే ఈ వ్యవహారంలో ఆల్బర్ట్‌కి చిలువ బాగా నొడిలేది కూడా. ఇప్పుడింకేం ఫరవాలేదు."

"అయితే మనం వెళ్లి అతన్ని తీసుకువద్దామా?"

"తప్పకుండా. అతను చిత్రమైన పరిసరాల్లో ఉన్నాడిప్పుడు. సెంట్ సెబాస్టిన్ శ్మశానవాటికల్ని మీ రెప్పుడైనా చూశారా?"

"ఎన్నడూ వెళ్లలేదు. వెళ్లాలని చాలసార్లు అనుకున్నాను."

"ఇప్పుడు అవకాశం దొరికింది కాబట్టి నడదాం. రండి. మీ కిచ్చిన బగ్గీ ఉందా?"

"లేదండి. పంపేశాను."

"ఫరవాలేదు. నా కొక బగ్గీ ఎప్పుడూ సిద్ధంగా ఉంటుంది."

"ఎప్పుడూనా?"

"ఎప్పుడూ ఉంటుంది. నాది చాలా చంచల ప్రకృతి. ఒకొక్కప్పుడు చీకటితోనే, మరొకప్పుడు అర్ధరాత్రివేళ బయలుదేరివెళ్లాలని కోరిక పుడుతుంది. కోరిక పుట్టగానే బయలుదేరి వెళ్లిపోతాను."

మాంట్ క్రిస్టో చేగంట మోగించాడు. పరిచారకు డొకడు వచ్చాడు "బగ్గీ సిద్ధం చేయించు. పిస్తోళ్ళు అక్కర్లేదు. ఆలీ బగ్గీ నడుపుతాడు."

త్వరలోనే బగ్గీ వచ్చింది. మాంట్ క్రిస్టో జేబుగడియారం తీసి చూశాడు "పన్నెండున్నరయింది" అన్నాడు. "మనం అయిదింటికి బయలుదేరివెళ్లవచ్చు. కాని మీ మిత్రుడు ఆందోళనపడతాడు. అందువల్ల మనం వెంటనే బయలుదేరడం మంచిది. రండి!"

అందరూ మేడ దిగి వెళ్లారు. మాంట్ క్రిస్టో, ఫ్రాంజ్ బగ్గీ లోపల కూర్చున్నారు. పెపినో ఆలీ ప్రక్క కూర్చున్నాడు. బగ్గీ అతివేగంగా పరుగెత్త నారంభించింది. నగర ప్రాకారంవద్ద ద్వారపాలకులు బగ్గీ నాపారు. ఆ సమయంలో నగరం విడిచి వెళ్లడానికి వీలులేదని నిరోధించారు. పగలుకాని రాత్రికాని ఏసమయంలో

నైనా సరే రాకపోకలను అనుమతిస్తూ రోమ్ గవర్నర్ ఇచ్చిన అధికారపత్రాన్ని మాంట్ క్రిస్టో చూపడంతో ద్వారపాలకులు దారి ఇచ్చారు. చంద్రు డుదయించి గంటన్నరపైన కావచ్చింది. ఆ వెన్నెలలో పురాతన రాజమార్గం అస్పష్టంగా కనపడుతోంది. అక్కడక్కడ గస్తీలు ముందుకు వచ్చినట్లూ, పెపినోసంజ్ఞ లందుకుని తిరిగి నీడల్లో మాయమైపోతున్నట్లూ ఫ్రాంజ్ కనిపెట్టాడు. కొంతదూరం వెళ్లినతరవాత బగ్గీ ఆగింది. పెపినో దిగివచ్చి తలుపు తెరిచాడు. మాంట్ క్రిస్టో, ఫ్రాంజ్ అక్కడ దిగారు.

"మనం పది నిమిషాల్లో అక్కడికి చేరుకుంటాం" అన్నాడు మాంట్ క్రిస్టో. పెపినోని పక్కగా పిలిచి రహస్యంగా ఏదో ఆజ్ఞ ఇచ్చాడు. పెపినో బగ్గీలో ఉన్న కాగడా ఒకటందుకుని వెళ్లిపోయాడు. అతను గుట్టలమధ్య సన్నని దారొకటి అనుసరించి నడవడం, ఒకచోట ఒక గుట్ట వెనుక అంతర్ధానం కావడం ఫ్రాంజ్ చూశాడు. తరవాత మాంట్ క్రిస్టో, ఫ్రాంజ్ లు ఆ దారినే నడవసాగారు. నూరడుగులలో ఒక చిన్న లోయ కనపడింది. అక్కడ నీడలో ఇద్దరు వ్యక్తులు మాట్లాడ్డం చూశారు. ఇద్దరిలో ఒకడు పెపినో, మరొకడు దారికాసే దొంగ. పెపినో తిరిగివచ్చి ఇలా అన్నాడు: "నావెంట రండి. ఇక్కడే శ్మశాన వాటికల గుహలున్నాయి."

ఒకచోట ఒక పెద్ద దుబ్బుచాటునద్వారంవంటిదికనపడింది. అక్కడ రాళ్లు గుట్టలు గుట్టలుగా ఉన్నాయి. ఆద్వారంలో ఒక్క మనిషి దాటడానికి మాత్రం ఎడముంది. దానికి కిందుగా కొద్ది అడుగులలోతుకు దూకాలి. ముందు పెపినో దూకాడు. కొద్దిదూరం నడవగానే మార్గం కొంచెం విశాలమయింది. అక్కడాగి పెపినో చేతి కాగడా వెలిగించాడు. అది పట్టుకుని వెనక్కి తిరిగి దారి చూపించాడు. ముందు మాంట్ క్రిస్టో, తరవాత ఫ్రాంజ్ దిగివచ్చారు. కొంతదూరం నడిచాక "ఎవరక్కడ?" అని కేక వినపడింది. కాగడావెలుగులో తుపాకి ఒకటి ఫ్రాంజ్ కి కనపడింది.

"మిత్రులే" అన్నాడు పెపినో.

పహరావాని వెనుకనే సొరంగాలలోకి దిగువగామెట్లున్నాయి. ముగ్గురూ మెట్లు దిగి ఒక ఆవరణ ప్రవేశించారు. అక్కడొక

సమాధి కనపడింది. అక్కడే అయిదు మోటుమార్గాల కూడలి కూడా ఉంది. ప్రక్కనే గోడలలోకి త్రవ్వబడినట్లు సమాధు లనేకం కనపడ్డాయి. ఇవే కాబోలు సెంట్ సెబాస్టిక్ భూగర్భాంతర శ్మశానవాటిక లనుకున్నాడు ఫ్రాంజ్. అక్కడక్కడ కొన్ని నెరదలల్లోనుంచి దీపాలవెలుగులు కనపడుతున్నాయి. మాంట్ క్రిస్టో ఫ్రాంజ్ భుజంపైన తట్టాడు. "దొంగలగుంపు విశ్రాంతి తీసుకుంటున్నప్పు డెలా ఉంటారో చూస్తారా?"

"తప్పకుండా. చూడ వలసిందే."

"అయితే కూడా నిశ్శబ్దంగా రండి. పెపినో! కాగడా ఆర్పెయ్యి."

పెపినో కాగడా ఆర్పివేశాడు. ఏభైఅడుగుల దూరంలో గోడలపైన వెలుగునీడలు కదలాడుతున్నాయి. ముగ్గురూ నిశ్శబ్దంగా నడిచారు. మాంట్ క్రిస్టో చీకటిలోకూడా చూడగలుగుతున్నట్లు సులువుగా నడుస్తున్నాడు. ఫ్రాంజ్ అతన్ని జాగ్రత్తగా అనుసరిస్తున్నాడు. మరొక పెద్దద్వారం దాటి విశాలమైన మరొక ఆవరణలోకి ప్రవేశించారు. ఆవరణంతా సమాధులతో నిండిఉంది. మధ్యలో నాలుగు పెద్ద అరుగులున్నాయి. ఒక అరుగుపైన ఎత్తు మిట్ట ఒకటుంది. దానిపైన సిలువ ఉంది. ప్రక్కనేఉన్న పెద్ద కాగడావెలుగులో ఒక వ్యక్తి కూర్చొని ఒక గ్రంథం పఠిస్తున్నాడు. ఆగంతుకు లిద్దరూ నీడలో నిలబడి ఆ దృశ్యాన్ని పరికించారు. గ్రంథం పఠిస్తున్నవాడే నాయకుడు లూగీ వాంపా. అతనిచుట్టూ కొద్ది కొద్ది దూరంలో రాతి అరుగుల పైన దాదాపు ఇరవైమంది దొంగలు తుపాకులు ప్రక్కను పెట్టుకుని కూర్చున్నారు. అరుగులకు దిగువగా కొద్దిదూరంలో ఒక ద్వారంవద్ద ఒక పహరావాడు చేత తుపాకి పట్టుకుని అటూ ఇటూ పచారుచేస్తున్నాడు. ఈ దృశ్యాన్ని కొంతసేపు పరికించిన తరవాత, మాంట్ క్రిస్టో చప్పుడు కాకుండా నూడు చీడీ లెక్కి అరుగుపై కూర్చున్న వాంపాను సమీపించాడు. గ్రంథపఠనంలో నిమగ్నుడై ఉన్న వాంపా ఇది గమనించలేదు. కాని ద్వారంవద్ద పహరా చూశాడు. "ఎవరక్కడ?" అని కేక వేశాడు. వాంపాఒక్క ఉదుటున లేచి పిస్తోలు తీశాడు. క్షణంలో దొంగలందరూ లేచి వచ్చారు. మాంట్ క్రిస్టోపైన ఇరవై తుపాకులు గురిపెట్టబడినాయి.

"వాంపా! నీ మిత్రుల్ని చాలా సంరంభంతో ఆహ్వానిస్తావు సుమా!" అన్నాడు మాంట్ క్రిస్టో.

"తుపాకులు దించండి" అని కేక వేశాడు వాంపా. ఒక చేతితో గౌరవసూచకంగా టోపీ తీసి పట్టుకున్నాడు. "క్షమించండి. తమ దర్శనం లభిస్తుందనుకోలేదు నేను. అందువల్ల మిమ్మల్ని వెంటనే గుర్తుపట్టలేకపోయాను."

"అంతేకాదు. నీ జ్ఞాపకశక్తి అన్నిటా మందగించినట్లుంది. నీకు మనుష్యుల ముఖాలు గుర్తులేకపోవడమే కాదు. వారితో చేసిన ప్రమాణాల్ని మరిచిపోతావు. నన్నుకాని నామిత్రుల్ని కాని మీ రెవ్వరూ తాకరాదని షరతు లేదా?"

"నేనా షరతు నెట్లా భంగపరిచానో అర్థం కావటంలేదండి."

"సాయంకాలం ఆల్బర్ట్ డి మార్సెర్ఫ్‌ని పట్టిఇక్కడికి తీసుకు వచ్చావు. ఆ యువకుడు నా మిత్రులలో ఒకడు. నే నున్న హోటల్లో నే అతనూ బసచేశాడు. నా బగ్గీలోనే రోమ్‌నగర మంతా తిరిగాడు. అయినా అతన్ని మన్నించక, పట్టి తీసుకు వచ్చావు. అందరిమాదిరిగానే అతని ప్రాణాలపైన పణం పెట్టావు" అన్నాడు మాంట్ క్రిస్టో. అంటూ జేబులో ఉత్తరంతీసి వాంపాకి అందించాడు.

నాయకుడు దొంగలవైపు తిరిగి, "ఈ సంగతి నా కెందుకు చెప్పలేదురా?" అన్నాడు రోషంతో. దొంగలు భీతితో వెనక్కి వెనక్కి తగ్గారు. "నేను కౌంట్ కిచ్చినమాటభంగపడేలా ఎందుకు చేశారు? మనందరి ప్రాణాలూ ఆయనగుప్పెటలో ఉన్నాయని తెలియదూ? మీలో ఎవరైనా తెలిసే ఈ పనిచేసినట్లయితే, వాడి బుర్రఒక్క దెబ్బతో పగలకొడతాను. చెప్పండి."

మాంట్ క్రిస్టో ఫ్రాంజ్ వంక తిరిగి అన్నాడు; "విన్నారా? నాకు తెలుసును. ఎక్కడో పొరపాటు జరిగిఉంటుంది."

"మీరు ఒంటరిగా లేరా?" అన్నాడు వాంపా, ఆందోళనతో.

"నువ్వు ఎవరికైతే ఈ ఉత్తరాన్ని పంపావో, ఆయ నున్నాడిక్కడే. లూగీవాంపా ఇచ్చినమాట నిలబెట్టుకునేవాడని అతనికి నిరూపించాలని నా ఉద్దేశం. ఫ్రాంజ్! ఇటు రండి. లూగీ వాంపా స్వయంగా మిమ్మల్ని క్షమార్పణ కోరుకుంటాడు."

ఫ్రాంజ్ ముందుకు వచ్చాడు. లూగీ అతన్ని సమీపించి ఇలా అన్నాడు: "మిమ్మల్ని హృదయపూర్వకంగా ఆహ్వానిస్తున్నాను. కౌంట్ చెప్పినది మీరు విన్నారుకదా! నా జవాబు కూడా విన్నారు. నాలుగువేల స్పానిష్ డాలర్లకోసం ఇటువంటి దెన్నడూ చేసేవాడిని కాదు. అటువంటిది నావల్ల జరగదు."

"కాని ఆల్బర్ట్ ఎక్కడ? ఎక్కడా కనిపించ డే?" అన్నాడు ఫ్రాంజ్.

పహరా ఉన్నవైపు చేతితో చూపి వాంపా ఇలా చెప్పాడు. "అక్కడున్నారు. నేనే వెళ్లి స్వయంగా తీసుకువచ్చి విడిచి పెడతాను." వాంపా పహరావద్దకు వెళ్లి అడిగాడు "ఖైదీ ఏం చేస్తున్నాడు?" మాంట్ క్రిస్టో, ఫ్రాంజ్ అతన్ని అనుసరించి వెళ్లారు.

"అదేమో తెలియదండి. గంటసేపటినించి అతను కదిలిన చప్పుడైనా కాలేదు" అన్నాడు పహరా.

"రండి. లోపలికి రండి" అన్నాడు వాంపా. చిన్నకాగడా వెలుగులో ముగ్గురూ చూశారు. ఒక మూల కంబళి కప్పుకుని ఆల్బర్ట్ గాఢనిద్రలో మునిగిఉన్నాడు.

మాంట్ క్రిస్టో నవ్వాడు: "బలే! బాగుంది! పొద్దున్న ఏడు గంటలకి చచ్చిపోవలసిన మనిషిని చూడండి!"

వాంపా ఆల్బర్ట్ వంక ప్రశంసాపూర్వకంగా చూశాడు. ఇటువంటి మనస్థైర్యానికి వాంపాకూడా ఆశ్చర్యపడ్డాడు. "మీరు చెప్పింది నిజం" అన్నాడు. "ఈయన తప్పకుండా మీ మిత్రుడే."

వాంపా ఆల్బర్ట్ ని సమీపించి భుజంతట్టి లేపాడు. "లేవండి" అన్నాడు వాంపా. ఆల్బర్ట్ చేతులు చాచి ఆవలించి కన్నులు నులుముకుని లేచాడు. "ఓ! మీరా" అన్నాడు వాంపాను చూసి. "అచ్చే. నన్ను మరి కొంతసేపు నిద్రపోనివ్వవలసింది. ఎంత చక్కని కల వచ్చింది! కౌంటెస్ తో కలిసి నేను నృత్యం చేస్తున్నాను సుమా!" అంటూ జేబు గడియారం తీసి చూశాడు. "ఒంటి గంటన్నరే అయింది! అరె! ఇటువంటి వేళ లేపారెందుకు?"

"మిమ్మల్ని విడిచిపెట్టడానికి."

ఆల్బర్ట్‌కి ఎలాటి భావపరివర్తనం కలగలేదు. అతిసహజంగా అన్నాడు : "బలే వాడవ్ ! ముందుకైనా నెపోలియన్ చెప్పిన మాటలు మరిచిపోకండి. 'చెడ్డవార్తలు చెప్పవలసినప్పుడు తప్ప నిద్ర చెడగొట్టవద్ద' న్నాడు. అయితే నా ప్రాణానికి పెట్టిన పణం చెల్లించారన్నమాటేనా?"

"లేదండి. కాని ఏదడిగినా ఎవరికి నిరాకరించలేనో, వారే వచ్చి మిమ్మల్ని విడిచిపెట్టమని అడిగారు."

"నిజంగా? అయితే ఆయనెవరో కాని మంచి ఉదార బుద్ధికలవాడై ఉండాలి." అంటూ ఆల్బర్ట్ చుట్టూ చూశాడు. ముందు ఫ్రాంజ్ కనపడ్డాడు. "అరె! నువ్వా ఫ్రాంజ్! నీ స్నేహ ఫలితమేనా ఇది ?"

"కాదు నేను కాదు" అన్నాడు ఫ్రాంజ్. "మన పొరుగునున్న మిత్రుడు ; కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో."

"ఓహో! మీరా ?" అన్నాడు ఆల్బర్ట్ ఉత్సాహంతో. "నిజంగా మీ దయ అపారం ! నేను శాశ్వతంగా మీకు ఋణపడిపోయాను- బగ్గీ ఇచ్చినందుకు, తరవాత దీనికి" అంటూ ఆల్బర్ట్ స్నేహపూర్వకంగా చెయ్యి అందించాడు. మాంట్ క్రిస్టో అందుకున్నాడు. కొద్దిగా అతనికి చెయ్యి కంపించింది. వాంపా ఈ దృశ్యాన్ని అత్యాశ్చర్యంతో చూస్తున్నాడు. ఆల్బర్ట్ ఫ్రెంచిజాతీయుల గౌరవాన్ని నిలబెట్టినందుకు ఫ్రాంజ్ ఆనంద భరితుడైనాడు. ఇలా అన్నాడు "ఆల్బర్ట్ ! త్వరగా పోదాంరా! కౌంటెస్ ఇంట్లో విందు కింకా వేళ ఉంది. మనంఅందుకోవచ్చు. లూగీ వాంపాపట్ల మనస్సులో ఎలాటి విరుద్ధభావం పెట్టుకోకు. నిజంగా ఆయన నిజాయితీపరుడు సుమా !"

"నువ్వు చెప్పింది నిజం. మనం వెంటనే బయలుదేరితే విందుకి అందుకోవచ్చు." తరవాత వాంపావైపు తిరిగి "నేను వెళ్ళడానికి ముందు తీర్చవలసిన వేవైనా ఉన్నాయా ?"

"ఏమీ లేవండి. మీ కిప్పుడు పూర్తిస్వేచ్ఛ లభించింది."

"అయితే పదండి" అంటూ ఆల్బర్ట్ వెంటనే బయలుదేరాడు. అతని వెనుక మాంట్ క్రిస్టో, ఫ్రాంజ్ నడిచారు.

"పెపినో" అని పిలిచాడు వాంపా. "ఏది కాగడా? నాచేతి

కియ్యి. నేనే దారి చూపుతాను" అని మాంట్ క్రిస్టో వంక తిరిగి "కనీసం ఈ గౌరవమైనా చూపగలను" అన్నాడు.

కాగడా తీసుకుని వాంపా ముందు నడిచాడు. ద్వారం సమీపించగానే ఇలా అన్నాడు: "కౌంట్! మరొకసారి క్షమించ వలసిందని కోరుతున్నాను, మీరు నాపైన మనస్సులో ప్రతికూల భావం పెట్టుకోవద్దని ప్రార్థిస్తున్నాను."

"లేదు వాంపా. చేసిన తప్పుల్ని నువ్వు దిద్దుకునే పద్ధతి చూస్తే, ఇటువంటి అవకాశం లభించినందుకు ఎవరైనాసరే సంతోషిస్తారు."

వాంపా యువకు లిద్దరివైపూ తిరిగి ఇలా అన్నాడు: "మీ కొట్టే నచ్చకపోవచ్చును కాని, నన్నెప్పుడైనా చూడగోరి నట్లయితే, నేనెక్కడున్నా సరే, మిమ్మల్ని హృదయపూర్వకంగా సత్కరించగలను."

ముందు మాంట్ క్రిస్టో నడిచాడు. తరవాత ఆల్బర్ట్ అనుస రించాడు. ఫ్రాంజ్ కొద్దిగా తటపటాయించాడు. వాంపా అది చూసి "మీ రేదైనా అడగదల్చుకున్నారా?" అన్నాడు.

"అవును. మేము వచ్చేముందు మీరంత శ్రద్ధతో చదువు తున్న గ్రంథ మేమిటి?"

"అది సీజర్ వ్యాఖ్యానసంపుటి. ఆ గ్రంథమంటే నాకు అత్యంత ప్రీతి."

ఆల్బర్ట్ మాంట్ క్రిస్టోతో ఇలా అన్నాడు. "మనం త్వరగా వెళ్లిపోవాలి. నాకు విందుకు వెళ్లాలని గట్టి కోరికుంది."

యువకు లిద్దరూ విందుకు వచ్చేసరికి సరిగ్గా రెండు గంట లయింది.

# 38

మరుచటి ఉదయం మాంట్ క్రిస్టోని దర్శించడానికి ఆల్బర్ట్ బయలుదేరుతూ, ఫ్రాంజ్ నికూడా రమ్మన్నాడు. కొంత భీతితో మిళితమైన, ఏదో చిత్రమైన ఆకర్షణ ఫ్రాంజ్ ని మాంట్ క్రిస్టోవైపుకు లాగుతోంది. అదీ కాక మాంట్ క్రిస్టో ప్రభావానికి మిత్రుడొక్కడినీ లోనుచెయ్యడం అతని కిష్టంలేదు.

అందువల్ల ఫ్రాంజ్ ఆల్బర్ట్‌ని అనుసరించి మాంట్ క్రిస్టో నివాసానికి వెళ్లాడు. మాంట్ క్రిస్టోని చూడగానే ఆల్బర్ట్ ఇలా అన్నాడు:

"నిన్నరాత్రి హృదయపూర్వకంగా నా కృతజ్ఞతాభావం ప్రకటించలేకపోయాను. మీరు చేసిన ఉపకారాన్ని ఈజన్మలో మరవలేను. నేను ఆజన్మాంతం మీకు ఋణపడ్డాను."

మాంట్ క్రిస్టో చిరునవ్వుతో ఇలా అన్నాడు. "నేను చేసినది అత్యల్పం. నేనేదైనా ఉపకారంచేసి ఉంటే, అది మీకు నాలుగువేల స్పానిష్ డాలర్ల ఖర్చు తప్పించాను. అదేమంత చెప్పుకోవలసింది కాదు. కాని నిన్నటి ప్రమాదస్థితిలో మీరు చూపిన నిర్లక్ష్యభావానికీ మనస్థైర్యానికీ మిమ్మల్ని మెచ్చుకోవాలి."

"అందులో మెచ్చుకోవలసిందేముంది? నే నాస్థితిలో అంతకంటె చెయ్యగలిగినది మాత్ర మేముంది? ఫ్రెంచివారు మృత్యుసన్నిధిలోకూడా చిరునవ్వుతో ఉండగలరని నిరూపించాలనుకున్నాను అంతే. అయితే అదంతా మీ ఔదార్యానికి సాటిరాదు. మీరు నాకు చేసిన ఉపకారానికి ప్రతిఫలమే మివ్వగలననే నా ఆలోచన. అది మీరే చెప్పండి. నాతండ్రి కౌంట్ డి మార్సెర్ఫ్ స్పానిష్ జాతీయు డైనప్పటికీ, పారిస్, మాడ్రిడ్ రాజధానీనగరాల్లో పరపతి సంపాదించుకున్నారు. మీ కేది కావలసినా నిరాకరించలేను. నేను మీకు చెయ్యగలిగే దేదైనా ఉందా?"

"మీ రిలా అంటారని నాకు తెలుసు. మీ స్వభావం నాకు తెలియకపోదు. మీరు చెయ్యగల ఉపకారాన్ని మనసారా స్వీకరిస్తాను. నిజంగానే మీవల్ల నా కొక ఉపకారం కావలసిఉంది. నేను పారిస్‌నగరానికీ, అక్కడి సమాజానికీ బొత్తిగా అపరిచితుణ్ని. ఇంతవరకూ నే నా నగరాన్ని చూడలేదు."

"అంటే, ప్రపంచంలోకెల్ల ఉత్తమమైన రాజధానీ నగరాన్ని మీ రింతవరకూ చూడనేలేదా? నమ్మశక్యంకాకుండా ఉంది."

"కావచ్చును. కాని అది నిజం! అది నాకే నామర్దాగా ఉంది. ఆలోటు తప్పకుండా తీర్చుకోవాలి. అక్కడి ఉన్నత సమాజంతో

నాకు పరిచయం చెయ్యగలవారుంటే, ఇదివరకే ఆ నగరాన్ని చూసే అదృష్టం పట్టిఉండేది."

"మీవంటి ప్రతిభాశాలికి వేరే ఒకరు పరిచయం చెయ్యడం అవసరమా?"

"అదంతా నీ ఉదారబుద్ధిమాత్రమే. సమృద్ధధనసంపద తప్ప ఇంకే ప్రజ్ఞ నాకుందో తెలియదు. కాని పారిస్ రావడానికీ, నా ధన సంపదకీ వ్యాపారాలకీ సంబంధంలేదు సుమా! నా కోరిక నెర వేర్చుకోడానికి తరుణంకోసమే వేచిఉన్నాను. ఇప్పుడు మీ ఆహ్వానంతో ఆ తరుణం లభిస్తోంది. నన్ను మీ సమాజంతో పరిచయ పరచగలరా, ఆల్బర్ట్?"

"తప్పకుండా. సంతోషపూర్వకంగా పరిచయం చెయ్య గలను. ఇప్పుడే నా తండ్రిదగ్గరనుంచి నాకు ఉత్తరంకూడా వచ్చింది —వెంటనే రావాలని. అక్కడ నా వివాహవిషయమై వెళ్లాలి. వధువు ఉన్నతవంశానికి చెందినది. నువ్వు నవ్వ నక్కరలేదు ఫ్రాంజ్!"

"పెళ్లి ఇదివరకే నిశ్చయమయిందికదా, ఆల్బర్ట్?" అన్నాడు ఫ్రాంజ్ నవ్వుతూ.

"ఏదయితేనేంలే. నవ్వవలసిందేమీ లేదు" అన్నాడు ఆల్బర్ట్. "ఎలా చెప్పినా ఒకటే. కౌంట్! మీరు ఎప్పుడు రాద ల్చుకున్నా సరే నాకు కబురుపెట్టండి. నేనే మిమ్మల్ని స్వయంగా సత్కరించ గలను."

"అయితే అది స్థిరపడినట్లే" అన్నాడు మాంట్ క్రిస్టో.

ఆల్బర్ట్ ఇలా అన్నాడు. "నిజం చెప్పండి కౌంట్. నిజంగా రావాలనే మీరు చెప్తున్నారా? మనం జీవితంలో అనేకం తల్చు కుంటాం 'ఎప్పుడో వెళ్లాలి అక్కడికి' అని. కాని అది సామా న్యంగా సమకూడదు. ఇటువంటి యత్నం కాదు గదా మీరు చెప్తు న్నది?"

"నిజమే చెప్తున్నాను ఆల్బర్ట్. నాకు కేవలం కోరిక ఉండడమే కాదు. అవసరంకూడా ఉంది. నేను నెరవేర్చవలసిన

కార్యాలు కొన్ని అక్కడున్నాయి. మీ రెప్పటికి పారిస్ చేరు కుంటారు ?"

"రెండు మూడు వారాలలో."

"అయితేం ? మూడుమాసాలు వ్యవధి ఇస్తున్నాను మీకు. రాగల అడ్డంకులనూ, అనివార్య కార్యాలనూ యోచించి, సర్దు బాటు చేసుకోడానికి మూడుమాసాలు చాలుననుకుంటాను."

ఆల్బర్ట్ అన్నాడు. "అయితే మీరు తప్పకుండా మూడు మాసాల్లో మా ఇంటికి వస్తారన్నమాట నిర్ధారణేనా ?"

"అయినా, ఫలానిరోజని ఇప్పుడే నిర్ణయించుకుంటే మంచిది కాదూ ? వేళకూడా నిర్ణయించుకుంటే మంచిది. నా నిర్ణయాలెప్పుడూ తిరుగుండవని మీకు ముందే చెప్పడం మంచిది."

"తప్పకుండా. అదే మంచిది"

మాంట్ క్రిస్టో ప్రక్కనే ఉన్న కాలెండర్ తీసి చూశాడు. "ఇవాళ ఫిబ్రవరి 21. ఇప్పుడు పదిన్నరయింది. మే 21 వ తేదీ ఉదయం పదిన్నరకి సరిగ్గావస్తాను."

"సరిగ్గా ఆవేళకి మే మందిరం అన్నీ సిద్ధంగా ఉంచుతాం. మీకోసం భోజనాది సదుపాయాలన్నీ చెయ్యబడతాయి."

"మీ నివాస మెక్కడ?"

"హెల్డర్ వీధిలో, 27 వ నెంబరు ఇల్లు. నేను మాతండ్రిగారి భవనంలో ఒక చివర ప్రత్యేకభాగంలో ఉంటాను."

"సరే. అంతా నిర్ధారణయిపోయినట్లే" అని మాంట్ క్రిస్టో తన డైరీలో వ్రాసుకున్నాడు. "మీ రెప్పుడు బయలుదేరుతున్నారు ?"

"రేపు సాయంకాలం అయిదుగంటలకి."

"అయితే ఇప్పుడే మీవద్ద సెలవు తీసుకుంటాను. నేను జరూరుగా నేపుల్స్ వెళ్లవలసిన పని కలిగింది. శనివారమో ఆది వారమో కాని తిరిగి రాలేను." ఫ్రాంజ్ వంక తిరిగి "మీరో ? మీరుకూడా రేపే వెడుతున్నారా?"

"రేపు వెనిస్‌నగరం వెడుతున్నాను. ఇటలీలో నేనింకా ఒకటి రెండేళ్లు గడపాలి."

"అయితే మనం పారిస్‌లో కలుసుకోలేమన్నమాట?"

"అంతే ననుకుంటాను."

"నే నింక బయలుదేరాలి" అంటూ మాంట్ క్రిస్టో యువకు లిద్దరి హస్తాలూ గ్రహించి కరచాలనం చేశాడు. ఫ్రాంజ్ కి మాంట్ క్రిస్టో చెయ్యితగలడం ఇదే మొదటిసారి. మాంట్ క్రిస్టో చెయ్యి చల్లగా తగిలింది. ఫ్రాంజ్ కి చెయ్యి వొణికింది.

యువకులిద్దరూ లేచి బయలుదేరారు. ఇద్దరూ తమ గది చేర గానే, ఆల్బర్ట్ అడిగాడు "ఇదేమిటి ఫ్రాంజ్? నువ్వు ఆట్టే మాట్లాడకుండా, అంత తీవ్రంగా ఏమి టాలోచిస్తున్నావు?"

"మాంట్ క్రిస్టోనిగురించి ఎంత ఆలోచించినా నా కేమీ బోధపట్టంలేదు. పారిస్ లో అతన్ని కలుసుకోడమంటే నాకేదో చెప్పలేని భయం కలుగుతోంది."

"అరె! ఎందు కంత భయం, సంకోచం? అతనివల్ల ముప్పు కలుగుతుందని భయపడుతున్నావంటే, నీకు మతిపోయుండా లన్నమాట!"

"నాకు మతి ఉందో లేదో, అదంతా అనవసరం. కాని మాంట్ క్రిస్టోని పారిస్ లో నువ్వు కలుసుకుంటావంటే, ఎటువంటి కీడు సంభవిస్తుందోనని భయపడుతున్నాను. నిజంగా నువ్వీ జన్మలో అతన్ని చూసి ఉండకుండా ఉంటే బాగుండు ననిపిస్తోంది."

"ఇటు విను ఫ్రాంజ్. ఇప్పు డామాట వచ్చింది కాబట్టి అంటున్నాను. నువ్వు నీ మిత్రులందరితోనూ ఉన్నట్లుగా మాంట్ క్రిస్టోతో ఉండడంలేదు. ఆయనతో చనువుగా ఉండవు. మితంగా, మర్యాదగా మాత్రం మాట్లాడతావు. దీనికి కారణమేమైనా ఉందా? ఇంతకుముం దెప్పుడైనా ఆయన్ని చూశావా?"

"అయితే నేను చెప్పేది ఎవ్వరిదగ్గరా ఒక్క మాట కూడా చెప్పనని ప్రమాణం తీసుకుంటావా?"

"ప్రమాణం చేస్తున్నాను."

"అయితే విను."

అప్పుడు ఫ్రాంజ్ తాను మాంట్ క్రిస్టో ద్వీపానికి వెళ్ళడం, అక్కడ అక్రమవ్యాపారులు కార్సికన్ దొంగలు తారసిల్లడం, మొదలైన వృత్తాంతమంతా నివేదించాడు. కౌంట్ సత్కారం,

విందు, గంజాయిలేహ్యం, శిలాప్రతిమలు, తన స్వప్నం, తరవాత తనకు మెలకువరావడం, ఆ పైన గుహలో దారి కనిపెట్టలేక పోవడం, దూరాన కౌంట్ బోటు మాత్రం కనపడ్డం, అంతా పూసగుచ్చినట్లు ఏ ఒక్క వివరమూ మరిచిపోకుండా ఏకరువుపెట్టాడు. తరవాత రోమ్‌నగరంవద్ద కలోసియమ్‌లో తాను విన్న సంభాషణ, పెపినోని విడిపించడానికి లూగీవాంపాకు కౌంట్ ఇచ్చిన వాగ్దానం నెరవేరడం నివేదించాడు. ఆఖరున, గడిచిన రాత్రి ధనం కొరకరావడం, మాంట్ క్రిస్టో స్వయంగా అల్బర్ట్‌ని విడిపించడం వివరించాడు.

అంతా విని అల్బర్ట్ ఇలా అన్నాడు: "ఇదంతా బాగానే ఉంది. కాని ఇందులో ఆక్షేపణకి ఏముందని? కౌంట్‌కి ప్రయాణాలంటే ప్రీతి. ఆయనకి ధనం ఉంది. స్వంతబోటుంది. ప్రయాణాల మధ్య విశ్రాంతి కోసం మాంట్ క్రిస్టోద్వీపం అనువైనస్థలమనుకుని ఉంటాడు. టస్కనీ ప్రభుత్వం అధీనంలోకి పోకుండా ఉండడానికి ఆ ద్వీపాన్ని కొని కౌంట్ బిరుదు తెచ్చుకుని ఉంటాడు. అసలేదీ కొనకుండానే, ఏ రాజ్యమూ లేకుండానే బిరుదులు తగిలించుకుని తిరిగే వాళ్లెంతమంది లేరు? ఇందులో నాకు తప్పేమీ కనపడదు."

"కాని అతని ఓడలో కార్సికన్ దొంగలమాటేమిటి? వాంపావంటివాళ్లు దుర్మార్గులైనా ఒప్పుకుంటావా? వాళ్లకి అక్రమంగా దోచుకోవడంతప్ప వేరేపని ఉండదు. అటువంటి దుండగులలో మాంట్ క్రిస్టోకి ఉన్న పరపతి ఎటువంటిదంటావు?"

"ఆ పరపతే లేకపోతే నే నీపాటికి ఏమైపోయేవాడినో తెలియదు. అందువల్ల అదెటువంటిదని తర్కించడం నాకు ఉచితం కాదు. నువ్వైతే అటువంటివాళ్లతో అతని స్నేహాన్ని నిరసించవచ్చును. కాని ఈ స్వల్ప దోషా లెంచడం నాకు తగదు. నా ప్రాణాలు కాపాడ్డానికి వచ్చిన భక్తవత్సలుడని మరీ ఆకాశానికెత్తడంలేదు. నాకు నాలుగువేల స్పానిష్ డాలర్లు, అంటే 24 వేల లివర్లు నష్టంతప్పించాడు. ఫ్రాన్స్‌లో నా ప్రాణం విలువ ఇంత ఉంటుందని ఎవ్వరూ భావించరుకూడా. ఎంత మహానుభావుడికైనా సరే జన్మభూమిలో పరపతి ఉండదుకదా!"

"జన్మభూమి అంటే జ్ఞాపకం వచ్చింది. ఈ వింతవ్యక్తి

జన్మభూమి ఏదయ్యుంటుందో చెప్పగలవా? అతని మాతృభాష ఏమిటో, అతని వృత్తి ఏమిటో, ఇంత సంపద అతని కెక్కడినుంచి లభిస్తున్నదో, అతని జీవితాదర్శాలేమిటో, ఇంతటి చిత్రప్రకృతికీ విలక్షణాలకూ మూలహేతువు లేవో తెలియదుకదా! నేనే నీ స్థితిలో ఉంటే, ఈ ప్రశ్నలన్నిటికీ సమాధానాలు తెలుసుకోడానికి ప్రయత్నిస్తాను."

"ఫ్రాంజ్ ! నా ఉత్తరం చూడగానే నువ్వు మాంటె క్రిస్టో వద్దకు వెళ్లావు. 'నామిత్రుడు అపాయంలో చిక్కుకున్నాడు. మీరు సహాయం చెయ్యాలి' అని అడిగావు. 'ఆల్బర్ట్ ఎవరు? అతని వృత్తి ఏమిటి? జీవనాధారం ఏమిటి? ఏ దేశం అతనిది' అని ఆయన నిన్ను ప్రశ్నించాడా ?"

"నిజమే. ఆ ప్రశ్నలేవీ అడగలేదు."

"అడగలేదు. వెంటనే వచ్చినన్ను విడుదల చేయించాడు. నే నెంత నిర్లక్ష్యంగా ఉన్నప్పటికీ అక్కడుండడం నాకు ప్రీతి కాదుకదా! ఒక్కమాట అడగకుండా, వెంటనే సహాయంచేసిన ఆవ్యక్తి, నన్ను ఈ చిన్న సహాయం అడిగినప్పుడు నిరాకరించమంటావా? పారిస్‌నగరం దర్శించే రష్యన్ రాకుమారులు, ఇటాలియన్ సామంతులు మొదలైనవారికి అడక్కుండానే సహాయం చేస్తాం కదా! నే నలా ప్రశ్నించగలన నే భావించావా ఫ్రాంజ్ ?"

ఫ్రాంజ్ ఒక్క నిట్టూర్పు విడిచాడు. "నీకు తోచినట్లు చెయ్యి ఆల్బర్ట్. నీవాదాన్ని కాదనగల సమర్థత నాకు లేదు. అయినా మాంటె క్రిస్టో చిత్రమైన వ్యక్తి అని నువ్వు ఒప్పుకోక తప్పదు."

"మాంటె క్రిస్టో దానశీలుడు. పారిస్ దర్శించాలనుకున్నాడంటే, మానవసౌశీల్యం, ధర్మప్రవర్తనల ప్రచారంకోసం పాటుపడి బహుమతి సాధించాలనే ఉద్దేశం ఉండిఉంటుంది. నా వల్ల అది ఆయన పొందగలిగేటట్లయితే నా పలుకుబడిగాని, మరొకటిగాని వినియోగించడానికి సిద్ధపడ్డాను. ఇంక ఈ మాటలు ఇప్పటికి మానేద్దాం. సెంట్ పీటర్స్ చర్చికి పోదామా?" ఫ్రాంజ్ సమ్మతించాడు.

మరునాడు సాయంకాలం యువకులిద్దరూ రోమునగరంనించి ప్రయాణమై వెళ్లిపోయారు.